

శ్రీ శ్రీ శ్రీ

# చిద్ఘనానందేంద్ర సరస్వతీస్వాములవారి భగవద్గీతోపన్యాసములు



భార్గవముద్రణము

1942

ఓమ్

శ్రీ గోపాలకృష్ణో విజయతేతరామ్

శ్రీ శ్రీ శ్రీ చిద్ఘనానందేంద్రసరస్వతీస్వాములవారి

# శ్రీ భగవద్గీతోపన్యాసములు

(గీతామూల, గీతామృత, సార సహితము)



గుంటూరు వాస్తవ్యులు,

మొరుసుపల్లి హనుమంతరావు. బి. ఏ., యమ్. యల్.,

జిల్లాకోర్టు వకీలు గారిచే

బెజవాడ ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు

అచ్చొత్తించి ప్రచురింపబడియె.

( చతుర్థ ముద్రణము )



1942

ల రు 2-0-0

Approved for use in General Libraries by the Text-book Committee to the Government of Madras Vide Part I-B of the Fort St. George-Page 691 dated 22-11-38


| | |
|---|---|
| 1st Edition : June | 1938 |
| 2nd Edition : Novr. | 1938 |
| 3rd Edition : March | 1940 |
| 4th Edition : March | 1942 |


వెలయువారు :—

మొరుసుపల్లి హనుమంతరావు,

బి. యే., యం. యల్.,

వకీలు, గుంటూరు.

IV




अर्जुनको गीताका उपदेश

THE GITA PRESS, GORAKHPUR.

No. 1027.

శ్లో॥ యత్ర గీతావిచారశ్చ । పఠనం పాఠనం శ్రుతం
తత్రాఽహం నిశ్చితం పృథ్వి । నివసామి సదైవహి॥



శ్రీశ్రీశ్రీ విద్యానందేంద్రసరస్వతీస్వాములవారు,
గీతోపన్యాసకులు.

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# తొ లి ప లు కు



చరాచరాత్మక మయిన ప్రపంచమును సృజించి కాపాడు నట్టి పరమాత్మ శ్రీమన్నారాయణుడు రామకృష్ణాద్యవతార ముల నంది దుష్టనిగ్రహ శిష్టపరిపాలనాది కార్యములద్వారా నానావిధ ధర్మములను ప్రతిష్ఠించెను. శ్రీకృష్ణావతారము "కృష్ణస్తు భగవాన్ స్వయమ్" అన్నట్లు నారాయణుని సంపూర్ణావతారము. తదితరము లంశావతారము లనబడును. అట్టి మహనీయు డగు శ్రీకృష్ణుడు సకలోపనిషత్తుల సారాంశమును చిన్నగ్రంథరూప మగున ట్లుపదేశించెను. ఆ గీతను బోధించుటకు శ్రీకృష్ణునికే యర్హత, వినుట కర్జునునకే యర్హత కలదు. ప్రస్థానత్రయములనబడు ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీతలలో, గీత మహాభారతమందలి భీష్మపర్వమున ప్రస్తావింపబడినది. దానికి శ్రీ శంకర, రామానుజ, మధ్వ, నీలకంఠాచార్యులు మున్నగు మహానుభావులు వ్యాఖ్యానములు, భాష్యములు, టీకలు వ్రాసియున్నారు. ద్వైతాద్వైతవిశిష్టాద్వైతులు, శైవులు మున్నగు మన ఆర్యమతమున జేరినవారు మాత్రమేగాక, మతాంతరులగు క్రైస్తవులు, మహమ్మదీయులు మున్నగువారుకూడ నంగీరింపవలసిన గ్రంథరాజముగ నున్నది. నేను చెన్నపట్టణమున పచ్చయప్ప కాలేజీలో యఫ్.ఏ., బి.ఏ., చదివినరోజులలో మధ్వ శ్రీ లక్ష్మణాచార్యులవారు, ప్రొఫెసర్ రంగాచార్యులవారు స్వామి రామకృష్ణానందద్వారా గీతోపన్యాసములను మతత్రయానుసారేణ శ్రవణము చేసియున్నాను.

ఆ మహానుభావుల వాగమృతము ననుభవించు భాగ్యము కలిగి నందులకు నా పూర్వపుణ్యము, భగవదనుగ్రహమే కారణము. నేను వినిన చదివినవిషయములలో కొన్నిటినయిన మరువకుండు నట్లున్నా స్నేహితుల ప్రోత్సాహముమీద కొన్ని ఆంధ్ర, ద్రావిడ ప్రదేశములం దప్పుడప్పుడు గడచిన 30 సం॥గ నుపన్యాసముల నొసంగుచున్నాడను. 1937 వ సం॥ నవంబరు, డిశంబరు నెల లలో గుంటూరు పట్టణమందలి టవున్ హైస్కూలు కాంపౌండు నందు 45 రోజు లుపన్యసించినాడను. ఆ పురజనులగు పురుషులు స్త్రీలు. ప్రతిరోజు రెండువేలమందికి తక్కువ కాకుండ చాల ఉత్సా హముతో విని నాకు బ్రహ్మానందమును గలిగించిరి. ఆ యుప న్యాసము లన్నిటిని మధ్వశ్రీ మొరుసుపల్లి హనుమంతరావు గారు (బి. ఏ., యం. యల్., వకీలు, గుంటూరు) బహు చక్కగా, చెప్పినది చెప్పినట్లు దేనిని వదలక వ్రాసికొని యెప్పటి కప్పుడు నాకు చదివి వినిపించిరి. వారు వాని నన్నిటిని గ్రంథ రూపముగ ప్రచురించుచున్నారు. వానిని పఠించిన 'హంసోయథా క్షీర మివాంబుమిశ్రి' మన్నట్లు, సారమును గ్రహించి యసార మును త్రోసివేయుదురుగాక! అమూల్యమగు గీతాసారమును గ్రహించి వారివారి జీవయాత్రలో పొందుపరచి సకలకష్టము లను పోగొట్టుకొని సకలైహికాముష్మికసుఖములను భగవ దనుగ్రహముద్వారా సకలురు నందుదురుగాత!

నారాయణస్మరణపూర్వక ఆశీర్వచనములు.

మకాం: నరసాపురం,
25—1—1938.

ఇట్లు విన్నవించు,
చిద్ఘనానందేంద్రసరస్వతీస్వామి.

ఓమ్



శ్రీమ న్నారాయణారంభాం శ్రీమదాచార్యమధ్యమామ్
అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరంపరామ్.
శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే.
శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘువరాన్వయ రత్నదీపమ్
అజానుబాహు మరవిందదళాయతాక్షం
రామం నిశాచరవినాశకరం నమామి.
మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి.
శ్రీరామం హనుమత్సేవ్యం శ్రీకృష్ణం భీమసేవితమ్
శ్రీవ్యాసం మధ్వసంసేవ్యం సకలాభీష్టదం భజే.

## చతుర్థముద్రణము - విజ్ఞప్తి

శ్రీశ్రీశ్రీ చిద్ఘనానందేంద్ర సరస్వతీస్వాముల వారి బోధనా పటిమకును, సోదర సోదరీమణులకు శ్రీ గీతాపఠనమందుఁ గల నిరుపమాన శ్రద్ధాభక్తులకును, కొలఁదికాలములో నీ గ్రంథము నాల్గవతూరి ముద్రింపించుట కవకాశముగల్గుటయే తార్కాణమని వేఱె చెప్పనక్కఱలేదు.

ముద్రణాకార్యమునకుఁ గాగితము లభ్యపడక కాల వ్యవధి పట్టినను శ్రీమన్నారాయణమూర్తి కృపవలన నీ కార్యము సమకూరినందుల కెంతయు సంతసింపఁదగియున్నది. శ్రీ స్వాములవారు పూర్వాశ్రమమున “గీతామృతము” అనెడి శీర్షికక్రింద 1926 సంవత్సరములో బందరులోఁ బ్రచురించ బడుచుండెడి ‘సత్సంగ’ పత్రికకు నిరువదియొకటి బిందువు

లుగా వ్యాసముల నంపియుండిరి. శ్రీవారి శిష్యవర్గములో నొకరగు శ్రీ నాళం చిన్మయలింగముగారు (హెడ్ క్లార్కు, సబ్ రిజిస్ట్రారు ఆఫీసు, భీమడోలు) వానిని గడుంగడు శ్రద్ధతో సేకరించియుంచి ఈ గ్రంథములోఁ జేర్చి యచ్చొత్తించవలసిన దని నా కొసంగియున్నారు. వారి కే నెంతయుఁ గృతజ్ఞుఁడను. దానిని శ్రీవారు ప్రకటించిన 'ధ్యానశ్లోకముల' నీ ముద్రిణమున నూత్నముగఁ జేర్చినాఁడను. గ్రంథవిస్తరమువలనను, కాగితము వెల పెరిగినందునను, గ్రంథమూల్యము హెచ్చింపవలసివచ్చినది. అందులకుఁ బాఠకమహాశయులు నన్ను మన్నించి, గీతామృతముఁ గ్రోలి నా యుత్సాహము నినుమడింపఁ జేయవలసినదని వేఁడుకొనుచున్నాఁడను. మఱియు నీ కూర్పు వెలువడుటలో నాకుఁ దోడ్పడిన నా సోదరుఁడు మదరాస్ హిందూ థియలాజికల్ హైస్కూలు టీచరు. చిరంజీవి మొరుసుపల్లి లక్ష్మీనరసింహారావు, బి. యస్‌సి., బి. యిడి. కిని, మదరాసువాస్తవ్యులు శ్రీయుత పూర ఆదిశేషు శాస్త్రి గారికిని, బెజవాడ ఆంధ్రగ్రంథాలయ ప్రెస్ మేనేజరు బ్రహ్మశ్రీ కుందా లక్ష్మీనరసయ్యగారికిని, ముద్రణాలయ కార్యనిర్వాహక బృందమువారికిని, నా కీ ప్రచారమునందు సర్వవిధముల సాయమొనరించుచున్నట్టి యసంఖ్యాకులగు మిత్రుల కెల్లరకును, నా కృతజ్ఞతాపూర్వక వందనములు.

ఇట్లు,
సుహృదయవిధేయుఁడు,
మొరుసుపల్లి హనుమంతరావు,
బి. ఏ., ఎమ్. ఎల్.,
ప్రచురణకర్త.

గుంటూరు,
17—3—42.
చిత్రభాను సం॥ర చైత్ర శు ౧.

46



మొరుసుపల్లి హనుమంతరావు, బి. యే., యమ్. యల్.,

గీతోపన్యాసముల ప్రచురణకర్త.

శ్రీ హయగ్రీవాయ నమః

సీ॥ శ్రీ వత్సగోత్ర లక్ష్మీబాయి రుక్మాజి
పుణ్యదంపతులకుఁ బుత్రకుండు
మొరుసుపల్ల్యన్వయమ్మునవాఁడు ప్లీడరు
హనుమంతరావు తాఁ దెనుఁగుబాసఁ
జిద్ఘనానందేంద్ర చిహ్నాసరస్వతీ
స్వామిగీతామహావాక్యచయము
సామరస్యముగ గీతామూలసారార్థ
సముదయంబులతోడ సంగ్రహించి

గీ॥ పొత్తముగ వ్రాసి యీపునర్ముద్రణంబు
నచిరకాలంబుననె దివి కరిగి నట్టి
స్వీయసతికి 'సరస్వతీబాయి' కొసఁగె
ఆశశిదివాకరం బిది యలరుఁగాత !

శ్రీ శ్రీ శ్రీ

## తృతీయముద్రణము - అంకితము

శ్రీ చిద్ఘనానందేంద్ర సరస్వతీస్వాములవారి గీతోపన్యాసామృతమును వెదజల్లవలయునని సంకల్పించి, నే నచ్చొత్తించిన గ్రంథములు రెండు ఆవృత్తులు శీఘ్రకాలములో నైపోయినవి. నాకీ ప్రచారమునందు సాయ మొనర్చుచు ననేకవిధములఁ బ్రోత్సహించుచున్న సోదరసోదరీమణులకును, గ్రంథము, పరిశీలిం తమ యభిప్రాయముల నొసగిన మహానీయులకును. పత్రికాధిపతులకును, కృతజ్ఞతాపూర్వక వందనములు. తా నొకటి తలఁచిన దైవ మొకటి తలఁచునను సామెత యెల్లరకుఁ దెలిసియే యున్నది. శ్రీమన్నారాయణుని పాదారవిందముల భక్తితోఁ గొల్చుచు నెమ్మదిగ సంసారయాత్ర జరుపుకొనుచున్న తఱి, నా పూర్వకర్మానుభవమున, నా ధర్మపత్నియు సహధర్మచారిణియునగు మొఱుసుపల్లి సరస్వతీబాయి (30 సం॥ వయస్సు) అకస్మాత్తుగ జబ్బుచేసి, నన్ను నాపసిబిడ్డల నలుగురిని దుఃఖసాగరమున ముంచి, పరమపవిత్రమగు ప్రమాధి సం॥ర కార్తిక శుద్ధ ఏకాదశి (22-11-39) రాత్రి స్వర్గస్థురాలైనది. గీతాప్రచారోద్యమమువలనఁ గలిగిన ఆనందములో నా గృహలక్ష్మియుఁ బాల్గొనుచుండెడిది. గృహిణి వియోగ సంతప్తమానసుఁడనయ్యుఁ బరిస్థితులు క్లిష్టముగా నున్నను, ఈగ్రంథముఁ జదువ నభిలషించు వార లనేకులు నా కుత్తరముల వ్రాయుటచేతను, పునర్ముద్రణ గావించి నాభార్య కంకిత మొనర్చిన ఆమెకు ఆత్మశాంతియు సద్గతియు చేకూరునను విశ్వాసముండుటచేతను ఈ గ్రంథము ముద్రింపించి శ్రీ

కృష్ణార్పణముగ నామె కంకిత మొనర్చుచున్నాఁడను. మఱియు ఆమె జీవించియుండఁగా ఈగ్రంథమును గన్నడభాషలోనికిఁ బరివర్తన చేయవలసిన దని నామిత్రులు బళ్ళారివాస్తవ్యులగు మధ్వశ్రీ ఆర్కాట్ భీమాచార్, యం. ఏ., యల్. టి., రిటైర్డు హెడ్‌మాష్టరుగారిని గోరియుంటిని. వారు దయతో దానికిఁ బూనుకొని మిక్కిలి శ్రద్ధతో నిర్వహించి సొగసుగాఁ దర్జుమా చేసి యిటీవల నాకుఁ బంపియున్నారు. దానిని ముద్రింపించుటకు యత్నముఁ జేయుచున్నాడను. అటుపైని దైవానుగ్రహము. ఈ ముద్రణమందు శ్రీ స్వాములవారి యాజ్ఞానుసారము, వారు రచించిన గీతార్థ సంగ్రహమును, మఱియు గీతోపదేశ త్రివర్ణ చిత్రమును జేర్చియున్నాఁడను. అదియుగాక ఐరోపామహాసంగ్రామమువలన కాగితము, క్యాలికో, అట్టలు మున్నగు వాని ధరలు హెచ్చినందున, గ్రంథముధర కొంచెము తప్పనిసరిగఁ బెంచవలసి వచ్చినది. ఈ ముద్రణము గూడ పాఠకుల నితోధికముగ నాకర్షించి వారి కెల్లరకును ఆత్మజ్ఞానాభివృద్ధియు, ఐహికాముష్మిక సుఖమును బడయుటకుఁ బరమోత్కృష్ట సాధనమై తనరారుఁగాత !

ఇట్లు విధేయుఁడు,

గుంటూరు,
19—౬—40.

మొరుసుపల్లి హనుమంతరావు,
బి. యే., యం. యల్.,
పరిచరణకర్త.



# ప్రథమ ముద్రణ పీఠిక.

శ్రీ శ్రీ శ్రీ చిద్ఘనానందేంద్ర సరస్వతీ స్వాములవారిని (పూర్వాశ్రమమున బందరు వాస్తవ్యులగు కోరంకి వెంకటరామశర్మగారిని) ఎరుగనివా రుండరు. వీరు అస్ఖలిత బ్రహ్మచారులు. వీరి వయస్సు 59 సంవత్సరములు. వీరి స్వస్థలము చెన్నపట్టణము. వీరు సుమారు 30 సంవత్సరములు బందరు హైస్కూలునం దుపాధ్యాయపదవి నలంకరించి, తాము సంపాదించు ద్రవ్యములో తమ ఖర్చులకు అవసరమగు సొమ్ముమాత్ర ముంచుకొని శేషించినదెల్ల ధర్మార్థమై వినియోగించుచు స్కూలులో పని ముగిసిన పిదప భగవద్గీతోపన్యాసముల నిచ్చుచు, పురాణకాలక్షేపముల జరుపుచు, బ్రహ్మజ్ఞానము గరపుచుండెడివారు. వీరు ఉద్యోగమునుండి విరమించుకొనిన పిదప ఇప్పటికి సుమారు రెండుసంవత్సరముల క్రిందట ఆశ్రమము స్వీకరించి, శ్రీ చిద్ఘనానందేంద్రసరస్వతీ స్వాములవారను సార్థకనామమును వహించి, ఆంధ్ర, ద్రావిడ దేశములలో పర్యటనము చేయుచు, గీతామృతమును పండిత పామరు లెల్లరకు వెదజల్లుచున్నారు. వారి పాండిత్యము, ఉపన్యాస చమత్కృతి, ఉపమానోపమేయ సంపదయు కఠినమగు వేదాంత విషయముల సోదాహరణముగ పసివారలకు సహిత మర్థమగునట్లు చెప్పగల సమర్థతయు—అద్వితీయములు. తా మితరులకు కేవల ముపదేశించుటయే గాక వాని నన్నిటిని తాము స్వయముగ ఆచరణలో బెట్టి ఇతరులకు మార్గదర్శకులైనవారిలో నగ్రగణ్యులు వీరే యని చెప్పనగును.

అట్టి మహామహుని గుంటూరు పట్టణమునకు మ. రా. శ్రీ పొర్ల నరసయ్య పంతులు, బి. ఏ., రిటైర్డు సబ్ మేజస్ట్రీటుగారు పిలిపించి, నామసంకీర్తనమందిరమువారి యాజమాన్యమున ది 10—11—37 మొదలు 28—12—37 వరకు శ్రీ స్వాములవారిచే మొత్తము 45 గీతోపన్యాసముల నిప్పించిరి. మొట్టమొదట న న్నుపన్యాసమున కాహ్వానించి నప్పుడు కార్యాంతర నిమగ్నుడ నగుటచే వెళ్ళుట తటస్థించలేదు. తదుపరి శ్రీ స్వాములవారి వాజ్ నైపుణ్యము, అసమాన బోధనాపద్ధతియు విని రెండవ

అధ్యాయము జరుగుచుండగా వెళ్ళియుంటిని' శ్రీవారి ఉపన్యాసము వినుటతోడనే అంతకుమున్ను లేని నూతనవికాసము నామనంబునకు బొడగట్టె. నేను జన్మతః ద్వైతినై శ్రీశ్రీశ్రీ సత్యధ్యానతీర్థ శ్రీపాదులవారిచే ప్రచురింపబడిన గ్రంథముల మూలమున ద్వైతసిద్ధాంతమార్గ మొక్కింత తెలిసికొన్నవాఁడనయ్యు ద్వైతాఽద్వైత విశిష్టాద్వైత సాంప్రదాయముల మూటిని సరిపోల్చి వానియందలి భేదాభేదముల విశదీకరించుచు గీతామృతము కరతలామలక మగునట్లు శ్రీస్వాములవారిచ్చిన మహోపన్యాసముల నొక చెవితో విని రెండవచెవిలోనుండి వదలివేసిన లాభము లేదనియు; వాని నన్నిటిని చక్కగా వ్రాసిపెట్టుకొని, చదివి అవగాహన చేసికొనుట మంచిదని దృఢనిశ్చయుండనై; శ్రీవారి గురుప్రేరణవల్ల స్వోపయోగార్థము వారిచ్చుచుండెడి ఉపన్యాసముల నప్పటికప్పుడు వ్రాసికొని, నిత్యము శ్రీ స్వాములవారిని సందర్శించుచు లోగడ నేను వినని విషయముల తెలిసికొనుచు నేను వ్రాసికొనినదెల్ల శ్రీవారికిని చదివి వినిపించి తప్పుల దిద్దుకొనియుంటిని. వానిని సర్వజనోపయోగార్థము ప్రచురించిన బాగుండునని కొందరు పురజనులు ప్రోత్సాహింప, శ్రీవారి యనుజ్ఞం బడసి ఏతత్కార్య నిర్వహణంబునకుం గడంగి, మొదటి మూడు అధ్యాయములు ఉపన్యాసముఖముగా మరియొకసారి వినుట యుక్తమని తలచి, నేను 20-1-38 తేది మొదలు 26-1-38 తేదివరకు నర్సాపురములో శ్రీవారిచ్చుచుండిన ఉపన్యాసములకు వెళ్ళి వానిని వ్రాసికొనియుంటిని. ఇట్టి మహనీయుని ఉపదేశవాక్యముల వ్రాసికొనుటకు భగవంతుడు నాకు శక్తిని ప్రసాదించుటయు, కృపాపరిపూర్ణాంతరంగులైన నన్ననుగ్రహించి వానినెల్ల సరిచూచి ముద్రింపించుటకు శ్రీ స్వాములవారు అనుజ్ఞ నిచ్చుటయు నా పూర్వజన్మసుకృతములు. తామిచ్చిన గీతామహోపన్యాసముల ప్రచురించుటకు నాకధికార మొసంగిన శ్రీ స్వాములవారికి కృతజ్ఞతాపూర్వక దండవత్ప్రణామంబు లాచరించుచున్నాఁడను.

ఈ గ్రంథము పెద్దదియగుటంజేసి, ముద్రించుటయందు కొంతవ్యవధి పట్టినది. నా కీ యుద్యమమునందు పుస్తకములు వలయువారినుండి సొమ్మును ముందుగా వసూలుచేసి నా కత్యంతసహాయ మొనర్చిన నా మిత్రులు

నర్సాపురం కాపురస్థులు, మహారాజశ్రీ గంటి వెంకట్రావు, బి. ఏ. ఎల్.టి.; కళా సుబ్బారావు, బి. ఏ., బి. ఎల్.; దాం. సుబ్రహ్మణ్యవర్మ, బి. ఏ.; బి. ఎల్.; గార్లకును; రాజోలు కాపురస్థులు: మహారాజశ్రీ దర్భా వెంకటాద్రియ్య (డిప్యూటీ ఇన్స్పెక్టరు ఆఫ్ స్కూల్సు); ఏ. సోమయాజులు (టీచరు) గార్లకును; తణుకు కాపురస్థులు, మహారాజశ్రీ పాము రి సుబ్బారాయుడుగారికిని; ప్రూఫులు దిద్దుటయందేమి, అత్యంత శీఘ్రకాలములో ఈ గ్రంథము ముద్రించి యిచ్చుటయం దేమి నాకు తోడ్పడిన శ్రీ వేంకటేశ్వర ముద్రాక్షరశాలా స్థాపకులు గొట్టిపాటి మృత్యుంజయరావు గారికిని; శ్రీస్వామివారిని గుంటూరునకు పిలిపించి, వారిచే ఉపన్యాసముల నిప్పించి, నా కిట్టి అపూర్వ అవకాశమును గల్పించిన మధ్వశ్రీ పొగ్గ నరసయ్య పంతులుగారికిని, శ్రీరామచంద్రపుర అగ్రహారము నామసంకీర్తన మందిర సోదరులకును కృతజ్ఞతాపూర్వకవందనము లర్పించు చున్నాడను.

ఆధ్యాత్మవిద్యాలాలసులగు మహానుభావు లెల్లరు శ్రీ స్వాముల వారి యుపన్యాసామృతమును గ్రోలి సఫలీకృతజన్ములై ఐహికాముష్మిక సుఖములను అనుభవించెదరుగాక!

శ్రీ స్వాములవారి ఉపన్యాసములు నేను వ్రాసికొని ముద్రింపించుటలో నేవేని లోపములు గన్పట్టిన వాని నన్నిటిని నావిగ భావించి సహృదయులు నాకు తెల్పినయెడల ద్వితీయ ముద్రణమున వానిని సవరించుకొనెద నని వినయపూర్వకముగ మనవి చేయుచున్నాడను.

ఇట్లు విన్నవించు బుధజనవిధేయుడు,

గుంటూరు, 9—6—38. } మొరుసుపల్లి హనుమంతరావు, బి. ఏ., ఎం. ఎల్.,
ప్రచురణకర్త.

# ద్వితీయ ముద్రణ పీఠిక

మహాశయులారా!

శ్రీ శ్రీ శ్రీ చిద్ఘనానందేంద్రసరస్వతీస్వాములవారి గీతోపన్యాసములు నేను ప్రచురించిన పిదప వానిని బహిర్గతము చేయకపూర్వము, శ్రీవారిని నిచటికి రప్పించి, ఒక సభ సమావేశపఱచి, ఏతద్గ్రంథము వారికి సమర్పించుట యుక్తమని యెంచితిని. అత్తరి శ్రీవారు భీమవరములో నుపన్యసించుచుండిరి. వారిని రమ్మనిన అచట వారిచ్చుచుండిన యుపన్యాస పరంపర విచ్ఛిన్నమగు నేమోయని సందేహించుచుండ, భగవత్ ప్రేరితులై వారంతట వారే యిచటికి వచ్చుట తటస్థించినది. అంత మా గుంటూరు మాధ్వసంఘమువారి యాజమాన్యమున 18-6-38 (బహుధాన్య నామ సం॥ జ్యేష్ఠ బ ౫ శనివారము) సాయంత్రము 5-30 గంటలకు శ్రీస్వాములవారు ఏహిందూకాలేజి హైస్కూలు భవనమం దుపన్యసించిరి. అచట "భక్తి"ని గురించి ఉపన్యాసమును, గ్రంథసమర్పణము నేర్పఱుపఁబడెను. నా పూర్వపుణ్యవశమున ఆరోజుననే కామకోటి పీఠాధిపతులగు శ్రీ ౧౦౮ జగద్గురు శంకరాచార్య శ్రీమచ్చంద్రశేఖరేన్ద్ర సరస్వతీ స్వాములవారు గుంటూరునకు దయచేయుటయు వారిని ఏతత్సభకు అగ్రాసనాధిపత్యము వహింపుఁడని నే నాహ్వానించినంతనే వా రనుగ్రహించి విచ్చేయుటయుఁ దటస్థించినది. నాడు వర్షము కురియుచున్నను, సుమారు రెండువేలమంది స్త్రీపురుషులు సభకు హాజరై నన్నానందపరచిరి. ఆసభలో శ్రీ చిద్ఘనానందేంద్రసరస్వతీస్వాములవారికి గ్రంథసమర్పణముఁ జేసి వారియొక్కయు, అగ్రాసనాధిపతుల యొక్కయు యాశీస్సులకుఁ బాత్రుడనైతిని. ఇట్లు నాయందుఁ బరమానుగ్రహము చూపిన వారిరువురకును నా హృదయపూర్వక వందనములు.

పెద్దల యాశీర్వచనము లమోఘములుగదా! శ్రీవారి యాశీర్వచన మహిమవలనను, వారి యుపన్యాసమునందలి మాధుర్యమువలనను నేను ప్రప్రథమమున ముద్రింపించిన ప్రతులన్నియు నతిస్వల్పకాలముననే గీతా

మృతపానలాలసులగు భగవద్భక్తుల 'చేఁజేరుటంజేసి నేనీ ద్వితీయముద్రణ మొనర్పవలసి వచ్చినది.

ఈసందర్భమున నేను, ప్రథమ ముద్రణమునందు నచ్చటచ్చటఁ గన్పట్టు స్ఖాలిత్యముల నిందు సంస్కరించుటకుఁ దోడ్పడిన శ్రీస్వాముల వారికిని, అమలాపురము కాపురస్థులు బ్రహ్మశ్రీ కత్తా జోగయ్యగారికిని ఈగ్రంథ మంతయుఁ బరిశీలించి దయతోఁ దమ యభిప్రాయముల నొసంగిన శ్రీకామకోటి పీఠాధీశ్వరులకు, అస్మద్గురువర్యులగు అవధానిశిరోమణి మద్వశ్రీ కాశీ కృష్ణాచార్యులగారికిని ఈగ్రంథప్రాశస్త్యమును తమపత్రికాముఖమున వెల్లడించిన హిందూ, ఆంధ్ర, పూర్ణబోధాదర్శిని మున్నగు పత్రికాధిపతులకును, ఈగ్రంథమందు దాసక్తిచే ప్రథమమున ముద్రింపించిన ప్రతు లన్నియు నచిరకాలములోననే చెల్లుటకు సర్వవిధముల నాకుఁ దోడ్పడిన యసంఖ్యాకులగు మన్మిత్రవరులకును, ద్వితీయముద్రణమును త్వరలోఁ బూర్తి కావించి ప్రథమముద్రణ స్ఖాలిత్యముల సవరింపించిన బ్రహ్మశ్రీ కుందా లక్ష్మీనరసయ్యగారికిని కృతజ్ఞతాపూర్వకవందనముల నర్పించుచున్నాను.

ఎవరీగ్రంథమును శ్రద్ధతోఁ జదివెదరో వారిజీవితమందు గొంతమార్పు కన్పట్టక మానదని నానమ్మకము. ఈయది ఆంధ్రదేశమందింటింట నుండవలయునని నాఆశయము. కనుక స్త్రీపురుషులెల్లరు దీనిని బడసి గీతామృతమును గ్రోలి తమ్ముఁదా బాగుపఱచుకొని, నన్నుఁ గృతార్థునింజేసి, శ్రీకృష్ణుని పరిపూర్ణానుగ్రహమునకుఁ బాత్రులై ఐహికాముష్మిక సుఖములందుదురుగాత!

ఇట్లు విన్నవించు.
బుధజన విధేయుఁడు,

గుంటూరు,
19-11-38.

మొరుసుపల్లి హనుమంతరావు,
బి. ఏ., ఎం. ఎల్.
ప్రచురణకర్త.

# అభిప్రాయములు

॥ श्रीः ॥

श्रीमत्परमहंस परिव्राजकाचार्यवर्य
श्रीमच्छङ्करभगवत्पाद प्रतिष्ठित
श्री काञ्ची कामकोटिपीठाधिप जगद्गुरु
श्रीमच्चन्द्रशेखरेन्द्रसरस्वतीश्रीपादैः

శ్రీ శ్రీ శ్రీ ౧౦౦౮ కామకోటి పీఠాధిపతులగు జగద్గురు శంకరాచార్య శ్రీ మచ్చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ స్వాములవారి ట్లాశాసించుచున్నారు.

“అస్మదత్యంత ప్రేమభాజన గర్తపురీ (గుంటూరు) నివాసి మొరుసుపల్లి హనుమంతరావుగారికి సర్వాభీష్టములు సిద్ధించునట్లు నారాయణస్మృతిః.”

శ్రీ శ్రీ శ్రీ చిద్ఘనానందేంద్ర సరస్వతీ స్వాములవారు ఆపామరసాధారణముగ సర్వజనసుబోధ మగున ట్లొసంగియుండు శ్రీభగవద్గీతార్థోపన్యాసములను తాము ముద్రింపించి ప్రచారపరచి నందులకు చాల సంతసించినాము. ధర్మానుసారమై, సప్రమాణము గను సయుక్తికముగను లౌకికదృష్టాంతములతో నొసంగియుండు నిట్టి యసామాన్యప్రవచనమును తాము శ్రద్ధ వహించి ప్రచారపరచి నందులకు సకలాస్తికులకును తమయందు కృతజ్ఞతాభావము కలిగియుండు ననుటలో నెంతమాత్రమును సంశయ ముండదు. ఇట్టి లోకోపకారమును గైకొని సన్మార్గప్రవృత్తి గలవారై యుండు తాము శ్రీచంద్రమౌళీశ్వరకృపచే నైహికాముష్మిక సకల శ్రేయస్సులను బొందుదురుగాక. నారాయణస్మృతిః”

## అవధాని శిరోమణి మధ్వ శ్రీ కాశీ కృపాచార్యులుగారు ఇటుల వ్రాయుచున్నారు

[26-10-38, గుంటూరు]

శ్రీ శ్రీ శ్రీ చిద్ఘనానందేంద్రసరస్వతీ స్వాములవారిని సుమారిరువది సంవత్సరములనుండియు నే నెఱుంగుదును. వీరి యుపన్యాసముల నపుడపుడు వినియుంటిని. వీరి యస్ఖలిత బ్రహ్మచర్యమునకును, సహజవిరక్తికిని నేనమితానందము నందితిని. వీరు పూర్వాశ్రమమునఁగూడ యతులకు యథార్థమగు వైరాగ్యాది గుణసంపత్తిని నేర్పఁదగిన బ్రహ్మచారులుగ నుండియు నిష్కళంకమగు యతిధర్మము నే యాచరణములోఁ బెట్టుకొనిన జ్ఞానయోగులు. ఇట్టి వీరి గీతోపన్యాసములను గుంటూరున నేను దాదాపు అన్నిటిని వింటిననియే చెప్పవచ్చును. ఎట్టిపామరులైనను వీరి యుపన్యాసము లాకర్షింపక మానవు. మొత్తముమీఁద వీరి గీతోపన్యాసములు అద్వైత సిద్ధాంతమునే బోధించెడివైనను అద్వైతమునందుఁగూడఁ గొంత సత్యమున్నది గాన చరమస్థితి వచ్చునఱకును, ద్వైతానుష్ఠాన మనివార్యమగుటంజేసి ముముక్షువుల కిపుడద్వైతతత్త్వ ముపదేశింపరాదనియే వీరి సిద్ధాంత మని నే గ్రహించితిని. "మధుసూదన సరస్వతీ"యొక్క సిద్ధాంతముగూడ నిట్టిదే. కావున వీరి యుపన్యాసములు వినుటకు మతత్రయమువారును సిద్ధపడవలయుననియే నా యభిప్రాయము. వీరి యుపన్యాసము లన్నియును "శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః"అను శ్లోకముపై నాధారపడియుండును. గాన,ప్రధానమగు తత్త్వత్రయజ్ఞానమును సంపాదించుకొని తమతమ మతానుసారమా యా మతస్థు లాచరణలోఁ బెట్టుకొని కడతేరుట కిట్టి యుపన్యాసములే త్రిమతస్థులకును మహోపకారకము లని నా తాత్పర్యము. ఈ మహనీయులు తమ యుపన్యాసామృతమును, నాకును, మాపురవాస్తవ్యులకును విను నవకాశము లను గల్పించినందులకు వీరియెడ నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

మా శిష్యరత్నములలో నొకరగు శ్రీరస్తు చిరంజీవి మొరుసుపల్లి హనుమంతిరావు, బి. ఏ., యమ్. యల్., గారు శ్రీవారి యుపన్యాసములను 'తూ. చా.' తప్పకుండ సంగ్రహించుటయేగాక అచ్చొత్తించి మన యాంధ్రలోకమునకు మహోపకర్త యగుట అతనికిని శ్రీపార్థసారథి కృష్ణుఁ డైహికాముష్మిక సుఖముల నొడఁగూర్చి యనుగ్రహించుఁగాత మని యాశీర్వదించుచు, నా కృతజ్ఞతను దెల్పుదును.

శ్రీవారి యుపన్యాసముల వినినవారుగాని, తద్గ్రంథములం గొనినవారుగాని, శ్రీకృష్ణుని యుపదేశముల ననుభవమునకుం దెచ్చికొని స్వమతానుసార మాచరణలోం బెట్టుకొని, యిహలోకమున నిర్దుష్టజీవయాత్ర కలవడి అపావృతస్వర్గద్వారులై శ్రీపార్థసారథికృపాపాత్రు లగుదురుగాక.

ఇతి శమ్ —కాశీ కృష్ణః

---

మహాకవి కళాప్రపూర్ణ శతావధాని బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రులుగా రిట్లు వ్రాయుచున్నారు.

( కడియము, 25_12–38. )

నేను సుమారు నెలపదిరోజులనుండి చెన్నపురి నెల్లూరు బెజవాడలలో నుంటచే మీరంపిన భగవద్గీతోపన్యాసము లనెడి గ్రంథముపై నభిప్రాయ మంపుట కాలస్యమైనది. స్వాములవారిని నేను పూర్వాశ్రమములో బాగుగ నెఱుంగుదును. చాలకాలము వారును నేనును బందరు హిందూ హైస్కూలులో నుపాధ్యాయులుగా నుంటిమి. వారు పూర్వాశ్రమమున గూడ సర్వదా గీతోపన్యాసములు చేయుచుం బరమార్థప్రధానముగా జీవితము గడపుచుండువారు. వారి జ్ఞానము నిరుపమానము. ఇటీవల సన్న్యాసాశ్రమస్వీకారము చేసినపిదప మాత్రము నేను వారి దర్శనము చేసినట్లు జ్ఞప్తిలేదు. వారి యుపన్యాసములపై నస్మదాదుల యభిప్రాయము లకించిత్కరములు. అయినను తాము పంపుమని కోరుటచే సూత్రప్రాయముగా వ్రాయుచున్నాను. శ్రీవారి గ్రంథము చాలవరకు జదివితిని. శ్రీకాశీకృష్ణాచార్యులవారు పొందిన అభిప్రాయమునే నేనును బొందితిని. ఇంతకన్న విస్తరింపవలసిన ఆవశ్యకత లేదు. గ్రహింపుడు.

చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి,
శతావధాని.

---

ఆంధ్రపత్రిక ది 31-1-39 ఇట్లు వ్రాయుచున్నది :

"శ్రీ చిద్ఘనానందేంద్ర సరస్వతీ స్వాములవారు (పూర్వాశ్రమమున కోరంకి వెంకటరామ శర్మగారు) గుంటూరులో ది 10-11-37 మొదలు 28-12-37 వరకు నిచ్చిన గీతోపన్యాసములను గ్రంథరూపమున గుంటూరు జిల్లాకోర్టు వకీలు మొరుసుపల్లి హనుమంతరావు పంతులుగారు ప్రచురించి ముముక్షుజనమున కత్యంతోపకారము జేసిరి. ఈగ్రంథాదిని గీతావాచకము కలదు. తరువాత నుపన్యాసము లొకొక్క అధ్యాయముపై ప్రచురింపబడినవి.

గీతారహస్యమును దెలుసుకొనుట కష్టము. ఏమాత్రము సంస్కృత జ్ఞానముకలవారైనను ఆ శ్లోకముల జదివి స్థూలముగ నర్థము దెలుసుకొనవచ్చును. కాని శంకరరామానుజాదులు గీతను పరిశోధించి యందుగల ధర్మమును తాము గ్రహించిన విధముగ లోకమునకు దెలియజేసిరి. వాని నాధారముగ జేసికొనియే నేడు త్రిమతములవారు తత్ప్రాశస్త్యమును జనసామాన్యమున కెరుకపరచు చుండిరి. ఎందరో ప్రతిపదార్థతాత్పర్యములను వ్రాసిరి. ఉపన్యాసముల సమయమున వివరించి చెప్పిన యంశములను యథాతథాగా నింతవరకు సమకూర్చినవా రెవరును లేరు. ఈఉపన్యాసములు వ్రాసికొనివచ్చి సభలో జదివినవి కావు. సభయం దున్నవారి కాబాలగోపాలము అర్థమగునటుల సందర్భోచితములగు కథలతో నుదాహరణములతో నివి అప్పటికప్పుడు చెప్పబడినవి. అందుచేత వీనిని చదువుకొనునపు డుండు ఆనందమును మెండుగ నుండును. ఈ ఉపన్యాసముల వినుట కెందరు జనులు చేరెదరో ఈ గ్రంథములు కొనుటకును అందరు నువ్విళ్ళూరెద రనుటకు సందియము లేదు. అందుచేతనే రెండవకూర్పుకూడ త్వరలో ప్రకటింపబడినది. ఇదియు పాఠకుల నత్యధికముగ నాకర్షించునని నమ్ముచున్నాను."

---

'ఆంధ్రమిత్ర' రంగూన్ ది 4-2-39 ఇట్లు వ్రాయుచున్నది;—

ఈ ఉపన్యాసావళిని హనుమంతరావుగారు చాలా శ్రమపడి ప్రచురింపగల్గారు. ఉపన్యాసకు లగు శ్రీ స్వాములవారు వర్ణాశ్రమ ధర్మోపాసకులు. శ్రీవారు అద్వైత తత్త్వావలంబకులైనను ద్వైత విశిష్టాద్వైత తత్త్వాల తారతమ్యముద్వారానే అధ్యాత్మిక విషయాలను సుస్పష్టముగా తేల్చగల్గారు.

స్వాములవారు జ్ఞానయోగానికి ఉన్నతస్థాన మిస్తూ హృదయకల్మషాన్ని పారద్రోసి దానికి కర్మయోగ ప్రధానమంటూ వక్కాణిస్తున్నారు. "భగవద్గీత మానవకోటికి సామాన్య మతగ్రంథము" అంటూ అహర్నిశలు చాటిన శ్రీ వివేకానందస్వామివారి ఉద్దేశముతో శ్రీస్వాములవారున్నూ యేకీభవిస్తున్నారు.

త్రిమూర్తు లగు బ్రహ్మ, విష్ణు, ఈశ్వరులద్వారా భగవంతుని పూజించడము, పరాత్పరు డగు శ్రీకృష్ణుడు మోక్షమార్గాన్ని మతవివక్షత లేకుండా స్వీకరించడమనే నిరీక్షణ స్వాములవారి దృఢవాక్కులు. ప్రపంచ విఖ్యాతిని బడసిన షేక్స్పియరు, సోక్రిటేస్, కార్లయిల్, డిసార్ట్రిస్, తాయిమానవర్, వివేకానందస్వామి, శ్రీ త్యాగరాజు, బమ్మెరపోతన్న పుష్పదంత, అశ్వినీకుమారదత్తు వీరివ్రాతల్ని భాగవత దృక్పథముతో విమర్శించారు.

ఉపన్యాసాలలో అక్కడక్కడ ఇంగ్లీషువాక్యాలు సమకూర్చడము క్లిష్టసమస్యల్ని యితిహాసాలమూలాన్ని విశదీకరించడము శుభసూచకము. శ్రీమద్భగవద్గీత శ్లోకాల్ని వచనరూపాన్ని ప్రచురించి ఆంధ్రదేశమునకు నూతనకుసుమము నర్పించినందులకు ప్రచురణకర్తను శ్లాఘించవలసియున్నది.



ది అడ్వర్టైజరు పత్రిక 15-1-41

శ్రీ శ్రీ చిద్ఘనానందేంద్ర సరస్వతీ స్వాములవారి
భగవద్గీతోపన్యాసములు

క్రౌనుసైజు 1/8. 368 పేజీలు వెల రు 1—12—0 లు

ప్రకాశకులు:—

మధ్వ శ్రీ మొరుసుపల్లి హనుమంతరావు పంతులుగారు,
బి. ఏ., యమ్. యల్., జిల్లాకోర్టు వకీలు, గుంటూరు.

శ్రీ శ్రీ చిద్ఘనానందేంద్ర సరస్వతీ స్వాములవారి శ్రీమద్భగవద్గీతోపన్యాస సంపుటిని జూచివాడను. ఇది సాంస్కృతిక పారిభాషా పదార్థ విజ్ఞానధనులకేగాక, ఆంధ్రభాషావిదులగు సామాన్యజనులకుగూడ నీ గ్రంథరాజమత్యంతోపయోగకారి యని దృఢముగ చెప్పవచ్చును.

తేటతెల్లమగు తెలుగు జిలిబిలి పలుకులతో, మృదుమధుర పదరచన కలితవచననిచయముతో, సకలజనమనోంబుజ వికసన కలనవిభాకర కరనికర నిభోదాహరణ పరంపరలతో, విలసిల్లెడి యీ గీతోపన్యాస సంపుటి యాంధ్ర మహాజన శ్రవణపుటముల కశ్రుతపూర్వసువర్ణాలంకారమని యే భావించెదను.

ఇంతదనుక నెందరో మహానుభావులు, తత్త్వసంపన్నులు, అష్టోత్తర శతోపనిషత్సార సుధారస మత్తచిత్తులగు ఉత్తమపూరుషులు, గీతోపన్యాసముల నొసంగిరి. కాని, యవి కతిపయజన మనోహ్లాదములకొకరమై, విషయ సంశ్లేషణ పటిష్ఠములై, పటుతరాధ్యాత్మిక తత్త్వగరిష్ఠములై యున్నందున, కించిదధీత గీతాకాంక్షులకు సులభబోధ్యములు కానేరకున్నవి. శ్రీ స్వాములవారు పూర్వాశ్రమమున బ్రహ్మచర్యనిష్ఠాగరిష్ఠతయందుండి, యోగీశ్వరులకు, విషయలంపటరహితులకు, కేవలాధ్యాత్మిక తత్త్వవేత్తలకు గూడ, కాయిక, వాచిక, మానసికముగ ననుభవసాధ్యము కాని, యనంత గీతారహస్యమును దెలిసికొనిన విజ్ఞానులగుటచే, నీ యాశ్రమమున నది పరిపక్వమై, సకలజనబుభుక్షుయోగ్యమైనది.

ఈ యుపన్యాస సంపుటియును దేహి, కృష్ణభక్తుల వాక్యసరణిని సంచరించి; శ్రీరామకృష్ణ పరమహంస, వివేకానంద స్వామ్యాదుల బోధ తరుచ్ఛాయల విశ్రమించి; శంకర, రామానుజ, మధ్వరాయ మత త్రిపథమున; శంకా సమాధానసందేహాందోళ నాందోళిత స్వాంతుడై; స్వోద్దిష్ట

మతమందిరాంతర్గతుండై; యష్టాదశాధ్యాయ విశిష్ట గీతాశాస్త్రమును సింహావలోకనము జనీ; తత్సారమును సావధాన మనస్కుడై చర్వితము గావించెను.

గీతాశాస్త్రమున అష్టాదశాధ్యాయములకు ప్రత్యేక విశిష్టత యున్నప్పటికిని; భక్తి, కర్మ, జ్ఞానయోగములు ముక్తికి ముఖ్యసాధకములు. గ్రంథ విస్తరభీతిచే విపులీకరణమును విరమించి భక్తియోగమునందలి, యణుప్రమాణ భక్తిప్రాశస్త్యవిషయమును, శైలికి, భక్తి ప్రపత్తి నిరూపణమునకు, నుదాహరించుచున్నారు.

శ్లో॥ "పత్రం, పుష్పం, ఫలం, తోయం, యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత, మశ్నామి ప్రియతాత్మనః॥ గీ. 9-26

క॥ దళమైన, పుష్పమైనను, ఫలమైనను, సలిలమైన పాయనిభక్తిన్
కొలిచిన జను లర్పించిన, నెలమిన్ రుచిరాన్నముగనె యేను భుజింతున్

అని పోతన మహాకవి తన భాగవతమున చక్కగ నాంధ్రీకరించి వక్కాణించెను. భగవంతునికి పత్రపుష్ప ఫలతోయంబులలో నేదైన నొక దానిని భక్తియుక్తముగ నిచ్చిన మోక్షసామ్రాజ్యలబ్ధి యగునా! యని సందేహించ వలదు. పురాణస్థపురుషులు భక్తిద్వారా ముక్తిద్వారమును చేరినట్లు యీకథాసంధానము చెప్పుచున్నది.

"పత్రము:— (1) శ్రీకృష్ణతులాభారము:— 16107 రు భార్యలు తమ సొత్తంతయు పెట్టిన సరితూగని పరమాత్మ, వాటి నన్నిటిని తీసివేసి, రుక్మిణియొక్క తులసిదళము పెట్టినంత మాత్రముననే సరితూగుట.

(2) శివగీత:—అగస్త్యుడు రామునికి శివప్రతిష్ఠ చేయవలసినదని చెప్పుచు, పరమశివునికి నొక మారేడుదళమిచ్చిన చాలునని చెప్పియున్నాడు. "బుద్ధం కించిత్సమాధాయ క్షుల్లకం జలమేవవా" ఒక మారేడుదళము గాని, ఒక పువ్వుగాని ఒక ఉద్ధరణి నీళ్ళుగాని పరమశివునికి అర్పించిన చాలును.

పుష్పము:—గజేంద్రుడు తొండముతో తామరపుష్పముతీసి భగవంతునికి చూపినంతనే భగవంతుడు సాక్షాత్కరించి రక్షించెను. భక్తిలేని పూజ పత్రిచేటు.

ఫలము:—"శబరీదత్తఫలాశనరామ" ఎంగిలిపండులిచ్చిన శబరిభక్తికి మెచ్చి మోక్ష మిచ్చెను.

తోయము:—రంతిదేవమహారాజు తనకు దొరకిన ఫలముల నిచ్చివేసి. 24రోజులు లేక 48రోజులు ఉపవాసముండి యేమియు నివేదనకు దొరుకక,

నీళ్లు నివేదనచేసి ఆనీళ్లు నోటిలోపోసుకొని నాలుక తడుపుకొనబోవుచుండగా ఒక ముదుసలి వచ్చి దాహము కోర, ఆమె కియ్యగా ఆముదుసలి శంఖచక్ర సమన్వితుడైన విష్ణువై సాక్షాత్కరించి విమానముపై రంతిదేవునికూర్చుండబెట్టి మోక్షమునకు తీసుకొని వెళ్లెను." గీ.ఉ.పుట195.

మానసికపూజ సర్వోత్తమమైనదని శ్రీ శంకరభగవత్పాదులవారీ క్రిందివిధమున వచించిరి.

"ఆత్మా త్వం, గిరిజా మతిః పరిజనాః ప్రాణాః, శరీరం గృహం
పూజా తే విషయోపభోగరచనా, నిద్రా సమాధిస్థితిః
సంచారః పదయోః ప్రదక్షిణవిధిః, స్తోత్రాణి సర్వా గిరో
యద్య త్కర్మ కరోమి త త్తదఖిలం శంభో తవారాధనమ్॥

పరమశివా: నీకు ఆరాధన యేమనగా నాఆత్మయే నీవు, నాబుద్ధియే పార్వతి, సహచరులు ప్రాణవాయువులు, నాశరీరమే నీయిల్లు, ప్రాపంచిక విషయములను నేను అనుభవించుటయే నీపూజ. నిద్రయే సమాధిస్థితి. కాళ్లతో నడచుటయే నీప్రదక్షిణము. నేను మాటలాడుమాటలన్నియు నీస్తోత్రమే. నేనుచేయు సకల కాయిక, వాచిక, మానసిక కర్మ లన్నియు నీ ఆరాధనయే."

పైని నుదాహరించిన భక్తియోగాంశమును గాంచిన ప్రతిమానవునికి శ్రీ స్వాములవారి యఖండప్రతిభ ప్రస్ఫురించకపోదు. ఈవిధముగనే యష్టాదశాధ్యాయములకు భక్తుల వాక్యప్రమాణములు, మహాత్ముల సిద్ధాంత ప్రమాణములు, ఆంగ్లేయుల గ్రంథప్రమాణములు. విరివిగ విశదీకరించిరి. ఉపనిషత్ప్రమాణములను తగ్గించి, యుదాహరణలను పెంపొందించిరి. మణిగణమునకు సువర్ణమును గూర్చినట్లు కూర్చిరి.

శ్రీ శ్రీ చిద్ఘనానందేంద్ర సరస్వతీస్వాములవారు ప్రసాదించిన యీగీతోపన్యాససుధాలహరిని యాంధ్రమహాజన హృదయముల యందు ప్రవహింపజేయబూనిన మధ్య శ్రీ మొరుసుపల్లి హనుమంతరాయ భక్తులు ధన్యతములని భావించెదను. శ్రీ స్వాములవారి యుపన్యాస చింతామణి నాంధ్రభారతికి సమర్పించుటకు హనుమంతరాయలకేగాని యితరుల కసాధ్యము కదా: శ్రీ స్వాములవారి బోధలవలన నాంధ్రజీవులు తరించును గాక.

గంటి సూర్యనారాయణశాస్త్రి.
(ఆంధ్ర విజ్ఞాన సమితి)

# Opinions

## Hindu, dated 4—9—38, Sunday Edition.

GITA LECTURES: By Sri Chidghananandendra Saraswati Swami, (Published by Sri Morusupalli Hanumanta Rao, Vakil, Guntur, Price Rs. 1-8).

This is a collection of lectures by Chidghananandendra Saraswati Swami (Mr. Koranki Venkatarama Sarma in his purvasrama). The publisher took down the lectures as they were delivered and got them revised by the Swami before they went to the press.

The Swami is a vigorous exponent of the orthodox Varnashrama Dharma. He instals Ahimsa on a high pedestal and condemns the sacrifice of animals. But he is prepared to hold that there is Himsa or violence in all things of the world and that it is the duty of the Kshatriya to deal death on others in the discharge of his Dharma and of the butcher to slaughter animals in the discharge of his caste functions in social life. (Pp. 333-334). He has a fling at the advocates of human equality. Commenting on the famous 18th sloka of the 5th Canto beginning with 'Vidyavinaya Sampanne', he says: "Some wrongly construe this sloka as authority for cosmopolitan dinners or intercaste marriages Sankara and other commentators said that this sloka refers only to Bhava Adwaita, not Kriya Adwaita. What Sri Krishna says is 'Sama Darsana' not 'Samavartana'. In this work-a-day world the principle 'Anta Brahmam' cannot be pushed to the length of destroying Varnasrama Dharma".

The Swami has a higher place for Jnana Yoga reserving Karma yoga for those whose Anthahkarana has not been purified. He discusses at length the differentiation of Karma into its component parts and considers that ultimately Karma has to be given up. Yet like every other commentator on the Gita he has to come back and postulate that the Pancha Maha Yagnas must be carried out for ever and ever. Curiously enough the Swami equates all Yagna to everyone's Matavarnashrama Dharmas. The word *Mata* has to be noted here. Hard as the Swami is on those who

violate Varnashrama Dharma, he is free to admit that the "Gita is the universal Scripture" in the words of Swami Vivekananda synthesising and harmonising different Yogas and different religions, that Karma is all action intended to create and sustain the world, and that amongst the six Darsanas of India there are three which do not admit even the existence of God. He is prepared to tell us, in commenting upon another oft quoted sloka (11) of Canto (4) that God-head worshipped as Brahma, Vishnu, Siva, Allah and God is available to all and that in the Gita, Krishna promises salvation through all channels thus establishing the basic unity of all religions.

The Swami's remarks, especially in the section on Vibhuti Yoga, are characterised by a broadness of vision so rare among orthodox interpreters. He has unreservedly accepted Madhwa's and Ramanuja's interpretations in certain contexts as the best, though he is an Adwaitin. It was this that attracted the Publisher, a Dwaitin to the Swami. The Swami freely quotes from all the great writers of the world including Shakespeare, Socrates, Vivekananda, Descartes, Thayimanavar, Pattinattupillai, Thomas a Kempis, Grey, Carlyle, Thyagaraja, Potana's Telugu Bhagavata, Pushpadanta, Aswini Kumar Dutt and others.

The Telugu discourses are interspersed with English passages, stories, anecdotes and witty turns of language give their own embellishment to the otherwise austere study of the Gita.

G. H. S.

---

**Benares Hindu University,**
October 9, 1939.

My Dear Hanumantha Rao,

Thank you for your letter. I did get your book on GITHA LECTURES, and *read them with much interest.*

Yours sincerely,
S. RADHAKRISHNAN.

---

**Brahmasri Vavilla Venkateswara Sastrulu Garu.**

(Editor, "Federated India" writes, (Madras d. 1-10-38) as follows :—

"These lectures contain an illuminating exposition of the Bhagavad Gita. The Swami is an Advaitin but he adopts the Dwaitic or Visishtadwaitic interpretations in many places. The subject has been dealt with in a lucid and interesting manner. The Swami is a master of Telugu and his lectures display great literary facility. Apposite anecdotes and quotations greatly enhance the value of the book. We have no hesitation in commending it to the Telugu Public".

---

**Brahma Sri C. Ramachandrayya Garu B. A.,**

Vakil, writes from Poonamalle, on 12-7-38.

"Your book containing the text and the Swamiji's lectures has been received by me. I feel very thankful to you for making a presentation of such a very valuable book to me. I say very valuable because the book contains matters which will elevate a man, in all matters secular and religious. I must really feel proud of you for having done such a service to humanity at large.

---

**Brahma Sree Challa Sivaramayya Garu,**

244, Swami Chetty St. Tirupattur, North Arcot District writes:—(16-7-38).

" I cordially thank you very much for your kindness in sending me by registered post a complimentary copy of Bhagavat Gita containing Mr. Sarma Garu's Lectures in extenso. You have done a laudable act at much sacrifice of your valuable time and money for the benefit of the Hindu public, who may still cherish some regard for our very great religious scripture at a time when even very highly educated people are losing their faith in Sanatana Dharma.

Mr. Sarma, even when he was at college in the nineties gave a good deal of his attention to the late Lakshmana' charlu's inspiring lectures on Bhagavat Gita. Soon after attending them he used to write articles to the Telugu *Sasilekha* weekly of Madras conducted by the late Mr, Seshacharlu just when the Andhra Prakasika by the late Parthasarathy Naidu was lifting its head and Sjt. K. Nageswararao Garu's Andhra Patrika had not as.yet been brought to Madras. Mr. Sarma is one of the very few who caught the spirit of the great Lakshmanachariar who was a very great pandit in Sanskrit besides a Vedadhyayi. He used to make large and pointed quotations from the Vedas, Upanishads, Bhashya sutras and the very intricate commentaries of great achari purushas on Gita."

---

## Brahma Sri K. Kuppuswami Ayya Garu, B. A.,

Retired Deputy Collector, Tiruvattiyur, writes on 14-7-38.

"I acknowledge with many thanks the receipt of the book so kindly sent by you by registered book-post. Apparently the hand of Providence is visible in the undertaking by a follower of Dwaita School of philosophy to publish the lectures on the Gita delivered by a Smartha Brahmin of Adwaita persuasion, whose first lessons in Bhagavat Gita were learnt at the feet of that great Sanskrit scholar Pandit Lakshmanchariar, the famous votary of Dwaita philosophy, when he was broadcasting the lectures on the Gita for the first time in the Tondamandalam High School, Madras, impartially according to the three schools of philosophy. Myself and others connected with me are placed under a deep debt of gratitude to your good self for having immortalised the efforts of one with whom we have had the good fortune to be borne and brought up in the same family."

---

**M.R.Ry. Nyapati Subbarao Pantulu Garu, B.A.,B.L.,**

( Rajahmundry d. 2-7-38 ) writes :

" I thank you for a copy of the Lectures. They are highly interesting and instructive. When delivered they have been attracting large crowds. You have taken great trouble in publishing these lectures which shows your deep interest in the Gita. I hope the book will be largely patronised by the Telugu public."

---

ఆంధ్ర విశ్వ కళాపరిషత్తు

**ANDHRA UNIVERSITY,**
**WALTAIR.**

*10th January, 1939.*

Dear Mr. Hanumantha Rao,

Many thanks for your kind letter of the 12th December 1938, and the Geetha Lectures which I appreciate immensely. That little dash of Western thought, though perhaps in all cases not quite accurate, adds to the value of the commentary.

Yours sincerely,

**C. R. REDDI,**

*Vice-Chancellor.*

---

'25

# విషయసూచిక

ఓం శ్రీ కృష్ణాయనమః

శ్రీ

# భగవద్గీతా మాహాత్మ్య ప్రారంభః



ధరోవాచః—

శ్లో. భగవ న్పరమేశాన భక్తి రవ్యభిచారిణీ,
ప్రారబ్ధం భుజ్యమానస్య కథం భవతి హేప్రభో। ౧

విష్ణురువాచ—

ప్రారబ్ధం భుజ్యమానోఽపి గీతాభ్యాసరత స్సదా,
స ముక్త స్స సుఖీ లోకే కర్మణా నోపలిప్యతే. ౨

మహాపాపాదిపాపాని గీతాధ్యానం కరోతిచేత్,
క్వచిత్ స్పర్శం న కుర్వంతి నళినీదళ మంభసా. ౩

గీతాయాః పుస్తకం యత్ర యత్ర పాఠం ప్రవర్తతే,
తత్ర సర్వాణి తీర్థాని ప్రయాగాదీని తత్ర వై. ౪

సర్వే దేవాశ్చ ఋషయో యోగినః పన్నగా శ్చ యే,
గోపాలగోపికావాపి నారదోద్ధవపార్షదైః. ౫

సహాయో జాయతే శీఘ్రం యత్ర గీతా ప్రవర్తతే,
యత్ర గీతావిచారశ్చ పఠనం పాఠనం శ్రుతమ్,
తత్రాఽహం నిశ్చితం పృథ్వి నివసామి సదైవహి. ౬

గీతాశ్రయోఽహం తిష్ఠామి గీతా మే చోత్తమం గృహమ్.
గీతాజ్ఞాన ముపాశ్రిత్య త్రీన్లోకా న్పాలయా మ్యహమ్, ౭

గీతా మే పరమా విద్యా బ్రహ్మరూపా న సంశయః
అర్ధమాత్రాక్షరా నిత్యా స్వనిర్వాచ్యపదాత్మికా. ౮

చిదానందేన కృష్ణేన ప్రోక్తా స్వముఖతోఽర్జునమ్,
వేదత్రయీ పరానంద తత్త్వార్థజ్ఞాన మంజసా. ౯

యోఽష్టాదశ జపే న్నిత్యం నరో నిశ్చలమానసః,
జ్ఞానసిద్ధిం స లభతే తతో యాతి పరం పదమ్. ౧౦

పాఠేఽసమర్థః సంపూర్ణే తదర్ధం పాఠ మాచరేత్,
తదా గోదానజం పుణ్యం లభతే నాత్ర సంశయః. ౧౧

త్రిభాగం పఠమానస్తు గంగాస్నానఫలం లభేత్,
షడంశం జపమానస్తు సోమయాగఫలం లభేత్. ౧౨

ఏకాధ్యాయం తు యో నిత్యం పఠతే భక్తిసంయుతః,
రుద్రలోక మవాప్నోతి గణో భూత్వా వసే చ్చిరమ్. ౧౩

అధ్యాయశ్లోకపాదం వా నిత్యం యః పఠతే నరః,
స యాతి నరతాం యావ న్మనుకాలం వసుంధరే! ౧౪

గీతాయా శ్లోకదశకం సప్త పంచ చతుష్టయమ్,
ద్విత్రి రేకం తదర్ధం వా శ్లోకానాం యః పఠే న్నరః. ౧౫

చంద్రలోక మవాప్నోతి వర్షాణా మయుతం ధ్రువమ్,
గీతాపాఠసమాయుక్తో మృతోఽమానుషతాం వ్రజేత్. ౧౬

గీతాభ్యాసం పునః కృత్వా లభతే ముక్తి ముత్తమామ్,
గీతే త్యుచ్చారసంయుక్తో మ్రియమాణో గతిం లభేత్. ౧౭

గీతార్థశ్రవణాసక్తో మహాపాపయుతోఽపివా,
వైకుంఠం సమవాప్నోతి విష్ణునా సహ మోదతే. ౧౮

గీతార్థం ధ్యాయతే నిత్యం కృత్వా కర్మాణి భూరిశః,
జీవన్ముక్త స్స విజ్ఞేయో దేహాంతే పరమం పదమ్. ౧౯

గీతా మాశ్రిత్య బహవో భూభుజో జనకాదయః,
నిర్ధూతకల్మషా లోకే గీతా యాతాః పరంపదమ్. ౨౦

గీతాయాః పఠనం కృత్వా మాహాత్మ్యం నైవ యః పఠేత్,
వృథాపాఠో భవే త్తస్య శ్రమఏవ ఉదాహృతః ౨౧

ఏత న్మాహాత్మ్య సంయుక్తం గీతాభ్యాసం కరోతి యః,
స తత్ఫల మవాప్నోతి దుర్లభాం గతి మాప్నుయాత్. ౨౨

సూత ఉవాచ—

మాహాత్మ్య మేత ద్గీతాయా మయా ప్రోక్తం సనాతనమ్,
గీతాన్తేచ పఠే ద్యస్తు య దుక్తం తత్ఫలం లభేత్. ౨౩

ఇతి శ్రీ వరాహపురాణే
శ్రీ గీతామాహాత్మ్యమ్.



ఓం

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీగురుధ్యానప్రకారః

వన్దే గురూణాం చరణారవిందే, సందర్శితస్వాత్మసుఖావబోధే,
జనస్య యే జాంగలికాయమానే, సంసారహాలాహలమోహశాంత్యై. ౧

వందే గురుపదద్వంద్వ మవాఙ్మానసగోచరమ్
రక్తశుక్ల ప్రభామిశ్ర మతర్క్యం త్రైపురం మహః. ౨

లక్ష్మీనాథసమారంభాం నాథయామునమధ్యమామ్.
అస్మదాచార్య పర్యంతాం వందే గురుపరంపరామ్. ౩

అస్మద్గురుసమారంభాం నాథయామున మధ్యమామ్,
లక్ష్మీవల్లభపర్యంతాం వందే గురుపరంపరామ్. ౪

ఇతి తత్త త్సంప్రదాయాఽనుగుణం
గురుపరంపరాఽనుసంధేయా.

## స్తోత్రశ్లోకాః

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే. ౫

యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్,
విఘ్నం నిఘ్నన్తి సతతం విష్వక్సేనం తమాశ్రయే. ౬

సమ్యఙ్న్యాయకలాపేన మహతా భారతేన చ,
ఉపబృంహిత వేదాయ నమో వ్యాసాయ విష్ణవే. ౭

వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్,
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్. ౮

వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే
నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమోనమః ౯

మునిం స్నిగ్ధాంబుదాభాసం వేదవ్యాస మకల్మషమ్,
వేదవ్యాసం సరస్వత్యావాసం వ్యాసం నమామ్యహమ్. ౧౦

అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహు రపరో హరిః.
అఫాలలోచన శ్శంభు ర్భగవాన్ బాదరాయణః ౧౧

కృష్ణం కమలపత్రాక్షం పుణ్యశ్రవణకీర్తనమ్,
వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిమ్. ౧౨

కృష్ణాయ యాదవేంద్రాయ జ్ఞానముద్రాయ యోగినే,
నాథాయ రుక్మిణీశాయ నమో వేదాంతవేదినే. ౧౩

ప్రపన్న పారిజాతాయ వేత్రతోత్త్రైకపాణయే,
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే నమః ౧౪

సారథ్య మర్జున స్యాదౌ కుర్వన్ గీతామృతం దదౌ,
లోకత్రయోపకారాయ తస్మై కృష్ణాత్మనే నమః ౧౫

సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనన్దనః,
పార్థో వత్స స్సుధీ ర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్. ౧౬

పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం,
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతమ్,
అద్వైతామృతవర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీ
మంబ త్వా మనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీమ్. ౧౭

గీతాశాస్త్ర మిదం పుణ్యం యః పఠేత్ ప్రయతః పుమాన్,
విష్ణోః పద మవాప్నోతి భయశోకాదివర్జితః. ౧౮

భారతామృతసర్వస్వం విష్ణో ర్వక్త్రా ద్వినిస్సృతమ్,
గీతాగంగోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే. ౧౯

గీతాః సుగీతాః కర్తవ్యాః కి మన్యైః శాస్త్రసంగ్రహైః,
యాః స్వయం పద్మనాభస్య ముఖపద్మా ద్వినిస్సృతాః ౧౦
గీతాధ్యయనశీలస్య ప్రాణాయామపరస్య చ,
నైవ సంతి హి పాపాని పూర్వజన్మకృతా న్యపి. ౨౧
అకృత్యమపి కుర్వాణో భుంజానో వా యతస్తతః,
ఘోరం వైవస్వతస్థానం గీతాధ్యాయీ న పశ్యతి. ౨౨
మలనిర్మోచనం పుంసాం జలస్నానం దినే దినే,
సకృద్గీతాంభసి స్నానం సంసార మల మోచనమ్. ౨౩
శ్లోక మేకం తదర్ధంవా పాదం పాదార్ధ మేవ వా,
నిత్యం పఠతి యో భక్త్యా స మోక్ష మధిగచ్ఛతి. ౨౪
సర్వశాస్త్రమయీ గీతా సర్వవేదమయో హరిః,
సర్వతీర్థమయీ గంగా సర్వధర్మమయో మనుః. ౨౫
ఏకం శాస్త్రం దేవకీపుత్రగీత మేకో దేవో దేవకీపుత్రఏవ,
ఏకోమంత్రో దేవకీపుత్రనామ కర్మాప్యేకం దేవకీపుత్రసేవా. ౨౬

అథ న్యాసః

ఓమ్ అస్య శ్రీభగవద్గీతాశాస్త్రమహామంత్రస్య, వేదవ్యాసో భగవాన్ ఋషిః, ప్రాయేణానుష్టుప్ ఛందః, క్వచిన్నానాఛందాంసి, శ్రీకృష్ణః పరమాత్మా దేవతా, అశోచ్యా నన్వశోచ స్త్వమితి బీజమ్
సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజే తి శక్తిః,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ ఇతి కీలకమ్.
మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసీతి కవచమ్.
కిరీటినం గదినం చక్రహ స్త మిత్యస్త్రమ్.
అనాదిమధ్యాంత మనంతవీర్య మితిధ్యానమ్.
జ్ఞానయజ్ఞేన భగవదారాధనార్థే గీతాపారాయణే జపేవా వినియోగః.
ఓం జ్ఞానాత్మనే శ్రీకృష్ణాయ అంగుష్ఠాభ్యాం నమః.

ఓం ఐశ్వర్యాత్మనే గోవిందాయ తర్జనీభ్యాం స్వాహా.
ఓం శక్త్యాత్మనే వేదవ్యాసాయ మధ్యమాభ్యాం వషట్.
ఓం బలాత్మనే బలభద్రాయ అనామికాభ్యాం హుమ్.
ఓం తైజసాత్మనే వాసుదేవాయ కనిష్ఠికాభ్యాం వౌషట్.
ఓం వీర్యాత్మనే గాండీవధన్వనే అర్జునాయ కరతలకరపృష్ఠాభ్యాంఫట్
ఓం జ్ఞానాత్మనే శ్రీకృష్ణాయ హృదయాయ నమః.
ఓం ఐశ్వర్యాత్మనే గోవిందాయ శిరసే స్వాహా.
ఓం శక్త్యాత్మనే వేదవ్యాసాయ శిఖాయై వషట్.
ఓం బలాత్మనే బలభద్రాయ కవచాయ హుమ్.
ఓం తైజసాత్మనే వాసుదేవాయ నేత్రత్రయాయ వౌషట్.
ఓం వీర్యాత్మనే గాండీవధన్వనే అర్జునాయ అస్త్రాయ ఫట్.
భూర్భువస్సువరోమితి దిగ్బంధః.

అథ ధ్యానమ్

కరకమల నిదర్శితాత్మముద్రః, పరికలితోన్నతబర్హిబర్హచూడః
ఇతరకరగృహీత వేత్రతోత్రో, మను హృది సన్నిధి మాతనోతు కృష్ణః
అతామ్రపాణికమలప్రణయప్రతోద
మాలోలహార మణికుండల హేమసూత్రమ్,
అవిశ్రమాంబుకణ మంబుదనీల మవ్యా
దాద్యం ధనంజయరథాభరణం మహో నః.
అగ్రేకృత్వా కమపి చరణం జానునైకేన తిష్ఠ
పశ్చాత్పార్థం ప్రణయసజుషా చక్షుషా వేక్షమాణః
సవ్యే తోత్రం కరసరసిజే దక్షిణే జ్ఞానముద్రా
మాబిభ్రాణో రథ మధివసన్ పాతు నః సూతవేషః.
వందే కృష్ణార్జునౌ వీరౌ నరనారాయణౌ శుభౌ,
ధృతరాష్ట్రసుతోన్మత్త గజారోహణ వల్లభౌ.

(యద్వా)—

ఓమ్ అస్య శ్రీ భగవద్గీతాశాస్త్రమహామంత్రస్య భగవాన్ వేదవ్యాస ఋషిః. అనుష్టుప్ ఛందః, శ్రీకృష్ణపరమాత్మా దేవతా.

అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ఇతి బీజం.

సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజేతి శక్తిః.

అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ఇతి కీలకమ్

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః ఇత్యంగుష్ఠాభ్యాం నమః.

నచైనం క్లేదయం త్యాపో న శోషయతి మారుతః ఇతి తర్జనీభ్యాం నమః.

అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్యఏవచ ఇతి మధ్యమాభ్యాం నమః.

నిత్యః సర్వగతః సాణు రచలోఽయం సనాతనః ఇత్యనామికాభ్యాం నమః.

పశ్య మే పార్థరూపాణి శతశోఽథ సహస్రశః ఇతికనిష్ఠికాభ్యాం నమః.

నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీనిచ ఇతి కరతల కరపృష్ఠాభ్యాం నమః.

ఇతి కరన్యాసః.

అథ హృదయాదిన్యాసః.

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః ఇతి హృదయాయ నమః. నచైనం క్లేదయం త్యాపో నశోషయతి మారుతః ఇతి శిరసే స్వాహా. అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవ చ ఇతి శిఖాయై వషట్, నిత్యః సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః ఇతికవచాయహుమ్. పశ్యమే పార్థరూపాణి శతశోఽథ సహస్రశః ఇతినేత్రత్రయాయ వౌషట్ నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీనిచ ఇతి అస్త్రాయఫట్, భూర్భువస్సువరో మితి దిగ్బంధః, ఓం శ్రీకృష్ణప్రీత్యర్థే గీతాపారాయణే జపేవినియోగః.

## ధ్యానమ్

ఓం పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతమ్,
అద్వైతామృత వర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీ
మంబ త్వా మనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీమ్.

నమోఽస్తు తే వ్యాస విశాలబుద్ధే ఫుల్లారవిందాయతపత్రనేత్ర
యేన త్వయా భారతతైలపూర్ణః ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః.

ప్రపన్నపారిజాతాయ తోత్రవేత్రైక పాణయే,
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే నమః.

వాచకః ప్రణవో యస్య క్రీడా వస్త్వఖిలం జగత్,
శ్రుతి రాజ్ఞా వపుర్జ్ఞానం తం వందే దేవకీసుతమ్.

సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః,
పార్థో వత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్.

వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్,
దేవకీపరమానందం కృష్ణం వందే జగద్గురుమ్.

భీష్మద్రోణతటా జయద్రథజలా గాంధారనీలోత్పలా
శల్యగ్రాహవతీ కృపేణ వహినీ కర్ణేన వేలాకులా
అశ్వత్థామవికర్ణఘోరమకరా దుర్యోధనావర్తినీ
సోత్తీర్ణా ఖలు పాండవై రణనదీ కైవర్తకే కేశవే.

పారాశర్య వచస్సరోజ మమలం గీతార్థగంధోత్కటం
నానాఖ్యానక కేసరం హరికథాసద్బోధనా బోధితమ్
లోకే సజ్జనషట్పదై రహరహః పేపీయమానం ముదా
భూయా ద్భారతపంకజం కలిమలప్రధ్వంసి నః శ్రేయసే.

మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిమ్,
యత్కృపా త మహం వందే పరమానంద మాధవమ్.
యం బ్రహ్మా వరుణేంద్రరుద్రమరుతః స్తున్వంతి దివ్యైః స్తవై
ర్వేదై స్సాంగపదక్రమోపనిషదై ర్గాయంతి యం సామగాః,
ధ్యానావస్థిత తద్గతేన మనసా పశ్యంతి యం యోగినో
యస్యాంతం న విదుః సురాసురగణా దేవాయ తస్మై నమః.

అతఃపరం యథార్థ్యాం సంపూజ్య
పారాయణాదికం కార్యమ్.



ఓమ్

# శ్రీమద్భగవద్గీతా

## ప్రథమోఽధ్యాయః

## అర్జున విషాదయోగః

ధృతరాష్ట్ర ఉవాచ :—

ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః,
మామకాః పాణ్డవాశ్చైవ కి మకుర్వత సఞ్జయ ? 1

సఞ్జయ ఉవాచ:—

దృష్ట్వా తు పాణ్డవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా
ఆచార్య ముపసఙ్గమ్య రాజా వచన మబ్రవీత్. 2

పశ్యైతాం పాణ్డుపుత్రాణా మాచార్య మహతీం చమూమ్,
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా. 3

అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి,
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః, 4

ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్,
పురుజి త్కున్తిభోజశ్చ శైబ్యశ్చ నరపుఙ్గవః. 5

యుధామన్యుశ్చ విక్రాన్త ఉత్తమౌజాశ్చ వీర్యవాన్
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః. 6

అస్మాకం తు విశిష్టా యే తా న్నిబోధ ద్విజోత్తమ
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తా న్బ్రవీమి తే. 7
భవా న్భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితిఞ్జయః
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవచ. 8
అన్యే చ బహవ శ్శూరా మదర్థే త్యక్తజీవితాః
నానాశస్త్రప్రహరణా స్సర్వే యుద్ధవిశారదాః. 9
అపర్యాప్తం త దస్మాకం బలం భీష్మాభిరక్షితమ్
పర్యాప్తం త్విద మేతేషాం బలం భీమాభిరక్షితమ్ 10
అయనేషు చ సర్వేషు యథాభాగ మవస్థితాః
భీష్మ మే వాభిరక్షన్తు భవన్త స్సర్వ ఏవ హి. 11
తస్య సఞ్జనయ న్హర్షం కురువృద్ధః పితామహః
సింహనాదం వినద్యోచ్చై శ్శఙ్ఖం దధ్మౌ ప్రతాపవా న్. 12
తత శ్శఙ్ఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః
సహసైవాభ్యహన్యన్త స శబ్ద స్తుములోఽభవత్. 13
తత శ్శ్వేతై ర్హయై ర్యుక్తే మహతి స్యన్దనే స్థితౌ
మాధవః పాణ్డవ శ్చైవ దివ్యౌ శఙ్ఖౌ ప్రదధ్మతుః. 14
పాఞ్చజన్యం హృషీకేశో దేవదత్తం ధనఞ్జయః
పౌండ్రం దధ్మౌ మహాశఙ్ఖం భీమకర్మా వృకోదరః. 15
అనన్తవిజయం రాజా కున్తీపుత్రో యుధిష్ఠిరః
నకుల స్సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ. 16

కాశ్యశ్చ పరమేష్వాస శ్శిఖణ్డీ చ మహారథః
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకి శ్చాపరాజితః. 17
ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే
సౌభద్రశ్చ మహాబాహు శ్శఙ్ఖా న్దధ్ముః పృథ క్పృథక్. 18
స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్
నభశ్చ పృథివీం చైవ తుములోఽభ్యనునాదయన్. 19
అథ వ్యవస్థితా న్దృష్ట్వా ధార్తరాష్ట్రా న్కపిధ్వజః
ప్రవృత్తే శస్త్రసమ్పాతే ధను రుద్యమ్య పాండవః 20
హృషీకేశం తదా వాక్య మిద మాహ మహీపతే!

అర్జున ఉవాచ—

సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత. 21
యావ దేతా న్నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్
కై ర్మయా సహ యోద్ధవ్య మస్మి న్రణసముద్యమే. 22
యోత్స్యమానా నవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియచికీర్షవః. 23

సఞ్జయ ఉవాచ—

ఏవ ముక్తో హృషీకేశో గుడాకేశేన భారత
సేనయో రుభయో ర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్. 24
భీష్మద్రోణప్రముఖత స్సర్వేషాం చ మహీక్షితామ్
ఉవాచ పార్థ పశ్యైతా న్సమవేతా న్కురూ నితి. 25

తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄ నథ పితామహాన్
ఆచార్యా న్మాతులా న్భ్రాతౄన్ పుత్త్రా న్పౌత్త్రాన్ సఖీం స్తథా.
శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయో రుభయో రపి
తాన్ సమీక్ష్య స కౌన్తేయ స్సర్వాన్ బన్ధూ నవస్థితాన్. 27

కృపయా పర యావిష్టో విషీద న్నిద మబ్రవీత్

అర్జున ఉవాచ—

దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్. 28
సీద న్తి మమ గాత్త్రాణి ముఖం చ పరిశుష్యతి
వేపథు శ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే. 29

గాణ్డీవం స్రంసతే హస్తా త్త్వక్చైవ పరిదహ్యతే
న చ శక్నో మ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః. 30

నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ
న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజన మాహవే. 31

న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ
కిన్నో రాజ్యేన గోవిన్ద కిం భోగై ర్జీవితేన వా. 32

యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగా స్సుఖాని చ
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ. 33

ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహాః
మాతులా శ్శ్వశురాః పౌత్త్రా స్స్యాలా స్సమ్బన్ధిన స్తథా. 34

ఏతా న్న హన్తు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిన్ను మహీకృతే. 35

నిహత్య ధార్తరాష్ట్రా న్నః కా ప్రీతి స్స్యా జ్జనార్దన
పాప మే వాశ్రయే దస్మా౯ హత్వైతా నాతతాయినః. 36

తస్మా న్నార్హా వయం హన్తుం ధార్తరాష్ట్రా న్స్వబాన్ధవా౯
స్వజనం హి కథం హత్వా సుఖిన స్స్యామ మాధవ. 37

యద్య ప్యేతే న పశ్య న్తి లోభోపహతచేతసః
కులక్షయకృతం దోషం మిత్రద్రోహేచ పాతకమ్. 38

కథం న జ్ఞేయ మస్మాభిః పాపా దస్మా న్నివర్తితుమ్
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన। 39

కులక్షయే ప్రణశ్య న్తి కులధర్మా స్సనాతనాః
ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మోఽభిభవ త్యుత. 40

అధర్మాభిభవా త్కృష్ణ ప్రదుష్య న్తి కులస్త్రియః
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః. 41

సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ
పతన్తి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః 42

దోషై రేతైః కులఘ్నానాం వర్ణసఙ్కరకారకైః
ఉత్సాద్య న్తే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః 43

ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన
నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ. 44

అహో బత మహ త్పాపం కర్తుం వ్యవసితా వయమ్
య ద్రాజ్యసుఖలోభేన హన్తుం స్వజన ముద్యతాః  45

యది మా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః
ధార్తరాష్ట్రా రణే హన్యు స్త న్మే క్షేమతరం భవేత్.  46

సఞ్జయ ఉవాచ—

ఏవ ముక్త్వార్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః.  47

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శ్రీ కృష్ణార్జునసంవాదే
అర్జున విషాదయోగో నామ
ప్రథమో ఽధ్యాయః.



ఓమ్

# శ్రీమద్భగవద్గీతా

## ద్వితీయోఽధ్యాయః

### సాంఖ్యయోగః

సఞ్జయ ఉవాచ:—

తం తథా కృపయావిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్,
విషీదన్త మిదం వాక్య మువాచ మధుసూదనః. 1

శ్రీభగవా నువాచ:—

కుత స్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున. 2

క్లైబ్యం మాస్మగమః పార్థ నైత త్త్వ య్యుపపద్యతే
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప। 3

అర్జున ఉవాచ:—

కథం భీష్మ మహం సఙ్ఖ్యే ద్రోణం చ మధుసూదన,
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన! 4

గురూ నహత్వా హి మహానుభావా
శ్రేయో భోక్తుం భైక్ష మపీహ లోకే
హత్వాఽర్థకామాం స్తు గురూ నిహైవ
భుఞ్జీయ భోగా న్రుధిరప్రదిగ్ధాన్. 5

న చైత ద్విద్మః కతర న్నో గరీయో
యద్వా జయేమ యదివా నో జయేయుః
యా నేవ హత్వా న జిజీవిషామ
స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః 6

కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః
యచ్ఛ్రేయ స్స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్. 7

న హి ప్రపశ్యామి మమాపనుద్యా
ద్యచ్ఛోక ముచ్ఛోషణ మిన్ద్రియాణామ్
అవాప్య భూమా వసపత్న మృద్ధం
రాజ్యం సురాణా మపి చాధిపత్యమ్. 8

సఞ్జయ ఉవాచ:—

ఏవ ముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః
న యోత్స్య ఇతి గోవిన్ద ముక్త్వా తూష్ణీం బభూవ హ. 9

త మువాచ హృషీకేశః ప్రహస న్నివ భారత!
సేనయో రుభయో ర్మధ్యే విషీద న్తమిదం వచః. 10

శ్రీభగవా నువాచ

అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే
గతాసూ నగతాసూంశ్చ నానుశోచ న్తి పణ్డితాః. 11

న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః
న చైవ న భవిష్యామ స్సర్వే వయ మతఃపరమ్. 12
దేహినోఽస్మి న్యథా దేహే కౌమారం యౌవనం జరా
తథా దేహాన్తరప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి. 13
మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణసుఖదుఃఖదాః
ఆగమాపాయినోఽనిత్యా స్తాం స్తితిక్షస్వ భారత! 14
యం హి న వ్యథయ న్త్యేతే పురుషం పురుషర్షభ,
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే. 15
నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః
ఉభయోరపి దృష్టోఽన్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః. 16
అవినాశి తు త ద్విద్ధి యేన సర్వ మిదం తతమ్
వినాశ మవ్యయ స్యాస్య న కశ్చి త్కర్తు మర్హతి. 17
అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తా శ్శరీరిణః
అనాశినోఽప్రమేయస్య తస్మా ద్యుధ్యస్వ భారత. 18
యఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్
ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే. 19
న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః,
అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే. 20

వేదాఽవినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హన్తి కమ్. 21

వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః
నచైనం క్లేదయ న్త్యాపో న శోషయతి మారుతః. 23

అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్యఏవచ
నిత్య స్సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః 24

అవ్యక్తోఽయ మచిన్త్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే
తస్మా దేవం విది త్వైనం నానుశోచితు మర్హసి. 25

అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్
తథాపి త్వం మహాబాహో నైనం శోచితు మర్హసి. 26

జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్యచ
తస్మా దపరిహార్యేఽర్థే నత్వం శోచితు మర్హసి. 27

అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత,
అవ్యక్తనిధనా న్యేవ తత్ర కా పరిదేవనా. 28

ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చి దేన
మాశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః
ఆశ్చర్యవ చ్చైన మన్య శ్శృణోతి.
శ్రుత్వా ప్యేనం వేద నచైవ కశ్చిత్. 29

అసత్య మప్రతిష్ఠం తే జగ దాహు రనీశ్వరమ్,
అపరస్పరసమ్భూతం కి మన్య త్కామహేతుకమ్. 8

ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః
ప్రభవ న్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః. 9

కామ మాశ్రిత్య దుష్పూరం దమ్భమానమదాన్వితాః,
మోహా ద్గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్త న్తేఽశుచివ్రతాః. 10

చి న్తా మపరిమేయాంచ ప్రళయా న్తా ముపాశ్రితాః
కామోపభోగపరమా ఏతావ దితి నిశ్చితాః. 11

ఆశాపాశశతై ర్బద్ధాః కామక్రోధపరాయణాః,
ఈహ న్తే కామభోగార్థ మన్యాయేనాఽర్థసఞ్చయాన్. 12

ఇద మద్య మయా లబ్ధ మిదం ప్రాప్స్యే మనోరథమ్,
ఇద మ స్తీదమపి మే భవిష్యతి పున ర్ధనమ్, 13

అసౌ మయా హత శ్శత్రు ర్హనిష్యే చాపరా నపి,
ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ. 14

ఆఢ్యోఽభిజనవా నస్మి కోఽన్యోఽ స్తి సదృశో మయా,
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇ త్యజ్ఞానవిమోహితాః. 15

అనేకచి త్తవిభ్రాన్తా మోహజాలసమావృతాః,
ప్రసక్తాః కామభోగేషు పత న్తి నరకేఽశుచౌ. 16

ఆత్మసమ్భావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః,
యజ న్తే నామయజ్ఞై స్తే దమ్భేనాఽవిధిపూర్వకమ్. 17

అహఙ్కారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః,
మా మాత్మపరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః. 18

తా నహం ద్విషతః క్రూరా౯ సంసారేషు నరాధమా౯,
క్షిపా మ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు, 19

ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని,
మా మప్రాప్యైవ కౌన్తేయ తతో యా న్త్యధమాంగతిమ్. 20

త్రివిధం నరక స్యేదం ద్వారం నాశన మాత్మనః,
కామః క్రోధ స్తథాలోభ స్తస్మా దేత త్త్రయం త్యజేత్. 21

ఏతై ర్విముక్తః కౌన్తేయ తమోద్వారై స్త్రిభి ర్నరః,
ఆచర త్యాత్మనః శ్రేయ స్తతో యాతి పరాం గతిమ్. 22

యశ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః.
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్. 23

తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి. 24

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
దైవాసురసమ్పద్విభాగయోగో నామ
షోడశోఽధ్యాయః.



# శ్రీమద్భగవద్గీతా

## సప్తదశోఽధ్యాయః.



## శ్రద్ధాత్రయవిభాగయోగః

అర్జున ఉవాచ:—

యే శాస్త్రవిధి ముత్సృజ్య యజన్తే శ్రద్ధయాఽన్వితాః,
తేషాం నిష్ఠా తు కా కృష్ణ! సత్త్వ మాహో రజ స్తమః. 1

శ్రీ భగవా నువాచ:—

త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు. 2
సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత,
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధ స్సఏవ సః. 3
యజన్తే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః,
ప్రేతాన్ భూతగణాం శ్చాన్యే యజన్తే తామసా జనాః. 4
అశాస్త్రవిహితం ఘోరం తప్యన్తే యే తపో జనాః
దమ్భాహఙ్కారసంయుక్తాః కామరాగబలాన్వితాః. 5
కర్శయన్త శ్శరీరస్థం భూతగ్రామ మచేతసః
మాంచైవాఽన్తశ్శరీరస్థం తాన్ విద్ధ్యాసురనిశ్చయాన్. 6
ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః
యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేద మిమం శృణు. 7
ఆయుస్సత్త్వబలారోగ్య సుఖప్రీతివివర్ధనాః
రస్యా స్స్నిగ్ధా స్థిరా హృద్యా ఆహారాః సాత్త్వికప్రియాః 8

కట్వమ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః
ఆహారా రాజస స్యేష్టా దుఃఖశోకామయప్రదాః. 9
యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్ 10
అఫలాకాఙ్క్షిభి ర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే
యష్టవ్య మేవేతి మన స్సమాధాయ స సాత్త్వికః. 11
అభిసన్ధాయ తు ఫలం దమ్భార్థమపి చైవ యత్
ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్. 12
విధిహీన మసృష్టాన్నం మన్త్రహీన మదక్షిణమ్
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే. 13
దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచ మార్జవం
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే. 14
అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితంచ యత్
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే. 15
మనఃప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః
భావసంశుద్ధి రిత్యేత త్తపో మానస ముచ్యతే. 16
శ్రద్ధయా పరయా తప్తం తప స్త త్త్రివిధం నరైః
అఫలాకాఙ్క్షిభి ర్యుక్తై స్సాత్త్వికం పరిచక్షతే 17
సత్కారమానపూజార్థం తపో దమ్భేన చైవ యత్
క్రియతే త దిహ ప్రోక్తం రాజసం చల మధ్రువమ్. 18
మూఢగ్రాహే ణాత్మనో య త్పీడయా క్రియతే తపః
పరస్యోత్సాదనార్థం వా తత్తామస ముదాహృతమ్. 19

దాతవ్యమితి య ద్దానం దీయతేఽనుపకారిణే
దేశే కాలేచ పాత్రేచ త ద్దానం సాత్త్వికం స్మృతమ్. 20

యత్తు ప్రత్యుపకారార్థం ఫల ముద్దిశ్య వా పునః
దీయతే చ పరిక్లిష్టం త ద్రాజస ముదాహృతమ్. 21

అదేశకాలే య ద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే
అసత్కృత మవజ్ఞాతం త తామస ముదాహృతమ్. 22

ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా. 23

తస్మా దో మిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః
ప్రవర్తన్తే విధానోక్తా స్సతతం బ్రహ్మవాదినామ్. 24

తది త్యనభిసన్ధాయ ఫలం యజ్ఞతపఃక్రియాః
దానక్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాఙ్క్షిభిః. 25

సద్భావే సాధుభావే చ స దిత్యేత త్ప్రయుజ్యతే
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే. 26

యజ్ఞే తపసి దానే చ స్థితి స్సదితి చోచ్యతే
కర్మ చైవ తదర్థీయం స దిత్యేవాఽభిధీయతే. 27

అశ్రద్ధయా హుతం దత్తం తప స్తప్తం కృతం చ యత్
అస దిత్యుచ్యతే పార్థ న చ త త్ప్రేత్య నో ఇహ. 28

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
శ్రద్ధాత్రయవిభాగయోగో నామ
సప్తదశోఽధ్యాయః,

ఓమ్

# శ్రీమద్భగవద్గీతా

## అష్టాదశోఽధ్యాయః

## మోక్షసన్న్యాసయోగః

అర్జున ఉవాచ:—

సన్న్యాసస్య మహాబాహో తత్త్వ మిచ్ఛామి వేదితుమ్,
త్యాగస్య చ హృషీకేశ పృథ క్కేశినిషూదన. 1

శ్రీ భగవా నువాచ:—

కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః
సర్వకర్మఫలత్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః. 2
త్యాజ్యం దోషవ దిత్యేకే కర్మ ప్రాహు ర్మనీషిణః
యజ్ఞ దానతపఃకర్మ న త్యాజ్యమితి చాపరే. 3
నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ
త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధ స్సమ్ప్రకీ ర్తితః. 4
యజ్ఞ దానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్. 5
ఏతాన్యపి తు కర్మాణి సఙ్గం త్యక్త్వా ఫలాని చ
కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మత ముత్తమమ్. 6
నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే
మోహా త్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః. 7

దుఃఖ మిత్యేవ య త్కర్మ కాయక్లేశభయా త్త్యజేత్,
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్. 8
కార్య మిత్యేవ య త్కర్మ నియతం క్రియతేఽర్జున,
సఙ్గం త్యక్త్వా ఫలం చైవ స త్యాగ స్సాత్త్వికో మతః. 9
న ద్వే ష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే,
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః. 10
న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మా ణ్యశేషతః,
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీ త్యభిధీయతే. 11
అనిష్ట మిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్,
భవ త్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్, 12
పఞ్చైతాని మహాబాహో కారణాని నిబోధ మే,
సాఙ్ఖ్యే కృతాన్తే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్. 13
అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్,
వివిధాశ్చ పృథ క్చేష్టా దైవం చై వాత్ర పఞ్చమమ్. 14
శరీరవాఙ్మనోభి ర్య త్కర్మ ప్రారభతే నరః,
న్యాయ్యం వా విపరీతం వా పఞ్చైతే తస్య హేతవః. 15
తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు యః,
పశ్య త్యకృతబుద్ధి త్వా న్న స పశ్యతి దుర్మతిః. 16
యస్య నాహఙ్కృతో భావో బుద్ధి ర్యస్య న లిప్యతే,
హత్వాపి స ఇమాఁ లోకా న్న హన్తి న నిబధ్యతే. 17
జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా,
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసఙ్గ్రహః. 18

జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః,
ప్రోచ్యతే గుణసఙ్ఖ్యానే యథావ చ్ఛృణు తాన్యపి. 19
సర్వభూతేషు యేనైకం భావ మవ్యయ మీక్షతే,
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్. 20
పృథక్త్వేన తు యజ్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్,
వేత్తి సర్వేషు భూతేషు తజ్జ్ఞానం విద్ధి రాజసమ్. 21
యత్తు కృత్స్నవ దేకస్మి న్కార్యే సక్త మహేతుకమ్,
అతత్త్వార్థవ దల్పం చ త త్తామస ముదాహృతమ్. 22
నియతం సఙ్గరహిత మరాగద్వేషతః కృతమ్
అఫలప్రేప్సునా కర్మ య త్త త్సాత్త్విక ముచ్యతే. 23
యత్తు కామేప్సునా కర్మ సాహఙ్కారేణ వా పునః
క్రియతే బహులాయాసం త ద్రాజస ముదాహృతమ్. 24
అనుబన్ధం క్షయం హింసా మనపేక్ష్య చ పౌరుషమ్,
మోహా దారభ్యతే కర్మ త త్తామస ముదాహృతమ్. 25
ముక్తసఙ్గోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః
సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే. 26
రాగీ కర్మఫలప్రేప్సు ర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః. 27
అయుక్తః ప్రాకృత స్స్తబ్ధ శ్శఠో నైష్కృతికోఽలసః
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే. 28
బుద్ధే ర్భేదం ధృతేశ్చైవ గుణత స్త్రివిధం శృణు
ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనఞ్జయ. 29

ప్రవృత్తిం చ నివృత్తించ కార్యాకార్యే భయాభయే
బన్ధం మోక్షం చ యా వేత్తి బుద్ధి స్సా పార్థ సాత్త్వికీ. 30
యయా ధర్మ మధర్మం చ కార్యం చాకార్య మేవ చ
అయథావ త్ప్రజానాతి బుద్ధి స్సా పార్థ రాజసీ. 31
అధర్మం ధర్మమితి యా మన్యతే తమసాఽఽవృతా
సర్వార్థా న్విపరీతాంశ్చ బుద్ధి స్సా పార్థ తామసీ, 32
ధృత్యా యయా ధారయతే మనఃప్రాణేన్ద్రియక్రియాః
యోగేనాఽవ్యభిచారిణ్యా ధృతి స్సా పార్థ సాత్త్వికీ. 33
యయా తు ధర్మకామార్థా న్ధృత్యా ధారయతేఽర్జున
ప్రసఙ్గేన ఫలాకాఙ్క్షీ ధృతి స్సా పార్థ రాజసీ. 34
యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ
న విముఞ్చతి దుర్మేధా ధృతి స్సా పార్థ తామసీ, 35
సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ
అభ్యాసా ద్రమతే యత్ర దుఃఖాంతం చ నిగచ్ఛతి. 36
య త్త దగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్
త త్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధిప్రసాదజమ్. 37
విషయేన్ద్రియసంయోగా ద్య త్త దగ్రేఽమృతోపమమ్
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్. 38
య దగ్రే చానుబన్ధే చ సుఖం మోహన మాత్మనః
నిద్రాలస్యప్రమాదోత్థం త త్తామస ముదాహృతమ్. 39
న తద స్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః
స త్త్వం ప్రకృతిజై ర్ముక్తం యదేభి స్స్యా త్త్రిభి ర్గుణైః 40

బ్రాహ్మణక్షత్త్రియవిశాం శూద్రాణాం చ పరన్తప
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవై ర్గుణైః. 41
శమో దమ స్తప శ్శౌచం క్షాన్తి రార్జవమేవ చ
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్. 42
శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్
దాన మీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్. 43
కృషిగోరక్షవాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్. 44
స్వే స్వే కర్మ ణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః
స్వకర్మనిరతః సిద్ధిం యథా విన్దతి త చ్ఛృణు. 45
యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వ మిదం తతమ్
స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః 46
శ్రేయా న్స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వభావనియతం కర్మ కుర్వ న్నాఽఽప్నోతి కిల్బిషమ్. 47
సహజం కర్మ కౌన్తేయ సదోషమపి న త్యజేత్
సర్వారమ్భా హి దోషేణ ధూమేనాగ్నిరివాఽఽవృతాః. 48
అసక్తబుద్ధి స్సర్వత్ర జితాత్మా విగతస్పృహః
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాఽఽధిగచ్ఛతి. 49
సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాప్నోతి నిబోధ మే,
సమాసేనైవ కౌన్తేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా. 50
బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్యచ,
శబ్దాదీ న్విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్యచ. 51

వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః,
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః. 52
అహఙ్కారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్
విముచ్య నిర్మమ శ్శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే. 53
బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాఙ్క్షతి,
సమ స్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్. 54
భక్త్యా మా మభిజానాతి యావా న్యశ్చాస్మి తత్త్వతః,
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్. 55
సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః,
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్. 56
చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః,
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ. 57
మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి,
అథ చేత్త్వ మహఙ్కారా న్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి. 58
య దహఙ్కార మాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే,
మిథ్యైష వ్యవసాయ స్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి. 59
స్వభావజేన కౌన్తేయ నిబద్ధ స్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహా త్కరిష్య స్యవశోఽపి తత్. 60
ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా. 61
తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత,
తత్ప్రసాదా త్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్. 62

ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యా ద్గుహ్యాతరం మయా,
విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు. 63

సర్వగుహ్యాతమం భూయ శ్శృణు మే పరమం వచః,
ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్. 64

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే. 65

సర్వధర్మా న్పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః. 66

ఇదం తేనాఽతపస్కాయ నాభక్తాయ కదాచన,
న చాఽశుశ్రూషవే వాచ్యం నచ మాం యోఽభ్యసూయతి. 67

య ఇదం పరమం గుహ్యం మద్భక్తే ష్వభిధాస్యతి,
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్య త్యసంశయః. 68

న చ తస్మా న్మనుష్యేషు కశ్చి న్మే ప్రియకృత్తమః,
భవితా న చ మే తస్మా దన్యః ప్రియతరో భువి. 69

అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః,
జ్ఞానయజ్ఞేన తేనాఽహ మిష్ట స్స్యామితి మే మతిః. 70

శ్రద్ధావా ననసూయశ్చ శృణుయా దపి యో నరః,
సోఽపి ముక్త శ్శుభాం ల్లోకా న్ప్రాప్నుయా త్పుణ్యకర్మణామ్. 71

కచ్చి దేత చ్ఛ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా,
కచ్చి దజ్ఞానసమ్మోహః ప్రణష్ట స్తే ధనఞ్జయ! 72

అర్జున ఉవాచ—

నష్టో మోహః స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత
స్థితోస్మి గతసన్దేహః కరిష్యే వచనం తవ. 73

సఞ్జయ ఉవాచ

ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః
సంవాద మిమ మశ్రౌష మద్భుతం రోమహర్షణమ్. 74
వ్యాసప్రసాదా చ్ఛ్రుతవా నేత ద్గుహ్యతమం పరమ్
యోగం యోగేశ్వరా త్కృష్ణా త్సాక్షా త్కథయత స్స్వయమ్
రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాద మిమ మద్భుతమ్
కేశవాఽర్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః.
తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూప మత్యద్భుతం హరేః
విస్మయో మే మహా॒న్ రాజ॒న్ హృష్యామి చ పునః పునః. 77
యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ. 78

ఇతి శ్రీ మహాభారతే శతసాహస్రికాయాం సంహితాయాం
వైయాసిక్యాం శ్రీమద్భీష్మపర్వణి శ్రీ భగవద్గీతా
సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే మోక్షసన్న్యాస
యోగో నామ అష్టాదశోఽధ్యాయః
శ్రీ కృష్ణార్పణమస్తు.

---



శ్రీ శ్రీ శ్రీ

చిద్ఘనానందేంద్రసరస్వతీస్వాములవారి

# శ్రీ భగవద్గీతోపన్యాసములు





శ్రీస్వాములవారు నిత్యము గీతోపన్యాసముల
ప్రారంభించునపుడు పఠించెడి

# ధ్యానశ్లోకములు



శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే. ౧

హే గోపాలక హే కృపాజలనిధే హే సింధుకన్యాపతే
హే కంసాంతక హే గజేంద్రకరుణాపారీణ హే మాధవ
హే రామానుజ హేజగత్త్రయగురో హే పుండరీకాక్ష మాం
హే గోపీజననాథ పాలయ పరం జానామి నత్వాం వినా. ౨

వందే శంభు ముమాపతిం సురగురుం వందే జగత్కారణం
వందే పన్నగభూషణం మృగధరం వందే పశూనాం పతిం
వందే సూర్యశశాంకవహ్నినయనం వందే ముకుందప్రియం
వందే భక్తజనాశ్రయం చ వరదం వందే శివం శంకరమ్. ౩

యం శైవాః సముపాసతే శివ యితి బ్రహ్మేతి వేదాంతినో
బౌద్ధా బుద్ధ యితి ప్రమాణపటవః కర్తేతి నైయాయికాః
అర్హన్నిత్యథ జైనశాసనరతాః కర్మేతి మీమాంసకాః
సోయం వో విదధాతు వాంఛితఫలం త్రైలోక్యనాథో హరిః.

గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరంబ్రహ్మా తస్మై శ్రీగురవే నమః. ౫

# శ్రీ భగవద్గీతోపన్యాసములు

## 1 వ అధ్యాయము

## అర్జున విషాద యోగము

ప్రపంచమునందలి సకల వస్తువులు నెనుబది నాలుగు లక్షల యోనివర్గములలో జేరినవి.

అవి నాలుగురకములు:—1 అండజములు [21 లక్షలు] అండజములనగా గుడ్లనుండి వెలువడునవి i. e. పక్షులు, పాములు మున్నగునవి; 2 స్వేదజములు [21 లక్షలు]. స్వేదజము లనగా చెమటనుండి పుట్టునవి. i, e. తేళ్ళు, నల్లులు, పేలు, దోమలు మొదలగునవి. 3 ఉద్భిజ్జములు [21 లక్షలు] ఇవి భూమిని పెల్లగించుకొని వచ్చునవి. i. e. వృక్షములు, పర్వతములు మున్నగునవి. 4 జరాయుజములు [21 లక్షలు]. జరాయుజము లనగా తల్లిగర్భములో సంచియందుండి కొంత కాలమైన పిదప వెలువడునవి. i. e. మనుష్యులు, మృగములు మున్నగునవి. ఈ యెనుబదినాలుగులక్షల యోనివర్గములలో పుణ్యాపాపములు, శుద్ధాశుద్ధములు, నిత్యానిత్యములు మున్నగువాటిని చక్కగా పరిశీలించి జన్మసాఫల్య మొందుటకు వీలైన జన్మ మానవజన్మయే. అట్టి మానవజాతికి మూడువిధములయిన దుఃఖములు కలవు. అవి యేవనగా ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక దుఃఖములు. ఆధ్యాత్మిక

దుఃఖము లనగా (Physical and mental maladies) శరీర సంబంధమైన రోగములు, మనస్సునకు కామ క్రోధాదులవల్ల యేర్పడు పీడ మొదలగునవి. ఆధిభౌతిక దుఃఖము లనగా, (environmental difficulties) చుట్టుప్రక్కలనుండు దొంగలు, తేళ్లు, పాములు మున్నగువానివలన గలుగు ప్రమాద ములు. ఆధిదైవిక దుఃఖము లనగా (Supernatural catastrophies) మనుష్యుల శక్తిసామర్థ్యముల కంటె అనేక యింతలు శక్తిగల దేవతల ప్రకోపమువలన కలుగు బాధలు. e.g. ఉప్పెన, భూకంపము, కలరా యిత్యాదులు. మానవులు ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికము లను మూడు విధములగు దుఃఖములను పోగొట్టుకొనుటకు ప్రపంచమున గల సాధనములు తాత్కాలికోపశమనములే గాని శాశ్వతమైనవి గావు. ఆ దుఃఖముల నిర్మూలపరచు శాశ్వతమైన సాధన మొకటియే—ఆత్మానాత్మవివేకము.

హిందూమతములోని అవాంతరశాఖ లగు ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత, శైవసిద్ధాంతములు మున్నగువాటి కన్నిటికిని ప్రస్థానత్రియము ప్రమాణ గ్రంథములు. అవి యేవనగా 1. భగవద్గీత, 2. ఉపనిషత్తులు, 3. బ్రహ్మసూత్ర ములు. వైదికమతము లన్నిటికి నివి మూడు ప్రమాణములు. వీటిని ప్రమాణముగ లేనట్టి మతము అవైదికమత మన బడును. నాస్తిక వాదము పూర్వపక్షము చేయబడియున్నది. వేదవ్యాసులవారు పదునెనిమిది పురాణముల వ్రాసి పంచమ వేదమనబడు భారత మేల వ్రాసిరన - ఉపనిషత్తులు, బ్రహ్మ

సూత్రములు సర్వప్రధానము లగుటచే ఉపనయనాది సంస్కారములు లేనివారు వాటిని జదువ వీలులేదు. కనుక అందరు అనగా స్త్రీలు, శూద్రులు, ద్విజబంధువులు మున్నగువారు తరించగలందులకై భారతమును వ్రాసిరి. భగవద్గీత భారతములో భీష్మపర్వములో శ్లోకరూపముగా జెప్పబడియుండుటచే దీనిని అందరు చదువవచ్చును. ఇది పరమోత్కృష్టమైన గ్రంథము. ఇయ్యది సర్వోపనిషత్సార మనియు, బ్రహ్మవిద్య యనియు, యోగశాస్త్ర మనియు మానవకోటి ఐహికాముష్మికసుఖముల బడయు సాధన మనియు, హిందూదేశములోనేగాక దేశాంతరములయందును మతాంతరులచే గూడ పొగడ్తగాంచిన గ్రంథరాజము. ఈ సంసారసముద్రమునుండి తరించుటకు, మానవజన్మలోని కష్టపరంపరలోనుండి వెలువడి అజ్ఞానాంధకారమును బోగొట్టుకొని జ్ఞానముబడసిచిత్తశాంతిని, జీవితజయమును, మోక్షమును పొందుటకు గీతాపఠనమే మార్గము. వివేకానందస్వాములవారు ఇద్దానిని గూర్చి "Universal Scripture". అనగా ప్రపంచమం దెల్లరు పఠించదగిన గ్రంథ మని వ్రాసియున్నారు. మరియు నిది Bible of humanity అనగా మానవు లెల్లరకును ధర్మబోధజేయు గ్రంథ మనబడును.

గీతయందు పదునెనిమిది అధ్యాయములు గలవు. మొదటి ఆరు అధ్యాయములు కర్మషట్క మనబడును. ఏడవ అధ్యాయము మొదలు పండ్రెండవ అధ్యాయమువరకు భక్తి లేక ఉపాసనాషట్క మనబడును. పదుమూడవ అధ్యా

యము మొదలు పదునెనిమిదవ అధ్యాయమువరకు జ్ఞానషట్క మనబడును. రెండవ షట్కము భక్తినిగురించి చెప్పుటలో అభిప్రాయ మేమనగా మొదటి షట్కమందు ప్రతిపాదింపబడిన కర్మకు, మూడవ షట్కమందు ప్రతిపాదింపబడిన జ్ఞానమునకు, రెంటికి భక్తి అవసర మని అభిప్రాయము. తలలేని మనుష్యునిమాదిరి భక్తిలేనికర్మ, భక్తిలేని జ్ఞానము నిష్ప్రయోజనము. ఇందు మొదటి అధ్యాయములోని 47 శ్లోకములు, రెండవ అధ్యాయములోని మొదటి పదిశ్లోకములు, మొత్తము 57 శ్లోకములకు పూర్వపీఠిక యని పేరు. అసలు గీతారంభము 2 వ అధ్యాయము 11 శ్లోకముతో; దాని అంత్యము 18 వ అధ్యాయమందలి 66 వ శ్లోకము, "సర్వధర్మాన్ పరిత్యజ్య" అను చరమశ్లోకముతో; శేషము 18 వ అధ్యా 67-78 శ్లోకములు ఉత్తరపీఠిక యనబడును.

గీతాధ్యాయములు పదునెనిమిది. భారతయుద్ధము జరిగినది పదునెనిమిదిరోజులు. యుద్ధమందలి అక్షౌహిణులు పదునెనిమిది. అందు పాండవులకు 7అక్షౌహిణులు, కౌరవులకు 11 అక్షౌహిణులు. [ 1 అక్షౌహిణి యనగా 21870 ఏనుగులు, 21870 రథములు, 65610 గుర్రములు, 109350 కాల్బంట్లు కలిగినది] సాంఖ్యశాస్త్రప్రకారము పదునెనిమిది అను సంఖ్యకు (indication) "సోహం" అనే అజపా గాయత్రి యేర్పడుచున్నది. దానికి అర్థ మేమనగా :— సః—ఆయన, బ్రహ్మ-అహం=నేను, జీవుడు. జీవుడు, పరబ్రహ్మము ఐక్యమగుట. జీవబ్రహ్మైక్యము తెలుపు సంఖ్య

పదునెనిమిది. గీతయందలి పదునెనిమిది అధ్యాయములు పదునెనిమిది యోగముల గురించి తెలుపుచున్నవి. యోగ మనిన చేరుటకు మార్గము [యుగము=yoke=యోగము] అందు మొదటిది విషాద యోగము.

దుర్యోధనుడు, అర్జునుడు, ఉభయులు శ్రీకృష్ణుని సాయము యుద్ధారంభమం దపేక్షించిరి. తాను ఒక్కడే కావలయునా, నవకోటి నారాయణులు కావలయునా కోరు కొమ్మనిన దుర్యోధనుడు నవకోటినారాయణుల కోరుకొని యెను. అర్జునుఁడు ఒంటరినైనను శ్రీకృష్ణుని సాయము కోరెను. ఇరుపార్శ్వములవారును కురుక్షేత్రమందలి యుద్ధ భూమికి జనిరి. శ్రీకృష్ణుడు అర్జునునకు సారథ్యము వహిం చెను. ధృతరాష్ట్ర మహారాజు గుడ్డివాడగుటచేత యుద్ధ మందలి విషయములు తనకు దెలియజెప్పవలసిన దని సంజయుని కోరెను. సంజయుడు వేదవ్యాసుని అనుగ్రహమువలన దూర దృష్టి, దూరశ్రవణముల రెంటిని బడసినవా డగుటచే యుద్ధ మందలి విశేషముల జెప్పదొడగెను. (Sanjaya being the foremost disciple of Veda Vyasa, attained through his grace the powers of telepathy and clairvoyance, and thus narrated the events and the conversation that took place between Lord Sri Krishna and Arjuna in the battle-field)

మొదటి శ్లోకమందు, యుద్ధసన్నద్ధులై కురుక్షేత్ర ములో చేరిన తన కుమారులును, తన తమ్ముని కుమారులును

ఏమి చేసిరి? అని ధృతరాష్ట్రుడు సంజయుని ప్రశ్నించు చున్నాడు. ఈ ప్రశ్న మొట్టమొదట అప్రస్తుతముగా కనుపడవచ్చును. ఆలోచించి చూడగా, దాని భావ మేమన కురుక్షేత్రము నేర్పడినది మొదలు అచట నెన్నో ధర్మకార్యములు జరిగియుండుటచే అచట ఆధ్యాత్మిక వాతావరణము ఏర్పడినందున యుద్ధము చేయవలయు నని అచటికి వెళ్ళిన తరువాత వీరి అభిప్రాయములు మారినవా? లేక పాపులై పోరాడ నుంకించుచున్నారా? అని ధృతరాష్ట్రుడు తెలిసికొనగోరి సంజయుని అడిగెను. మరియు మనస్సులు మారిపోవుటకు భీష్మ ద్రోణాదులైన గొప్పభక్తులు అంతర్ముఖు లుండుటచే వారల గాంచిన పిమ్మట మనస్సు మారిపోయి యుండవచ్చును.

"శ్లో॥ న హ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః
తే పునన్త్యురుకాలేన దర్శనా దేవ సాధవః!"

అని చెప్పబడినది. అనగా గంగాదినదులు తీర్థములే, విగ్రహములు దేవతలే. ఐనను వీనిని చాలకాలము సేవించిన గాని పాపములు పోవు. సాధువుల దర్శించినంత మాత్రముననే మన పాపము లన్నియు పరిహారమగును.

పురాణములు మున్నగువాటిని చదువుటలో రెండు దృక్పథములు కలవు, 1. Historical aspect [చారిత్రాత్మక మైనట్టిది] 2. Esoteric aspect [ఆధ్యాత్మిక సంబంధ

మైనట్టిది.] గీతయందు విస్తరింపబడిన ముఖ్యాంశము, మానవజన్మ యావత్తు ఒక యుద్ధమువంటిది. మహాభారత యుద్ధము పదునెనిమిది రోజులు మాత్రమే జరిగెను. మానవుని జీవితమందలి యుద్ధము నిత్యము జరుగుచున్నది.

The Gita depicts life's battle and hence its study is all important. The life's battle is everlasting, while the Mahabharata War lasted for eighteen days.

మన శరీరము ఒక యుద్ధభూమివంటిది. స్థూల, సూక్ష్మశరీరములు క్షేత్రము. ధర్మక్షేత్రము అనగా మానవశరీరము. ధర్మము చేయుట కుపయోగపడునది మానవశరీరము. పాండవులు సాత్వికవృత్తులు; కౌరవులు రాజసిక, తామసిక వృత్తులు. మన శరీరమందలి సాత్వికగుణములకు, రాజసిక తామసిక గుణములకు నిత్యము యుద్ధము జరుగుచున్నది. భారతయుద్ధమందలి నీతి యేమన: ఈశ్వరానుగ్రహ మున్నయెడల మనము పట్టినది బంగారమగును. దైవబలమువలన పాండవులు తమకు వైరి బలములకన్న సైన్యము తక్కువైనను జయముగాంచిరి. తా మెంత గొప్పవా రైనను తమ కెంత సేన యున్నను, యోధానుయోధులు తమప్రక్క నిలిచి యుద్ధమాడినను దైవ బలము లేమి కౌరవులు యుద్ధమందు ఓడిపోయిరి. సంజయుని ప్రశ్నించుచున్న ధృతరాష్ట్రుడు అధమజీవులతరగతిలో చేరిన వాడు.

జీవులు మూడురకములు. 1 ఉత్తములు - సాత్వికులు సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును పరమాత్మయందు

తమ మనస్సు లీనపరచువారు. వీరిని తేనెటీగలకుపోల్చవచ్చును. తేనెటీగ అన్నిపూవులపై, చెట్లపై వ్రాలి మకరందమును మాత్రము ఎట్లు గ్రోలునో, అట్లే ఈ యుత్తమజాతియందు చేరిన స్త్రీపురుషులు తామే లౌకిక, వైదిక వ్యాపారముల చేయుచున్నను, అంతటను ఆ పరబ్రహ్మ లేక శ్రీమన్నారాయణస్వరూపమునే గాంచెదరు.

2 మధ్యములు — రాజసులు. వీరు సాధారణమైన ఈగలవంటివారు. మామూలుగ ఈగ కొంతసేపు శుద్ధమైన వస్తువులయందు, మరికొంతసేపు అశుద్ధమైన వస్తువులందు, వ్రాలుచున్నది. అట్లే రాజసికులు కొంతసేపు ఆత్మనుగురించి, కొంతసేపు ప్రపంచమును గురించి విచారణ సలుపుచుండుదురు.

3 అధములు - తామసులు. వీరలు అమేధ్యములో పుట్టి, అమేధ్యములో పెరిగి, అమేధ్యములో చచ్చు పురుగుల వంటివారు.

శ్రీ రామకృష్ణ పరమహంస వీరలను మూడు దీపములకు పోల్చియున్నాడు. మొదటివారు సాత్వికులు - గ్లాసుతో కప్పబడిన దీపము. వారి కెల్లపుడు భగవంతునియందు మనస్సు లీనమై యుండును. రెండవవారు - రాజసులు - పైన తట్ట బోర్లించబడినట్టి దీపముమాదిరి.ఆతట్టయందలి చిల్లులలోగుండ అప్పుడప్పుడు వెలుగు బయల్పడునట్లు వీరు కొన్ని సమయముల యందు మాత్రమే పరమాత్మవిచారణ చేసెదరు. మూడవ

రకము — తామసులు. కుండ బోర్లించిన దీపమువంటివారు. వీరు భగవత్ చింతయే లేక అజ్ఞానాంధకారనిమగ్నులై, శరీరమే శాశ్వత మని యెంచి యెన్ని కొంపలో కూల్చి తమ పొట్ట నింపుకొనువారు. వీరలగురించి భాగవతములో ప్రహ్లాద చరిత్రయం దిట్లు చెప్పబడి యున్నది.

"అచ్చపుఁ జీకటింబడి గృహవ్రతులై విషయప్రమత్తులై
చచ్చుచుఁ బుట్టుచుర్ మరల చర్వితచర్వణులైన వారికిఁ
జెచ్చెరఁబుట్టునే పరులు చెప్పిననైన నిజేచ్ఛనైన నే
మిచ్చిననైన కానలకు నేగిననైన హరిప్రబోధముల్"

ఇట్టి అచ్చపుజీకటిలో బడి కొట్టుకొను అధముల ప్రతినిధివంటివాడు ధృతరాష్ట్రుడు. సంజయు డన్ననో కామక్రోధముల జయించిన మహానుభావు డగు సద్గురువు.

ఉభయపక్షములవారు యుద్ధసన్నద్ధులైన తదుపరి, భీష్ముడు పాండవపక్షపాతి యనియు, ముదుసలి వాడగుటచే శరీరేంద్రియపాటవములు తగ్గియుండునని శంకించి, దుర్యోధనుడు ద్రోణాచార్యుని సమీపించి, "మీ శిష్యులలో నొకడగు ధృష్టద్యుమ్నుడు ఎదిరిబలముల [పాండవ సైన్యములను] యెంత చక్కగా ఆయత్తపరచినాడో చూడుడు. అనఁగా జాగ్రత్తగా యుద్ధముచేసి మనకు జయము సమకూర్చుడు; లేనిచో శిష్యునివలన జయింపబడిన మీకు అప్రతిష్ఠ వచ్చును" అనిచెప్పి పురిగొల్పెను. [శ్లో. ౩] అందుకు భీష్ముడు, దుర్యో

ధనుడు తమయం దనుమాన పడుచున్నాడని గుర్తెరిగి మాట లతో చెప్పిన ప్రయోజనములేదని యెంచి బిగ్గరగా శంఖము పూరించి సింహనాదము చేసెను. (అనగా దుర్యోధనా! చూడు, నేను చూపునకు ముసలివాడనైనను నాపరాక్రమమం దెట్టి లోపము లేదని తెలియపరచెను.) వెంటనే కౌరవసైనికులు తమతమ వాద్యముల (శంఖములు, భేరి, మృదంగాదుల) మోగించి తాము యుద్ధసన్నద్ధులై యున్నట్లు తెలిపిరి. (శ్లో॥ 13) యుద్ధరంగమందుగూడ ఒక [Code of morality] నీతి కలదు. ఏమన ప్రత్యర్థులు యుద్ధమునకు సిద్ధముగా నున్నామని తెలుపనంతవరకు బాణప్రయోగము చేయరాదు. ఇంతలో పాండవ పక్షమున నాలుగు తెల్లని గుర్రములు [శైబ్య, సుగ్రీవ, మేఘపుష్ప, వలాహకములు] కట్టిన గొప్ప రథమందు శ్రీకృష్ణుడు, అర్జునుడు ఇరువురును కనుబడిరి. (శ్లో॥14) రథము అనగా యీ మానవ శరీరము. రథములో కూర్చున్న వాడు అర్జునుడు, ఆత్మ. ఇంద్రియములు గుర్రములు. మనస్సు పగ్గము. విషయములు - శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు బాటలు. పరమాత్మ - గమ్యస్థానము. మహాస్యందనము = గొప్ప రథము-మానవశరీరము. నాలుగు తెల్లని గుర్రములు = తెలుపు జ్ఞానమును సూచించునది, నాలుగు గుర్రములు = నాలుగు వేదములు. వేదబద్ధులై ప్రవర్తించు వారికి ఆత్మ పరమాత్మల స్వరూపము తెలియును.

"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ చ
ఇంద్రియాణి హయా నాహుః ర్విషయాం స్తేషు గోచరాః"
అని చెప్పబడినది.

మరియు, "రథస్థం వామనం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే" అని చెప్పబడియున్నది. అనగా రథములో వేంచేసి యున్న స్వామిస్వరూపమును చూచినవారికి పునర్జన్మ లేదు. రథోత్సవము గుడిలోనికి రా వలనుపడని పంచమజాతివారి యుపయోగము నిమిత్తమై యేర్పరచబడినది. రథమం దుండి ఊరేగు స్వామిని పంచములు సహితము చూడవచ్చును. రథమును పంచములు కూడ లాగవచ్చును. రథోత్సవ సందర్భమందు స్పర్శదోషము లేదు. దీని అంతరార్థ మే మనగా— యీ చిన్నరథము (మానవశరీరము) లో నున్న వామనమూర్తి ని (జీవుని) తెలుసుకొనిన వారికి పునర్జన్మ లేదు. సాక్రేటీస్ అను గొప్ప గ్రీకు తత్త్వవేత్త (Know thyself) అనగా నీ వెవరో తెలిసికొనుము అని వ్రాసిచ్చెను. ఇచట కృష్ణుడు పరమాత్మ. అర్జునుడు జీవాత్మ. పరమాత్మ పాంచజన్యమును, అర్జునుడు దేవదత్తమును పూరించిరి. వెంటనే వారి సైనికులు భేరి మృదంగాదుల మ్రోగించి యుద్ధమునకు సంసిద్ధముగా నున్నామని తెలియపరచిరి. అంతయు సర్వసిద్ధమై యుండెను. వింటినారిని మాత్రము లాగవలసియున్నది. ఆ సమయములో పరమాత్మ మూడు లోకములు స్వాధీనపరచు కొన్నవాడైనను, భక్తులయందలి కటాక్షమువల్ల అర్జునుని వ్యాజముగా నుంచుకొని, అతనికి విషాదము కలిగించి, ఆయన

చేత మాటిమాటికి అడిగించుకొని, 108 ఉపనిషత్తుల సారాంశమును మన కెల్లరకు బోధించియున్నాడు. వేదాంతము బోధ చేయువారికి జారత్వమును, చోరత్వమును ఉండరాదు. స్థూల దృష్టి గలవారికి ఆ రెండుదోషములు కృష్ణునియం దున్నట్లు తోచుచున్నది. మరియు అర్జునుడు శ్రీకృష్ణునికి బావమఱది. (Familiarity breeds contempt) అతిపరిచయము వలన చులకదన మేర్పడు చున్నది. కనుక అతనిని ఏదో క్లిష్టపరిస్థితిలో పెట్టినగాని, అనగా ఎట్లు ఈ దుఃఖము పోగొట్టుకొందునా ? అను స్థితిలో తెచ్చిపెట్టినగాని తనను ప్రశ్నించడు. అపుడు తాను అర్జునునిద్వారా ప్రపంచమం దెల్లరకు ఆత్మవిచారణయే పరమావధి యని బోధపరచనగు నని పరమాత్మ అర్జునునకు దుఃఖము కలిగించుచున్నాడు. తొట్టె (ఉయ్యాల) లో నుండు బిడ్డను గిల్లునది, నిద్రపుచ్చునది పరమాత్మయే. ఇట్లు పరమాత్మచే ప్రేరేపింపబడిన అర్జునుడు శ్రీకృష్ణునితో ఏమనె ననగా — "ఉభయపార్శ్వముల వారు కానవచ్చునట్లు రథమును దీసికొనిపోయి మధ్య నిలువంబెట్టుము. ఎవరు ఏప్రక్కన నున్నారో, బలాబలముల చూచి యుద్ధము చేయవలయును." (శ్లో 21 - 23) దీని అంతరార్థము ఏమన పాపపుణ్యముల రెంటిస్వరూపము తెలిసికొని పాపముల వదలి పుణ్యము నవలంబించుటకు మన కాయిక, వాచిక, మానసిక వృత్తులను మధ్యరకముగ నుంచుకొనవలయును. (The golden mean should be

adopted) శ్రీకృష్ణుడు భక్తపరాధీను డగుటచే కోరినప్రకారము రథమును మధ్యనిలుపగా, అర్జునుడు తన బంధువులను, పినతండ్రులను, బావమఱదులను, పూజనీయులైన గురువులను యెదిరి బలగములలో నిలిచియుండఁగ జూచి, అఖండ భూమండలము స్వాధీనము కానున్నను త్రైలోక్యాధిపత్యము రానున్నను, వారలతో తాను యుద్ధము చేయనని చెప్పెను. [శ్లో 34-35]

బ్రహ్మజ్ఞానమును బడయుటకు కొన్ని ముఖ్యలక్షణములు లేక పూర్వాంగములు (Preliminary qualifications) ఉండవలయును. అవి యేవనగ:—

[1] నిత్యానిత్య వస్తువివేకము (The sense of discrimination between the eternal and transitory things) శాశ్వతమైన వస్తువు లెవ్వి? అశాశ్వతమైన వస్తువులెవ్వి అని తెలిసికొనుట.

[2] ఇహాముత్రఫలభోగవిరాగసాధనమ్ (i. e., non-attachment towards worldly or heavenly pleasures.) ఐహికాముష్మిక సుఖములయందు మనస్సు లగ్నపరచకుండుట, వాటియందు, కాకిరెట్టచూచిన యెంత అసహ్యమో అంత అసహ్యము కలుగవలెనని శ్రీశంకరాచార్యులు వ్రాసిరి.

[3] శమదమాదిషట్కసంపద (i. e., control over the external sensory organs and the inner mind) ఇంద్రియములను, మనస్సును స్వాధీన మం దుంచుకొనుట; తితిక్ష (patience), శ్రద్ధ (faith), సమాధానము (contentment or peace of mind.)

[4] ముముక్షుత్వము : (i. e., hankering after liberation from material bondage) ఈ ప్రాపంచిక వస్తువులతో మనల కట్టివేసిన మాయాపాశముల నెన్నడు త్రెంచుకొని బయటపడుదుమా అను అభిలాష. నీటిలో ముంచబడిన వాడు పైకి రావలయు నని యెట్లు తాపత్రయపడునో అట్లే మన మనస్సుకు తత్తరపాటు కలుగవలయును.

అర్జునునియందు, ఈ లక్షణము లుండుటచే, శ్రీకృష్ణ పరమాత్మ అతనిని వ్యాజముగా నుంచుకొని మన కెల్లరకు తత్త్వజ్ఞానోపదేశము చేయుచున్నాడు. గురువు శిష్యుని పరీక్ష చేసినమీదట. దత్త్వోపదేశము చేయవలయును. అందుచే అర్జునుని పరమాత్మ పరిశీలించుచున్నాడు.

అర్జునుడు, ''హే కృష్ణా! నాకు జయము అక్కరలేదు. రాజ్యము అక్కరలేదు'' అనెను. (శ్లో॥ 32 - 33) బ్రాహ్మణు లధ్యాత్మిక విద్యవలనను, క్షత్రియులు పరాక్రమమువలనను, వైశ్యులు ధనమువలనను, శూద్రులు విధేయతవలనను తరించవలయును. అట్టిచో శ్రీకృష్ణుడు అర్జునుని ప్రశ్నించు చున్నాడు. అర్జునా! నీకు రాజ్యము లేనందువలన సుఖము యేమి? అందుల కర్జునుడు నాకు సుఖ మక్కర లే దనెను. సుఖము లేనిచో జీవయాత్ర గడచుట యెట్లనిన, నాకు జీవించియుండుట గూడ అవసరము లేదని అర్జునుడు చెప్పెను. మానవుడు యెక్కువగా ప్రేమించునది తన శరీరము; మీదు మిక్కిలి తన ప్రాణము. అట్టి ప్రాణము కూడ

తన కవసరము లేదని అర్జునుడు చెప్పెను. మన కీ శరీరము సుఖము కలిగించు నను వ్యామోహ మున్నంతకాలము దాని యందు, దారపుత్రాదులయం దనురక్తి యుండును. ఆ వ్యామోహము నశించిన వెంటనే వారలయందు విరక్తి కలుగుచున్నది. పరమప్రీతిపాత్రమైన తన ప్రాణమందుకూడ అర్జునునకు విరక్తి కలిగినది. ఆత డిట్లు ప్రశ్నించుచున్నాడు. "ఓ అచ్యుతా! [అచ్యుతు డన, ఆయనను పట్టుకొన్న వారిని తిరిగి యీ భూలోక కష్టపరంపరలో జారిపడ నివ్వనివాడు] నేను యుద్ధముచేసి, రాజ్యముగెలిచి యేమి ప్రయోజనము? నా బంధువులు, స్నేహితులు, గురువు లయినట్టి వారిపై నే నెట్లు బాణప్రయోగము చేయగలను? ప్రయోగించి రక్తపుకూడు కుడువ నగునా?" వలదు అను సంకోచము అతని మనస్సునందు కలిగెను. తా నెవరి నిమిత్తమై యుద్ధమాడి జయింపదలచెనో తా నెవరి సహాపంక్తి నపేక్షించునో, అట్టివా రెల్లరు ప్రాణత్యాగమునకు సంసిద్ధులై యెదిరిబలములందు నిలిచియుండ, వారితో యుద్ధమాడి, వారలఁ బరిమార్చి గెలిచిన రాజ్యము నాకేల ? వారు నన్ను చంపినను సరే, నేను యుద్ధము చేయ ననెను.

అందులకు కృష్ణుడు, అర్జునా! కౌరవులు ఆతతాయులు; వారల సందేహించక పరిమార్చుట నీకర్తవ్యము, "ఆతతాయిన మాయాంతం, హన్యాదే వావిచారయన్" అని ధర్మశాస్త్ర మందు చెప్పబడినది. ఆతతాయు లెవరనగా—(1) ఇంటికి

నిప్పు పెట్టువారు (2) విషము పెట్టువారు (3) భూమి మక్తాలను మెగబెట్టువారు (4) డబ్బుతీసికొని మెగబెట్టువారు (5) స్త్రీని చెడగొట్టువారు (6) ఆయుధములచే హింసించుటకు వచ్చువారు. ఈ ఆరింటిలో ఒక చెడుపని చేసినను ఆతతాయి యనబడును. అర్జునా! నీకుఁ గౌరవులపై యింత వ్యామోహ మేల? వారలు మీ కీ ఆరు విధములైన చెరుపు కలుగజేసిన వారే కదా? e g. లాక్షాగృహదహనము, విషముపెట్టుట, రాజ్యము నివ్వకపోవుట, ద్రవ్య మపహరించుట, ద్రౌపదిమాన భంగముచేయుట, ఇవి యన్నియుగాక పై పెచ్చు యుద్ధములో మిమ్ముల బరిమార్చుటకు సంసిద్ధులై యున్నారుగదా? ఈ ఆరు రకముల పాపములలో, యే ఒకపాపముచేసిన చంపవచ్చునని ధర్మశాస్త్రము లుద్ఘోషించుచున్న వే? అన్నిరకముల పాపముల జేసినట్టి కౌరవుల నేల చంపరాదు? అని ప్రశ్నించగా అర్జునుడు "అహింసా పరమో ధర్మః" అను వేరొండు యుత్కృష్ట ధర్మము గలదు. కనుక వారెట్టి అపకారము జేసినను, నేను వారితో యుద్ధముచేయను. అపకారికి యుపకారము చేయుటయే మహాపురుషుల యాశయముకదా! హే కృష్ణా! నా గాండీవము జారిపోవుచున్నది; నా శరీరము గగుర్పాటు చెందుచున్నది; భూమ్యాకాశములందు చెడుశకునములు కానవచ్చుచున్నవి. నేను యుద్ధము చేయను" అని కృష్ణునితో చెప్పెను. రాజ్యమందలి పేరాసతో ప్రీతిపాత్రులైన బంధువులు, స్నేహితులు, పూజనీయు లగు గురువులు మున్నగు వారిమీద బాణప్రయోగము జేయవలయు నను

యెంతటి పాపకార్యమునకు యొడిగట్టితిని అని అర్జునుడు దుఃఖ పడుచు, రథము ముందు నిలువబడినవాడు, వెనుకకు నొదిగిల బడెను. అని సంజయుడు ధృతరాష్ట్రునకు తెలియబరచెను.

గీతలో 18 యోగములు ప్రతిపాదింపబడినవి. యోగము అనగా చేరికకు మార్గము. Religion అనగా Re= back, ligo = to bind. పరమాత్మ మన జన్మస్థానము. దానిని వదలిపెట్టి జీవులు పరిభ్రమించి ప్రపంచమంతయు దుఃఖ భూయిష్ఠ మని గుర్తెరిగిన పిమ్మట, పరమాత్మ సాన్నిధ్యము మరల కలుగజేయునట్టివి అన్ని మతములు. అవి అనేకములు. Circumference మీద నుండువాడు యే radius పట్టుకొని పోయినను centre కు చేరుచున్నాడు. గీతయందలి పదునెని మిది అధ్యాయములు పదునెనిమిది మార్గముల సూచించు చున్నవి. అందు మొదటిది విషాదయోగము, i. e. విషాద మార్గము తెలుపుచున్నది. పేరాసకు లోబడుటచే తనకు యుద్ధము చేయవలయు నను సంకల్పము కలిగె నను పొరపాటు అర్జునుడుగ్రహించియేదుఃఖపడెను. అట్లే మనకుకూడ, ప్రపంచ మందలి దుఃఖములజూచి యెపుడు విషాదము కలుగునో అపుడు మనకు ఈశ్వరానుగ్రహము కలుగుచున్నది. జీవకారుణ్యము, భూతదయ; ముక్తికి ప్రథమసోపానములు. ప్రతిజీవుడు, తాను అజ్ఞానదశలో యెన్ని పాపకార్యములు చేసినది జ్ఞాపకపరచుకొని పరమాత్మ సాన్నిధ్యమున నిలువబడి, ఆయనకు వాటిని తెలిపి, పశ్చాత్తాపపడి, వేడి కన్నీరుగార్చి, తన నడవడి యంతట

నైనను మార్చుకొనవలయును. ప్రతిమానవుఁడు తనగుండెపై చెయ్యివేసికొని, ఆత్మపరీక్ష చేసికొని, తాజేసిన పాపకార్యములకు జింతిలి, పశ్చాత్తప్తహృదయుడై మన్నించమని పరమాత్మను కోరి, మరల అట్టిపనులు చేయకున్న పరమాత్మయొక్క పరిపూర్ణ కటాక్షమునకు పాత్రుడుకాగలడు. Repentence is half cure. మరియు మనము జీవయాత్ర గడపుటలో, ద్రవ్యార్జనలోగాని, తదితరములగు పనులలోగాని యెకరి మనస్సు కష్టపెట్టగూడదు. విష్ణురహస్య మను గ్రంథములో నిట్లు చెప్పబడినది.

"అకృత్వా పరసంతాపం అగత్వా ఖలమందిరం
అక్లేశయిత్వా చాత్మానం యదల్పమపి తద్బహు"

అనగా, యితరులకు సంతాపము గలిగించకూడదు. నీచుల సేవ జేయరాదు. తన శరీరమునకు మనస్సునకు యెట్టిహింస కలిగించుకొనరాదు. అట్లు సంపాదించిన ధనము స్వల్పమైనను అదియే యెక్కువగా నుండును.

మఱొకచోట

శ్లో॥" నీచసేవా నకర్తవ్యా కర్తవ్యో మహదాశ్రయః
పయోపి శౌండినీహస్తే వారుణీ త్యభిధీయతే"

అని చెప్పబడియున్నది. అనగా నీచులసేవ పనికిరాదు. మహాత్ముల ఆశ్రయము చేయవలయును. కల్లు గీయువానివద్ద

పాలకుండ ఉన్నను అయ్యది కల్లు అని యితరులచే భావించ బడును.

ప్రతిమానవుడు జీవకారుణ్యము, భూతదయ, పశ్చాత్తాపము గలిగి సకలాత్మలను తనమాదిరిగానే భావించవలయును ("A Sage is one who weeps with those that weep and who laughs with those that laugh') 'Swami Vivekananda."

దుఃఖించువారితో దుఃఖించి సంతోషించువారితో సంతోషించునట్టివాడే నిజమైన యోగి అని వివేకానందస్వామి చెప్పియున్నాడు. అనగా యితరుల సుఖదుఃఖములను, నీ సుఖదుఃఖములట్లే భావించవలయును. నీ కంటిలో దుమ్ముపడిన, నీకాలిలో ముల్లు గుచ్చుకొనిన యెట్లుబాధపడుదువో, అట్లే యితరులకు కష్టము కలిగినపుడు నీకష్టమువలె వాటిని భావించి వాటిని నివారించుము. పశ్చాత్తప్తహృదయులకు, దయాంతరంగులకు, వెన్నవలె మృదువైన స్వభావము కలవారలకు, పరమాత్మసాక్షాత్కారము కలుగును. కఠిన హృదయులకు అట్టిది కలుగనే కలుగదు. నీతోడి సోదర సోదరీమణులు, తినుటకు తిండి, కట్టుటకు గుడ్డ, పొట్టపొడిచి చూచినను అక్షరజ్ఞానములేక బాధపడుచున్నారు. వారలపై నీదృష్టి ప్రసరింపజేసి వారికి నీయోపినకొలది సేవజేసి పరమాత్మ అనుగ్రహము జూరగొనుము. The Bible says, "Unless you love your neighbour, God will not love you," అనగా నీ పొరుగింటి వానిని నీవు ప్రేమించినగాని, భగవంతుడు నిన్ను

ప్రేమించ డని బైబిలులో చెప్పియున్నది. అర్జునుడు యిట్టి లక్షణములు కలవా డగుటచే, ఆయనను వ్యాజముగా నుంచుకొని, మన కందరికి పరమాత్మ గీతోపదేశము చేసినాడు.

"సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః
పార్థో వత్స స్సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్"

అని చెప్పబడినది. అనగా, సర్వోపనిషత్తులు ఆవువంటివి. వాటిని పిండుటకు గోపాలబాలుడే కావలయును. ఏలనన గొల్లపిల్లవాడు పాలుపిండుటకు కడు సమర్థుడు. దూడ కుడిచిన తరువాత వాటిని పిండవలయును. అట్లు పితుకబడిన పాలే శరీరారోగ్యమునకు మంచివి. గోపాలునిచే పిండబడి యర్జునుడు అనే దూడ కుడిచి వదలిపెట్టిన శేషమును మనము త్రాగవలయును. సుధీర్భోక్తా - మంచి పరిపక్వమైన బుద్ధి కలవారికే గీత బోధపడును. ఎవరి గీత బాగుండునో వారికే యీగీత అర్థమగును. దుగ్ధం - గీతామృతము - పిండబడిన పాలు; 108 ఉపనిషత్తుల సారాంశము. అట్టి గీతామృతమును పరమాత్మ అర్జునుని ద్వారా మన కెల్లరకు ఉపదేశించి యుంటచే దానిని గ్రోలి మానవు లెల్లరు తరింతురుగాత!

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
అరునవిషాదయోగో నామ ప్రథమోఽధ్యాయః

సంపూర్ణః

# శ్రీ భగవద్గీతోపన్యాసములు

## 2వ అధ్యాయము

## సాంఖ్య యోగము

రెండు సేనలమధ్య నిలువబడి కన్నీరు గార్చుచున్న అర్జునుని శ్రీకృష్ణభగవానుడుచూచి కొన్నిమాటలు చెప్పుచున్నాడు. (శ్లో॥ 1). అర్జునా! నీవు పిరికితన మిట్టి సమయములో జెంద కూడదు. ధైర్యము చేపట్టి యుద్ధమునకు లెమ్ము. అనగా అర్జునుడు, పూజనీయులైన భీష్మ ద్రోణాదులపై బాణము లెట్లు వేయగలను? వారల జంపి రాజ్యము గెల్చుట చంపినవారి రక్తముతో కలిసిన అన్నము తినిన ట్లగుచున్నది. అంతకన్న భిక్షాటనమే మేలు అని తోచుచున్నది అనిచెప్పెను. (శ్లో॥ 45) ఇచట గమనించవలసిన విషయమేమనగా, అర్జునుడు క్షత్రియుడై యుండి, తన స్వధర్మమైన యుద్ధము మంచిది కాదనియు, బ్రాహ్మణవృత్తియైన భిక్షాటనమే తనకు దగుననియు, భ్రాంతి పడెను. ఆ యవివేకము పోగొట్టుటకై శ్రీకృష్ణుడు అర్జునునికి గీతోపదేశము చేసియున్నాడు. అందువల్ల గీతకు ఈ అధ్యాయమందలి 5 వ శ్లోకము బొడ్డురాయివంటిది. మరియు మనము గ్రహించవలసిన నీతి దీనినిబట్టి యొందుగలదు—ఒకరిని జంపి వారిసొత్తుపొందవలయుననికోరుట నెత్తుటికూటితోసమానము.

ఓ కృష్ణా! యుద్ధమందు మనము కౌరవుల గెల్తుమో వారలు మనలగెల్తురో నాకు తెలియకపడదు. (శ్లో 6) కార్పణ్యా దోషమువల్ల నా మనస్సు చెడిపోయినది. యుద్ధముచేయుటయో, లేక భిక్షాటనమో యీ రెంటియం దేది శ్రేయస్కరమో నేను గ్రహించు స్థితిలో లేను. నేను శిష్యభావము జెంది ప్రపన్నుడనగుచున్నాను. శరణాగతి జొచ్చుచున్నాను. ఈ రెంటిలో నేది మంచిదో నీవే పరిశీలించి చెప్పవలసినది, అని కోరెను. ప్రపత్తియనగా (Entire resignation unto His lotus feet). తమతమజాతినిబట్టి, ధనమునుబట్టి, విద్యనుబట్టి వచ్చు ఆధిక్యత మరచిపోయి పరమాత్మను శరణుజొచ్చుటయే. కార్పణ్యాదోషమనగా శరీరమే ఆత్మఅనుకొని ఎల్లపుడు సౌఖ్యము కొరకై వెదకుట; అట్టివారిని కృపణు లందురు. మరియొక అర్థమేమనగా:—స్వల్పధనము నష్టమైనను దుఃఖము భరింపజాలని వాడు కృపణుడు. వానిదోషము కార్పణ్యాదోషము. అట్టివాని ప్రాణమునకు డబ్బునకులంకె. (Shakespeare said; "Where the treasure is, there the heart lies") షేక్స్పియ రను ఆంగ్లకవీశ్వరుడు అట్టివారి ధనాగారము యెచట నుండునో అచటనే వారి మనస్సుండునని వ్రాసియున్నాడు. ఇట్లు దుఃఖపడుచున్న అర్జునునిజూచి పరమాత్మ సులభశైలితో 108 ఉపనిషత్తుల సారాంశమును అర్జునునకు ఉపదేశించెను. గీతారంభము ఈ యధ్యాయమందలి 11 శ్లో. నుండియనియు, యీ 10 శ్లో. వరకు గీతయొక్క పూర్వపీఠికయనియునిదివరకు ఉపన్యాసమందు చెప్పబడియున్నది. గీతారంభము ఈయధ్యాయము 11 శ్లోకము

నుండి యని తెలియనగును. తత్వజ్ఞానములేనట్టి జీవులను, నా యిల్లు, నా వాకిలి, నా దార పుత్రాదులు, నా బంధువులు అను మమకారమును, వారి యెడబాటువలన గలుగు దుఃఖము, అనగా, మోహశోకములు, యీ సంసార సాగరమందు వారల నిమగ్నులంజేసి వారిని స్వధర్మవిముఖులంజేయుచు, అన్యధర్మములు మంచివనునట్లు మనస్సునకు తోచునట్లొనర్చుచున్నవి. ఒకవేళ స్వధర్మపరిపాలన యొనర్చినను నట్టిది, ఫలాపేక్షతో, అహంకార మమకారములతో జేయబడుచున్నది. అహంకార మమకారములవలన బుణ్యాపాపములందలి భేదము, నిత్యానిత్య వస్తువివేకము నశించుచున్నది. అందువల్ల 'పునరపిజననం పునరపిమరణ'మ్మని చెప్పినట్లు సంసార పరంపరలో జిక్కుపడి జన్మలు యెత్తుచు జచ్చుచు జీవులు పరమాత్మ సాన్నిధ్యమునకు దూరస్థులగుచున్నారు. ఈ సంసార సాగరమునుండి విడిపింపబడుటకు, పరమాత్మ సాన్నిధ్యము జెందుటకు రెండుమార్గములు. (1) అంతఃకరణ శుద్ధి కలవారికి జ్ఞానమార్గము; (2) లేనివారికి కర్మమార్గము. రెంటిలో జ్ఞానమార్గము సమీచీనకారణ మగుటచే దానిని పరమాత్మ ముందు తెలిపియున్నాడు.

యామునాచార్యులుగారు [ఆళవందారు] గీతార్థ సంగ్రహములో, పిపీలికాది బ్రహ్మపర్యంతము జీవు లందరికి రెండు దోషములు కలవని, ఆ రెండుదోషములు అర్జునుని

యందుండుటచే వాటినిపోగొట్టుటకు పరమాత్మ గీతోపదేశము చేసినట్లు వ్రాసియున్నాడు.

"అస్థాన స్నేహకారుణ్య ధర్మాధర్మధియాకులం
పార్థం ప్రపన్న ముద్దిశ్య శాస్త్రావతరణం కృతమ్"

అర్జునునియం దారోపింపబడిన రెండు దోషము లెవ్వి యనగా:—

1. అస్థాన స్నేహకారుణ్యం (Compassion or pity shown to others, which is out of place: this is an impediment to our further progress) మన లౌకిక వ్యాపారములయం దెవరికి నే సమయమునందు దాక్షిణ్యము చూపవలయునో గుర్తెరిగి మెలగవలయునేగాని, సమయోచితముగాని దయ తగదు.

2. ధర్మాధర్మధియాకులం - స్వధర్మము మంచిది కాదని, పరధర్మము మంచిదని యెంచుట రెండవదోషము. బ్రాహ్మణులకు ధర్మములు ఆఱు. ఏవన:— 1 యజ్ఞము చేయుట, 2 యజ్ఞము చేయించుట, 3 వేదముల జదువుట, 4 వేదముల జదివించుట, 5 దానము చేయుట, 6 దానము పుచ్చుకొనుట. భిక్షాటనము బ్రాహ్మణులకు చెల్లునేగాని క్షత్రియులకు పనికిరాదు. అట్టిచో అర్జునుడు తన స్వధర్మమైన యుద్ధము వదలి భిక్షాటనము మంచి దని తలచుట రెండవ దోషము. పొరుగింటికూర పుల్లకూర అనుకొనినంతవరకు జీవులు మోక్షము జెందజాలరు. ఈ రెండు దోషములు సకల

ప్రాణులకు నున్నవి. ఈ రెండుదోషములు పోగొట్టుకొనిన గాని జీవులు తరించజాలరు. అందువలన అర్జునుని వ్యాజముగా నుంచుకొని మొదటిదోషము జ్ఞానమార్గము వలనను, రెండవ దోషము కర్మమార్గము వలనను పరిహరించుటకు యత్నించు డని పరమాత్మ మనకెల్లరకు బోధించుచున్నాడు. ప్రతి గుడి యందు ధ్వజస్తంభము సమీపములో బలిపీఠముండుట దక్షిణ దేశములో జూడనయ్యెడిని. దాని తాత్పర్య మేమనగా దేవా లయములోనికి పోకముందు ఆ పీఠముపై మనయందలి అహం కార మమకార దుర్వృత్తులను బలియిచ్చి దేవుని దర్శించుటకు లోపలికి పోవలయును.

అట్లు ప్రపన్నుడైన ధనంజయునితో శ్రీకృష్ణు డిట్లు పలుకుచున్నాడు. ఈ 11 శ్లో॥ 10 శ్లోకమునకు 12వ శ్లోకము నకును లంకె (connecting link.) "ఓ అర్జునా! నీవు ఎవరిని గురించి దుఃఖపడగూడదో, వారినిగురించి దుఃఖపడుచున్నావు. నీవు మాటలనుబట్టి జ్ఞానివలె కనుపడుచున్నావు, జ్ఞాని యెట్టి ఆపదకలిగినను తన మనస్సు నిబ్బరముగా నుంచుకొనును. (He will maintain or preserve the balance of his mind resigning himself to the will of providence) ధనంజయుడు చెప్పిన మంచిమాట తేవనగా యుద్ధమందు పెద్దలు జ్ఞానులు ఆహుతి అయిపోయినచో, రెండోతరగతి, మూడవ తరగతివారు, అనగా చచ్చురకము మిగిలిపోయి ప్రపంచము నకు అనర్థము వాటిల్లునని ధనంజయుని అభిప్రాయమైనట్లు

కొందరు వ్యాఖ్యానకారులు వ్రాసియున్నారు. జ్ఞాను లున్న నే యే సమయములో నేపని నిర్వర్తించవలసినది యితరులకు తెలిపి, తాముచేసి చూపి, మార్గదర్శకు లయ్యెదరు. పెద్ద తలలు లేనిచో పురుషులు స్వేచ్ఛగా ప్రవర్తించెదరు. ఇట్టి పురుషులం జూచి స్త్రీలు భ్రష్టులయ్యెదరు. మన యిండ్లలోని స్త్రీలు చెడిపోవుటకు నూటికి తొంబదితొమ్మిది పాళ్ళు పురుషులే కారణము. "స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణ సంకరః" యని చెప్పబడినది. స్త్రీలు వ్యభిచరించిన యెడల వర్ణసంకరము కలుగును. అందువలన పితృదేవతలకు తర్పణములు జరుగక వారందరు నరకాద్యధోలోకముల పాలగుదురు. ఇట్టి అనర్థముండుటచే, తనకు యుద్ధము తగదని ధనంజయుడు మొదటి అధ్యాయ మందు తెలిపి యున్నాడు. ఈ మాటలనుబట్టి చూడ పార్థుడు జ్ఞానివలె కనబ్బుచున్నాడు.

కాని నిశ్చయమైన జ్ఞానులు చనిపోయిన వారిని గురించిగాని, చనిపోవువారిని గురించిగాని దుఃఖపడరు. కనుక కృష్ణుడు అర్జునునితో "ఓ అర్జునా ! నీవు దుఃఖపడుట చూచిన నీ మాటలు మంచివైనను నిన్ను మూఢుల జాబితాలో చేర్చవలసినట్లు కనిపించుచున్నది" అని చెప్పుచున్నాడు. (11 శ్లోక) రామానుజభాష్యములో "గతాసూన్" అనగా శరీరము లనియు (నశించునవి) "అగతాసూన్" అనగా నశించనట్టి ఆత్మలు అనియు చెప్పబడి

యున్నది. అనగా జ్ఞాని శరీరమును గురించిగాని, ఆత్మను గురించిగాని దుఃఖపడడు. జ్ఞానులు సమీపబంధువియోగము ఏకపుత్రమరణము కలిగినను నిర్వికారముగా నుండెదరు. వారికి లక్షలు కోట్లు నష్టము వచ్చినను చలించరు. మహమ్మద్ ప్రవక్తకు ప్రియశిష్యుడైన జైద్ (Zaid) చనిపోయిన వార్త తెలుపగనే ఆయన "అల్లా దియా అల్లా లియా" అని సెలవిచ్చెను. అనగా యిచ్చిన పరమాత్మ తిరిగి అద్దానిని తీసుకొనినచో మన మేల దుఃఖపడవలె నని అభిప్రాయము.

దుఃఖపడునట్టి మూఢులు మూడురకములవారు. (1) ఉత్తములు—విగతజీవులైనవారిని గురించి మాత్రము చింతించువారు, (2) మధ్యములు—చనిపోయిన వారికొరకు కొంత సేపు వారిపై ఆధారపడియుండు దారాపుత్రాదులు బంధువులు మున్నగు వారికొరకు కొంతసేపు దుఃఖించువారు, (3)అధములు—చచ్చిపోయినవారు డబ్బుయిచ్చి పోలేదనియు పీనుగను బాడిచి పొడిచి, నిష్ఠురము లాడుచు యేడ్చువారు.

అవతారిక:— నీవు శరీరమును గురించి దుఃఖపడుచున్నావా? ఆత్మలను గురించియా? ఆత్మలను గురించి దుఃఖింప పనిలేదు. 11వ శ్లోకము మొదలు 30వ శ్లోకమువరకు జ్ఞాన ప్రకరణము లేక అధ్యాత్మప్రకరణ మని పేరు.

శ్లో 12: ఓ అర్జునా! పరమాత్మ అయిన నేనున్నూ, జీవుడైన నీవున్నూ, భూత, వర్తమాన, భవిష్యత్ కాలము

లందు ఉండిన, ఉన్న, ఉండబోవు తత్త్వములే. ఆత్మ, పరమాత్మ త్రికాలాబాధ్యమైన తత్వము లనుట యీశ్లోకమందలి అభిప్రాయము.

ప్రతిమానవునికి, శరీరము, ఆత్మ యున్నదని మనము ఆరంభమున విశ్వసింతము. కాలక్రమమున అది యుక్తి యుక్తమని గోచర మగును. ఈ విషయమై పై శ్లోకములలో విపులముగా తెలియనగును. "ఓ అర్జునా! పరమాత్మమైన నేను, జీవాత్మయైన నీవు, ఒకప్పుడు యుండియు యుండలేదను సమయములేదు. There was never a time, when I, the Supreme Soul and you, the individual soul were not existing. (Here two negatives are used to bring out the full force) బ్రహ్మాండము నడుపు పెద్ద చైతన్యము పరమాత్మ; ఆత్మకు, పరమాత్మకు నిప్పుకణికకు నిప్పురాశికి, చక్కెరకు చక్కెరకొండకు, యెట్టి సంబంధమో అట్టి సంబంధముకలదు. వర్తమాన కాలమందు, పరమాత్మమైన నేను, జీవాత్మయైన నీవున్నూ ఉన్నారము. భవిష్యత్ కాలమందుగూడ నుండగలము. I, the Supreme Soul, and you, the individual soul are existing now, and there will never be a time when we will cease to exist. ఆత్మ, పరమాత్మ మూడుకాలములయందు శాశ్వతముగా నుండు తత్త్వములు."

అద్వైతము:— వీరి సిద్ధాంతప్రకారము పరమాత్మకు జీవాత్మకు పారమార్థికదశలో భేదములేదు. When they go beyond time, space and causation, the soul and

God are the same i. e. they become merged with one another. When we speak from the standpoint of time, space, and causation they are separate entities. విశిష్టాద్వైతులకు, ద్వైతులకు, శైవులకు - వీరందరికి పరమాత్మ వేరు. మరియొక భేద మేమన—అద్వైతసిద్ధాంత ప్రకారము—ఈ ప్రపంచమంతయు స్వప్నముమాదిరి లేనిది ఉన్నట్లు కనపడుచున్నది. నామరూపములతో కూడిన జడ ప్రకృతి మిథ్య. The world has only a phenomenal existence. బ్రహ్మవస్తు వొక్కటియే సత్యము; జగత్తుమిథ్య. అయితే పరబ్రహ్మము-అనాది, అనంతము; ప్రకృతి అనాదియే కాని సాంతము. బ్రహ్మవస్తు వొక్కటియే అనాదియు, శాశ్వతమైనట్టిదియు అయి యున్నది. విశిష్టాద్వైత, ద్వైత సిద్ధాంతముల ప్రకారము, పరమాత్మ, జీవాత్మ, ప్రకృతి—మూడు వేరువేరు శాశ్వతములైన ప్రత్యేక తత్త్వములు. They are three separate and eternal entities. 1 పరమాత్మ. (శ్రీమన్నారాయణుడు) 2 ప్రకృతి, 3 జీవాత్మ—మూడు అనాది అనంతము లైనవి. జడప్రకృతియొక్క నామరూపములు మారుచున్నవే గాని వస్తువు ఒక్కటియే. అద్వైతులకు యితరసిద్ధాంతముల వారికి గూడ వ్యావహారిక దశలోఆత్మయుపరమాత్మయు వేరువేరువస్తువులు. అన్ని సిద్ధాంతములవారికి మెట్లొకటియే. viz. వర్ణాశ్రమ ధర్మప్రకారము నడచుకొనుట, సత్ప్రవర్తన. కాని మేడ యెక్కిన తరువాత (అనగా అజ్ఞానము నశించిన తరువాత) మేడపై నుండు వస్తువు ఒకటియా ఒకటిన్నరయా లేక రెండా యని స్వల్ప భేదాభిప్రా

యములు మాత్రము యీ సిద్ధాంతములయందు గలవు. అద్వైతులు మాయ నశించిన పిమ్మట జీవుడు జీవత్వమును పోగొట్టుకొని పరమాత్మగా నగుచున్నా డనెదరు. జీవుడు ముక్తిదశలో పరమాత్మమాదిరిగ నగుచున్నా డనుట విశిష్టాద్వైతము. జీవుడు వైకుంఠమునకు వెళ్ళి, పరమాత్మకు సమీపమున నుండి, ఆయనకు నెల్లప్పుడు సేవజేయుచు, ఆయన అపారకరుణకు పాత్రుడై బ్రహ్మానందము అనుభవించు ననుట ద్వైతము. స్వల్పభేదముల పాటించి యొకరికంటె యొక రెక్కువ యని పోట్లాడుకొనుట పొరబాటు.

శ్లో॥ 13. శరీరమును మించిన ఆత్మ ఒకటి కలదని తనకు తెలుపవలసినదిగా అర్జునుడు కోరెను. శరీరము వేరు, ఆత్మ వే రనుటకు యీశ్లోకమునందు దృష్టాంత మివ్వబడినది. ఆత్మ నాశనము లేనిది. జ్ఞానముతో కూడుకొన్నది. ఆనందమయ మైనది. శరీర మన్ననో అజ్ఞానముతో కప్పబడినది. దుఃఖ భూయిష్ఠమైనది. నశించునది. కొన్ని యుదాహరణములు తీసుకొనిన మనకు వీటియందలి తారతమ్యము విశదపడగలదు.

(1) మానవశరీరమునకు అవస్థలు అయిదు, అవి యేవనగా:— 1 శైశవము; 2 బాల్యము; 3 కౌమారము; 4 యౌవనము; 5 వార్ధక్యము. దశలు మారినను వ్యక్తి నశించుటలేదు. దశలతో గూడిన శరీరము పోయినను 'నేను' అను వస్తువు నశించుటలేదు. అది మరియొక స్థూలశరీరమందు కర్మను అనుసరించిపోయి ప్రవేశించుచున్నది. మరియు, రూపలక్షణ

ములు మారిపోయినను మనము పూర్వపరిచయము కలవారిని గుర్తుపట్టుచున్నాము. ప్రతినిముసము శరీరము మారిపోవు చున్నది. ఏడుసంవత్సరముల కొకసారి మన శరీరమందలి యెముకలుకూడ మారిపోవుచున్న వని వైద్యశాస్త్రము చెప్పు చున్నది. మార్పు గొప్పదైనగాని మన స్థూలదృష్టికి గోచ రముకాదు. క్షురకర్మ చేయించుకొనిన మరుక్షణమునుండియే రోమములు మొలకెత్తుచున్నను కొన్నిదినములు గడచిన గాని, పెరిగినట్లు మనకు తెలియుటలేదు. ఆ రోమములు అమాంతముగా మొలచుటలేదు. అట్లే మన శరీరము ప్రతి నిముసము మార్పు చెందుచున్నను మనము మనుష్యుల గుర్తు పట్టుచున్నాము. గనుక శరీరము ముఖ్యముకాదు. మనస్సును పట్టి గుర్తుపట్టలేము. అది గ్రంథావలోకన వలన, ప్రపంచ పర్యటనవలన, జ్ఞానసంపదవలన మారిపోవుచున్నది. గనుక దేనిని బట్టి మనము మనుష్యుల గుర్తించుట ? అనగా—గుర్తించు టకు శరీరముగాని, మనస్సుగాని ప్రధానములుకావు. ఈస్థూల సూక్ష్మశరీరముల అధిష్ఠించియుండు నిర్వికారతత్వము 'నేను' అను చైతన్య మొకటిగలదు. అదియే ఆత్మ. ఆ ఆత్మ, శరీరము భిన్నములు. మార్పు గోచర మగుటకు మారనివస్తు వొకటి యుండి తీరవలయును.

(2) మఱియొక నిదర్శనము—నాటకరంగముపైకి అనేక పాత్రధారులు వచ్చి, వారివారి పాత్రల నటించి నాటకము పరిసమాప్తి చేయుచున్నారు. పాత్రలు మారుచున్నవే గాని, రంగస్థలము మారుటలేదు. In other words, the whole

world is transient and everchanging, but there is one entity who is able to perceive and take cognizance of the fact that it is everchanging. That entity is above change and that is the Spirit. ఈ ప్రపంచము అశాశ్వతము, నిమిష నిమిషమునకు మార్పు చెందుచున్నది. ఈ మార్పులను గమనించెడి నిశ్చలము, నిర్వికార మైనట్టి తత్త్వమొకటి కలదు - పరమాత్మ.

(3) 'షష్ఠీవ్యపదేశాత్' అను సాంఖ్యసూత్రము కపిలమహర్షి యుదాహరణగా నిచ్చియున్నాడు. షష్ఠీవిభక్తి (కి, కు, యొక్క, లో, లోపల) ఉపయోగించుటవల్ల, పొందబడు వస్తువు, పొందువాడు వేరు వేరని తెలియుచున్నది. The Possessor is always distinct from the thing possessed. "నా యిల్లు" "నాసొమ్ము" "నాతల" "నాకాలు" అని చెప్పుచున్నప్పుడు, ఆయావస్తువులు, అంగములకంటె, "నేను" అనునది విలక్షణమని స్పష్టపడుచున్నది. 'నా తల' యని చెప్పుటలో నాకు సంబంధించిన తలగాని, తలయే నేనుగాదు. అట్లే యితరములు. కాని నా 'ఆత్మ' అని చెప్పునపుడు అది appositional force లో ఉపయోగించబడుచున్నది. e.g, the city of London (లండన్ పట్టణము) అనుటలో లండన్ వేరు, పట్టణము వేరు కాదు. దీనినిబట్టి కూడ శరీరము వేరు, ఆత్మ వేరని తెలియుచున్నది. నాది ఫలానిజిల్లా, ఫలానితాలూకా, ఫలాని గ్రామమని చెప్పుటలో వాటిలో నెద్దియు నేనుకాదు. నాయిల్లు అనుటలో, యిల్లు, నేను ఒకటికాదు. ఇంకాకొంచెము లోతునకు

పోయిన, నాతల, నాముక్కు, నాకడుపు అనునపుడు నేను, తల ముక్కు- కడుపు, ఒకటికాదు. అవి నాకు సంబంధించినవి. మనుష్యుడు, అతని కాలు ఒకటి అయిన ట్లయితే, మనుష్యుని కాలు (amputate) నరకినను అతడు బ్రతుకుచున్నాడు. గనుక 'నేను' అనునది వేరు. 'నా బుద్ధి పాడయిపోయిన. దనుటలో, నేను బుద్ధికాదు. బుద్ధి నాయది. I am something distinct from the physical and mental bodies. శరీరమును గుప్పిట నుంచుకొని, దాని నధిష్ఠించి యుండునది ఆత్మ. సాక్రెటీస్ యెట్లు గొప్ప జ్ఞానియైనాడనగా, అతడు గొప్పవారి దగ్గరకు వెళ్ళి ప్రతి యింద్రియమును చూపి, "నీవు; యింద్రియములు ఒకటేనా" అని ప్రశ్నించి, విచారణవల్ల యీ స్థూలసూక్ష్మశరీరముల కన్న భిన్నమైనది, ఆత్మ యని తెలిసికొనియెను.

(4) మరియొక దృష్టాంతము. ఒక్కొక్క మనుజుని యొక్క రాగద్వేషములు అతని సహజ స్వభావమును వెలి బుచ్చుచున్నవి. e.g. చేపను నీటిలో నుండి తీసికొనివచ్చి నవ రత్న ఖచితమైనట్టియు, స్వర్ణమయమైనట్టియు సింహాసనముపై కూర్చుండపెట్టినను అది తత్తరపాటుచెంది నీళ్ళలోపోయి చేర వలయునని కోరుచున్నది. దానికి భూలోకసంబంధమైన వైభ వము యెంత గొప్పదియైనను రుచింపదు. నీళ్ళలో నుండుట దాని జన్మహక్కు. అందుచేత నది తన స్వస్థానమైన నీటి లోనికిపోయి చేరవలయు నని కోరుచున్నది. జీవులు చచ్చుటకు యిష్టపడరు. చచ్చుట వారికి యిష్టము లేకపోవుటనుబట్టిచచ్చు

టయే స్వభావముగా కలిగిన శరీరమునకు చావు ఏల కష్టము కలిగించును? చావు స్వభావముగా కలిగిన శరీరము నీవు కాదు, శాశ్వతమైన ఆత్మతత్వము నీవు గనుక. శరీరధర్మమైన చావు నీకు రుచించదు. అందువలన 'సత్' వస్తువు మనయందున్నది. జ్ఞానము 'చిత్' నీ నిజస్వరూపము. నీ నిజస్వరూపము "సత్, చిత్, ఆనందము" సచ్చిదానందము. శరీరము నీవే అయినచో శరీరము దుఃఖభూయిష్ఠమైనది. శరీరము నీవుకాదు. నీవు సచ్చిదానందరూపివైన ఆత్మవని తెలిసికొనుము. అది శరీరముకన్న వేరు. అదియే ఆత్మయని దృఢపడుచున్నది.

శంకరులవారు యీ సందర్భములో 'జ్ఞేయము' 'జ్ఞాత' అను దృష్టాంత మిచ్చియున్నారు. 1 జ్ఞేయము - అనగా object to be known మనము తెలిసికొను వస్తువులు. 2 జ్ఞాత తెలిసికొనువాడు. (Knower) 3 జ్ఞానము - Knowledge- తెలిసికొనుట. మనము తెలిసికొను వస్తువులలో, తెలివిలో మార్పు లుండవచ్చునుగాని, తెలిసికొనువాడు మారుటలేదు. There may be changes in the objects perceived or in knowledge, but the Knower is eternal. That real knower is the Spirit.) ఆ తెలిసికొనువాడు (జ్ఞాత) ఆత్మ. (5) పాశ్చాత్యసిద్ధాంతమందలి కొన్ని యుదాహరణముల గమనించనగును. జార్జి బార్క్లే (George Barkeley) అనునాతడీ ప్రపంచమంతయు ఒక కలమాదిరి యనియు, అందు చూచు వస్తువులన్నియు అశాశ్వతము లనియు, ఎవనికి ఆ వస్తువులు స్వాప్నిక ప్రపంచములో గోచరమగునో వాడొక్కడు స్థిరముగా

నుండవలెననియు, వాడే పరమాత్మ యనియు, స్వప్నములో కన పడు వస్తువులు జడప్రకృతి, జీవాత్మలనియు వ్రాసియున్నాడు. God is the dreamer, the individual souls and all the material objects are like the things dreamt of; according to him, they are unreal; the moment you are awake, they all vanish. But the person that was dreaming exists. That dreamer is God.

డేకార్టీస్ అను యింకొక తత్వవేత్త 'నేను ఆలోచించు చున్నాను; అందుచేత నే నున్నాను. నే నాలోచించునట్టి విషయములోను, ఆ ఆలోచనలో మార్పుండవచ్చును. కాని ఆలోచించువాడు మార్పుచెందుటలేదు. వాడే ఆత్మ' అని వ్రాసియున్నాడు. Descartes in his 'Methods and Meditations' said 'cogito ergosam-' i.e. I think, therefore I exist. Its meaning is the things thought of and our thoughts may vanish but the thinker is real and he is the spirit. Therefore the body and spirit are different . entities. The body perishes. The spirit does not die with the body. It assumes another shape and is eternal. శరీరము నశించుచున్నది. కాని ఆత్మకు నాశములేదు. శరీరము చాలించిన పిదప అది వేరొక శరీరమందు ప్రవేశించుచున్నది. గనుక శరీరము వేరు, ఆత్మ వేరు అని తెలియనగును.

(శ్లో 14) ఓ అర్జునా! నీకు నేను గొప్ప సుఖము కలుగ జేయవలయునని జ్ఞానబోధ చేయుచుండగా నీవు పొరబడు చున్నావు. ఏది సరియైన సుఖమో, యేదికాదో నీవు గ్రహింప జాలకున్నావు. ఇంద్రియస్పర్శవలన కలుగు సుఖదుఃఖములు ఆయా వస్తువులలోనివి కావు. ఆ సుఖదుఃఖములు మన మనస్సుకు సంబంధించినవి. ఏలనన ఒకనికి సుఖము కలి గించు పదార్థము మరియొకనికి కష్టము కలిగించుచున్నది. One man's food is another man's poison. e. g. ఆంధ్రులకు నెయ్యి కడు రుచ్యము, ముఖ్యము. బర్మా దేశస్థు లకు దాని వాసనయే గిట్టదు. వారికి 'నఫీ' అనగా భూమిలో పాతిపెట్టి నిలువవుంచిన నానారకముల మాంసము బహు రుచ్యము, శ్రేష్ఠమై యొప్పుచున్నది. అయ్యది మనకు పరమ అసహ్యము. ఒక మనుష్యునకు ఒకే పదార్థము ఒక స్థితి యందు లేక ఒక కాలమందు సుఖమును, మరియొకచో దుఃఖ మును గలిగించుచున్నది. e. g. చిన్నతనములో టపాకాయలు కాల్చుట, చెడుగుడు సంతోషము గలుగజేయును. పెత్తన ములో అయ్యవి ప్రాణసంకటము. యౌవనమందు రూప వతు లగు స్త్రీల జూచిన పురుషులకు, అట్లే పురుషుల జూచిన స్త్రీలకు కామోద్రేకము గలుగుచున్నది. కాని వైరాగ్యపరాకాష్ఠ వచ్చిన పిదప అట్టి వ్యామోహము నశించుచున్నది. 'కుణప మివ చ నారీ త్యక్తకామో విరాగీ' యని యుత్తరగీతలో చెప్పబడినది. అనగా వైరాగ్యము పొందినవా డెంత అందమైన స్త్రీ వచ్చినను ఆమెను పీనుగ

మాదిరిగా, అశుద్ధమైన వస్తువుగాఁ జూచుచున్నాడు. మరియు, చలికాలమందు అత్యవసరమైన వేడినీరు, మండు వేసంగిలో కష్టము కలిగించును. విషము కొన్ని సమయములలో ప్రాణము తీయును. మరికొన్ని సమయములందు ప్రాణములు పోవువారిని మృత్యువుబారినుండి తప్పించుచున్నది. కాన సుఖదుఃఖములు మన మనస్సునుండి వెలువడుచున్నవి, "The mind can make a Heaven of Hell or a Hell of Heaven" కనుక శాశ్వతమైన సుఖము పొందుటకు అంతర్ముఖుడవై ఆత్మవిచారణ చేయుము.

ఇంకొకరు ఈ శ్లోకమును "ఇంద్రియములను మంచి విషయములతో చేర్చినందువలననే సుఖమా? చెడువిషయములతో చేర్చిన దుఃఖమా?" అను ప్రశ్నగా తీసుకొని దానికి ప్రత్యుత్తరము "కాదని" అర్థము చెప్పియున్నారు. ఇందుకు అద్వైత వ్యాఖ్యానకారుడు స్వపుత్రవిషయము నిదర్శనముగా ఇచ్చియున్నాడు. తండ్రి మంచి దుస్తులు వేసికొనియున్న సమయములో పరమ అశుద్ధస్థితిలో నున్న, అందవిహీనుడైన తనబిడ్డ యెదురువచ్చుటతోడనే యెత్తుకొని, తన గుడ్డలతో తుడిచి, "చుబుకు చుబుకు" అని ముద్దుపెట్టుకొనుచున్నాడు. 'నాది' అను మమకారమువలన అశుద్ధము,వికారము తోచుటలేదు. పరాయి బిడ్డడు ఎంత అందముగా నున్నను, ఆ తండ్రి వారల జూచి సంతోషించడు; పైపెచ్చు యెదిరింటిపిల్లవాడు, బుద్ధిమంతుడు, మంచి మార్కులు వచ్చినవని చెప్పుటతోడనే అది చావు

తెలివి అనియు, ఎదిరిపిల్లవాడు వఖ్ఖచేసినాడన్న అది రోగ మనియు అసూయాజనితములగు మాటలాడుచుండుట మానవ స్వభావము. My = మమ = మైన్ = నాది అను మమకారమే దీనికి కారణము. తన బిడ్డ దద్దమ్మ, పదిఏండ్లు వచ్చిన పిదప "అత్త, అమ్మ" అనినచో పంచదార పంచిపెట్టు తల్లిదండ్రు లున్నారు. మమకారమువలన వస్తువుల నిజస్వరూపము మనకు తెలియుటలేదు. ఉత్తరగీతలో ఒక మాట బంధము కలిగించు నని, ఒకమాట మోక్షమును గలిగించునని చెప్పబడియున్నది.

శ్లో॥ "ద్వే పదే బంధమోక్షాయ మమేతి నిర్మమేతి చ
మమేతి బధ్యతే జంతుః నిర్మమేతి విముచ్యతే."

అనగా మమకారమువలన బంధము, మమకార రాహిత్యమువలన మోక్షము కలుగును. అందువలన మమకారము నశించినగాని వస్తువులయొక్క నిజస్వరూపము తెలిసికొన జాలము. యమదూతలు వచ్చి ఒకప్రక్కన లాగుచున్నను, "నాయిల్లు, నా వాకిలి" అను మమకారము జీవుని ఆ వస్తువుల పైకి లాగుచున్నది. ఈ విశ్వము, శరీరము, హృదయము యావద్వస్తువులు భగవంతుని వని గుర్తెరిగిన మనకు దుఃఖము లేదని, శాశ్వతమైన సుఖము చెందనగునని చెప్పబడియున్నది.

శ్లో॥ "విశ్వం త్వదీయం, హృదయం త్వదీయమ్
మదీయ మేకం, శివపాదపద్మమ్."

అని విశ్వనాథాష్టకములో చెప్పబడియున్నది. దీని యర్థ మేమనగా, "హేవిశ్వనాథా! నాశరీరము, హృదయము లోను గాగల సమస్తములు నీయవి. నీపాదారవిందముల యందలి భక్తి నా కనుగ్రహింపుము."

తాయిమానవరు అను ద్రవిడభక్తు డిట్లు చెప్పి యున్నాడు. "ఎల్లాంవుర్ అడిమయే, ఎల్లాంవుర్ వుడైమయే. ఎల్లాం వునదు సేయిలే" అనగా అందరును నీసొత్తు, అందరు చేయు వ్యాపారములకు నీవే కారణము. అంతా నీ బానిసలు అని తెలిసికొనిన మనము బాగుపడెదము. దురభిమానగ్రస్తులమై నా యిల్లు, నా వాకిలి, నాభార్యబిడ్డలు అనుకొనరాదు. అందువలన జీవుడు పోక, కొట్టుకొనునప్పుడు వారికి ఏ వస్తువు నందు వ్యామోహమో దానిని కడిగి, కడిగిన నీరు నోటిలో పోయుచున్నారు. ఈప్రపంచములో జన్మించినపుడు మనము వెంటనేమియు తీసికొని రాలేదు. పోవునపుడు తీసికొని పోజాలము. కనుక "నేను, నాది" యనుటకు బదులుగా భగవంతునివైపు తిరిగి, అంతా "నీవు" అంతయు "నీది" అనుచు ఆయనను భజించిన సర్వసుఖములు కలుగును. "Naked thou art born and naked thou shalt return. All this is not mine but thine or yours—"Bible. భూదేవి అన్నదమ్ములు కలహించి తనను పంచుకొనునపుడు వారల జూచి "యెంతకాలము వీరు నన్ను కట్టిపెట్టుకొని యుండెదరో చూచెద"నని నవ్వుచున్నది. వామనచరిత్ర (భాగవతము)

యందు బలిచక్రవర్తి "కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిన్ బొందరే । వారేరీ సిరిమూటగట్టుకొని పోవం జాలిరే" అని చెప్పియున్నాడు. మరియు, వైద్యులు తాము రోగులకు మందు యిచ్చునపుడు నద్దాని గుణగణముల బొగడి ఆరోగ్యము తప్పక కలుగునని చెప్పునపుడు భగవంతుడు వారల జూచి "నేను మరుక్షణములో మృత్యుదేవతగా రాబోవు చుండగా, ఈ వైద్యుడు కాపాడగలడా" అని నవ్వుచున్నాడు.

అహంకార మమకారములకు మించిన శత్రువులు జీవునకు వేరొండులేవు.

కనుక "ఓ అర్జునా ! మా తాత, మా గురువు, మా బంధువులు" అను మమకారము నిన్ను పీడించుచున్నది. నీవు దుఃఖపడుట వారు జ్ఞానులగుటవలనను, వయోవృద్ధు లగుటవల నను గాదు. మమకారము పరిత్యజించిన నీకు ధర్మము గోచర మగును. ప్రపంచమందలి సుఖదుఃఖముల సమముగా భావిం పుము. అయ్యవి అశాశ్వతములైనవి. శాశ్వతమైన సుఖము ఆత్మవిచారణవలననే పొందనగును" అని కృష్ణుడు చెప్పెను.

(శ్లో॥ 15) ఎవడైతే సుఖదుఃఖముల సమముగా తీసికొని నిర్వికారముగా నుండునో వానికి మోక్షము కలుగు చున్నది.

A man should never lose his balance of mind. He should not be elated by success or depressed by sorrow- Then only he can attain Moksha.

సుఖదుఃఖముల సమముగా భావించు టనగా అర్థమేమి? సుఖమును దుఃఖముగా భావించవలయునా? లేక దుఃఖమును సుఖముగా భావించవలయునా? అద్వైత సిద్ధాంత ప్రకారము ప్రాపంచిక సుఖము అస్థిరము గనుక నద్దానిని దుఃఖముమాదిరిగా పరిత్యజించవలెను. విశిష్టాద్వైత, ద్వైత సిద్ధాంతముల ప్రకారము ప్రపంచమంతయు శ్రీమన్నారాయణుని ఆలయమగుటచే, ఆయన యే సమయములయందు ఏది ప్రసాదించినను దానిని విసుగుకొనక అనుభవించి తీరవలయును. అద్వైత సిద్ధాంతములో సుఖమును దుఃఖము మాదిరిగా భావించి పరిత్యజించవలయు ననుట—ఇది జ్ఞానమార్గము. మిగతా రెండు సిద్ధాంతములయందు దుఃఖములను కూడా సుఖముమాదిరిగా శ్రీమన్నారాయణ ప్రసాద మని సంతోషముగా స్వీకరించి అనుభవించవలెను. మనము దేవాలయమునకు వెళ్ళినపుడు కట్టెపొంగలి పెట్టినను; చక్కెరపొంగలి యిచ్చినను, పరమాత్మ ప్రసాదమని కండ్లకు అద్దుకొని భుజించవలయును—యిది భక్తి మార్గము. ఈ సిద్ధాంతముల యందలి తారతమ్యము కొన్ని ఉదాహరణము లిచ్చినగాని మనస్సుకు పట్టదు.

మొదట అద్వైతసిద్ధాంతము తీసుకొందము. ప్రాపంచిక వస్తువులయందు సుఖము ఒకపాలు, దుఃఖము తొంబై తొమ్మిదిపాళ్ళు (e. g) ధనము వచ్చినపుడు సంతోషమే కాని వచ్చినది మొదలు మనకు అనేక విధముల తాపత్రయము కలుగుచున్నది.

"అర్థానా మార్జనే దుఃఖం । ఆర్జితానాంచ రక్షణే ।
నాశే దుఃఖం, వ్యయే దుఃఖం । కిమర్థం దుఃఖభాజనమ్."

అనగా ద్రవ్యము సంపాదించుట ఒక కష్టము. కాపాడుట మరియొకకష్టము. ఎక్కువ ఖర్చుపెట్టుట కష్టమే; ఎవరైనా దొంగిలించిన కష్టము. అన్నివిధముల కష్టము కలిగించు ద్రవ్యము యేమి ప్రయోజనము? మఱియు ఇంకొక ఉదాహరణము. వివాహమైనపుడు పల్లకిలో కూర్చుండబెట్టి యూరేగునపుడు చాలా కులాసాగా నున్నను, సంసారభారము పైబడ్డతరువాత అనేక కష్టములు కలుగుచున్నవి. (Marry in haste and repent at leisure) త్వరపడి పెండ్లి చేసుకొని అటుపైన సావకాశముగ పశ్చాత్తాపపడవలయును అని చెప్పబడినది. ప్రపంచమంతయు తూకమువేసినను దుఃఖభూయిష్ఠముగా గన్పట్టుచున్నది. The whole world weighed in the balance is found wanting. ప్రాపంచిక సుఖము పయోముఖవిషకుంభము. అందువలన జ్ఞానులు, బుద్ధిశాలురు అద్దానిని కోరరు గనుక జ్ఞానమార్గములో నున్నవారు దుఃఖముల నే రీతిగా వదలిపెట్టెదరో, అట్లే ప్రాపంచిక సుఖమును త్యజించి బ్రహ్మవిచారణవలననే శాశ్వతసుఖము కలుగునని దానిని అనుష్ఠించెదరు. ఇయ్యది అద్వైతసిద్ధాంతము.

రామానుజ మధ్వాచారులవారిది భక్తిమార్గము. ప్రపంచమందు దుఃఖముకూడ నీమంచి కొరకే కలుగుచున్నది.

అది యీ శరీరమందు, ప్రపంచమందు మనకు అభిమానమును తగ్గించి దృష్టి పరమాత్మయందు నిలుపుటకు అవకాశ మిచ్చుచున్నది. గనుక దుఃఖము వచ్చినను విసువుకొనక దానినీ జీవుడు అనుభవించవలెను. (e. g.) పిల్లలను పంతుళ్లుకొట్టుట వారివారి మంచికొరకేగదా? వారి కది తాత్కాలిక దుఃఖము కలిగించుచున్నను, ఉత్తరోత్తరసుఖము కలిగించుచున్నది. We are all moustched babies —— మన మందరము మీసాలువచ్చిన పిల్లలవంటివారము. "You must be trained in the school of adversity before you obtain the Divine Grace" (Swami Vivekananda) భగవంతుని అనుగ్రహము బడయుటకు పూర్వము కొన్నికష్టముల అనుభవించితీరవలయునని వివేకానందస్వామి చెప్పియున్నాడు. ఇనుమును నిప్పులో వేసి కాల్చినగాని అది సాగి సమ్మెటకు లొంగదు. "Sweet are uses of adversity" దుఃఖమువల్ల ప్రాపంచిక వస్తువులయందు విరక్తి పరమాత్మయందు భక్తి కుదురుచున్నది. భారతమందలి శ్లోక మొకటి యిచట చెప్పనగును. కృష్ణుడు భారతయుద్ధమైన తరువాత కుంతిదేవిదగ్గరకు వెళ్ళి తాను సెలవు తీసుకొనుచు, యింకేమి కావలయునో వరము కోరుకొమ్మనగా ఆమె తనకు యెల్లప్పుడు కష్టము కలుగునట్లు వరమివ్వవలసిన దని కోరుచు నిట్లు చెప్పెను.

శ్లో॥ విపదోనైవ విపదః సంపదోనైవ సంపదః
ఆప ద్విస్మరణం విష్ణోః సంపత్తస్యైవ సంస్మృతిః॥

అనగా ప్రపంచములో నేదివిపత్తు అనుకొనుచున్నామో అది విపత్తుకాదు. ఏది సంపద యనుకొనుచున్నామో అది సంపదకాదు. లౌకిక ఆపద ఈశ్వరుని జ్ఞాపకపరచుకొనుటకు కారణభూతముగా నుండుటవలన నదియే వాంఛనీయము. అదియే నిజమైన సంపద; లౌకిక సంపద ఈశ్వరుని మరచిపోవుటకు కారణభూత మగుటచే నదియే విపత్తుగా భావింపవలయును అని యిందలిభావము. కనుక సుఖమువచ్చినను దుఃఖమువచ్చినను, సమముగా మానవులు స్వీకరింపవలయును. మరియు పరమాత్మ భవరోగమునకు వైద్యుడు. మనరోగము కనిపెట్టి మందిచ్చు వైద్యుడు రోగి కోరినట్లు తియ్యనిమందు నివ్వడు. అట్లే పరమాత్మ యెవరికి నెంత యివ్వతగునో అంత యిచ్చుచున్నాడు. ఇచ్చినదానితో సంతోషించి యివ్వనిదానికై దుఃఖపడరాదు. తల్లి పిల్లలకు కోరినదెల్ల పెట్టినయెడల అజీర్ణము కలుగును. కనుక భగవంతు డిచ్చు కష్టసుఖముల నిర్వికారముగా సమముగా స్వీకరింపుము. ఇది భక్తిమార్గము.

ఈ రెండు మార్గములలో యేది మంచిదని విచారించుటలో కాలము వృథాపుచ్చక కార్యరంగమందు దిగి మానవుడు ఏదో యొకమార్గము అవలంబించవలయును.

(శ్లో॥ 16.) ఓ అర్జునా! ఆత్మ సద్వస్తువు, అనాత్మ (శరీరము) అసద్వస్తు వని తత్వజ్ఞానులు నిర్ణయించియున్నారు.

సద్వస్తువు - ఆత్మ - అనాది, అనంతము; అట్లే పరమాత్మ అనాది, అనంతము; ఘటపటాది ప్రపంచము నామరూపములతో కూడినట్టిది, ఒకప్పుడు పుట్టినది, నశించునది గనుక యిది అసద్వస్తువని పరమాత్మ చెప్పెను. ఇది నీ కెట్లు తెలియును అని అర్జునుడు అడుగగా యిది అంతయు తన స్వకపోలకల్పితముకాదనియు, తత్వవేత్తలమాటలను శిరసావహించి ప్రమాణపురస్సరముగా తాను చెప్పుచున్నానని తెలిపెను. శ్రీకృష్ణుడు మూడులోకములకు నియామకుడైనను వినయతతో యిట్లు చెప్పుటను బట్టి మనము గ్రహింపవలసినది యేమనగా-తనబుద్ధి, తన అంతర్వాణి ప్రమాణ మని చెప్పువారలను మనము విశ్వసించక, వేదశాస్త్ర పురాణములను ప్రమాణములుగా నుంచుకొని యుపదేశించువారి మాటల నమ్మిన బాగుపడుదుము.

ఈ శ్లోకము [శ్లో॥ 16] అద్వైత సిద్ధాంతమునకు పట్టుగొమ్మ. సత్ అనగా ఆది,అంతము లేనిది,శాశ్వతమైనది. అసత్ అనగా ఆద్యంతములు కలిగినది. మరియు సద్వస్తువులకు నామరూపములు లేవు. అసద్వస్తువులకు నామరూపము లున్నవి. అద్వైత సిద్ధాంతము ఏమనగా—ఈ పాంచభౌతిక శరీరము [ఘటపటాది ప్రపంచము] ఇదివరలో లేదు, ముందుండబోదు. ప్రస్తుతము వున్నట్లే తోచుచున్నను నిశ్చయముగా లేదు. "ఆదా వంతేచ యన్నాస్తి వర్తమానేపి తత్తథా" అని అద్వైతకారికలో నున్నది.

That which was not existing some time ago, that which ceases to exist sometime hence, is as good as non-existent. The world appears to exist, but its existence is only dream-like. The Brahman alone is real and eternal. The world is un-real like the water in a mirage, or a snake in a rope, or silver in a mother of pearl. If a man's father is a mala, and his son is a mala, that man also must be a mala. So also this world was not existing in the past, it will not exist in future, and hence it follows that it is not existing at present, except as a dream.

ఇంతవరకు ఉండనట్టి, యీ ప్రపంచము ముందుండబోదు. కనుక యిప్పుడును లేదు. కాని స్వప్నము మాదిరి లేని వస్తువులు వున్నట్లు మనకు కనపట్టుచున్నవి. (e.g.) ఎండమావులలోని నీరుమాదిరి, ముత్యపుచిప్పలలోని వెండిమాదిరి, రజ్జుసర్పభ్రాంతిమాదిరి. బ్రహ్మవస్తువు ఒకటిమాత్రమే శాశ్వతమైనది; నిజమైనది. ఒక మనుజుని తండ్రి మాలవాడు, కుమారుడు మాలవాడైనచో, వాడు మాలవాడని వేరే చెప్పవలయునా? అదేరీతిగా యిదివరకు లేనట్టి, ముం దుండబోనట్టి యీ ప్రపంచము యిపుడుకూడ లేదని వేరే చెప్పనక్కరలేదని అద్వైతులభావము. ద్వైత విశిష్టాద్వైతసిద్ధాంతములలో ప్రకృతి (matter), ఆత్మ, పరమాత్మ అన్నియు శాశ్వత తత్వములు. జడప్రకృతియొక్క నామరూపములు మారుచున్నవి గాని, వస్తువు మారుటలేదు. బంగారమును ఒడ్డాణముగా చేసినను, డైమండ్ గొలుసుగా జేసినను బంగా

రము మాత్రము ఒకటియే. ఆత్మ జ్ఞానసంకోచవికాసముల వలన మార్పుచెందినను అసలు ఆత్మ వస్తువుకు మార్పు లేదు. పరమాత్మ నిర్వికారుడు.

ఈ విశ్వమంతయు వ్యాపించియున్న మహాపదార్థము బ్రహ్మవస్తువు నాశరహితమైన దని తెలిసికొనుము. అట్లే ఈ ఆత్మవస్తువునుగూడ నాశనము చేయువా డెవ్వడు లేడని అర్జునునకు పరమాత్మ చెప్పియున్నాడు. (శ్లో॥ 17)

Know that He who pervades the universe, and the soul which influences this body are both indestructible. No power on earth or heaven can destroy Him who destroys everything.

శరీరములు రెండువిధములు. స్థూలశరీరము, సూక్ష్మశరీరము (లింగశరీరము). అద్వైతసిద్ధాంతప్రకారము కారణశరీరమే మూలప్రకృతి. అదికూడ నశించునది గనుక దానిని గూడ శరీరముగా తీసికొనినారు. ఈ మూడురకముల శరీరములు నశించినను శరీరి (ఆత్మ) కి నాశనము లేదని ఆత్మ నిత్యమని చెప్పబడుచున్నది. మరియు. ఆత్మ తర్కశాస్త్రమందలి ప్రత్యక్ష, అనుమాన, శబ్ద, అర్థాపత్తి ప్రమాణములన్నిటికి అతీతమైనది. అట్టి ఆత్మజ్ఞానము చెందుటకు స్వధర్మానుష్ఠాన మవసరము గనుక ఓ అర్జునా ! లెమ్ము ! నీ స్వధర్మానుష్ఠానము చేయుము. అనగా యుద్ధముచేయుము అని కృష్ణుడు (శ్లో॥18) చెప్పియున్నాడు.

మరియు ఆత్మ యింకొక ఆత్మను చంపునదికాదు. చంపబడునదికాదు. అట్లు అనుకొనువారు మూఢులు. శరీర

ధర్మములను ఆత్మయం దారోపించుట మూఢత్వము. (శ్లో॥19) షడ్భావవికారములు శరీరమునకు సంబంధించినవేగాని, ఆత్మకు సంబంధించినవిగావు. ఆ వికారములు ఏవనగా;—(1) అస్తి = తల్లి గర్భములో కొంత కాలముండుట. (2) జాయతే = పుట్టుట. (3) వర్ధతే = పెరుగుట (4) పరిణమతే = శైశవము, బాల్యము, కౌమారము, యౌవనము, వార్ధకము, ఒకదశనుండి మరియొకదశకు మారుట. (5) క్షీయతే = తగ్గుట. (6) నశ్యతే = నశించుట, లేకపోవుట (శ్లో॥ 20) ఆత్మ పుట్టుకయు, నాశమును లేనిది. ఇది యొకరివలన చంపబడదు. ఒకరిని చంపదు. It is by its very nature eternal and indestructible (శ్లో॥ 21)

శరీరము నశించుట యెట్లు అను విషయము (శ్లో॥ 22) పరమాత్మ చెప్పుచున్నాడు. అర్జునా! ప్రాతగుడ్డలు వదలి క్రొత్తగుడ్డలు వేసికొన్నను, ఒక యింటిని వదలి వేరొక యింటిలో ప్రవేశించినను వ్యక్తి మారుటలేదు. అట్లే శరీరము నశించినను, దానితోబాటు ఆత్మ నశింపక, కర్మను అనుసరించి తిరిగి ఉత్తమ, మధ్యమాధమ శరీరములందు ప్రవేశించుచున్నది. కనుక యీ శరీరము పోవునని దుఃఖపడవలసిన అవసరము లేదు. ఈ శ్లోకమందు ఇచ్చిన ఉపమానము (ప్రాతగుడ్డలు వదలి నూతనవస్త్రముల ధరించుట) సరియైనది కాదని కొందరు ఆక్షేపించుచున్నారు. ఈ శరీరము నశించిన వెనుక ముందుజన్మలో రాబోవు శరీరము ఇంతకంటె మంచిదని యేమి నమ్మకమని ప్రశ్నించుచున్నారు.

దీనికి సమాధానము ఏమనగా ప్రతిజీవుడు నెన్ని జన్మములు ఎత్తవలసినది, వానికి తెలియకున్నను ఈశ్వరునికి తెలియును. కనుక యెన్ని జన్మములు కడచిన అంత శీఘ్రముగా గమ్యస్థానము చేరవచ్చును. (గమ్యస్థానము=పరమాత్మ) కొండ దిగుటలో భగవత్సాన్నిధ్యము నుండి పడిపోవుచున్నా మనుకొనుట పొరబాటు. ఆ దిగుటయే గమ్యస్థానమునకు త్వరలో చేర్చును. అదిగాక అర్జునుడు యుద్ధభూమియందు ఈ ప్రశ్నలు అడిగి యుండుటచే, యుద్ధరంగమందు ప్రాణములు కోల్పోయిన వారికి వీరస్వర్గము కలుగు నని చెప్పబడియుండుటచే రాబోవు జన్మను గురించి విచారపడవలసిన అవసరము లేదని మరియొక సమాధానము.

The sooner we get out of this mortal coil, how ever good and beneficial it may be, the better, because we would be nearing the goal - Paramathma.

పరమాత్మ మన గమ్యస్థానము. కొన్ని జన్మలు గడచిన గాని ఆయనను చేరజాలము. అందుచే ఈ పాంచభౌతికము అశాశ్వతము నగు శరీరము ఎంత త్వరలో వదలిన మన కంత మంచిది.

ఆత్మ అవికారి యనుట యెట్లు అను ప్రశ్నకు పరమాత్మ (శ్లో॥ 23; 24) సమాధానము చెప్పుచున్నాడు. ఆత్మను శస్త్రములతో ఛేదించుటకు వీలులేదు. నిప్పుతో దానిని కాల్చజాలము. నీటివలన తడపలేము. గాలివలన అయ్యది యిగురగొట్టబడదు. ఈ ఛేదనదహనాదులన్నియు శరీరమునకు సంబం

ధించినవే గాని ఆత్మకు అంటవు. ద్వైతసిద్ధాంతప్రకారము శ్రీమన్నారాయణుడు బింబస్థానము. ప్రకృతి అద్దము. జీవులు ప్రతిబింబస్థానము. పరమాత్మ ప్రకృతియు అనాద్యనంతము లగుటచేత పరమాత్మ ప్రతిబింబములైన జీవరాసు లన్నియు అనాద్యనంతము లగుచున్నవి. అందుచే ఛేదనభేదనాది వికారములు శరీరములకే గాని ఆత్మకు లేవు.

దీనికి కారణములు ఏవనగా:—

(1) ఆయుధములు, నిప్పు, నీరు ననునివి అన్నియు జడప్రకృతిలో చేరిన వస్తువు లగుటచే, జడప్రకృతిలో చేరిన వస్తువుల నశింపజేయునే గాని ప్రకృతికి అతీతమైన ఆత్మ వస్తువును నశింపజేయజాలవు.

(2) జీవాత్మ అణుస్వరూప మగుటచే దానిని శస్త్రములచే ఛేదించుట అసాధ్యము. ఏ ఆయుధము నుపయోగించెదమో దానికి చిక్కుపడు వస్తువునే ఛేదించునుగాని పట్టు చిక్కని వస్తువులను ఛేదించజాలదు.

(3) ఛేదించు వస్తువుకంటె, ఛేదింపబడు వస్తువు వెలుపల వేరుగా (as a different entity) నుండవలయును. పరమాత్మ సర్వాంతర్యామి అగుటచే శస్త్రములయందుకూడ నున్నందున ఆయనను ఆ శస్త్రములతో ఛేదించ నెట్లు వీలు పడును? వీలులేదు.

(4) ఒక వస్తువునకు నిప్పు అంటించవలయు నన్న దానియందు రగులుకొను స్వభావ ముండవలయును. నిప్పు

పిడకను అంటుకొనునేగాని, బూడిదను తగులబెట్టజాలదు. అట్లే అగ్నిచేత మార్పుచెందు స్వభావ మీ యాత్మకు లేదు.

(5) నీళ్ళలో తడిపినందువలన గుడ్డ నాని పిగిలి చినిగి పోవుచున్నది. దానియందు సూక్ష్మరంధ్రములు (fibrous pores) ఉన్నగాని నీటియొక్క గుణము (effect) కనబడదు. ఆత్మకు అట్టివి యేవియును లేవు. అందువల్ల నీటిచే ఆత్మను తడుపజాలము.

(6) గాలి తడిబట్టలోని తడిని లాగుచున్నది గాని, ఆత్మలో చెమ్మ (moisture) లేకపోవుటచేత దానిని యేమియు చేయజాలదు.

కనుక జీవాత్మ పరమాత్మలు ఛేదింపబడవు. తగుల బడవు, తడుపబడవు, ఇగుర్పబడవు. జీవాత్మ పరమాత్మలు శాశ్వతమైనవి. అన్నిటియందు నుండునవి. నిర్వికార మైనవి. చలనము లేనివి. అనాదిగా నుండునవి. (శ్లో॥ 24)

అలెగ్జాండరుచక్రవర్తి గ్రీకుభాషలో మనభగవద్గీత చదివి యుండెను. హిందూ దేశములో కామినీకాంచనములఁద్యజించిన, వైరాగ్యపరాకాష్ఠ కలిగిన మహానుభావులనుచూడ కుతూహల పడి, జీలము యుద్ధము అయిపోయిన పిదప అరణ్యమునకు వెళ్ళగా అచట నొక మహాపురుషుడు తపోనిష్ఠాగరిష్ఠుడై యుండ గాంచెను. ఆ తపస్విని చక్రవర్తి యెంత పలుకరించి నను పలుకలేదు. తాను చక్రవర్తిననియు రాజ్య మంతయు వప్పజెప్పెద నన్నను మారుపలుకలేదు. అందమైన పిల్లను ఇచ్చి వివాహము చేసెదనన్నను మాట్లాడలేదు. అంతట

తన ఒరలోనుండి కత్తినితీసి చంపెదనని చెప్పగా, ఆ తపస్వి చిరునగవుతో గీతయందలి (2 అ. 23 శ్లో) "నైనం ఛిందన్తి శస్త్రాణి" etc. అను శ్లోకమును చదివి 'నీవునన్ను చంపజాలవు' అని తెలుపగానే చక్రవర్తి పాదాక్రాంతుడై ఆయన తత్త్వజ్ఞానము గాంచి ఆశ్చర్యమందెను. అట్లే అతడు తన దేశములో నున్న డైయోజినిస్ (Diogenes in his Tub) దగ్గరకు వెళ్ళి నీకు యేమికావలయునో కోరుకొమ్మని అడుగగా, ఆ మహానుభావుడు, "నాపై సూర్యకిరణములు ప్రసరించకుండా నీవు అడ్డు నిల్చియున్నావు. అట్లు నిలువక నీవు వెళ్ళిపోవలయు నని కోరుచున్నాను." అని చెప్పెను. కనుక ఆత్మజ్ఞానము కలవారు ఎవరికిని భయపడరు. వారే విధమైన భయము చెందరు. వారికెట్టియాపద కలిగించ సాధ్యముకాదు.

మరియు ఆత్మ అవ్యక్తమైనట్టిది. అనగా బాహ్యేంద్రియములకు గోచరము కానట్టిది. అచింత్యము, అనగా మనస్సువల్ల నూహించుటకు వీలులేనిది. అవికారం = ఎట్టి విధమైన వికారము లేనిది. (i. e. unchangeable). The soul is said to be unperceivable, unimaginable and immutable. So there is no room for you to grieve for the soul. గనుక నీవు ఆత్మవిషయమై దుఃఖపడ నక్కఱలేదు. (శ్లో॥ 25).

శ్లో॥ 11 మొదలు 25 శ్లోకమువరకు ఆత్మ, శరీరములు భిన్నము లని చెప్పబడియున్నది. ఇంకొకపక్షము 26 వ శ్లోకమున చెప్పబడుచున్నది.

అర్జునా! ఒకవేళ నీవు శరీరము ఆత్మ రెండు ఒకటియే యని భావించినను, నీవు దుఃఖించిన ప్రయోజనము లేదు. సంయోగము ఎప్పుడు కలదో, అప్పుడు వియోగమును తప్పక కలుగును. పుట్టుట గిట్టుటకొరకే. చచ్చినవారికి తిరిగి మోక్షము వచ్చునంతవరకు జన్మము తప్పదు. "శరీరము" అను మాటకు వ్యుత్పత్త్యర్థము నశించుట. 'దేహము' అనగా దహింపబడునది. అద్దానిని శాశ్వతముగా నుండునట్లు చేయుట ఎవ్వరి తరము కాదు. భాగవతములో, "అద్యవాబ్దశతాంతేవా, ప్రాణినాం మరణం ధ్రువమ్" అని చెప్పబడినది. కనుక యీ శరీరమును గురించి దుఃఖపడిన నేమి ప్రయోజనము?

The body must perish; you cannot avoid the unavoidable or alter its course. Death is the inevitable goal, through which all of us must pass, whether we wish it or not.

ఈ శరీరము నశించక తప్పదు. దానిని తప్పించుట కెవ్వరికిని సాధ్యపడదు, చింతించిన యేమి లాభము? చచ్చిన పీనుగుచుట్టు చావబోయ్యే పీనుగులు ఏడ్చుచున్నవని, చనిపోయినవారికై దుఃఖపడువారల గురించి పట్టినత్తుపిళ్ళై యను ఒక తమిళభక్తుడు చెప్పియున్నాడు.

" One thing, and one thing alone, is certain in this world," said Swami Vivekananda viz, "death." Death alone is the inevitable goal. It is the best leveller. "ఈ ప్రపంచమున ఒక్కటిమాత్రము సత్యము. మన మెల్లరము మృత్యువువాత పడవలసినవారము. మృత్యువు

అందరిని సముల జేయును" అని వివేకానందస్వామి చెప్పి యున్నాడు.

చక్రివర్తులు, బీదవారు, విద్యావంతులు, నిరక్షర కుక్షులు, పెద్దలు, పిన్నలు, సుందరాకారులు, కురూపులు అందరు చనిపోవలసినవారలే. ప్రహ్లాదచరిత్రలో ప్రహ్లాదుడు తన తోడి దైత్యకుమారులతో నిట్లనియె.

"బాలకులార! రండు మనప్రియపుబాలురు గొంద ఱుర్విపైఁ
గూలుట కంటిరే........................"

చావు యెపుడు వచ్చునది ముందు తెలియదు. ఆ రహస్యము ఎటువంటి గొప్ప వైద్యులకు గూడ తెలియదు. భగవంతునికి ఒక్కనికి మాత్రమే తెలియును.

Gray in his "Elegy" said—

"The pomp of learning, the boast of heraldry
All that wealth or all that fame can give,
Await alike the inevitable hour,
The paths of glory lead us but to the grave,"

గ్రే అను ఒక సుప్రసిద్ధాంగ్లకవి పై చెప్పినట్లు వ్రాసి యున్నాడు. అందలి భావ మేమనగా, విద్యాధిక్యము, శూరత్వము, ధనమువలనను, కీర్తివలన వచ్చు ఔన్నత్యము అన్నియు చివరకు శ్మశానవాటికకు చేరియే తీరవలయును. అద్దానిని తప్పించుకొనుటకు ఎట్టివారికి వలనుపడదు.

జ్ఞానులు శరీరము నశించునని మరణము వచ్చినప్పుడు చలించరు. తమ ముఖ్యబంధువు లెవ్వరైన గతించినను దుఃఖ పడరు. నశించుట స్వభావముగా గలిగిన శరీరమును గురించి

కల్పకోటికాలము దుఃఖించినను లాభములేదు. అందువలన నీవు శరీరమును అట్టిపెట్టుకొనజాలవు. చచ్చిపోయినవారు తిరిగిరారు. నీవు యెవరు నీ భార్యబిడ్డలనుకొనుచున్నావో, వారి పూర్వజన్మ వృత్తాంతముగాని, నీ జన్మవృత్తాంతము గాని యెరుగవు. ఈ శరీర బాంధవ్యము ఈ మధ్య వచ్చినది, మధ్యపోవునది. నీ దారపుత్రాదులు, బంధువులు, స్నేహితులు, చలిపందిరిలో చేరినవారి మాదిరి. లేక రైళ్ళలో బస్సులలో, టాంకార్లలో, ప్రయాణముచేయువారి మాదిరి. i. e, యెచ్చటెచ్చటవారో తాత్కాలికముగ కొంతసేపు కూడి ప్రయాణముచేసి, వారివారి గమ్యస్థానము రాగానే దిగిపోవు చున్నారు. కనుక ఈ బాంధవ్యము అశాశ్వతమైనదిగా నెరుంగుము. ఎవరిస్టేషన్ ముందు వచ్చునది మనకు తెలియదు. మన మందరము సంసార మను టె్రయిన్‌లో ప్రయాణము చేయుచున్నాము. పిల్లలను వెంటబెట్టుకొని ప్రయాణము చేయు పెద్దలు, టిక్కెట్లు చూపించవలసిన దని పిల్లలు అరడి చేసినను, వారల కోపపడెదరేగాని వారి కివ్వరు. గమ్యస్థానము రాగానే రైలుబండిలోనుండి దిగుటకు బిడ్డలు ఇష్టపడకున్నను తల్లితండ్రులు వారిని బలాత్కారముగా దించివేయు చున్నారు. మన మందరము సంసార మనెడి రైలులో ప్రయాణముచేయు పిల్లలవంటివారము. మన టిక్కెట్టు మనదగ్గర లేదు. భగవంతునిదగ్గర నున్నది. గమ్యస్థానము (నియమిత కాలము) రాగానే ఆయన మనలను యీ రైలుబండినుండి దించివేసి తీసికొనిపోవుచున్నాడు. కనుక దుఃఖపడి ప్రయో

జనములేదు. తామస్ ఏకెంపిస్ అను నాతడు 'ఇమిటేషన్ ఆఫ్ క్రైస్టు' అను గ్రంథమందు "Keep thyself as a pilgrim and guest upon the earth to whom belongeth nothing of wordly business" అని వ్రాసియున్నాడు. ఈ భూమిపై నాది అనుకొన నగు వ్యాపార మెద్దియులేదు. నీవు యిచట ఒక యాత్రికునివలె, లేక అతిథివలె చరించుము అని అందలి భావము.

Creation is only projection. సముద్రపు కెరటాలను సముద్రము తనలోనికి లాగుకొనునట్లు, సాలెపురుగు తన శరీరములోనుండి యేర్పడిన నూలుపోగుతో గూటిని కట్టి, దానియందు తాను ప్రవేశించి, కొంతకాల ముండి, తిరిగి మరల తన యిష్టమువచ్చినపుడు తన లోపలికి లాగుకొనునట్లు, భగవంతుడు ప్రపంచమును తన స్వరూపములోనుండి బయటపెట్టి, వాటియందు తాను అంతర్యామిగా నుండి, తన కిష్టము వచ్చినపుడు వాటిని తనలోపలికి లాగుకొనుచున్నాడు. మరియొకరు చెప్పినది యేమనగా:— Matter is indestructible. Nothing is lost when a candle burns. పృథివి, అప్, తేజస్సు, వాయువు, ఆకాశము అను - ఈ పంచ భూతముల వలన యేర్పడిన శరీరము నశించినవెంటనే, ఆయా భూతములు తమ చేరికను వీడి మూలరూపములతో పోయి చేరుచున్నవి. కాని అవి నశించుటలేదు గనుక శరీరవిషయమునను మనము దుఃఖపడవలసిన పనిలేదు.

అర్జునా! ఈ ఆత్మసంగతి బహు ఆశ్చర్యము. (శ్లో॥ 29) ఆత్మ నిత్యము, శరీర మనిత్యమైనపుడు మనము ఎందులకు

దుఃఖపడుట! అదియే విచిత్రము. శ్రీరామచంద్రమూర్తికి అద్వైత ముపదేశించిన వసిష్ఠునుగూడ పుత్రవియోగమువలన కడు దుఃఖించెను. ఆత్మజ్ఞానము బోధచేయువా రుండుట కష్టము. చెప్పువారున్నను, వినువారు దొరకుట దుర్లభము. వినినను యింటికిపోయి మననము నిదిధ్యాసనము చేసికొనువా రుండుట కష్టము. ఒక గురువు తన శిష్యుని, రెండుచెవులు భగవంతు డేల ప్రసాదించియున్నాడని అడుగ నొకచెవి వినుటకు, వినినవాటిని బయటికి వదలుటకు మరొకటి యిచ్చినాడని చెప్పినాడట. ఆ రీతిగా మనము వినువిషయములు ఒక చెవితో విని, రెండవ చెవిలోనుండి వాటిని బయటికి వదలిపెట్టిన ప్రయోజనములేదు. గొప్పగొప్ప పండితులు, జ్ఞానులు మున్నగువారివలన విను విషయముల గురించి వారువారు తమ యిండ్లకు వెళ్ళి, మననము చేసికొని, అందలి సారము గ్రహించి, తమ నడివడికలో అవసర మగు మార్పులు చేసికొని, పరమాత్మయొక్క పరిపూర్ణ కటాక్షమును చూరగొనవలయును. అనేకవేలమంది ప్రజలలో ఆత్మసంగతి తెలిసికొనవలయు నని యెవరో యొక్కరు ప్రయత్నించుచున్నారు. అప్రత్యక్షమైన విషయములు తెలిసికొను మహానుభావులు ఈ ప్రపంచమందు కొద్దిమంది గనుక సర్వసామాన్యులకు నీ ప్రపంచమందు శరీరము నశించు ననగానే దుఃఖము కలుగుచున్నది. ఈ మాట చెప్పుటతోడనే అర్జునుడు పుణ్యాత్ముడగుటచే శ్రద్ధతో వినుచున్నాడని ప్రోత్సాహపరచినట్లయ్యెను.

అంతట అర్జునుడు పరమాత్మను శ్లో॥ 29 వరకు చెప్పిన విషయములు, అనగా, శరీరమునకు ఆత్మకు నున్న భేదముల స్పష్టీకరించవలసిన దని కోరగా వాని రెంటికి గల భేదము 30 శ్లోకమందు చెప్పబడినది. అవి యేవనగా:—

| దేహము. | ఆత్మ. |
|---|---|
| [1] జడము=తెలివిలేనిది. | [1] చైతన్యము=తెలివికలది. |
| [2] అశాశ్వతము | [2] శాశ్వతము. |
| [3] దుఃఖమయమైనది, లేక దుఃఖమునే కలిగించునది. | [3] ఆనందమయమైనది, లేక సుఖమునే కలిగించునది. |
| [4] పరమాశుద్ధమైనది. | [4] పరమ పరిశుద్ధ మైనది. |
| [5] అజ్ఞానమయమైనది. ఈ లక్షణములు కలిగి అశాశ్వత మైనదానికి దుఃఖపడిన ప్రయోజనములేదు. | [5] జ్ఞానమయ మైనది. ఈ లక్షణములు కలిగి శాశ్వతమైనదానికి దుఃఖపడ నవసరములేదు. |

The more you identify yourself with this mortal coil, the greater will be your sorrow. The more you detach yourself from this body, the greater will be your happiness. ఈ శరీరము నీవు యేక మనుకొను నంతవరకు మానవుని దుఃఖమునకు మితిలేదు. నీవు శరీరమునకు భిన్నుడ వని గ్రహించి దానియందలి మమకారము చంపుకొనినకొలదిఆనందమతిశయించుచున్నది. పరమాశుద్ధమైన శరీరమును నేను గాను. చైతన్యమయమై, శాశ్వతమై జ్ఞానానంద మయమైన ఆత్మను 'నేను' అని తెలిసికొనుము. Swami Vivekananda said " Let the lion of Vedanta roar,

the foxes of timidity, conceit, vanity, fear etc. will run away to their holes."

వేదాంత మను సింహగర్జనము వినబడగానే కామక్రోధ లోభము లను గుంటనక్కలు తమ బొరియలకు పారిపోవునని వివేకానందస్వాములవారు చెప్పియున్నారు.

ఈ అధ్యాయము 11 శ్లో॥ మొదలు 30 శ్లోకములవరకు జ్ఞానమార్గము లేక అధ్యాత్మప్రకరణ మని చెప్పెదరు. అంతః కరణశుద్ధి యింద్రియ నిగ్రహ మనోనిగ్రహములు కలిగిన సనకసనందనాద్యుత్తమోత్తములకే కాని యిది సామాన్యులకు వలనుపడదు. అంతఃకరణశుద్ధిలేని వారికి కర్మయోగము శ్లో॥ 39 మొదలు చెప్పబడినది. శ్లో॥ 31-39 ఈ రెంటికి Connecting link, అనగా లంకె అయివున్నవి. ఇంద్రియ నిగ్రహము మనోనిగ్రహము లేనివారు నూటికి తొంభై తొమ్మిదిమంది. అట్టి వారికి కర్మమార్గము విధింపబడినది. 1, 2 తరగతులలో ప్రయాణము చేయలేనివారికి 3 వ తరగతి బండి యేర్పరచి యున్నారు. జ్ఞానమార్గము ఎట్టి దనగా కర్మానుష్ఠానము చేసిన పిదప అంతఃకరణశుద్ధి బడసి తద్ద్వారా జ్ఞానము పొందనగును. 25 లేక 30 సంవత్సరములు కష్టపడి పనిచేసిన వారికే పింఛను (Pension) లభించును. కర్మానుష్ఠానము వల్ల జ్ఞానము పడయనగును. కర్మయోగము (i. e) discharge your duty—this is the pivot on which the whole Gita moves. నీ విధ్యుక్త ధర్మము నీవు నెరవేర్చుము. ఇదియే గీతయందలి ముఖ్యవిషయము.

అర్జునా! నీవు పుట్టుకచే క్షత్రియుడవు. నీ ధర్మము

యుద్ధము. అది నిర్వర్తించిన స్వర్గద్వారము తెరువబడియుండును. ఇహలోకమందు పరలోకమందు సుఖము కలుగును. యుద్ధము చేయనిచో జనసామాన్యము నిన్ను పిరికిపందగా నెంచెదరు. నీ బంధువులతో యుద్ధము చేయుట తగదని, నీవు గౌరవబుద్ధితో మానుకొంటి వనుకొనరు. ఇప్పుడు నిన్ను చూచుటకు మొగము చెల్లనివారలును, నీవు యుద్ధము చేయకున్న,నీ యెట్ట యెదుట నిలచి నిందావాక్యముల పలికెదరు. నీకున్న బిరుదు లన్నియు, అర్జున, ఫల్గున, పార్థ, కిరీటి, శ్వేతవాహన అనునవి నేల గలి యును. ఇచట బ్రాహ్మణునకు క్షత్రియునకు ధర్మమందుగల భేదము గమనించవలయును. నిందించువారల దండించుట క్షత్రియ ధర్మము. బ్రాహ్మణులు తమ్ము దూషించువారల తమ మిత్రులుగా భావించవలయును; ఏలననగా, వారల దూషించినందువలన ప్రపంచమందు విరక్తి పరమాత్మయందు భక్తి కుదురుట కవకాశ మేర్పడుచున్నది. బ్రాహ్మణులు సాత్త్వికగుణసంపన్నులు. క్షత్రియులకు రజోగుణము ప్రధాన మగుటచే దూషించినవారిని రణరంగమున చెండాడవలయును. "ప్రాణం వాపి పరిత్యజ్య మాన మేవాభిరక్షతు" అని చెప్పబడి నది. అనగా క్షత్రియుడు ప్రాణము సహితము పోగొట్టుకొని యైనను మానము కాపాడుకొనవలయు నని ధర్మశాస్త్రములు వక్కాణించుచున్నవి. క్షత్రియుడు యుద్ధములో వెన్నుజూపి పారిపోయిన నరకము కలుగును. యుద్ధమందు మడసిన వీరస్వర్గ మబ్బును. కనుక ఓ అర్జునా! నీవు యుద్ధముచేయకున్న నిహ పరములు రెంటికిం జెడినవాడ వయ్యెదవు. ఇందలి నీతి

యేమనగా వేదములు శాస్త్రములు నా ఆజ్ఞను తెలుపు నవి, గనుక వాని నుల్లంఘించక స్త్రీపురుషులు తమ తమ వర్ణాశ్రమధర్మముల నెరవేర్చవలయును—అని శ్రీ కృష్ణపరమాత్మ అర్జునుని వ్యాజముగా నుంచుకొని మన కందరికిని తెలిపి యున్నాడు. కనుక ఓ అర్జునా ! యుద్ధమందు సుఖదుఃఖము లను, లాభనష్టములను, మానావమానములను పాటించక యుద్ధము చేయుము. Do your duty without caring for the consequences thereof ఫలాఫలముల నాలోచించక నీ విధ్యుక్తధర్మము నెరవేర్పుము.

అంతట అర్జునుడు "అయితే యుద్ధము చేయ మను చున్నారే, జయము కలుగునా?" యని ప్రశ్నించిన, నెవరు చెప్పగలరు. కాని యెవ్విధముగానైనను లాభము కలుగునని పరమాత్మ చెప్పెను. జయ మొందిన రాజ్యలాభము నిచట సుఖము కలుగును. ఓడి యుద్ధమందు చనిపోయిన పరలోకమున వీరస్వర్గము కలుగును. కనుక యుద్ధమే కర్తవ్యము.

ఆ యుద్ధ మెట్లు చేయవలయునో చెప్పెదను వినుము. [శ్లో॥ 39]. ఎన్ని యుపన్యాసములు ఇచ్చినను, విన్నను, జ్ఞానము కలుగుటలేదు. ఎన్ని టానిక్ సీసాలను త్రాగినను బలము కలుగుటలేదు. దీనికి కారణ మెద్ది ? మనయందలి అంతర్గత రోగమును పోగొట్టుకొనకపోవుటయే. దానికి ప్రప్రథమములో చికిత్సచేయవలయును. జ్ఞానము పొందకుండ అడ్డుపడునట్టి అంతర్గతరోగము — ప్రాచీనకర్మ. పరీక్ష తప్పిపోవలసిన గీత యున్నవారికి మేష్టరు ఎంతబాగా చెప్పినను, వారిబుఱ్ఱకు

నేమియు నెక్కదు. ఆ ప్రాచీనకర్మయొక్క వేగమును తగ్గించిన గాని జ్ఞానము కలుగదు. ప్రాచీనకర్మనుబట్టి యేర్పడిన అంతరంగిక మగు అశుద్ధి పోగొట్టుకొనవలయును. దానిని వశింపు చేయుటకు కర్మయే సాధనము. కర్మను కర్మతో రూపుమాపవలయును. పూర్వకాలమందు ముల్లుగుచ్చుకొనిన మఱియొక్క ముల్లుతో దానిని ఊడబెరికి రెండుముళ్ళనుచేర్చి అవతల పారవేయుచుండిరి. (ఇప్పుడు సూదులతో తీయుచున్నారు.) అంతఃకరణమాలిన్య మున్నంతకాలము, మురికిగానున్న అద్దములో మురికి తుడిచివేయునంతవరకు మొగము ఎట్లు కానరాదో,అట్లే ఆ మాలిన్యము పోగొట్టనంతవరకు జ్ఞానము కలుగదు. కనుక అర్జునా! అట్టి కర్మయోగము చెప్పెద వినుము. అనగా, యిదివరకు చెప్పినదానికంటె ఎక్కువ శ్రద్ధతో ముఖ్యమైన విషయము గనుక విను మని పరమాత్మ చెప్పెను.

(శ్లో॥ 40) అర్జునా! కర్మచేయవలయును. ఎవరైన నుద్యోగము సంపాదించ వలయు నన్న గొప్ప పరీక్షలైనా ప్యాసై యుండవలయును. లేదా పరీక్షలు ప్యాసుకాకున్నను, అయ్యగారిని, అమ్మగారిని ఆశ్రయించి, వారియింటిలో చాకిరి చేసి, వారి ననుసరించవలెను. ఇది రెండవ మార్గము. అడుగకుండా చాకిరిచేయువారియందు అభిమానము కలిగి వారికి యేదో యొకపని యిచ్చుచున్నారు. దక్షిణదేశమందు డెబ్బదియేండ్ల వెనుక దోసెతహశ్శీలుదారని ఒకరుండెడివారు. తండ్రి చక్కగా దోసెలుచేసి దొరకు యిచ్చినందువలన కుమారునికి మెట్రిపరీక్షలు ప్యాసుకాకున్నను తహశ్శీలుదారుపని

యిచ్చియుండుటచే, ఆయనను దోసెతహాశ్శీలుదారని పిలుచు చుండిరి. అంతఃకరణశుద్ధి కలవారు మొదటిరకము. పరీక్షలు ప్యాసైనందువలన నుద్యోగము పొందువారు. అంతఃకరణశుద్ధి లేక కర్మానుష్ఠానావలంబులై ప్రవర్తించి జ్ఞానముపొందువారు రెండవరకము. వారు అనుసరింపువలన చాకిరిచేయుటవలన నుద్యోగము సంపాదించునట్టివారు.

జ్ఞానము పొందవలసినట్టి వస్తువు - సాధ్యము. దానిని పొందుటకై చేయవలసిన కర్మలు - సాధనములు. వానిని అనేకవిధములుగ విభజింపనయ్యెడిని.

మొదటి విభజన:—

(1) లౌకిక కర్మలు:—Worldly duties.

(2) వైదిక కర్మలు:—Spiritual duties.

మొదటివి మానవుని శరీరపోషణ నిమిత్తమున్ను, మానవునిపై ఆధారపడియుండు దారపుత్రాదులను, బంధువర్గమందలి వారలను పోషించుటకై నియమింపబడిన పనులు. శరీరపోషణ చక్కగా నుండనిచో ఆత్మవిచారణ చేయుటకు సావకాశ ముండదు. రెండవది - వైదికకర్మలు. ఆత్మోద్ధారణకు హేతుభూతములైన జపతపములు మొదలైనవి. మానవుడు వీనిరెంటిని ఆచరించవలసి యున్నది.

పూర్వకాలమందు వారి వారి కులాచారముల ననుసరించి వారి వృత్తుల సక్రమముగ నెరవేర్చుచున్నంతవరకు దేశము సుభిక్షముగా నుండెను. కాని వారి జాతిమతభేదముల

తప్పి, తక్కువజాతివారి పనులు తాము చేసిన (Dignity of labour.) మిక్కిలి గౌరవము అను దురభిప్రాయముతో చరించుటయే ప్రస్తుతము మనల నందరిని బాధపెట్టు నిరుద్యోగ సమస్యకు మూలకారణము. మరియు, ఒకజాతి మనుష్యుడు వేరొక జాతివృత్తిని స్వీకరించిన, ఆ జాతివారి కుండు సహజనిపుణతతో తా నా పనిని నిర్వర్తించజాలడు. అగ్రజన్మమెత్తినవాడుసీమకు వెళ్ళి ట్రానింగులో డిప్లొమా పొందివచ్చినను, మాదిగవాడు చెప్పులు కుట్టినట్లు కుట్టజాలడు. ఇప్పటికి వైశ్యులదగ్గర, కాపుల దగ్గర ధన ముండుటకు కారణముఏమనగా వారి వారికులాచార ప్రకారము వ్యాపారము వ్యవసాయములు చేసికొనుటవలననే. Dignity of labour అను దానికి సరియైన యర్థము ఏమనగా, వారి వారి కుల మతాచారములకు లోబడి స్వధర్మముల చక్కగా నిర్వర్తించుటయే.

(ii) రెండవ విభజన:— 1. కాయిక (physical) 2. మానసిక (mental) 3. వాచిక (verbal) కర్మలు.

(iii) మూడవవిభజన:— 1. నిత్యకర్మలు: 2. నైమిత్తికకర్మలు.

(1) నిత్యకర్మలు (i. e. Daily ceremonies) :— ప్రతిరోజు ఈ శరీరము కాపాడుకొనుటకై చేయునవి. మానవునికి యేపాటు తప్పినా సాపాటు తప్పదు. సర్వసంగపరిత్యాగము భోజనము వినా జరుగును. అన్నము, నిద్ర, శరీరపోషణకు అత్యావశ్యకములు. అటులే ఆత్మసుఖముకొరకై కొన్ని మత సంబంధమైనకర్మలు నిత్యము చేయవలయునని అన్నిమతములు

చెప్పుచున్నవి. అవియేవనగా—స్నానము, సంధ్య, జపము, దేవతార్చన మున్నగునవి. సంధ్యావందనము ఒకపూటచేయని వారు రౌరవాదినరకములలో పడుదురని వ్రాయబడి యున్నది. ఈకాలపుపిల్లలకు ఆ భయములేదు. ఉపనయనమైన మరుసటి క్షణమందే సంధ్యకు స్వస్తిచెప్పినవారికి తగిన నరకము సృష్టించుటకు ఆ యమునకైనా సాధ్యపడదు. ఈ కాలపు పిల్లలు సంధ్యావందనమందలి అర్థము తెలియకుండా చేసి యేమి ప్రయోజన మని ప్రశ్నించెదరు. కాని అర్థము విప్పి చెప్పినను "ఇంతేకదా! యిది మానసికముగా చేసిన చాలదా?" అను ప్రశ్న వేయుచున్నారు. సంధ్యావందనము మాత్రము మానసికముగా చాలదా అనువారలకు, మానసికము లగు అన్నము, ఆవకాయలతో కడుపు నిండునా? నిండదు. అవి మాత్రము ప్రత్యక్షముగా విస్తరియందు కానబడవలయును. (It is wrong to think that we should live to eat; but we should eat to live.) మనము తినుట బ్రతుకుటకొరకుగాని, మనము బ్రతుకుట తిండికొరకుగాదు. కనుక మానవులు నిద్రాహారములయందే తమ కాలము వృథాగా వెళ్ళబుచ్చక, ఆత్మోద్ధారణకు మార్గములగు పూజానమస్కారములు తదితర కర్మలను వారివారి మతాచారముల ప్రకారము చేసియే తీరవలయును. "పొట్ట" మహాపాపిష్ఠిది. దానికి మించిన శత్రువు వేరొకటిలేదు. అవ్వై అను ఒక ద్రావిడభక్తురాలు పొట్టను గురించి యిట్లు వ్రాసినది:—"వున్నోడు వాళ్వాదు అరిదరి దుగాళ్" అనగా "ఓ పొట్టా! నిన్ను భరించుట చాలాకష్టము.

నీకు ఒకపూట ఆహారము యెక్కువ వేసినను, ఒకపూట తక్కువగా వేసినను, అసలే వేయకున్నను నీవు ఒప్పుకొనుటలేదు. తల్లిగర్భములో చేరినదిమొదలు నీవు నన్ను ప్రతిరోజు యేదో విధముగా పీడించుచున్నావు. నిన్ను భరించుట చాలా కష్టముగా కనుబడుచున్నది." నిత్యకర్మలు చేయుటవలన అంతఃకరణశుద్ధి, తద్ద్వారా జ్ఞానమార్గము కలుగును. వాటిని చేయకున్న ప్రమాదము వాటిల్లును కోర్టుకు అసెసర్లుగా పోయిన వారికి కొందరికి బత్తెకర్చుల నిచ్చెదరు. కొందరి కివ్వరు. కాని సమ్మను తీసుకొని పోకున్న వారల ప్రాసిక్యూషన్ చేయుటయో లేక జరిమానా విధించుటయో జరుగును. అటులే సంధ్యవగైరా నిత్యకర్మల చేయకపోయిన అరిష్టము వాటిల్లును. అట్టివారు ఉత్తరజన్మలో అధమయోనిలో జన్మించెదరు.

(2) నైమిత్తిక కర్మలు (Occasional ceremonies):- సంక్రాంతియందు కూష్మాండదానము, పితృశ్రాద్ధము, పర్వదినములయందు జేయు పితృతర్పణము మొదలైనవి.

(iv) నాల్గవవిభజన:—(1) నిషిద్ధకర్మలు, (2) కామ్యకర్మలు.

(1) నిషిద్ధకర్మలు (Prohibited acts) e.g. అసత్యమాడరాదు. పరస్త్రీగమనము చేయరాదు. పరద్రవ్యాపహరణము కూడదు. కల్లుసారాయి త్రాగరాదు. అభిచారిక హోమములు (శాతపుడి లేక శూన్యముపెట్టుట) చేయరాదు. ఎందువలన ననగా - చెరపకురా చెడెదవు అని చెప్పబడినది. You will be digging your own grave. A circle ends

where it begins, నీగోతిని నీవు త్రవ్వుకొనుచున్నావు. వల యము యెచట ప్రారంభమగునో అచట చేరుచున్నది. ఒకరికి చెరుపు చేయదలపకుము. అది నీ మెడకే చుట్టుకొనును. "శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః, పరోపకారః పుణ్యాయ, పాపాయ పరపీడనం" అని చెప్పబడినది. అనగా ఒకరిని బాగుచేసిన నీవు బాగుపడెదవు. ఒకరికి అపకారము చేయ సమకట్టిన నీవు చెడెదవు భాగవతములో దశమస్కంధ ములో శ్రీకృష్ణుని చంపుటకై వెళ్ళినవా రందరు నశించిన పిమ్మట ఒకడు తాను మన్ను తిని కృష్ణుని జంపదలచినవాడే మట్టిలో గలసె నని చెప్పబడియున్నది.

(2) కామ్యకర్మములు (Stereotyped or earmarked Karmas) ప్రత్యేకఫలముల కోరి చేయుపనులు. e. g. సంతా నముకొరకు పుత్రకామేష్టిచేయుట. వీనివలన నితరుల కెట్టి హానిలేదు. ఫలప్రాప్తి కలుగుచున్నది. కాని అట్టిఫలమునవలన దుఃఖము ఎక్కువ, సుఖము తక్కువగా కన్పట్టుచున్నది. దశ రథుడు పుత్రకామేష్టియాగ మొనర్చి సంతానమును బడసెనే గాని, ఆయనజన్మ యావత్తు దుఃఖముతోనే గడచెను గదా ? రామాయణమం దెచ్చట జూచినను రోదనమే. దానికి తగి నట్లు అందలి కాండ లేదు. దశరథునకు పుత్రకామేష్టిచేసినందు వలన దివ్యమైనకుమారులు కలిగిరేగాని, విశ్వామిత్రుడు బయలు వెడలి వచ్చి తన యాగసంరక్షణార్థమై ఒకచెంప పాలు, ఒక చెంప నీరుగారు పసిబాలురైన శ్రీరామలక్ష్మణుల బనుపుమని కోర, ముని శాప మిచ్చునేమో యని వెరగొంది కన్నీరు

గార్చుచు ఇష్టములేక పిల్లల విశ్వామిత్రునివెంట బంపుటయు, తరువాత వారికి వివాహమై కొంతకాలము సుఖముగా నుండి శ్రీరామచంద్రుని పట్టాభిషేక మహోత్సవమునకై అంతయు ఆయత్తపరచి కైకేయి వరముకోరుటంజేసి, తన ప్రాణముతో సమానముగా జూచుచున్నట్టి శ్రీరామచంద్రుని అరణ్యమునకు బంపి, పుత్రవియోగమువలన దుఃఖసంతప్తుడై కాలధర్మమొందెను.

రామావతారము ధర్మాచరణావతారము. కృష్ణావతారము ధర్మబోధావతారము. చెప్పువానికంటె, చేసిచూపువా డెక్కువ. అందువల్ల కృష్ణావతారముకంటె రామావతారము యెక్కువ. అందువలననే రామకోటి వ్రాయబడుచున్నది; కాని కృష్ణకోటి వ్రాయువా రెవ్వరు గానబడరు. బిడ్డలులేనివారికి ఒకటే యేడుపు, బిడ్డలున్నవారికి చచ్చునంతవరకు అనేకరకముల యేడుపు. అట్లే ధనము, తదితర ఫలముల వాంఛించి కర్మచేయువారి గతి కామ్యకర్మవలన నొకపాలు సుఖము, తొంబదితొమ్మిదిపాళ్ళు దుఃఖము కలుగుచున్నది. శంకరాచార్యులవా రిట్లు వ్రాసియున్నారు.

"శ్లో॥ అర్థ మనర్థం భావయ నిత్యం।నాస్తి తత స్సుఖలేశ స్సత్యమ్
పుత్రాదపి ధనభాజాం భీతిః । సర్వత్రైషా విహితా రీతిః॥

అనగా, ధనమువలన అనేక అనర్థములు కలుగును. ధనము గలవారికి తమ స్వంతకుమారులవలన గూడ కీడు వాటిలును.

ఈ కర్మము చేయుటకు (1) ప్రవృత్తిమార్గము (2) నివృత్తిమార్గము అను రెండు మార్గము లున్నవి. ఈ రెంటి యందలి తారతమ్యము గమనించ నయ్యెడిని.

(1) ప్రవృత్తి మార్గము—ఫలమును గోరి కర్మములు చేయుట. i. e. Karma done in order to obtain mundane or celestial pleasures. (2) నివృత్తిమార్గము - ఫలాపేక్ష లేకుండా భగవదర్పణముగా కర్మము చేయుట. పరమేశ్వరానుగ్రహము, తద్ద్వారా మోక్షము కోరి చేయునట్టి కర్మ నివృత్తిమార్గ మనబడును. Do your duty for God's sake (According to western philosophy, do your duty for duty's sake) వేదాంత మంతయు కర్మలను నివృత్తిమార్గమున చేయవలసిన దని బోధించుచున్నది. నివృత్తిమార్గమునకు, నిష్కామయోగము లేక అనాసక్తియోగ మనెడి పేర్లు గలవు. ప్రవృత్తి మార్గమును సకామయోగ మనెదరు. ఈ రెంటికి గల భేదము శ్లో॥ 40-47 యందు చెప్పబడినది. ఫలాపేక్షతో కర్మ చేయువాడు కొంచెము ఎక్కువచేసినను, కొంచెము తక్కువ చేసినను, కొన్నిరోజులు చేయకపోయినను, మడి ఆచారము లలో తక్కువైనను కష్టము కలుగును. ఫలాపేక్ష లేకుండ కొంచెము కర్మచేసినను అట్టివాడు సంసారబంధ మను మహా భయమునుండి విడిపింపబడి మోక్షము చెందును. ప్రవృత్తి మార్గము పదునైన కత్తులమీద నడచుటవంటిది. అనగా నియమములతో శరీరము కట్టుబాటులో నుంచుకొని యొక ఫల మును అపేక్షించి కర్మానుష్ఠానము చేసిన ఆ ఫలము మాత్రము

కలుగుచున్నది. నియమములో నెట్టి లోపమున్నను, కోరికలు నెరవేరక పోవుటయేగాక చేయువారికి కీడు వాటిల్లును. నివృత్తి మార్గము ననుసరించువారి కర్మయందు ఎట్టి లోప మున్నను, భగవంతుడు వారల మన్నించి అనుగ్రహించును. ఉదాహరణ ములపైగాని యిందలి తారతమ్యము బోధపడదు. బిడ్డలకొరకై (అనగా సంతాన మపేక్షించి)గాని, ధనముకొరకై గాని, సుందర కాండ పారాయణ చేయువారు బహుజాగ్రత్తగా నియమ ముతో, ఆచారముతో, నిర్ణయకాలము సాంతమగువరకు చేసినగాని ఫలము కలుగదు. ఫలాపేక్షలేకుండా మోక్షముకోరి సుందరకాండ పారాయణ చేయువారియం దెట్టిలోపము లున్నను, భగవంతుడు వాటిని మన్నించి వారలకు గొప్ప సుఖము—మోక్షము ప్రసాదించుచున్నాడు.

మరియొక దృష్టాంతము. డబ్బుకోసమై పంకా లాగు వాడు, యెక్కువ లాగినను, మెల్లగా లాగినను, లాగకున్నను, అధికారియొక్క ఆగ్రహమునకు పాత్రుడగుచున్నాడు. అధి కారి లేచునంతవరకు ఒకేమాదిరిగా, ఎంతవరకు గాలి అవ సరమో అంతమాత్రము గాలి వచ్చునట్లు వాడు లాగవల యును. డబ్బుఆశలేకుండా పంకాలాగువాడు యెట్లు లాగి నను, వానికి ఏ యిబ్బందియు లేదు. వారలను అధికారులు దండించజాలరు. ఏమి అడగకుండా పంకా లాగుచున్న యెడల అధికారికి వారియం దభిమాన మేర్పడి, ఆతని తలపై యెంతయేని బరువు పెట్టినట్లుండి, వారి కేదో సహాయము

చేయుట తటస్థించుచున్నది. ఏమి అడుగలేనటువంటి పసిపిల్లలకు ఆయావేళలు కనిపెట్టి తల్లి అన్నియు నిచ్చుచున్నది. అల్లరి చేసి వస్తువులు కావలయు నని కోరుపిల్లలకు తల్లి విసుగుకొని యెప్పుడో యింత పడవేయుచున్నది. బ్రాహ్మణుని చేతిలో కాణీపెట్టి, ధర్మార్థకామమోక్షచతుర్విధ ఫలసిద్ధ్యర్థం అని సంకల్పము, చెప్పు మనుట హేయము. కర్మ యావత్తు ఫలము కోరకయే చేయవలయును. కర్మచేయునపుడు నీవెట్టిఫలముకోరక రామార్పణము, కృష్ణార్పణము అను బుద్ధితో చేయునెడల భగవంతుడు సంతోషించి నీవు కోరకయే, ఐహికాముష్మిక సుఖముల ఆయన నీకు ప్రసాదించును. అడిగినవారికి అడిగిన వస్తువుమాత్రము నిచ్చుచున్నాడు.

మధుసూదనసరస్వతి ఒక దివ్యమైన యుదాహరణము నిచ్చియున్నాడు. మామిడిపండు కొరకు ఆశపడి పాతిపెట్టిన టెంక, పల్లుతోము పుల్లలు, నీడ, తోరణములకు ఆకులు, నీవు కోరనటువంటి వాటినెన్నియో నీ వపేక్షించిన ఫలముతో పాటు యిచ్చుచున్నది. అట్లే నివృత్తికర్మానుష్ఠానపరులకు వారు కోరు మోక్షమేగాక, వారు కోరనటువంటి సకలైహికాముష్మికసుఖములు భగవదనుగ్రహమువలన కలుగును.

లౌకికకర్మలు చేయువారు, తాము పైయధికారులపార పెట్టి, వారి కంటిలో దుమ్ముకొట్టినను, సర్వనియామకుడు, సర్వసాక్షి అయిన భగవంతునికండ్లయందు దుమ్ముకొట్ట జాలరు. God consciousness తో మీ లౌకికకర్మలను నెరవేర్చనియెడల మీరు రాజద్రోహులు, దేశద్రోహులు అగు

టయే గాక భగవంతునికి ద్రోహము చేసినవారలు నయ్యెదరు. ఈ ధర్మము, ఉద్యోగస్థులు, ప్లీడర్లు, వర్తకులు, వేయేల, స్త్రీపురుషాదు లందరు గుర్తెరుగనగును. 'కృపణాః ఫలహేతవః' అని తెలిసికొని, తమయొక్క దృక్పథమును మార్చుకొని 'మనము చేయున దెల్ల భగవంతుని కైంకర్యము. భగవంతుడు మెచ్చవలయును' అను అభిప్రాయము స్థిరముగా మనస్సులందు నిలిపి తమ పనుల నిర్వర్తించవలయును.

మరియు, స్త్రీపురుషు లందరు వారి వారి వర్ణాశ్రమ ధర్మములను ఈశ్వరార్పణబుద్ధితో నెక్కువ తక్కువ యని పోట్లాడుకొనక చక్కగా నిర్వర్తించవలయును. భగవంతుడు సర్వజ్ఞు డగుటచే ఆయన యెవరికి ఏకర్మల నియమించినాడో అవి చేసియే తీరవలయును. భగవంతుడు ఇచ్చిన విద్య, ద్రవ్యము, శరీరబలము, అహంకార మమకారములు వదలి, ఫలాపేక్ష లేకుండ యితరులకొరకై వినియోగించవలయును. నివృత్తికర్మ చేయువా డుదారస్వభావుడు. ప్రవృత్తికర్మ చేయువాడు దీనుడు. వివేకానందస్వాములవారు చెప్పినట్లు (Your heart to God, and your hands to work) తాము చేయు పని అంతయు భగవత్కైంకర్య మను దృష్టితో కర్మచేయువారు తమ్ము తాము బాగుపరచుకొని యితరులను బాగుచేయుచున్నారు. ఫలము నపేక్షించి చేయువారు కేవలము కృపణులు. కేవలము డబ్బుకొరకు ఆశించి చెప్పువిద్యగాని భాగవత పురాణాది కాలక్షేపములు గాని రక్తిగట్టవు. డబ్బుకోసమై అన్నము వండి పెట్టు పూటకూళ్లమ్మ అనేక కల్తీలు చేసి అపరిపక్వాన్నము

పెట్టుచున్నది. ప్రేమపురస్సరముగా వండిపెట్టు ముసలమ్మ పచ్చడిమెతుకులు పెట్టినను బహు రుచ్యముగా చేసిపెట్టు చున్నది. గనుక కర్మానుష్ఠానము ఫలాపేక్ష లేకుండా చేయ వలయును.

కర్మలు చేయుటలో నొకజాతియు నొకవర్ణమువా రెక్కువ మరియొక్కరు తక్కువ అనుకొనుట మిక్కిలి పొరపాటు. ఈ ప్రపంచము ఒక గడియారము వంటిది. గడియారములో పెద్దచక్రములు, చిన్నచక్రములు అన్ని సరిగా నుండినగాని అవి పనిచేయవు. అందులో యే చక్రి మూడదీసినను అది ఆగిపోవుచున్నది. అట్లే యీ ప్రపంచము నడచుటకు అన్ని జాతులవారు ముఖ్యమే. There must be compartmental co-ordination between all the castes for the progress of humanity. అన్ని కులములవారు తమతమ పనులను కలసి మెలసి చేసికొనుచు మానవకోటి పురోభివృద్ధికి తోడ్పడ వలయును. అధ్యాత్మసంబంధమైన బోధచేయుటకు బ్రాహ్మ ణులు, రాజ్యపోషణకొరకు క్షత్రియులు, వ్యాపారముచేయు టకు వైశ్యులు, శరీరపాటవమువలన పైరులు పంటలు పండించు టకు శూద్రులును అందరు అవసరమే. వీరిలో నెవరు లేకున్నను కష్టమే. గడియారమందలి పెద్ద చిన్న చక్రములలో నేది తీసి వేసినను, గడియారము నిలిచిపోవుచున్నది మరియు గడియార మందలి ఆయాచక్రములు ఆ యా స్థానములలో నుండవలసినదే కాని స్థానములు తప్పించిన గడియారము పనిచేయదు. అట్లే ప్రతిమనుజుడు కులము, మతము, జాతిని అనుసరించి విధ్యుక్త

ధర్మము నెరవేర్చవలయును. ఒక జాతివారి పనులు మరొక జాతివారు చేయుట పనికిరాదు. ఏ జాతివారు ఆజాతిపని చేయుటయే శ్రేయస్కరము, గౌరవప్రదము.

ఒక మానవుని ప్రతిష్ఠ లేక అప్రతిష్ఠ అతని కులము, జాతి, మతము మున్నగు సందర్భములపై ఆధారపడియుండదనియు, తన "డ్యూటీ" తాను సక్రమముగా నెరవేర్చుట గౌరవమని యొక ఆంగ్లకవి ఇట్లు చెప్పియున్నాడు.

"Honour and insult from no condition arise;
Act well your part, therein all the honour lies."

ఫలాపేక్ష ఉండకూడదు. కర్మలు మాత్రము చేసియే తీరవలయును. అందలి ఫలాఫలములు దైవాధీనములు. కర్మచేయుట మనవంతు, ఫలమిచ్చుట భగవంతుని వంతు అని 47 శ్లోకమందలి ముఖ్యాభిప్రాయము. కర్మలవలన ఫలము గలుగునా? కలుగదా? పూర్వజన్మమందలి పరిస్థితులనుబట్టి ఫలము కలుగును. ఫలము కలిగినపుడు నీ మహిమ లేక ప్రయోజకత్వమువలననే కలిగినదనియనుకొనుట తప్పు.ఆయనయే ఫలము కలిగించునని నీవుచేయవలసిన కృషి మానుకొనుట వెఱ్ఱితనము.

ప్రవృత్తి నివృత్తి మార్గములకు గల మరియొక భేదము గమనించ నయ్యెడిని. జీవుడు ముక్తిపొందుటకు పాపము బంధమే, పుణ్యము బంధమే. మొదటిది యినుపసంకెలల వంటిది. రెండవది బంగారుసంకెలల మాదిరిది. పాపపుణ్యములు రెండు నశించినగాని, జీవుడు మోక్షము జెందడు. ఫలాపేక్ష లేకుండ నివృత్తికర్మచేసినగాని, పాపపుణ్యములు

రెండును నశించి జీవునికి మోక్షము కలుగదు. శ్రుతి వాక్యము యేమనగా:—"విద్వాన్ - పుణ్యపాపే విధూయ నిరంజనః పరమం సామ్య ముపైతి" అనగా నివృత్తి కర్మానుష్ఠానము చేయునట్టివాడు పాపపుణ్యముల రెంటిని పోగొట్టుకొని జ్ఞానము పొంది, జ్ఞానముద్వారా మోక్షమును పొందును. ఈ వేదాంతవిషయము కథాభాగములో గూడ గమనించవలయును. కృష్ణుడు ఏమని తెలియపరచుచున్నా డనగా— ఓ అర్జునా! నీకు అపకారులైనట్టి కౌరవులపై ఎట్లు బాణము ప్రయోగించెదవో, అట్లే నీ కుపకారముచేసిన భీష్మద్రోణాదులపై గూడ బాణప్రయోగము చేయవలయును. కౌరవులు పాపవృత్తులు. భీష్మద్రోణాదులు పుణ్యవృత్తులు గనుక జీవుడు పాపపుణ్యముల రెంటిని నివృత్తిమార్గమున కర్మానుష్ఠానముచేసి జయించి మోక్షము చెందనగును. ఒక కర్మ యెక్కువ, ఒక కర్మ తక్కువ కాదు. ఈశావాస్యోపనిషత్తులో "న కర్మ లిప్యతే నరే" అని చెప్పబడినది. అనగా కర్మము నీవు చేయు విధమును బట్టి ఫలములు హెచ్చుతక్కువలుగా మారును. నివృత్తికర్మానుష్ఠానము చేసిన అంతఃకరణ శుద్ధిజెంది జ్ఞానము బడసి తద్ద్వారా మోక్షము పొందనయ్యెడిని. ప్రవృత్తికర్మ ఒక బావివంటిది. నివృత్తికర్మ ఒక పెద్ద చెరువువంటిది. చెఱువు బావియొక్క ఉపయోగమేగాక యింకా యెక్కువ ప్రయోజనమును జేయును. భూములు సాగుచేయుటకు చెఱువు నీరు యిచ్చుచున్నది. అట్లే నివృత్తికర్మలవల్ల మోక్షసామ్రాజ్యమే గాక మనము కోరకపోయినను ఐహికాముష్మిక సుఖములును

గలుగుచున్నవి. అన్ని ఫలములు గలుగజేయు నివృత్తికర్మ యుండగా స్వల్పఫలముల నపేక్షించి ప్రవృత్తి కర్మచేయువాడు మూఢుడు. లేక కృపణుడు. కనుక ఫలాపేక్షలేకుండా కర్మ చేయవలయును. అందులో నివృత్తికర్మయే శ్రేష్ఠము.

అట్లయినచో నివృత్తికర్మల ననుష్ఠించి జ్ఞానము చెందిన వారెల్లపుడు సమాధిలో నుందురా? లేక జాగ్రదవస్థను చెంది ప్రపంచములో సంచారము చేయుదురా? అట్టివారు జాగ్రదవస్థలో నుండునపుడు ఏలక్షణములు కలిగియుందురు? అని అర్జునుడు ప్రశ్నించగా పరమాత్మ శ్లో. 55 మొదలు 58 శ్లోకములయందు స్థితప్రజ్ఞుని లక్షణముల చెప్పియున్నాడు.

పరమాత్మ యేమని తెలిపియున్నా డనగా, ఓ అర్జునా! బాహ్యాప్రపంచమందలి వస్తువులలో ననగా, విషయవాంఛలలో తన మనస్సు తగులుకొన నియ్యక, యెల్లపుడు ఆత్మానందము అనుభవించువాడు స్థితప్రజ్ఞు డనబడును. స్థితప్రజ్ఞుడు అనగా నిశ్చలమైన బుద్ధికలవా డని యర్థము. ఎపుడు మనుజుడు విషయవాంఛల నెల్ల జయించి, వాటిని తన మనస్సునందు చొరనియ్యక, మనస్సు తన ఆత్మయందు లేక పరమాత్మయందు నిలిపి బ్రహ్మానందము అనుభవించుచున్నాడో అట్టి స్థిరావస్థయం దున్నవాడు స్థితప్రజ్ఞు డనబడును. (శ్లో. 55)

మరియు, స్థితప్రజ్ఞుడు సంతోషము వచ్చినపుడు పొంగడు. దుఃఖము వచ్చినపుడు చలించడు. సుఖ దుఃఖముల రెంటిని నిర్వికారముగా తీసికొనును. వానికి రాగ

భయక్రోధము లుండవు. వా డెల్లప్పుడు ఆత్మనే మననము చేసి కొనుచుండును. శరీరమందు అభిమాన మున్నంతవరకు రాగ ద్వేష క్రోధములు కలుగుచున్నవి. ఆత్మజ్ఞానము కలవానికి, శరీరమందభిమానముండదు. అందువలన వానిచే బాధింపబడడు. స్థితప్రజ్ఞుడు దన బుద్ధిస్థైర్యమువలన తన్ను సంబంధించియున్న ప్రియములగువానియందంతటను స్నేహమువదలి ఉదాసీనుడయి (తగులులేనివాడై) శుభము వచ్చెనని యానందింపడు, అశుభము వచ్చెనని దుఃఖపడడు. (శ్లో. 56)

(శ్లో.57) బ్రహ్మజ్ఞాని అన్నిటికన్న ముఖ్యమైన ప్రియమైన ప్రాణము సహితము ఇతరుల కుపయోగపడునెడల ఇచ్చుటకు సంసిద్ధుడైయుండును. పాశ్చాత్యదేశములయందు రెండు సిద్ధాంతములు కానవచ్చెడిని. (1) Utilitarian School e.g. the end justifies the means. తాము సాధింపదలచినది మంచిదైన, సాధనలో మంచిచెడ్డలు గమనించ పనిలేదనువారు (2) Intuitional School, e.g, honesty for its own sake as an end in itself. ఒక పనియందలి మంచియే లక్ష్యముగా నుంచుకొని అద్దానికై దానిని నిర్వర్తించువారు. ఈ రెండవ రకములో చేరినవారిపేరు భూమిపై శాశ్వతముగా నిలుచును. స్వార్థత్యాగపరులై తమకు అన్నిటికన్న ప్రియమైన ప్రాణము సహితము పరోపకారార్థమై వినియోగించు మహామహుల పేరు పుడమిపై ఆచంద్రార్కస్థాయిగా నిలిచియుండును. e.g. శిబిచక్రవర్తి తన మాంసమును కోసియిచ్చుట, దధీచి ఇంద్రునికి వజ్రాయుధము జేసికొనుటకై తన వెన్నెముక నిచ్చుట,

రామకృష్ణపరమహంసయొక్క చరిత్ర అనునవి కొన్ని తార్కాణములు.

పై చెప్పిన లక్షణములు కలుగవలయునంటే అట్టివాడు తాబేలు ఒకనిముసములో కరచరణాద్యవయవములను ముడుచుకొనునట్లు ప్రపంచమంతటను వ్యాపించియుండు తన కరచరణాద్యవయవము లుపసంహరించుకొనవలయును. ఇంద్రియనిగ్రహము పూర్తిగా నుండవలయును. (He must have complete control over his sensory organs.) శ్లో. 58.

ఈ యింద్రియనిగ్రహ మెట్లు కలుగును? అనగా ఇంద్రియములకు కావలసిన ఆహారము ఇవ్వకున్నచో నింద్రియజయము కలుగును. i. e. ఆ యా యింద్రియములకు కావలసిన విషయములతో వాటికి కోరిక లేకుండ చేయుట కర్తవ్యము. (శ్లో. 59) మరియొక అర్థము యేమనగా అసలు ఆహారమే తగ్గించిన అన్ని యింద్రియములు లోనగును. మరియొక వ్యాఖ్యానకారుడు వ్రాసినది యేమనగా:—వేదాంతము చదువుట వలనగాని,వార్ధక్యమువలనగాని, లోకానుభవమువలనగాని అన్ని విషయవాంఛలు కట్టిపెట్టవచ్చునుగాని, జిహ్వాచాపల్యమును జయించుట కష్టము. అది బ్రహ్మసాక్షాత్కారముతోగాని నశింపదు. అన్నివిధముల నింద్రియముల జయించుటకు ప్రయత్నమును చేయవలయును. (శ్లో.60) ఈ యింద్రియములు మహాప్రమాదకరము లయినవి. వాటిని అదుపుఆజ్ఞలలో నుంచు

కొనుట మహాకష్టము. అవి మనస్సునుగూడ కలుగింగజేయును. ఒకఅంతర్ముఖుడైన భక్తుడు భగవంతుని యుత్సవసమయములో నుద్బోధించుచు నిట్లు జెప్పియున్నాడు.

శ్లో॥ దృష్టి స్సేవితు మాగతోత్పలదృశాం వక్షోజయో ర్ధావతి
శ్రోత్రం నిర్గతకోకిలారవకలాలాపేషు విశ్రామ్యతి
చేతః తత్ సుకృతైకలభ్యసురతారంభేషు సన్నహ్యతి
స్వీకృత్యాంజలిమేవ మాధవ జగన్నాథ ప్రసీదాధునా.

అనగా భగవంతుడా! నాకండ్లు స్త్రీల అవయవ విశేషముల చూచుటకు పారిపోవుచున్నవి. చెవులు శృంగారరస ప్రధాన మగుమాటలు మున్నగువాటిని వినుటకు పారిపోవుచున్నవి. మనస్సు స్త్రీలను ఆలింగనము చేయుట మొదలగు విషయములను స్మరించుచున్నది. నా చేతులు మాత్రము నాకు స్వాధీనముగా నుండుటచే నీవైపు త్రిప్పియున్నాను. అంత వరకే నీవు అల్పసంతోషివై నన్ననుగ్రహించవలయును. మన మందర మీ రకములో చేరినవారము. బ్రహ్మజ్ఞాని యింద్రియముల తన గుప్పిట నుంచుకొనును. (శ్లో. 16)

ఇంద్రియనిగ్రహము లేనందువలన కలుగునష్టము పరమాత్మ 62-68 శ్లోకములలో జెప్పియున్నాడు. అవి యేవనగా మన యింద్రియములను ప్రాపంచిక వస్తువులయందు లగ్నపరచినయెడల వాటియందు (సంగము) అభిమానము అంకురించు

చున్నది. (Ordinary attachment is the initial stage of desire and can be easily uprooted) అట్టిది మొలక లెత్తకముందే దానిని పెరికి పారవేయవలయును. లేనిచో విషయాపేక్ష వేళ్ళుపారి కామముగా మారి గొడ్డలితో నరకినను పోనట్టి స్థితిలో నుండును. 'Kamam' is deep-rooted desire, it is the fructified stage of attachment. అట్టి కామము వలన వావివరుసలు భోజ్యాభోజ్యములు అను విచక్షణ నశించి వాటిని అనుభవించియే తీరవలయు నని దురాశ కలుగుచున్నది. ఆ కామమువలన ఆ దేవస్తువుకొరకు అపేక్షించు పెరవారిపై క్రోధము జనించుచున్నది. Anger is the resultant when our desires are baffled. క్రోధమువలన తల్లి తండ్రి గురువు అన్నదమ్ములు మొదలైన వారినిగూడా చంపవలెనని తోచును. అట్టికోపముపై మన కేల కోపము రాకూడదని ఉపనిషత్తులో చెప్పబడినది. "శ్లో॥ అపకారిణి కోపశ్చేత్ కోపే కోపః కథమ్ నయేత్" అనగా అపకారిపై కోపము వచ్చునెడల కోపము మహాపకారికదా. దానిమీాద యేల కోపము రాకూడదు? క్రోధమువల్ల భ్రాంతి యేర్పడుచున్నది. అనగా శాశ్వతమైనది అశాశ్వతముగాను, శుద్ధము అశుద్ధముగాను కనంబడు చున్నది. అట్టి భ్రాంతివలన మతి తప్పి, మనము చదివినది, వినినది మఱచిపోవుచున్నాము. మఱపువలన బుద్ధి నాశన మగు చున్నది. "బుద్ధింతు సారథిం విద్ధి" అని కఠోపనిషత్తులో చెప్పబడినది. దాని అభిప్రాయము ఏమనగా మానవ శరీర మను రథమునకు బుద్ధి సారథివంటిది, సారథి సరిగా

నడపనిచో రథము దారితప్పి, రథమును అధిష్ఠించియుండు ఆత్మను గోతిలో పడవేయును. బుద్ధినాశనమువల్ల జీవుడు నశించుచున్నాడు. అనగా అధోగతిపాలై పారమార్థికమునకు దూరస్థుడై "పునరపిజననమ్ పునరపి మరణమ్" అనువీనినే చెందుచున్నాడు.

ఇచ్చట ఒక వ్యాఖ్యానకారుడు పరమాత్మ యేల 63 శ్లోకమందు 'ప్రణశ్యతి' అనుపదము ఉపయోగించవలెను? ఆత్మ నాశనము లేనిదని 23-24 శ్లోకములయందు చెప్పబడి యున్నదానికి విరుద్ధమా? అని ప్రశ్నించుచున్నాడు. దీనికి సమాధానము ఏమనగా - ఆత్మ నాశనము లేనట్టిదనుమాట వాస్తవమే. పరమాత్మ 'ప్రణశ్యతి' అని చెప్పుటలో యెట్టి శాపములేదు. జీవులయొక్క పురోభివృద్ధి కోరి పరమాత్మ చెప్పినవిషయములు అనుష్ఠించనిచో మనము పరమాత్మసాన్నిధ్యమునకు దూరస్థులమై అధోగతిపాలగుదు మని గట్టిగా తెలిపియున్నాడు.

రాగద్వేషములు లేకుండ అత్యావశ్యకమైన విషయ సుఖములను అనుభవించునపుడు బ్రహ్మభావన ఉన్నయెడల జీవుడు ప్రసాదము (మనోనైర్మల్యము = Tranquility or peace of mind) చెందుచున్నాడు. (శ్లో॥ 64). ఎపుడు మనోనైర్మల్యము ఏర్పడునో అప్పుడు అన్ని దుఃఖములు నశించుచున్నవి. మరియు బుద్ధి నిలకడగా నుండును. (శ్లో॥ 65). మనస్సు నిలకడ లేనివారికి (i.e. when a man looses self-conrtol) బుద్ధి నశించుచున్నది. మంచిభావములుకూడ స్ఫురిం

పవు. అవి స్ఫురించకపోవుట వలన శాంతిలేదు. శాంతి అనగా (Cessation from all troubles) శాంతిలేకపోయిన సౌఖ్యము లేదు. "శాంతము లేక సౌఖ్యములేదు సారసదళనయనా" అని త్యాగయ్య కృతిచెప్పియున్నాడు. (శ్లో॥ 66) ఎంత జ్ఞాని యైనను బయటపోవుటయే స్వభావముగా కలిగిన ఇంద్రియము లను మనస్సుచే నియమించి అరికట్టి, అంతర్ముఖముగా చేయక పోయినయెడల వానిజ్ఞానము నశించుచున్నది. గాలివలన తిప్పట్లు చెంది పడవ నీటిలో మునిగిపోయినట్లు ఇంద్రియ నిగ్రహము, మనోనిగ్రహము లేనట్టివాడు సంసారసముద్ర ములో మగ్నుడై పోవును (శ్లో॥ 67) కాబట్టి అర్జునా! ఇంద్రి యములను అన్నివిషయములనుండి యుపసంహరించ వలయును. అట్టి వాని తెలివియే నిలుకడయైనది. (శ్లో॥ 68)

బ్రహ్మజ్ఞాని అన్ని యింద్రియములను తన స్వాధీనమం దుంచుకొనును. ఇంద్రియనిగ్రహము గల యోగియొక్క నాలు కపై పంచదార పెట్టినను కరుగకుండ నుండవలయును. ఈ మున్నగు బ్రహ్మజ్ఞానియొక్క లక్షణములను పరమాత్మ శ్లో॥55-68 లలో చెప్పినవాటి సారాంశము 69 వ శ్లోకమందు చెప్పు చున్నాడు. ఏది పామరజనులకు పగలో అది బ్రహ్మజ్ఞానికి రాత్రి. ఏది పామరజనులకు రాత్రియో, అదిబ్రహ్మజ్ఞానికి పగలు. అనగా మనము పల్లుదోముకొనునప్పుడు ఆయన పరుపు విప్పు నని, మనము నిద్రపోవునపుడు ఆయన పండ్లు తోముకొనునని అర్థముకాదు. శ్లో॥69. "నిశా" అను పదముతో వత్ = వంటిది అను ప్రత్యయము కలుపుకొని అర్థము గ్రహించవలయును.

కాని ఈ శ్లోకమును literal గా interpret చేయరాదు. నిశా అను తరువాత వత్ (like) అను ప్రత్యయము కలిపి చదువు కొనిన శ్లోకార్థము విశదపడగలదు. అది యేమనగా:—
సాధారణ మనుజునికి రాత్రివలె తోచునట్టి విషయము లన్నియు బ్రహ్మజ్ఞానికి పగలువలె పొడకట్టును. e. g. అజ్ఞానికి ఆత్మ అనాత్మభేదము తెలియదు. (i.e. He does not know the difference between matter and spirit) అది జ్ఞానికి కరతలామలకము. సాధారణ మనుజునికి పగలు వలె కన్పట్టు విషయములు జ్ఞానికి చీకటివలె నుండును. e. g. ఉదరపోషణకొరకై అబద్ధములాడుట, తప్పు పత్రములు పుట్టించుట, వ్యభిచారము మున్నగునవి అజ్ఞానికి పగలు వంటివి. We are wide awake in these worldly matters, while a Brahmagnani sleeps over them. బ్రహ్మజ్ఞాని యీ విషయములలో మనస్సును చొరనివ్వడు గనుక అతనికి చీకటివంటివి. బ్రహ్మజ్ఞాని ప్రతివస్తువులో ఆత్మచైతన్యము చూచుచుండును. మూఢుడు ప్రకృతిఅంశమును చూచు చుండును. The Brahmagnani always looks at the 'Noumenon' i. e. the underlying substratum of all phenomena. The whole world is a phenomenon and God or Brahma is the Noumenon. A true philosopher reads books in brooks and sermons in stones. బ్రహ్మజ్ఞానికి ప్రపంచమంతయు శివమయము లేక నారాయణ మయముగా కనబడుచున్నది. ఒక స్త్రీని అనేకులు పురుషులు

చూచుచున్నారనుకొనుము. వారిలో తండ్రి చూచునపుడు వాత్సల్యము, భర్తచూపులయందు కామము, కడుపున పుట్టిన పిల్లవాడు చూచునపుడు మాతృప్రేమ వెల్లివిరియుచున్నవి. త్యాగరాజు చెప్పినట్లు జ్ఞానికి చీమలలో దోమలలో అన్నిటిలో జగమంతయు రామమయముగా గన్పించుచున్నది. రామకృష్ణ పరమహంస తాను కూర్చొనుటకై వేయబడిన చాపయందు కాళీదేవిని (ఆనందమయీ మాతను) గాంచెను. పిల్లియందు గూడా ఆమహాతల్లి కానవచ్చెను. కబీరునకు కుక్కయందున శ్రీరాముడు కానవచ్చెను. రామకృష్ణుని వంచించుటకై అందమైన భోగము దానిని పంపగా, నామె రూపరేఖాసౌందర్యముల జూచి ఆ జగజ్జనని కాళిమాత తన్ననుగ్రహించుటకై ఆ రూపముతో వచ్చినదని ఆయన పాదాక్రాంతుడై ఆమెకు సాష్టాంగదండప్రణామ మాచరించినతోడనే ఆ భోగము స్త్రీ సిగ్గుచెంది ఆమె స్వభావము అంతటనుండి మార్చుకొనినట్లు చెప్పబడియున్నది. కడుపున పుట్టిన బిడ్డ, తల్లి యెన్ని వేషములు వేసికొన్నను, తల్లిని గుర్తించుచున్నాడు. అట్లే జ్ఞాని సమస్త వస్తువులయందు శ్రీమన్నారాయణుని, లేక శివుని స్వరూపము గాంచుచున్నాడు.

మరియు బ్రహ్మజ్ఞాని సముద్రము మాదిరిగా గంభీరముగా నుండును. సముద్రములో నదులు వచ్చి పడినను పడకున్నను, అది గంభీరముగానే యుండునుగదా! అట్లే బ్రహ్మజ్ఞాని కెట్టి సుఖదుఃఖములు వచ్చినను చలించడు.

విషయవాంఛ కలవారికి మనశ్శాంతి యుండదు. బ్రహ్మజ్ఞాని విషయాపేక్ష వీడినవా డగుటచే వానికి మనశ్శాంతి కలుగుచున్నది. (శ్లో॥ 70)

బ్రహ్మజ్ఞాని ఆత్మావశ్యకమైన పదార్థముల అనుభవించునపుడుకూడ, అహంకార మమకారములను వదలిపెట్టి, వాటియందు మనస్సు లీనపరచడు. కనుక మనస్సమాధానము జెందును. శాంతి యనగా మోక్షమని యర్థము చెప్పుచున్నారు. ఇచట శాంతియే రాబోవు మోక్షమునకు సూచన. (శ్లో॥ 71)

ఈ బ్రాహ్మీస్థితి (బ్రహ్మభావన చెందు స్థితి) జ్ఞానకర్మయోగానుష్ఠానమువల్ల అంత్యకాలములో చెందినను పునర్జన్మ కలుగక మోక్షము పొందనగును. వార్ధకములోనైనను, జ్ఞానకర్మానుష్ఠానము చేసినయెడల లోగడచేసినట్టి లోపముల పరమాత్మ మన్నించి మోక్షము ప్రసాదించునప్పుడు, బ్రహ్మచర్యాశ్రమము నుండియే జ్ఞానకర్మయోగానుష్ఠానము జేయువారుకూడ మోక్షము పొందుదు రను విషయము నేల సంశయింపవలయును? ఈఅధ్యాయమందు ప్రతిపాదింపఁబడిన జ్ఞానమార్గముగాని, అందుకు సాధనమైన కర్మమార్గముగాని, అంత్యకాలములో స్త్రీలు పురుషులు చేసిన నుపయోగకరమే! It is never too late to mend. Better late than never! మన తెలివిమాలినతనము తెలిసికొని సిగ్గుచెంది, పశ్చాత్తాపపడి, వేడికన్నీరుగార్చి, చివరకైనను మంచిమార్గము అనుష్ఠించవలయును. అట్టివారికి కూడ పరమాత్మ అభయప్రదానము

72 వ శ్లోకమం దిచ్చుచున్నాడు. 9 వ అధ్యాయములో 29, 30 శ్లోకములు, 18 వ అధ్యాయములో 66 వ శ్లోకము (చరమశ్లోకము) ఈ యభిప్రాయమును బలపరచుచున్నవి. ఇచట ఖట్వాంగమహారాజుయొక్క వృత్తాంతము గమనించ నగును. ఆ మహారాజు దేవతలతరపున యుద్ధముచేసి, రాక్షసుల జయించి, సంతోషముతో వారుచేయుచున్న మర్యాదల నందుకొనువేళ, బృహస్పతి ఆ మహారాజు కడకు జని, ఒక్క ముహూర్తకాలములో నాతనికి మరణ మాసన్నమగుచున్నదని తెలుప ఆ మహారాజు కొంతసేపు వ్యవహారముల తన కుమారునకు నొప్పగించి మిగిలిన కొన్ని విషయములలో, గొప్పభక్తుల రావించి భగవన్నామస్మరణచేయుచు, శరీరము చాలించినందున మోక్షము పొందెను అని చెప్పబడుచున్నది. కనుక అంత్యకాలములోనైన భగవన్నామస్మరణ జేసిన మోక్షము కలుగునప్పుడు బాల్యమునుండి చేయువారికి గలుగకుండునా ? నిస్సంశయముగా మోక్షము లభించునని తెలియవలయును.

ఈ రెండవఅధ్యాయము సాంఖ్యయోగమనబడుచున్నది. సాంఖ్య మనగా బుద్ధి. సాంఖ్యయోగ మనగా బుద్ధితోగూడిన యోగము= (i. e. the path of wisdom) The aim of life is moksham i. e. liberation from material bondage. This is the end and aim of all religions. Karma Yoga is the stepping stone to Gnana Yogam and the latter leads to Moksha, అన్ని మతములు జీవునికి మోక్షము కలుగు విధములు తెల్పుచున్నవి. కర్మయో

గము జ్ఞానయోగమునకు మార్గము. కర్మానుష్ఠానము వలన జ్ఞానము, తద్ద్వారా మోక్షము, జీవులు పొంద గలరు. మరియు ఈ అధ్యాయమును సాంఖ్యయోగ మనుటకు మరి యొక కారణము కలదు. అదియేమన, యీ అధ్యాయమందలి శ్లో॥ 11-30 లు జ్ఞానయోగమును గురించి చెప్పుచున్నవి. శ్లో॥ 31-54 వరకు కర్మయోగమును గురించి చెప్పబడినది. శ్లో॥ 55-72 యందు జ్ఞానియొక్క లక్షణములు చెప్పబడినవి. కనుక యిందలి ముఖ్యాంశము జ్ఞానయోగము. అందువలన దీనికి సాంఖ్యయోగ మని పేరు కలిగినది.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే సాంఖ్య
యోగోనామ ద్వితీయోధ్యాయః

స ం పూ ర్ణ ః

---

# శ్రీ భగవద్గీతోపన్యాసములు

## 3 వ అధ్యాయము

## కర్మయోగము

రెండవ అధ్యాయమందు చెప్పిన సంగతులను అర్జునుడు విని యీ యధ్యాయ ప్రారంభములో శ్రీకృష్ణ పరమాత్మను ఒక ప్రశ్న అడుగుచున్నాడు. (శ్లో॥ 1,2) కర్మ సాధనమని, జ్ఞానము సాధ్యమనియు, రెంటిలో జ్ఞానము శ్రేష్ఠమని చెప్పి, నన్ను జ్ఞానమార్గము వదలి అధమమైన కర్మయోగములో ఏల ప్రవేశపెట్టవలయును? కర్మలో అహింసాత్మకమైనట్టి కర్మల వదలి, హింసాత్మకమైనట్టి కర్మ, యుద్ధము నాకేల విధించవలయును? ఇందువలన నా మనస్సులో యిదివరకున్నట్టి సందేహములు మరింతయెక్కువైనవి. జ్ఞానకర్మయోగ సమ్మేళనవల్ల నేను ఏ తెరువు మంచిది అని నిశ్చయింప జాలకున్నాను. ఈ రెంటిలో నెయ్యది శ్రేయస్కరమో? తెలుపవలసిన దని అర్జునుడు శ్రీకృష్ణపరమాత్మను కోరెను. (శ్రేయస్కర మనగా, ఆరంభములో కష్టము, కాని అంత్యములో సుఖము కలిగించునది. (వేపఉండ మాదిరి) e.g. జపము, తపము మున్నగునవి. ప్రియము=అనగా తాత్కాలికసుఖ మిచ్చినను, ఉత్తరోత్తర కష్టము కలిగించునట్టిది. e.g. టాకీస్. కాఫీహోటళ్ళు మొదలగునవి.

అందుకు శ్రీకృష్ణుడు ఈ విధముగా జవా బిచ్చెను. అర్జునా! నేను సృష్ట్యాదిలో రెండు రకముల మనుజుల సృష్టించి నాను. (1) అంతఃకరణశుద్ధి కలవారు, (2) అంతఃకరణశుద్ధి లేనివారు. మొదటిరకములో చేరినవారికి జ్ఞానయోగము, రెండవరకమువారికి కర్మయోగము విధించినాను.

అర్జునుడు అంతట తనను అంతఃకరణశుద్ధి లేనివానిగా యెట్లు చెప్పగలవు అని పరమాత్మను ప్రశ్నించగా, పరమాత్మ యేమని సెలవిచ్చినాడనగా - కర్మానుష్ఠానము చేయని వానికి జ్ఞానము అలవడదు. చిన్నక్లాసులో పరీక్ష ప్యాసైనగాని పెద్దక్లాసులో కూర్చొన వీలులేదు. అట్లే కర్మల నేనాడు చేయని వారికి, కర్మలు మధ్య వదలినవారికి జ్ఞానము కలుగదు. అసలు సర్వీస్ చేయనివారికి, కొన్నాళ్లుచేసి మానుకొన్న వారికి పింఛన్ రాదు. కర్మ చాలాకాలము చేయుచుండవలెను. మన శరీరముపై కురుపు లేచిన, అది లోపలనుండి మానుపట్టి పై పక్కు దానిఅంతట అదియే ఊడిపోవలయును. అట్లే Time conception దాటునంతవరకు అనగా - కాలచక్రమున కతీతుల మగువరకు మానవులు కర్మ చేయవలెను. అపుడు కర్మలు వానియంతట నవి వీడిపోవును. అంతియేగాని, వాటిని మనంతట మనము వదలివేయరాదు. కనుక కర్మ చేసియే తీరవలయును. కర్మ సాధనము, జ్ఞానము సాధ్యము. కర్మ (disciplinary measures) గోడకు పునాదివంటిది. పిల్లలు బాగుపడవలెననిన వారిని చిన్నతనమునుండి కట్టుదిట్టములో నుంచవలయును.

లేకున్న వారికి చదువురాదు. మానవులు వారివారి వర్ణాశ్రమ ధర్మముల ననుసరించి స్నానము, సంధ్య, జపము మున్నగు కర్మల జేసి, తదుపరి తమ లౌకిక వ్యాపారములను చక్కబెట్టు కొనవలయును. ఆరంభములో జ్ఞానము కుదురదు. కనుక అర్జునా! కర్మానుష్ఠానము చేయవలయును. కర్మానుష్ఠానము ద్వారా జ్ఞానము, తద్ద్వారా మోక్షము జీవులు పొందగలరు.

అన్నికర్మలు వదలిపెట్టినవాడే జ్ఞానమునకు అర్హుడు. అనగా జ్ఞానమునకు అర్హత అన్నికర్మలు వదలిపెట్టదగినస్థితి వచ్చునపుడు కలుగుచున్నది. మానవుడు ఒక నిముసమైనను యేపని చేయకుండ నుండజాలడు. It is impossible to keep quiet. The clock goes on ticking till the key is out. The pent-up energy must have its vent. It is not in our nature to keep quiet even for a trice. జీవుడు ప్రాచీనకర్మకు లోబడి అస్వాధీనుడై యేదో కర్మలుచేయు చున్నాడు. కనుక మనయందలి శక్తిని, నదికి ఆనకట్టవేసి కాల్వలు త్రవ్వి, వానిగుండా పొలములకు నీరుపంపి సాగుచేసు కొనునట్లు సరియైన మార్గములలో ప్రవేశపెట్టవలయును. ఆన కట్ట లేకపోయినచో నదులలో నీరంతయు పోయి సాగరమందు కలసి క్షారోదకమై నిరుపయోగ మగుచున్నది. అట్లే మన యందలి శక్తి (energy) మంచి మార్గములో పెట్టకున్న వృథాగా పోవును. కాలు నిలకడ లేనివారు గుడికి ప్రదక్షిణ ములు చేసినయెడల కాళ్ళకు పరిశ్రమతోపాటు భగవంతుని

యందు మనస్సు కుదురును. కాని రోడ్లవెంబడి తిరిగిన అట్టి ప్రయోజనములు కలుగవు. (శ్లో॥ 5)

కర్మేంద్రియములను మాత్రము నియమించుకొని మనస్సుతో నెవడైతె ప్రాపంచిక విషయములు యోచన చేయుచుండునో, అట్టివాడు ప్రపంచమును మోసపుచ్చు కపటాచారి. (శ్లో॥ 6)

ఎవడైతే జ్ఞానేంద్రియములను మనస్సుతో నియమించుకొని, కర్మేంద్రియములతో నియమితకర్మలను చేయునో అట్టివాడే శ్రేష్ఠుడు. (శ్లో॥ 7) కనుక కర్మలు చేయవలయును. నీ యిష్టమువచ్చిన కర్మలను జేయరాదు. నీకు నీ జాతివర్ణాశ్రమముల బట్టి నియమింపబడిన కర్మలను చేయుము. Do your duties prescribed by the Vedas in consonance with your caste, creed or sex. కర్మచేయక వదలి పెట్టుటకంటె కర్మచేయుటయే శ్రేష్ఠమైనది. కర్మలన్నిటిని వదలిపెట్టిన శరీరయాత్ర జరుగుట కష్టము. శరీర మున్నగాని సత్కర్మచేయ వలనుపడదు. కనుక శరీరసంరక్షణకు అవసరమైనట్టి కర్మలనైన చేసి తీరవలయును. "శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్" అని చెప్పబడినది. (శ్లో॥ 8)

మరియు యజ్ఞము నిమిత్తము అనగా విష్ణు ప్రీత్యర్థము కర్మలు చేయుము. Discharge all your duties for God's sake, and not for your own self. Eat to worship God. ఈశ్వరార్పణముగా చేయనికర్మలు, అనగా స్వార్థము

నిమిత్తముచేయు అన్నికర్మలు మానవుని యీప్రపంచములో బద్ధుని చేయుచున్నవి. కనుక ఫలాపేక్షను వదలిపెట్టి, ఈశ్వరార్పణ బుద్ధితో ఆయాకర్మల జేయుము. (శ్లో॥9) యజ్ఞము= యజ్ఞో వై విష్ణుః అని చెప్పబడినది. కనుక యజ్ఞార్థాత్ అనగా విష్ణుప్రీత్యర్థ మని గ్రాహ్యము. మరియు, 'ముక్తసంగ స్సమాచర' అనగా, నేను చేయుచున్నాను అను అభిప్రాయము ఉండరాదు. భగవంతుడు నాచేత చేయించుచున్నా డనుకొన వలయును. మరియు ఫలాపేక్ష వదలిపెట్టవలయును. సమాచర= అనగా ఈశ్వరార్పణముగా జేయుకర్మలను కూడ నీ స్వార్థము కొరకై చేయుకర్మలను ఎంత యుత్సాహముతో చేసెదవో, అట్టి యుత్సాహముతోనే వాటిని నిర్వర్తించవలయును.

ప్రపంచమును సృష్టించునపుడు మనుష్యులతో పాటు యజ్ఞములను సృష్టించి బ్రహ్మదేవుడు మానవులతో నిట్లనియె. 'మీరు మీయజ్ఞముల నెరవేర్చినయెడల మీకోర్కెలు నెరవేరును. కామధుక్ అన కామధేనువు యే మాదిరిగా కోరిన దెల్ల యిచ్చునో అట్లే ఆ యజ్ఞములు చేయుటవలన కోరినదెల్ల పొందనగును. యజ్ఞము అనగా విష్ణుప్రీత్యర్థమై చేయు కర్మలు అని అర్థము. (శ్లో॥ 10) మరియు సృష్ట్యాదిలో దేవతలను, మనుష్యులను బుట్టించి. మనుష్యులను పిలిచి బ్రహ్మ వారితో "మీరు యజ్ఞములచేసి దేవతలను తృప్తిపరచుడు. అందువలన దేవతలు సంతసించి, సకాలములో ఎండ, వర్షము మొదలగునవి కలిగించెదరు. పాడిపంటలు చక్కగానుండును. ఇట్లు మీ రొండొరులకు సహాయము చేసికొనుచో అందరికి శ్రేయ

స్కారము" అని చెప్పెను. దేవతలకు సత్రాశను లని పేరు. అనగా యజ్ఞయాగాది క్రతువులలో వేల్చబడు హవ్యకవ్యాములవల్ల తృప్తిచెందువారు. హవ్యము=దేవతలకు సమర్పించునది, మానవులకు దేవతలకు లంకె (Connecting link) కర్మలు అని గ్రహించవలయును. (శ్లో 11.)

అట్లు యజ్ఞములవలన ఆరాధింపబడిన దేవతలు మనుష్యుల కోర్కెలన్నిటిని నెరవేర్చుచున్నారు. వారి అనుగ్రహమువల్ల పొందిన పదార్థములను వారికి విశ్వాసముతో సమర్పింపక ఆరగించువాడు వట్టిదొంగ. అంతయు భగవంతుని సొత్తు. సొంతకాడైనట్టి భగవంతుని మఱచి మనకు హక్కులేనిదే మన దనుకొని అనుభవించుటయే దొంగతనము (శ్లో12.) 'ఎవరైతే సకల దేవతలను తన శరీరముగా కలిగిన పరమాత్మకు నివేదన చేయకుండ భుజించెదరో వారు పాపపు టుండల మ్రింగుచున్నారు' అని 13-వ శ్లోకమునందు చెప్పబడినది. ఇది చాలా ముఖ్యమైన శ్లోకము. యజ్ఞశిష్టాశిన స్సంతః- అనుటలో యజ్ఞము అనగా నేమి? ఆశ్రమములలో నెల్ల గృహస్థాశ్రమము మంచిది. ఇతరాశ్రమవాసులు తంగేటిజున్ను వలె గృహస్థాశ్రమవాసులపై ఆధారపడి యుండెదరు. మానవునికి అయిదు వస్తువులు లేనిదే సంసారము జరుగదు. "ఖండినీ పేషిణీ ఛుల్లీ ఉదకుంభీచ మార్జనీ,పంచసూనా గృహస్థస్య తాభి స్స్వర్గం న విందతి" కత్తిపీట (తరుగునదియు,) రుబ్బురోలు (నూరునదియు,) పొయ్యి, కుండ, చీపురుకట్ట యీ అయిదు లేనిదే యెటువంటి బీదవానికైనను సంసారము జరుగదు. వీని నుప

యోగించునపు డనేక సూక్ష్మజీవులు చచ్చును. వీటి అయి దింటివలన కలుగు దోషములకు పంచసూనదోషము లని పేరు. వీటిని పోగొట్టుకొనినగాని జీవుడు తరించడు. అందుకై పంచ మహాయజ్ఞములు యేర్పరచబడినవి.

అవి యేవనగా (1) బ్రహ్మయజ్ఞము — వేదపారా యణ (Scriptural study) లేక పురాణపఠనము.

(2) దైవయజ్ఞము:— (Divine worship) దేవ తార్చన, వైశ్వదేవము మున్నగునవి. ఈశ్వరారాధనచేయుట. మరియొక పద్ధతి యేమనగా ప్రపంచమందలి పనులను చూచి వీని యన్నిటికి నియామకుడైన పనివాడు భగవంతుడు బుద్ధి శాలి యని యూహించుట. దీనిని Ontological argument అనెదరు. Look at the shining stars in the firmament and the creeping creatures below. They all proclaim the existence of Divinity. The stars in the sky, and waters in the sea proclaim Divine glory, "The Sun and the Moon in their passage are singing, The hand that made us is Divine."

ఆకాశమందలి నక్షత్రముల వంకను, భూమిపై పాకు చిన్నజంతువులను చూడుము. అవి అన్నియు భగ వంతుని మహిమను చాటుచున్నవి. సముద్రమందలి నీరు, ఆకాశమందలి నక్షత్రములును ఆయన కీర్తిని ఉద్ఘోషించు చున్నవి. సూర్యచంద్రాదులు తాము సంచరించుచు ఒకపాట పాడుచున్నారు. అదియేమన "మాసృష్టికర్త ఆ భగవానుడే."

చిలక ముక్కులయందలి యెఱ్ఱనిరంగు, నెమలిపింఛ మందలి సౌష్ఠవము, గులాబిపూలలోని సువాసన, మామిడి పండ్లయం దలి తీపి— యివి అన్నియు ఆ పరాత్పరునివలననే కలిగినవి. "Who made the mangoes so very sweet? Is it the garden owner or the gardener?: Neither of the two It is God. Do not forget the existence of God in all these things."అన్నివస్తువులు ముందుదైవమునకు నివేదనచేసి తరువాత నీవు ఆరగించుము. అదియే దైవయజ్ఞము. టపాలో ఉత్తరమువేసిన చిరునామాదారునకు చేరుచున్నట్లు, నోటవేసి కొనిన అన్నము రక్తముగా మన దేహమందలి యితరావయ వములన్నిటికి బలముకలిగించునట్లు, మనము యేదేవతలకు నివే దన లేక హోమముచేసినను, అవి అన్నియు సర్వాంతర్యామి, అందరు దేవతలను తనశరీరముగా కలిగిన ఆపరమాత్మకే చేరు చున్నవి. దైవభక్తి, దేవతార్చన, తులసిపూజ తగ్గిపోవుట వలననే భయంకరమైన రోగములు, అపమృత్యువు కలుగు చున్నవి.

(3) పితృయజ్ఞము:— తల్లిదండ్రులు జీవించియున్న, వారిని పార్వతీపరమేశ్వరులు లేక లక్ష్మీనారాయణులవలె భావించి వారిని పూజించుట. తండ్రియొక్క ఋణము ఒకవేళ తీర్చినను తీర్చవచ్చునుగాని తల్లిఋణము తీర్చజాలము. తల్లికి యెక్కువ ప్రాముఖ్యము అన్ని దేశములలో నిచ్చియున్నారు. తండ్రికొరకు స్వార్థత్యాగముచేసిన వారిలో శ్రీరామునికంటె భీష్ముండు ఎక్కువ. తల్లిదండ్రులు బ్రతికియున్నంతకాలము వారు చెప్పినమాటలు విని, అట్లునడచి, వారు కాలముచేసిన

పిదప వారి ఆత్మశాంతి కొరకై పిండప్రదానములు మున్నగు నవి చక్కగా చేయవలయును.

(4) మనుష్యయజ్ఞము లేక నరయజ్ఞము:— మానవ (మాధవ) సేవ. 'Verily, verily, the human body is the living temple of God". మానవశరీరము భగవంతుని ఆలయము అని బైబిలులో చెప్పబడినది.

(5) భూతయజ్ఞము:—జంతుసేవ (Service to the dumb creatures) e. g. నీళ్ళతొట్లు వేయించుట, పింజరపోల్సు, గోరక్షణశాలలు మున్నగునవి నిర్మించుట, పిండితో ముగ్గు వేయుట, శునక సూకరనారాయణులకు అన్నము పెట్టుట, పుట్టలో పాలుపోయుట మున్నగునవి.

కర్మయోగ మందలి సారాంశ మంతయు, ఈ పద మూడవ శ్లోకమం దిమిడియున్నది. Vivekananda said, 'Serve God; serve humanity, and serve the world at large.'' ఈ శ్లోకము ఈశ్వరసేవ, మానవసేవ, ప్రపంచ సేవ చేయవలసినదని చెప్పుచున్నది. Live for God, live for humanity and live for the world at large. Root out selfishness, lead a life as unselfish as possible. Unselfishness is godly. స్వార్థపరిత్యాగముతో, పరోప కారార్థమై నీ శరీరము నుపయోగించుము. అట్లు చేసిన యెడల, "నాది" యనుకొనదగినది యేది లేదనియు. సర్వ స్వము భగవంతుని సొత్తనియు నీ మనస్సున నాటుకొనిపోయి అహంకారము నశించునని వివేకానందస్వామి వ్రాసి.

యున్నారు. "The highest ideal is eternal and entire ideal is eternal and entire self - abnegation, where there is no 'I', but all is thou, and whether he is conscious or unconscious of it, Karma Yoga leads man to that end." (Swami Vivekananda.) భగవంతునికి నివేదన చేయకుండ తాము భుజించువారు 'అఘం' అనగా "అమేధ్యము"ను భుజించిన ట్లని ఒక వ్యాఖ్యానకారుడు వ్రాసి యున్నాడు. మరియు వరాహపురాణమునందు విష్ణువునకు గాని శివునకుగాని నివేదన చేయకుండ భుజించువారు ముందు జన్మలో పందిఅయి పుట్టుదురని వ్రాసియున్నది. మన వీధుల వెంట తిరుగు పందులు అట్టివే అయివుండును.




ఈ జగత్తు ఒక చక్రమువంటిది. దానిని చక్రముగా వర్ణించుటకు కారణము ఏమనగా అయ్యది ప్రారంభించిన

తావునకు తిరిగి వచ్చి చేరుచున్నది. The circle ends where it begins. ఈ జగత్ చక్రమును పరమాత్మ శ్లో॥ 14-16 లందు వర్ణించియున్నాడు.

అన్నసారము వలన పిండోత్పత్తి యేర్పడుచున్నది. మేఘము వలన వర్షము కురిసి సస్యములు ఫలించి అన్నము కలుగుచున్నది. మేఘములు సూర్యుని వలన (యజ్ఞము వలన) కలుగును. అన్ని యజ్ఞములకు అనేక కర్మలు అవసరము. కర్మల విధించునవి వేదములు. అయ్యవి వినాశములేనట్టి పర బ్రహ్మస్వరూపమునుండి వెలువడినవి. పరబ్రహ్మ సర్వాంత ర్యామి యగుటచే, అంతటను మనశరీరమందుగూడ నున్నాడు. మన శరీరమును పుట్టించి, కాపాడి సంహరించువాడు పరమాత్మ యగుటచే ఆయన మనకు నియమించిన కర్మానుష్ఠానము చేసి ఆయనను తృప్తి పరచవలయును. Carlyle said 'Work is worship.' ఇట్టిజగచ్చక్రముతో సంబంధింపబడిన జీవులమగు మనము విహిత కర్మానుష్ఠానము చేసినచో బంధమునుండి విడి పింపబడుదుము. ఎవడు కర్మలను చేయడో వాడు వ్యర్థమైన ఆయువు కలిగినవాడు. (పాపిష్ఠి). అట్టివాడు జీవించియుండుట నిష్ప్రయోజనము. వాడు కర్మభ్రష్టుడు. అట్టి కర్మభ్రష్టుడు ఇంద్రియారాముడు. కర్మలు చేయునట్టివాడు ఆత్మారాముడు.

ఎవడైతే పరమాత్మయందే రమించుచు, పరమాత్మ యందే సంతుష్టి చెందునో, అట్టివానికి కర్మవలన ప్రయో జనము లేదు (శ్లో. 17). అట్టివాడు కర్మలు చేయనందువలన

దోషములేదు. He has attained the summum bonum of human happiness. అట్టివా డెవ్వరిని ఆశ్రయించడు. (శ్లో॥ 18). కాబట్టి అంత గొప్పస్థితికి రానివారు కర్మ చేయ వలయును. కనుక అర్జునా! నీవు ఎల్లప్పుడు ఫలాపేక్ష లేకుండ కర్మ చేయుము. అట్లు చేయువారు మోక్షము చెందెదరు. (శ్లో॥ 19).

జ్ఞానులు రెండు రకములవారు. 1 కొండగుహాలలో లేక తదితర నిర్జనప్రదేశములలో నుండి తపస్సు చేసికొనుచు తమ ఆత్మోద్ధారణకై పాటుపడువారు. అట్టివారు కర్మచేసినను చేయకున్నను యితరులకు బాధలేదు. 2 సంఘములోనుండు జ్ఞానులు. వీరు జ్ఞానులైనను, కర్మలుచేయుట తమ ఆత్మోద్ధారణ కవసరము లేకపోయినను, ఇతరులకు ఆదర్శప్రాయముగా కర్మలు చేయువారు. అందువలన కృష్ణపరమాత్మ అర్జునునకు తెలిపినది యేమనగా - జనకుడు, అశ్వపతి, ప్రియంవద మొద లగు రాజర్షులు తాము బ్రహ్మజ్ఞానము చెందినను కర్మ వదలి పెట్టలేదు. ఏలననగా, తమకంటె తక్కువస్థితిలో నున్నవారిని క్రమముగా పైకి లేవనెత్తుటకై తమకు అనవసరమైనను వారికి దారి చూపించుటకై కర్మలు చేయుచుండిరి. అట్టివారిలో నీవు శతాంశమైనను కావు. గనుక నీవుకూడ కర్మలు చేసియే తీర వలయును. (ఋషులు మూడువిధములు—దేవఋషులు, బ్రహ్మ ఋషులు, రాజఋషులు) ఈ సందర్భములో జనకమహారాజు యెట్టి రాజఋషి యైనది ఒక వృత్తాంతమును బట్టి గమనించ

వచ్చును. యాజ్ఞవల్క్యుడు - జనకుడు, కొందరు మునిశ్రేష్ఠు లకును వేదాంతము నుపన్యసించుచు వారందరిలో జనకుడు మిక్కిలి శ్రద్ధాభక్తులతో వినుచుండుట గాంచి, అతనివైపు అనేకసార్లుచూచి ఉపన్యసించుచుండెను. ఇది జనకునితో పాటు వినుచున్న మునులు చూచి కినిసి, ద్రవ్యాపేక్షతో రాజువైపు చూచుచున్నాడని యపోహపడిరి. ఈ సంగతి ఆ ఋషీశ్వరుడు గుర్తెఱిగి వేదాంతోపన్యాసము మధ్య మునులు బసజేసి యున్నట్టి పూరిపందిళ్లు తగులబడిపోవు చున్నవని కేక వేయిం చెను. అంతట మును లందరు ఉపన్యాసమును వదలిపెట్టి తమ గోచిపాతలు కాపాడుకొనుటకై పరుగెత్తిరి. జనకమహారాజు ధనాగారము యావత్తు నిజముగా యాజ్ఞవల్క్యుడు తగులబడు నట్లొనర్చినను, మంత్రు లందరు వచ్చి రాజుతో మొరబెట్టు కొన్నను, దానిని లెక్కసేయక తాను ఆత్మవిచారణలో నున్నా ననియు, ఆత్మకు నెట్టి నాశనము లేదనిన్ని, మిథిల కిదివర కెందరో అధిపతు లుండిరనియు, యికముం దుండగలరనియు, మిథిలకు తనకు శరీర మాత్రసంబంధమే యగుటచే మిథిల మండిపోయినను, తన ఆత్మ మండుటలేదనియు మంత్రులతో చెప్పి నిర్వికారముగా కూర్చొనియెను. ఈ చిత్రమువలన జనకు డెట్టి అంతర్ముఖుడైనది యాజ్ఞవల్క్యు డితరుల కెరుకపరచెను. ఇచట జనకునివిషయము ప్రస్తావించుటలో అర్జునుడు క్షత్రియు డగుటచే క్షత్రియుని ఉదాహరణముగా నిచ్చినచో మనసున నాటునని శ్రీకృష్ణుని అభిప్రాయ మని గమనించ నయ్యెడిని

(శ్లో 20.) గొప్పవారు, పెద్దలు నేపనిచేసిన నితరులు నా పని చేయుచున్నారు. కనుక పెద్దలు జాగరూకులై జీవయాత్ర గడుపవలెను. (శ్లో॥ 21.) మరియు అర్జునా! నేను ముక్తిప్రదాతను. త్రిలోకములయందు నేను పొందవలసిన ప్రయోజనము లేదు. అయినను నేను కర్మచేయుచున్నాను. (శ్లో॥ 22.) నేను బద్ధకించి కర్మచేయకున్నచో, పామరు లందరు నన్ననుసరించి కర్మ వదలిపెట్టెదరు. మానవులు చేయవలసినపని యెగబెట్టుట త్వరలో అలవాటు చేసికొనియెదరు. ఒకరిని చూచి మంచి చేయుద మనుకొనుట దుర్లభము. People catch and imitate evil in others very easily but not so in the case of good qualities. (శ్లో. 23.) నేను కర్మ చేయకపోయిన యెడల జనులందరు కర్మ వదలిపెట్టి కర్మభ్రష్టు లగుదురు. అందువలన వర్ణసంకర మేర్పడి జనులు చెడిపోయెదరు. కనుక ప్రవృత్తికర్మ చేయువాడు ఎంతఉత్సాహముతో కర్మచేయునో అట్టి ఉత్సాహముతోడనే ఫలాపేక్ష లేకుండ లోకసంగ్రహార్థము కర్మచేయువారుకూడ కర్మ చేయవలయును. ఈ నియమము అన్ని వ్యవహారములలో కూడ గమనించవలయును. (శ్లో॥25 ) కనుక జ్ఞానికిని కర్మకావలెను. అజ్ఞానికి కర్మకావలయును. (e.g పరీక్ష ప్యాసయినను తిరిగి ఆ పుస్తకములు చూడనిదే అందలి విషయములు బోధపడవు. స్కూలు మేష్టర్లు తాము ఎంత చదువుకొన్న వారైనను, పిల్లలకు చెప్పవలసిన పాఠములకు నోట్సు వ్రాసి పెట్టుకొనియెదరు. అల్లే ప్లీడర్లు తమ కేసుల

గురించి ముందుగా నోట్సువ్రాసి పెట్టుకొనియెదరు. వారట్లు చేయనిచో, వారికి ఉన్నజ్ఞానము తగ్గిపోవును.

అవతారిక:—జ్ఞానికి, జ్ఞానము లేనివారికి, నుభయులకు కర్మానుష్ఠాన మవసరమయినచో అనుష్ఠించు విధమందు వీరల కేదైన భేదముగలదా? దీనికి సమాధానము చెప్పబడు చున్నది.

జ్ఞానిగా నుండువాడు కర్మాతీతుడైనను కర్మయందాసక్తి గల పామరజనులకు పెద్దవిషయములు చెప్పి చెడగొట్టరాదు. ఇతరులకొరకు చేయుకర్మలను చక్కగా నిర్వర్తించి వారలకు మార్గదర్శి కావలయును. (శ్లో॥ 26.) ఈ గుళ్ళు గోపురముల చుట్టుతిరుగుట, పుణ్యానదులలో స్నానముచేయుట మున్నగు నవి లాభము లేదనియు, త్రివేణి, ఇడా, పింగళా, సుషుమ్న యున్నవి, అందులో స్నానముచేయవలయుననియు కొందరు చెప్పెదరు. అది సోమరిపోతు వాదము. ఇతరుల కుపదేశము చేయదలచువారు Constructive గా చెప్పవలయును. నెలకు పదిహేనురూప్యముల జీతము తెచ్చుకొని పొట్టపోసికొను గుమాస్తాకు చక్కగా పనిచేసిన ప్రమోషన్ వచ్చునని చెప్ప వలయునేగాని, చేసిన తహశ్శీలుదారు పనిచేయవలయును; లేక పోతే మానివేయ వలయును అని చెప్పిన వాడుద్యోగము మానుకొన్నచో తినుటకు తిండి యుండదు.

అహంకారమునకు లోబడిన మూఢుడు ప్రాచీనకర్మ బద్ధుడై ప్రకృతిమాయకు లోబడి కర్మ యంతయు తానే

చేయుచున్నా ననియు, తన స్వప్రయోజకత్వమువలన దానిని నిర్వర్తించుచున్నట్లుభ్రమపడుచున్నాడు. జ్ఞాని కర్మ యావత్తు భగవంతునివలన తనద్వారా నడిపింపబడుచున్నదని గ్రహించును. అనగా జ్ఞాని కర్త, కర్మ, క్రియ, ఈ అన్నింటియందును శ్రీ జనార్దనస్వరూపమునే గాంచుచున్నాడు. (శ్లో॥ 27).

జ్ఞానిగా నుండువాడు గుణములను కర్మలను విభజించి తెలిసికొని ప్రకృతి వికారములైన ఇంద్రియములు ప్రకృతి వికారములైన విషయములతో సంబంధపడుచున్నవియే గాని, చైతన్యస్వరూపి యగు తనకు (ఆత్మకు) ప్రాకృతికవిషయములతో సంబంధము లేదని తెలిసికొనును. (శ్లో॥ 28). మూఢుడు ప్రాపంచిక విషయములతో తనకు సంబంధ మున్నట్టు భ్రమించును. చక్కగా విచారించిన జ్ఞానికి ఏవిధమైన వికారము లుండవు. ప్రాపంచిక విషయములచే జ్ఞాని పీడింపబడడు. (శ్లో॥29) సకలలౌకిక, వైదిక, నిత్య నైమిత్తికాదికర్మలను ఆత్మచింతతో నాయందు సమర్పించి అహంకార మమకారములు లేకుండ ఫలాపేక్షను వదలిపెట్టి, సంసారసంబంధమైన యెట్టి చింతయు లేక భార మంతయు నాయందుంచి చేయవలయును. అట్టివారికి చింత లన్నియు రూపుమాపెదను. వారలు విగతజ్వరులయ్యెదరు. జ్వరము అనగా cares and anxieties as regards family affairs = గృహసంబంధమైన తాపత్రయము, విగతజ్వర= Freedom from all such cares and anxieties ; అట్టి తాపత్రయమునుండి విడిపింపబడుట యని అర్థము. (శ్లో॥ 30) ఎవ

గై తే నా అభిప్రాయము ప్రకారము శ్రద్ధతో, ఓర్వలేమి లేక కర్మానుష్ఠానము జేయుచున్నారో అట్టివారు సకల పాపపుణ్యములనుండి విడిపింపబడి మోక్షసామ్రాజ్యమును జెందెదరు. (శ్లో॥31). ఎవఁడు ఓర్వలేమి కలిగి నా యభిప్రాయ ప్రకారము కర్మానుష్ఠానము చేయడో, వాడు పరమమూఢుడు. అట్టివాడు సంసారబంధములో తగులుకొని యనేకవిధములుగా చెడిపోవు నని యెరుగుము. Realise that the man who will not carry out my mandate will be entangled in the meshes of Samsara and will be lost for ever.

జీవులు వారివారి ప్రాచీనకర్మకు లోబడి పనులుచేయుచున్నారు. అట్లుండ నిగ్రహమువలన నేమి ప్రయోజనము? ఈప్రశ్నలకు సమాధానము 33 శ్లోకమం దివ్వబడినది. అది కర్మయొక్క వేగమును తగ్గించును.

మఱియు ఇంద్రియములకు విషయములయందు రాగ ద్వేషము లేర్పడుచున్నవి. రాగద్వేషములు జీవునకు బలమైన శత్రువు లగుటంజేసి, వాటికి మనము వశము కాకూడదు. [శ్లో. 34]

కనుక మన ప్రయత్నము మనము చేసి కర్మయొక్క కాఠిన్యము తగ్గించుమార్గము అనుసరించవలెను. వారి వారి స్వధర్మములను అనుష్ఠించి, జాతిమతానుసారేణ విధింపబడిన ధర్మములు ఇతరులకు దోషయుక్తముగా కను

పడుచున్నను, వాటిని ఆచరించుటయే శ్రేయస్కరము. అట్లు ఆచరించక, యింకొకజాతి ఆశ్రమధర్మముల ననుసరించిన నరక ప్రాప్తియే యగును. స్వధర్మానుష్ఠానము చేయుచు చనిపోవుటయే శ్రేయస్కరమైనది. [శ్లో ॥ 35] To die in one's own faith is far preferable to following other faiths however good they may be. e.g. భర్తకు చారు అన్నము వండిపెట్టినను పరవాలేదు. కాని పరపురుషునికి పరమాన్నము నండిపెట్ట తగదు. మన దేవాలయములకు సంవత్సరమున కొకసారి వెళ్ళినను పరవా లేదుకాని, వాటిని వదలిపెట్టి నిత్యము యితర దేవాలయములకు వెళ్ళిన నరకప్రాప్తి ఘటిల్లును.

ఈ విషయములను వినిన తరువాత, అర్జునుడు పరమాత్మను ఒకప్రశ్న వేయుచున్నాడు. ఏ బలవత్తరమైన కారణము వలన ప్రేరేపింపబడి, మానవుడు తాను చేయదలచుకొన్న పని చేయకపోవుటయు, చేయదలచుకొనని పని చేయుటయు తటస్థించుచున్నది. [శ్లో. 36] ఈ ప్రశ్నకు సమాధానము శ్లో. 37-40 లం దివ్వబడినది. ఆశ, కోపము రెండు మానవునికి బలమైన శత్రువులు. అవి రజోగుణము వలన గలుగునవి. గొప్ప ఆహారమును గోరునవి. (Those desires are insatiable) ఎక్కువ పాపకార్యములు చేయునట్లు ప్రేరేపించుచున్నవి. కనుక జీవునికి సంసారములో కామక్రోధములు గొప్ప శత్రువులు. భారతమం దిట్లు చెప్పబడినది.

"శ్లో॥ న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే."

నిప్పులో కట్టెలు నెయ్యివేసినకొలది అగ్ని ప్రజ్వరిల్లునే కాని తగ్గదు. అట్లే ఆశకు కావలసిన పదార్థములు ఇచ్చుట వలన దానిని పోగొట్టజాలము. అది మరింత వృద్ధి యగును.

కామ క్రోధములు సంసారములో చిక్కుబడిన వారికి శత్రువులు. కామినీ కాంచనములయందలి ఆసక్తియే ఆత్మ సుఖమునకు కారణభూతములైన పనుల జేయనివ్వదు. అయ్యది మన వర్ణాశ్రమధర్మముల ననుష్ఠించుటకు ప్రతిబంధకమగు చున్నది. కామమును రూపుమాపుటకు అనుభవించి తృప్తి పరచలేము. మండు పుల్లలపై నెయ్యిపోసిన మంట మరింత యెక్కువగును. మంట ఆర్పవలయుననిన, దానిపై మట్టి కొట్ట వలయును. అట్లే కామమును మొలకెత్తకముందే దానిని అణచివేయవలయును. ప్రాపంచిక విషయములను భోగము వలన జయించజాలము. ఆశ పరమశత్రువు. ఆశ విఫలమైన, మన కోర్కెలకు అడ్డుపడు వారిపై క్రోధము జనించుచున్నది. Anger is the resultant of baffled desires. క్రోధము వలన యుక్తాయుక్త విచక్షణ నశించిన మానవు డెట్టి పని నైనను చేయుచున్నాడు. మనకు కోపము ఎవరిపైనున్న వారల చూడము, వారలతో మాట్లాడము. అట్టిచో రౌరవనరకము నకు హేతుభూతమైన కోపముపై నీవు యెందుకు కోపము తెచ్చుకొనగూడదు ?

కామక్రోధములు అందరికి గలవు. కాని కొందరిలో యెక్కువ,మరికొందరియం దవి తక్కువగా నుండును. It is only a difference in degree. సంసారములో చిక్కుబడినవారిని మూడురకములుగా విభజింప నయ్యేడిని. 1. ఉత్తములు (సాత్వికులు). 2. మధ్యములు (రాజసులు) 3. అధములు (తామసులు). కామక్రోధములు మూడు రకములవారిని మూడువిధములుగా బంధించుచున్నవి. మొదటి తరగతివారిని సాత్వికులను పొగ నిప్పును గప్పినట్లు కామక్రోధములు బంధించుచున్నవి. వారు వాటివలన కలుగు చెరుపును వినినంత మాత్రమున (నిప్పును ఊదినట్లు) పోగొట్టుకొందురు. రెండవ తరగతివారికి రాజసులకు అద్దముమీద మురికిపడినట్లు మరింత యెక్కువగా బాధించును. దానిని పోగొట్టుకొనుటకు ఎక్కువ శ్రమపడవలెను. అనేక జన్మలయందు శ్రవణము మననము చేసినకాని రాజసులు కామక్రోధముల పోగొట్టుకొన జాలరు. మూడవ తరగతి——తామసులను జీవుడు గర్భములో నుండునపుడు మావిసంచి కప్పియుండునట్లు కామక్రోధములు పూర్తిగా వారల ఆవరించియుండును. పరమాత్మ ప్రత్యేక కటాక్షము ప్రసరింపజేసినగాని తామసులు తరించరు(శ్లో॥38).

జ్ఞానికి కామక్రోధములు నిత్యశత్రువులు. స్థూలదృష్టిపై యీ వాక్యమునకు అర్థము ఏమని స్ఫురించవచ్చుననగా నివి అజ్ఞానికి శత్రువులు కావని; కాని, అది గొప్ప పొరపాటు.

అవి జ్ఞానికి అజ్ఞానికి యిద్దరికిని పరమశతృవులు. అయితే జ్ఞాని వాటిని అట్టివానిగా గుర్తెరిగి జాగ్రత్తతో ప్రవర్తించును. అజ్ఞాని మాయచే కప్పబడి అజ్ఞానాంధకారమున మునిగి అవి తనకు శతృవులని తెలియకున్నాడు. అవి యెట్టివనగా నిప్పు మాదిరి నింపుటకు శక్యము గానట్టివి. తృప్తిపరచుటకు సాధ్యము కానట్టివి. (శ్లో॥40). ఈ కామక్రోధములు ఇంద్రియములద్వారా లోపల ప్రవేశించి మనోబుద్ధులను పాడుచేసి జీవుని జ్ఞానమును నశింపచేయుచున్నవి (శ్లో॥ 40).

కనుక ఓ అర్జునా! ఆరంభములోనే నీవు ఇంద్రియముల జయించవలెను. అందువలన జ్ఞానవిజ్ఞానముల రూపుమాపు కామమును జయించనగును. జ్ఞానము= Theoretical knowledge. విజ్ఞానము = Practical knowledge. మరియొకరు వ్రాసినది యేమనగా:—జ్ఞానము = General knowledge, విజ్ఞానము = Detailed knowledge (శ్లో॥ 41). కనుక ఈ విషయములను నీవు చక్కగా తెలిసికొని పరమాత్మయందు మనస్సుంచి ధ్యానము చేయుటవలన నింప శక్యముగాని కామక్రోధముల జయింపుము. ఆయన దయలేనిదే వాటిని జయింప వీలుపడదు. జీవుడు భగవదనుగ్రహము లేనిదే కేవలము తన కృషివలన కామక్రోధముల జయింపజాలడు. (శ్లో॥ 42) కావున భగవంతుని ఆరాధింపుము. కృష్ణునకు కుమారుడగు మన్మథుడు (ప్రద్యుమ్నుడు) తండ్రి అదుపు ఆజ్ఞలకు లోబడినవాడగుటచే తండ్రియుండు తావున తాను వెరగందియుండడు.

శివుడు మన్మథుని దగ్ధముచేసినవా డగుటచే, ఆయనను భజించుటవలన కామము సులభముగా నశించును. కనుక వారిద్దరిలో నెవరిని భజించినను కామము నశించును. మానవులు భగవంతుని భజించి, ఆయన అనుగ్రహమునకు పాత్రులై, కామక్రోధముల జయించి, సంసారబంధములనుండి విడిపింపబడి మోక్షము చెందగలరు. (శ్లో॥ 43)

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే కర్మయోగో
నామ తృతీయోధ్యాయః
సంపూర్ణః



# శ్రీ భగవద్గీతోపన్యాసములు



## 4 వ అధ్యాయము

## జ్ఞానయోగము.

శ్లో॥ 1. అర్జునుడు, శ్రీకృష్ణపరమాత్మను జ్ఞానయోగ కర్మయోగములను ఇదివరలో నెవరికైన ఉపదేశించితిరా? యని ప్రశ్నించగా శ్రీకృష్ణుడు సృష్ట్యాదిలో సూర్యునకు, అతడు దానిని వైవస్వతమనువునకు, మనువు ఇక్ష్వాకునకు ఉప దేశించె నని చెప్పెను.

శ్లో॥ 4. అందుపై అర్జునుడు పరమాత్మను, నీవు ఇటీవల జనన మొందినవాడవగుటచే సృష్ట్యాదిలో ఉపదేశించియుండుట యెట్లు? అని ప్రశ్నించెను. అందుకు శ్రీకృష్ణుడు తా నిదివరకు అనేక జన్మములు యెత్తినట్లు చెప్పెను. (శ్లో॥5). పరమాత్మకు కూడ సాధారణమనుజునికి వలె జనన మరణము లున్నచో వారిద్దరికి గల భేద మేమి? అను సమస్యకు సమాధానము 6 వ శ్లోకమం దివ్వబడినది. ఇద్దరికి గల భేదములు : (1) జీవుడు అణుమాత్రుడు. ie. atomic that which cannot be divided into two even mentally పరమాత్మ సర్వాంతర్యామి. He is all-pervading and all-permeating (2) జీవునకు చావుపుట్టుక లున్నవి. పరమాత్మునకు అట్టివి లేవు. "అవ్య

యాత్మా". పరమాత్మ పాంచభౌతిక శరీరములో ప్రవేశించి నప్పుడు అవతారమనిన్ని, దానిని చాలించినపుడు నిర్యాణ మనిన్ని చెప్పవలయును. (3) పరమాత్మ మాయను జయించి, దానిపై స్వారిచేయుచున్నాడు. జీవుడు మాయలో మునిగి యున్నాడు. (4) పరమాత్మకు భూత, భవిష్యత్, వర్తమాన కాలములందు జరుగు యావద్విషయములును దెలియును. జీవునికి అట్టివి తెలియవు.

అయినచో సర్వాంతర్యామి అయిన భగవంతుడు అవతారము లేల యెత్తవలయును? దీనికి 7, 8 వ శ్లోకములు సమాధానము. ఎప్పుడు ధర్మమునకు హానియు, అధర్మమునకు అభివృద్ధి కలుగునో తా నప్పు డవతరించి దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేయుదునని సెలవిచ్చియున్నాడు. అట్టి అవతారములు తాల్చి పరమాత్మ సాధారణ మనుజునివలె కష్టసుఖముల పాలు యేల కావలయును? అవతారము లన్నియు మానవుని బోధకొరకై పరమాత్ముడు చేసిన లీలలు. జ్ఞానసంపన్నులు జ్ఞానశూన్యుల నుద్ధరించవలయు ననిన తా మెచ్చటనో కూర్చుని పత్రికాముఖంబున తెలిపిన సర్వసాధారణులకు జ్ఞానోదయము కలుగదు. తాముకూడ పై మెట్టు దిగి వారిలో కలిసి మెలిసి వారికి బోధచేయవలయును. e.g. పసిపిల్లవాడు మేడమెట్లు యెక్కలేక పడి దుఃఖించునప్పుడు మేడపై నున్న తండ్రి యెన్నిపనులున్నను కట్టిపెట్టి క్రిందికి దిగివచ్చి శిశువును ఆదరించి భుజముపై వేసుకొని పైకి గొంపోవుట యెరుగమా ?

వివిధావతారముల తాత్పర్య మేమి? ఒకసారి మనుష్యుని వలె, మరొకతూరి చేపవలె, ఇంకొకసారి పంది, సింహము మొదలగు వేరువేరు రూపములు దాల్చుటలో సమస్త ప్రాణి కోటి తన కుటుంబములోనివనియు, వారందరు తనకు సమానులనియు, అన్నిటిని సమదృష్టితో చూడవలయు ననియు పరమాత్మ మనకు తెలిపియున్నాడు.

అవతారము లన్నియు మనల నుద్ధరించుటకొరకై భగవంతుని లీల లని గమనించియుంటిమి. తన జన్మకర్మల రహస్యము (6, 8 శ్లో.) చెప్పినట్లు యథార్థముగా నెవరు తెలిసికొనుచున్నారో అట్టివారు పునర్జన్మ లేక శాశ్వతమోక్ష మందగలరు. (శ్లో. 10). అనేకులు అనురాగ భయ క్రోధములను విడిచి పరమాత్మయందు మనస్సు లీనముచేసి మోక్షమును పొందియున్నారు. (శ్లో॥ 10).

శ్లో॥ యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః.

పరమాత్మ నయిన నన్ను భజించువారు ఏకోరికలతో భజించుచున్నారో వారికి ఆ యా కోరికలు నాచే నెరవేర్పబడును.

ఈ శ్లోకమునకు శంకరభాష్యమునందు, కొందరు విద్యకొరకు, కొందరు ద్రవ్యముకొరకు, కొందరు వివాహముకొరకు, కొందరు సంతానము కొరకు, కొందరారోగ్యము కొరకు, కొందరు జ్ఞాన భక్తి వైరాగ్యముల కొరకు, కొందరు

ముక్తికొఱకు, భగవంతుని ఉపాసించుచున్నారు. ఆ యా కోరికలను ఈశ్వరుడు నెరవేర్చును అని చెప్పబడియున్నది. అనగా ఈశ్వరుడు తన్నుపాసించువారికి సకల ఐహికాముష్మిక మోక్షసుఖములను వారివారి కోరికల ననుసరించి కలిగించు ననుట. భగవంతుడు కల్పవృక్షము, కామధేనువు, చింతామణి వంటివాడు. అడుగుటలో మిక్కిలి యుత్తమమైన మోక్షము నడుగుటయే మంచిది ముక్తిప్రదాత యగు ఈశ్వరుని మోక్షము తప్ప ఇతరవరములను కోరుట దౌర్భాగ్యలక్షణము. ఆయన గౌరవమును తక్కువపరచుటయే. చక్రివర్తిని సమీపించి ఒక రూక అడిగినట్లుండును. మరియు ముక్తినిచ్చువాడు వేరే; ఐహిక సుఖాదులను కలిగించువారు వేరని తలచరాదు. అన్నిటిని ఆ పరాత్పరుడే కలిగించుచున్నాడు. 'శతే పంచాశత్' న్యాయము అనగా నూరురూప్యములు పట్టునట్టి సంచిలో 90, 70, 50 మున్నగు భాగములు ఇమిడియుండునట్లు, ముక్తిప్రదాతయగు భగవంతునియందు ఐహికసుఖాదుల నిచ్చుశక్తి యిమిడియున్న దని గ్రాహ్యము.

మరియును ఈ శ్లోకమువలన భగవంతుని ఎవ్వరేరూప ముండునట్లు భావించుచున్నారో వారిని భగవంతుడు ఆయా రూపములతోనే అనుగ్రహించినట్లు చెప్పబడుచున్నది. ఒక మన్నే అనేకము లగు కుండలు, మూకుళ్ళు మున్నగు అనేక పాత్రలుగా పరిణమించునట్లు, ఒక్కబంగారే నాగరము, ఒడ్డాణము, గొలుసు, గుండీలుమున్నగు ఆభరణములుగా పరిణమించు నట్లు సచ్చిదానందమూర్తి యగు నిర్గుణ పరబ్రహ్మమే సగు

ణావస్థయందు (మాయలో ప్రతిఫలించి) రామకృష్ణాద్యవతారములుగ కనబడుచున్నాడు, కనుక ఒక అవతారమునకును మరియొక అవతారమునకును భేదము కల్పించరాదు. అదియే మాదిరి శివ కేశవులకును భేదమును పాటించరాదు. పంచదార మిఠాయిలు వేరు ఆకారములుగా కనబడినను అన్నియును ఒకటే మోస్తరు తీపిగానే యుండును. ఈ శ్లోకమున సకల మతస్థులకు భగవంతుడు ఒక్కడే యనియు ఆయనకే ఆయా భాషలయందు వేరువేరునామములు కల్పించబడిన వనియు సూచింప బడినది. దాహమును పోగొట్టు నీరు అరవమున 'తన్ని' యనియు, ఆంగ్లేయభాషలో 'Water' అనియు, హిందీ భాషయందు, 'పాని' యనియు, గ్రీకుభాషయందు 'Aqua' యనియు వేరువేరు పేర్లతో వ్యవహరింపబడుచున్నది. అట్లే చరాచరాత్మిక ప్రపంచకమును సృష్టించి, కాపాడి, సంహరించు పరమాత్మ బ్రహ్మయని, విష్ణువని, శివుడని, అల్లా అని, God అని. వివిధమతస్థులచే వేరు వేరు నామములతో వ్యవహరింపబడును. కనుక ఈ శ్లోకాభిప్రాయము ననుసరించి ఒక మతస్థుడు మరియొక మతస్థునితో అనవసరమైన వాదము నందు దిగకూడదు. వారి మతప్రకారముగా అద్వితీయ మగు పరమాత్మను వారి వారి సాంప్రదాయానుసారము భజించి జన్మసాఫల్యము పొందుటకు ప్రయత్నించవలెను. దీనివలన సర్వమతసామరస్యము (మహమ్మదీయ, క్రైస్తవ, బౌద్ధమతము:లు లోనుగా) అనగా Harmony of religions సూచింపబడుచున్నది. వారి వారి భక్తితీవ్రతను బట్టి (inten-

sity of devotion) ఫలముకలుగునేగాని ఒకమూర్తి యెక్కువ, ఒకమూర్తి తక్కువ, ఒక భగవన్నామ మెక్కువ, ఒక భగవన్నామము తక్కువ అని తలచరాదు. ఈ శ్లోకాభిప్రాయమునే శ్రీరామకృష్ణపరమహంసవారి చరిత్రియందును వారి యుపదేశవాక్యములందు విపులముగా చూడనగును. మతద్వేషము గలవారు కుక్కలకన్న హీను లనియు, మతసహనము కలిగి స్వమతధర్మముల ననుష్ఠించువారు సాంసారిక తాపత్రియములను బోగొట్టుకొని ఐహికాముష్మిక సుఖములను బొందుదు రనుట గ్రాహ్యము.

శివకేశవులకు ఎట్టిభేదములు లేవనియు, వారిద్దరుకూడ పరమాత్మస్వరూపమే యనుటకు ఒక చిన్న తార్కాణము. శివదీక్షా పరతంత్రుడగు నరహరియను ఒక విశ్వబ్రాహ్మణుని, పాండురంగనికి మొలత్రాడు తయారుచేయవలసినదని కోరగా, తాను శ్రీపాండురంగని దర్శనము చేయననియు, కొలతలు తీసుకొనివచ్చి యివ్వవలసిన దనియు అతడు చెప్పెను. ఎన్నిసార్లు అట్లు కొలతలు తీసుకొని మొలత్రాడు చేసినను, అది విగ్రహమునకు సరిపోలేదు. అందుపై ఆబత్తుని కండ్లకు గట్టిగా గంతగట్టి కొలతలు దీసుకొనుటకై పాండురంగని ఆలయమునకు తీసుకొనిపోయిరి. అంతట ఆ విశ్వబ్రాహ్మణుడు కొలతలు తీసుకొను సమయములో శ్రీస్వామివారిమూర్తి, లింగము పానవట్టముగా అతని చేతికి తగిలెను. ఆత డంతట విస్మయమంది కండ్లకు గట్టిన గంతల విప్పిచూడ పాండురంగని విగ్రహము యథారూపముగానే యుండెను. దానిని బట్టి అతడు తన పొరపాటు తెలిసి

కొని శివకేశవులకు భేదము లేదనియు, నెవరిని గొల్చినను ఒకటియే యనియు గుర్తెరిగెను.

శ్లో॥ కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధి ర్భవతి కర్మజా 12

జనసామాన్యము అప్రత్యక్షమైన మోక్ష సుఖమును కోరదు. పుత్రపశ్వన్నాదులను కోరి దేవతాంతరములను భజించును. ఆదేవతలు తమ్ము భజించువారి కోర్కెలు శీఘ్రకాలములోనే నెరవేర్చుచున్నారు. దుఃఖసంబంధములేని శాశ్వతమైన ఆత్మసుఖమును జెందుటకు సకల దేవతలను శరీరముగా కలిగిన పరమాత్మనే భజింపవలయును. అట్టి మోక్షసుఖము నిదానముగ జెందనగును. అట్టి యీశ్వర భజనకు వారివారి స్వధర్మాచరణమే ముఖ్యమైన అంగము. అధర్మాచరణశ్రుతిస్మృతులయందు వారివారి జాతుల ననుసరించి చెప్పబడియున్నది. ఉత్తమమధ్యమాధమజాతులయందు ఆయాజీవులు పుట్టింపబడుటకు కారణము ఈ క్రింది శ్లోకమున తెలుపబడెను.

శ్లో॥ చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః
తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్॥ 13

వారివారి గుణకర్మల ననుసరించి ప్రజలు ముఖ్యముగా నాలుగుజాతులయందు నాచే పుట్టింపబడు చున్నారు. నే నట్టి సృష్ట్యాదులకు కర్తగ నున్నను వారివారి ప్రాచీన కర్మను కారణముగ నుంచుకొని చేయుటచే కర్త కానని యు తెలిసికొనవలెను.

మాయయందలి సత్వరజస్తమో గుణములు మూడింటిలో రజోగుణముకన్న సత్వగుణము ప్రబలియుండునప్పుడు తమోగుణము హెచ్చుతక్కువగా లేకుండ పుట్టినట్టివారు బ్రాహ్మణజాతిలోను రజోగుణము ఎక్కువగా నున్నప్పుడు క్షత్రియజాతిలోను, రజోగుణతమోగుణముల రెండింటిలో (సత్వగుణము హెచ్చుతక్కువగా లేకుండుట) తమోగుణము కన్న రజోగుణము యెక్కువగా నున్నప్పుడు పుట్టువారు వైశ్యజాతిలోను, రజోగుణముకన్న తమోగుణము ఎక్కువగానున్నప్పుడు జనించువారు శూద్రజాతిలోను చేరుదురు. ఈశ్లోకమున చెప్పబడిన బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రు లనెడి నాల్గు జాతులు ముఖ్యమైనవి పేర్కొనబడెను. అనులోమవిలోమ వివాహములవలన అనగా గొప్ప జాతి పురుషుడు తక్కువజాతి స్త్రీని వివాహమాడుట, తక్కువజాతి పురుషుడు గొప్పజాతి స్త్రీని వివాహమాడుట మున్నగు అసాంప్రదాయ, అశాస్త్రీయ, నిషిద్ధవివాహముల వలన పుట్టిన సంకరజాతివారు అనగా కుండకులు, గోళకులు మున్నగువారి విషయమై ధర్మశాస్త్రాదులందు వివరముగ చెప్పబడి యున్నది. పూర్వజన్మయందలి పుణ్యవిశేషములచేతనే కొందరు జీవులు ఉత్తమజాతియందు పుట్టుచున్నారు. పాపవిశేషము వలననే అధమజాతులయందు పుట్టుచున్నారు. "శ్వయోనింవా, సూకరయోనింవా, చండాలయోనింవా", అని ఛాందోగ్యోపనిషత్తునందు చెప్పబడియున్నది. అనగా పాపమువల్లనే కుక్కలుగా, పందులుగా చండాలురుగా పుట్టుచున్నారు.

ఉత్తమయోనిలో జన్మించినందుకు ప్రాచీనసుకృతమే కారణముగ నున్నను పుట్టుకవలననే జనులు తరించుదురని అనుకొనగూడదు. వారివారి జాతిధర్మములను అహంకారము, మమకారము ఫలాపేక్ష వదలిపెట్టి ఈశ్వరార్పణ బుద్ధిగా నను ష్ఠించుటయే తరణోపాయము. జ్ఞానము, తద్ద్వారా ముక్తి సకలజాతులవారికి, సకలాశ్రమముల వారికి స్త్రీలకు సహా సమానమే. అయితే ఆ జ్ఞానమును చెందుటకు సాధనములలో కర్మానుష్ఠానమున భేదము కనపడుచున్నది? ఒకజాతిధర్మము మరియొక జాతికి పనికిరాదు.

"శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః"

అని వెనుకటి అధ్యాయము నందు చెప్పబడినది. గనుక వారి వారి జాతికి ఆశ్రమమునకు తగినట్లు వేదశాస్త్రములయందు విధింపబడిన కర్మనే సాధ్యమైనంత వరకు బ్రహ్మార్పణబుద్ధితో అనుష్ఠించి అంతఃకరణశుద్ధి ద్వారా జ్ఞానమునొంది ప్రకృతిబంధవినిర్ముక్తులై శాశ్వతమోక్షానందమును చెందుటకు ప్రయత్నింపవలె ననుట గ్రాహ్యము.

శ్లో॥ 18: A tough sloka. According to Adwaita all the activity pertains to the matter and not the spirit e. g. a man travelling in a boat or train thinks that objects which are still alongside are moving, while in reality they are still and it is the boat or train that is moving. That is all due to lack of proper perspective. (దృష్టిమాంద్యము)

ఇది చాల కఠినమైన శ్లోకము.

అద్వైతము:-అజ్ఞానమువలన స్థూలసూక్ష్మశరీరములు పనిజేయుచుండగా ఆత్మచేయుచున్నట్లు తోచుచున్నది. మనము రైలులో లేక పడవలో ప్రయాణము చేయుచున్నపుడు, చెట్లు చేమలు మున్నగునవి పరుగిడునట్లు తోచును. వానికి చలనము లేదు. కదలుచున్నది రైలు, లేక పడవయే. దీనిని గుర్తెరుగుట కర్మలో అకర్మ. అకర్మలో కర్మ యేమనగా, నేను పని చేయుట లేదనుకొను మనోవ్యాపారమే కర్మ, స్థూలశరీరముతో పనిచేయక పోయిన మాత్రమున అకర్మ కాదు. సర్వకర్మ సన్న్యాసము చేసి జ్ఞాననిష్ఠ గలిగినవారు జ్ఞానములో అన్ని కర్మలు ఇమిడియున్నవి అని గుర్తెరుగుదురు.

విశిష్టాద్వైత సిద్ధాంతము:—జీవునికి శుద్ధత, అశుద్ధత అని రెండు అవస్థలు.

జడ ప్రకృతిలో చేరి శుద్ధుడైన ఆత్మ అశుద్ధుడగుచున్నాడు. అందువలన కర్తృత్వాది వ్యాపారములు అతనికి అంటుచున్నవి. కర్మలో అకర్మ యనగా—నివృత్తి కర్మలో అకర్మ (జ్ఞాన మిమిడియున్నదని) యెఱుగుట. అకర్మ (జ్ఞానము) లో కర్మయన జ్ఞానము కలిగినను కర్మ వదలక చేయుచుండవలయు ననుట.

Madhwacharya's interpretation–Most apt- మధ్వాచార్యులవారి అభిప్రాయము బహుయుక్తముగా నున్నది. జీవుడు తాను చేయు యావత్తు కర్మ తన స్వశక్తివల్లకాదని,

దానికి కారణభూతుడు శ్రీమహావిష్ణు వని తెలుసు కొనుట. ఆ పనులకు తాను కర్త కానని విష్ణుమూర్తి జీవుని బొమ్మ మాదిరి నడుపుచున్నాడని గ్రహించుట. హృషీకేశ = Lord of the sensory organs, కాయిక, వాచిక, మానసిక వ్యాపారము లన్నిటిలో జీవుని స్వశక్తి యేమాత్రము లేదని వాటి కెల్ల కారణము విష్ణుప్రేరేపణ యని తెలియవలయును. అకర్మలో కర్మ—మనము నిద్రపోవు నప్పుడుకూడ మనల కాపాడువాడు పరమాత్ముడే. He is an indefatigable worker = వైకుంఠనాథుడు. He is ever active and never tired. Realise that God is working even when you are asleep. This is Karma in akarma.

Sloka 22. Don't ask for any fruit or benefit. God will give it without your asking. The example given by Madhu Sudana Saraswati is planting a mango shell, (మామిడిటెంక) which ripens into a full tree and gives several other benefits, like leaves, shade etc, besides the mango fruit. So according to him, if you pray for Moksha others will come in their wake. నీవు ఎట్టి ఫలములకోరకుము, మధుసూదన సరస్వతి యిచ్చిన మామిడికాయ టెంక ఉదాహరణము ఇదివరకు చెప్పబడినది. భగవంతుని నీవు మోక్షమునకై ప్రార్థించుము. ఇతర ఐహికాముష్మికసుఖము లన్నియు, వాటి అంతట అవి నీకు చేకూరును.

But you must be content with what you get. He gives according to your capacity. (గోవిందరాజ స్వామి తలక్రింద మానికె వున్నది.) Don't covet others' property. అహంకారమును వదలి ఈశ్వరప్రసాదము స్వీకరింపుము. ఈశ్వరు డిచ్చినదానితో తృప్తిజెందుము. ఇతరుల సొత్తుకు అపేక్షింపకుము.

Everything you do is in Lord's service
అద్వైత : అంతయు బ్రహ్మము.
Vishista adwaita, విశిష్టాద్వైత:— అంతయు బ్రహ్మశరీరము.

Dwaita ద్వైత:—అంతయు భగవంతుని సొత్తు.

Let all the credit be to Him. The whole world is one Yagnam. Realise divinity in the subject, object, and the thing offered. Then you realise Moksha.

నివృత్తికర్మలు : —1. అగ్నిహోత్రపూజ (This is for House - holders) ఇది గృహస్థులకు. 2. మానసికముగా అగ్నిని ధ్యానముచేయుట (ఇది సన్యాసులకు.) 3. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములద్వారా చేయు హోమములు, అవసరమైన పనులుచేయుట. అత్యావశ్యకమైన పనులు చేయనివాడు 'పశురేవ' పశుప్రాయుడు.

4. ఇంద్రియనిగ్రహము. ఇది సన్యాసులకు.

(5) ప్రాణాయామము. రేచక పూరక కుంభకములు.

పూరకము = Inhaling, కుంభకము = Retention, రేచకము = Exhalation of carbonic & other gases.

(6) ద్రవ్యయజ్ఞము = Charity ie. all sorts of philanthropic acts done with the aid of money, learning, or bodily strength.

(7) తపోయజ్ఞము, చాంద్రాయణాది వ్రతములు చేయుట, యోగము ఆసనములు వేయుట, లంబికాయోగము, హఠయోగము etc.

(8) స్వాధ్యాయము ie. study of the scriptures.

(9) జ్ఞానయజ్ఞము.

(10) ఆహారనియమము etc. చాతుర్మాస్యదీక్ష, వ్రతములు వగయిరా అనుసరించుట. ఎవరికి వీలైన కర్మలను వారు ఈశ్వరార్పణబుద్ధిగా చేసిన జ్ఞానము కలుగును.

జ్ఞానము వలన లాభ మేమి? నివృత్తికర్మానుష్ఠానము వల్ల జ్ఞాన మనే అగ్నిని చెందినయెడల గత జన్మలో చేసిన పాపపుణ్యములు నశించును. పాపపుణ్య రూపములైన కర్మలు భస్మీభూతము లగును.

జీవుడుచేసిన కర్మలు మూడు రకములు :—

(1) సంచితము—పూర్వజన్మలోని కర్మఫలితము (i e.) That Karma which is stored up.

(2) ప్రారబ్ధము (ie.) That which has begun to bear its result or exercise its influence.

(3) ఆగామి—ఈ జన్మలో చేయుదాని ఫలితము, ముందుజన్మలో వచ్చునది.

జ్ఞానము, భక్తి, వీనివలన సంచిత ఆగామికర్మలు నశించును. కాని ప్రారబ్ధకర్మ అనుభవించి తీరవలయును. కాలికి చుట్టుకొన్నపాము కరవకమానదు. అందువల్ల గొప్పవిరాగులకు భక్తులకు కూడా యేదో దీర్ఘరోగము (Chronic disease) ఉండుట చూచుచున్నారము. కాని యోగులు సమాధి యందున్నపుడు ఆ బాధను మరియొక వస్తువునకు (Transfer) చెందచేసి భగవంతుని ధ్యానించెదరు. జ్ఞానము భక్తియు కలవారికి ప్రారబ్ధకర్మ అనుభవించుట కష్ట మనిపించదు గనుక నిష్కామకర్మానుష్ఠానమువల్ల కర్మలు నశించును.

జ్ఞానము ఎవరికి కలుగును, ఎవరికి కలుగదు? శ్రద్ధ కలిగినవారికి జ్ఞానము కలుగును. శ్రద్ధయన గురువు వాక్కుల యందు, వేదాంతగ్రంథములయందు నమ్మక ముండుట. అట్టి వారికి సంసార బంధమునుండి విడుదల కలుగును. మూఢునికి, సంశయము కలవానికి, నమ్మకము లేనివానికి, వీరి ముగ్గురికి జ్ఞానము కలుగదు. వీరిముగ్గురిలో సందేహముకలవారికే లోకమందును సుఖములేదు. సంసారసాగరమునుండి బయటపడుటకు జ్ఞానమును మించిన మరొక ఆయుధము లేదు.

కాబట్టి అజ్ఞానమువల్ల కలిగిన సందేహమును జ్ఞానమను కత్తిచే ఛేదించుము. ఆ కత్తి కర్మానుష్ఠానము వలన దొరకును. అర్జునా! లెమ్ము! నీ స్వధర్మమైనట్టి యుద్ధాచరణ

అనే దివ్యమువల్ల జ్ఞాన మనే కత్తిని సంపాదించి సందేహము నశింపజేయు మని పరమాత్మ సెలవిచ్చియున్నాడు.

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే జ్ఞానయోగో
నామ చతుర్థోధ్యాయః
సంపూర్ణః



# శ్రీ భగవద్గీతోపన్యాసములు

## 5 వ అధ్యాయము

## కర్మసన్న్యాసయోగము

శ్రీకృష్ణపరమాత్మ ఒకచోట కర్మానుష్ఠానము చేయవలసినదని మరొకచోట సన్న్యసించవలసినదని చెప్పియుండుటచే దీనికి సమన్వయ మెద్ది? వీటి రెంటిలో నేదిగొప్ప అని అర్జునునకు సందేహము కలిగి ప్రశ్నించెను. సర్వకర్మసన్న్యాసము, అద్వైతసిద్ధాంతప్రకారము జ్ఞాననిష్ఠవలన కలుగును.

ద్వైత:—యత్యాశ్రమము మంచిదా? గృహస్థాశ్రమము మంచిదా? అని అర్జునుడు అడిగినాడని అభిప్రాయము. రెంటిలో గృహస్థాశ్రమము నిరపాయ మైనది. Ramakrishna compares it to a fight within the trenches while Sanyasam is a fight with the enemy in the open field. గృహస్థాశ్రమము కందకములోనుండి పగవారితో యుద్ధము చేయుటవంటి దనియు, యత్యాశ్రమము బహిరంగ ప్రదేశములో యుద్ధముచేయునటువంటి దనియు శ్రీరామకృష్ణ పరమహంస పోల్చియున్నాడు.

సన్న్యసము రెండురకములు. అవి యేవన:—

1. బాహ్యసన్న్యసము. Change in mere appearance only. పై వేషమును మాత్రము మార్చుట.

2. మానసిక సన్న్యసము. కామక్రోధాదులను పోగొట్టుకొనుట. అదియే యుత్తమపక్షము. గృహస్థుడుగా నుండియు

తామరాకుపై నీటిబొట్టువలె, అంటిఅంటనట్లు సంసారము చేయవలయును. మానసికసన్న్యాసము అందరికి ముఖ్యమే. కొన్ని జాతులవారికి బాహ్యసన్న్యాసము విధింపబడినది. i. e. జాతులలో బ్రాహ్మణులకు, ఆశ్రమవాసులలో యతులకు, స్త్రీలలో వితంతువులకు దానిని విధించినారు. బ్రహ్మచారికి తాంబూలము, సన్యాసికి ధనము, దొంగతనము చేసినవానికి ఆశ్రయము ఇచ్చినవారు నరకముపా లగుచున్నారు అని గ్రంథములు చాటుచున్నవి.

గృహస్థునకును స్వార్థత్యాగ మవసరము. Read Bhakti Yoga of Aswini Kumar Dutt. Bahya Sanyasam imposes certain restrictions on the person and may later on convert him into a real bhakta (S. 3) Look upon all things alike.

. అశ్వినీకుమారదత్తువలన రచింపబడిన "భక్తి యోగము" చదువనగును. బాహ్యసన్న్యాసము వలన శరీరము కొన్ని కట్టుబాట్లకు లోనై చివరకు భక్తి కుదురవచ్చును.

శ్లో॥ 4 & 5:—Both asramas give Moksha provided you act properly. The element of self-denial or renunciation must exist in the Grihasta also. If a Grihasta has got faith, his house is a tapovanam or a temple of God. He must conquer Kama, Krodha, and worship God and then he can conquer all difficulties. Catch hold of God's feet.

ఈ రెండు ఆశ్రమములలోకూడా చక్కగా నడచుకొనిన మోక్షము కలుగును. స్వార్థత్యాగము గృహస్థునికి

గూడ ఉండవలయును. గృహస్థుడు భగవంతునియందు నమ్మకముతో నడచుకొనిన అతని గృహమే తపోవనమై, లేక దేవాలయమై రాజిల్లును. అతడు కామక్రోధముల జయించి, భగవంతుని భజించినచో కష్టములనుండి విముక్తి పొందనగును. శ్రీమన్నారాయణుని పాదారవిందములు గట్టిగా పట్టుకొని వదలరాదు.

తత్త్వవేత్త లక్షణములు,

శ్లో॥ 8 & 9:—Whatever you do and wherever you are, you must know that He is the Lord of all sensory organs and without His will, even a blade of grass does not move. It is He that is directing every movement of this body.

భగవంతుని ఆజ్ఞ లేనిదే గడ్డిపోచగూడ కదలదు. నీ వెచటనున్నను నేపని చేయుచున్నను ఆయనవలననే జరుపబడు చున్నవనుట మరువకుము.

శ్లో॥ 11:—కర్మయోగులు ఫలాపేక్ష వదలి మనస్సుతో ఇంద్రియములతో పనిచేసి ఆత్మశుద్ధి పొందుచున్నారు.

శ్లో॥ 12:—ఇంద్రియ నిగ్రహము కలిగి ఫలాసక్తి లేక కర్మానుష్ఠానము చేయువారు యుక్తులు, అనగా యోగముతో కూడినవా రగుచున్నారు. ఫలాపేక్ష పోగొట్టుకొనజాలనివాడు సంసారబంధములో కట్టుబడుచున్నాడు. ఆత్మ పరమాత్మ విచారణ చేసినవాడు తొమ్మిదిద్వారములతో గూడుకొన్న యీ శరీరములో సుఖముగా నుండును.

శ్లో॥ 13:—ఫలాపేక్ష వదలి పరమాత్మను ధ్యానము చేయువాడు యీ శరీరములో సుఖముగా నుండును. ఈ శరీరము ఒక పట్టణనుమాదిరి. దానికి తొమ్మిది ద్వారములు. అందు జీవుడు కాపురము. జీవుడు వేరు, శరీరము వాని కవచమని అందలి తారతమ్యము తెలుసుకొనవలెను.

"The more you identify with the body, the greater you will have to suffer. The greater the detachment, the greater will be the joy.

—Swami Vivekananda.

ఈ శరీరమే నీవని భ్రమపడునంతవరకు, కష్ట మధికమగు ననియు, ఈ శరీరము వేరు, నీవు వే రని గుర్తెరిగి నిస్సంగుడవై చరించిన కొలది ఆనంద మతిశయించు ననియు వివేకానంద స్వామి వ్రాసియున్నాడు.

శ్లో॥ 14:—సుఖదుఃఖములు రెండు సమానముగ అనుభవించవలయును. సుఖము వచ్చినపుడు నీ మహిమవలననే యని అనుకొనరాదు. దుఃఖము వచ్చినపుడు భగవంతుని దూరరాదు. కష్టసుఖములు ప్రాచీనకర్మను అనుసరించ వచ్చును. కనుక దేవుని దూషించుట తప్పు. సుఖము జీవుని వలన, కష్టము భగవంతునివలన కలుగును అనుకొనువారు మూఢులు. పరమాత్మను భజించిన కర్మ అనుభవించుటలో కష్టము తప్పును, గనుక భక్తి అవసరము.

శ్లో॥ 15:—పరమాత్మ వారివారి కర్మనుబట్టి కష్టసుఖముల నిచ్చుచున్నాడు. కాని ఆయనకు యెట్టిపక్షపాతము

లేదు. జీవునికి అజ్ఞాన మనే ఆవరణమును తీసివేసిన యెడల ఆత్మకు భక్తి కలుగును.

S 16. Gnanam is not anything which can be acquired from outside but it is to be manifested from within. It is always latent in the Atma; and "Karma anustanam" and Bhakti dispel the clouds of agnanam surrounding the Atma as a result of the Karma accumulation in the several previous births.

జ్ఞానము వెలుపలనుండి మనము సంపాదించగల వస్తువు కాదు. అది ఆత్మయం దిమిడియున్నది. భక్తివలనను కర్మాను ష్ఠానమువల్లను, పూర్వజన్మ కర్మలవలన కలిగిన అజ్ఞానాంధ కారము వీడిపోయిన పిదప అది వికసించును.

పాపకర్మ పోగొట్టుకొనవలయును. అజ్ఞునకు దాని కొంత దారపుత్రాదులకు పంచిపెట్టెద ననగా, దాని కేవలు చేసినకర్మ వానే అనుభవించవలయునని శ్రీకృష్ణ పరమాత్మ చెప్పెను. e.g. వాల్మీకి వృత్తాంతము. మన పాపపుణ్యములను దారపుత్రాదులు అనుభవించరు. ధర్మశాస్త్రములు. భర్త పుణ్యములో భార్యకు సగము అనియు, ఆమె పాప మంతయు భర్తకు చెందుననియు, పిల్లలపాపములన్ని తండ్రికిచెందుననియు చెప్పుచున్నవి. దీనికి సమన్వయము ఏమనగా - భార్యకు జ్ఞాన మార్గము గల్గుటకై వ్రతములకు, పూజాపునస్కారములకు అవకాశము ఏర్పరచుట భర్త విధ్యుక్త ధర్మమై యున్నది. ఆమెను కేవలము భోగపదార్థముగా నెంచుట కడు హేయము. అట్టి సౌకర్యములు చేయనియెడల ఆమె పాపములకు భర్త

జవాబు చెప్పవలసియుండును. బిడ్డలకు తల్లిదండ్రులు చిన్నప్పటినుండి దైవభక్తి, పెద్దలయందు భక్తి, సత్ప్రవర్తన అలవాటు చేయవలయును. లేనిచో వారు దుష్టులయినచో ఆ పాపమును తల్లిదండ్రులుకర్మలోపమువలన అనుభవించెదరు. అహంకార మమకారములు వదలి ఫలాపేక్ష లేక కర్మచేయువాడు అంతఃకరణశుద్ధివలన జ్ఞానము చెందును.

శ్లో॥ 18:—జ్ఞానము వచ్చినవాని లక్షణములు ఏవి? ఇది చాలా కఠినమైన శ్లోకము. బ్రాహ్మణజన్మ యెత్తి, వేద పురాణములు చదివి వినయసంపన్నత కలిగిన బ్రాహ్మణుని, పరమపవిత్రమైన పరోపకారమునకై సృష్టింపబడిన ఆవును, చతుష్పాదజంతువులలో పెద్దది అయిన ఏనుగను (రాజసమైనది) తామసమైనటువంటి కుక్కను, కుక్కమాంసము వండుకొని తిను పరమతామసియైన చండాలుని, ఈ యయిదుగురిని సముముగా గమనించువాడు జ్ఞాని. వ్యాఖ్యానకారులు భావాద్వైతమేకాని, క్రియాద్వైతము కాదని వ్రాసియున్నారు. అనగా పరిపక్వమైన భక్తులకు, జ్ఞానులకు వీటి అన్నిటియందు భగవంతుడు కనుపడుచుండునని అభిప్రాయము. కబీరు కుక్కలో రాముని, త్యాగరాజు చీమలలో దోమలలో బ్రహ్మను, రామకృష్ణ పరమహంస చాపలో ఆనందమయి మాతను జూచిరి. ప్రతిమానవుడు తన వర్ణాశ్రమధర్మములకు విరుద్ధముగా నడువకుండ అంతా సమానమే అని చూచుకొనవలయును.

Some wrongly construe this sloka as an authority for cosmopolitan dinners or intercaste marriages. Sankara and other commentators said that this sloka

refers only to Bhavadwaitam and not to Kriya-adwaitam. What Sree Krishna says is "సమదర్శిన" not "సమవర్తిన". In this work-a-day world the principle of "అంతా బ్రహ్మము" cannot be pushed to the length of destorying Varnasramadharma. వ్యవహారపు పట్ల గృహస్థులు అందరిని సమానముగా చూచుటకు వీలులేదు. e. g. A man connot look upon or treat his wife daughter, and daughter-in-law alike. ఒక మానవుడు భార్యను, కూతురిని, కోడలిని, ముసలిని ఒకమాదిరి చూడ జనునా ? వీలులేదు. కాని యెవరికి హాని చేయ కూడదు. All that Sankara said was that a chandala who has atmagnanam is equal to his Guru: you may do all social service consistent with Varnasrama-dharma.

ఈ శ్లోకము జాతిమత వివక్షత లేకుండ విందుల నారగించుటకును, వర్ణాంతర వివాహముల నొనరించుటకును, ప్రమాణ మని కొందరు దురభిప్రాయపడుచున్నారు. శ్రీ శంకరాచార్యులవారు మున్నగు వ్యాఖ్యానకారులు ఈ శ్లోకము భావాద్వైతమును మాత్రము సూచించుచున్నది కాని క్రియాద్వైతమును సూచించుట లేదనియు శ్రీకృష్ణుడు "సమదర్శిన" (అనగా అందరిని సమముగా చూడవలయును) అని చెప్పియున్నాడుగాని "సమవర్తిన" అందరిపట్ల సమానముగా వర్తించవలసిన దని చెప్పియుండలే దనియు, మరికు విశదపరచియున్నారు. "అంతాబ్రహ్మము" అను దానికి జాతిమత వివ

ఖ్యతలేక వర్ణాశ్రమధర్మముల త్యజించి మెలగవచ్చునని అర్థము తీయుట కేవలము వితండవాదము. ఒక మానవుడు తనయింటి లోని వారి నందరిని సమముగా చూచుటకు వీలులేదని పైన గమనించియున్నారము. శంకరాచార్యులవారు చెప్పినది యేమ నగా ఆత్మజ్ఞానము గలిగిన చండాలుని గురువుతో సమాన ముగా చూడవచ్చును; అంతియేకాని మరియొకటికాదు. కనుక స్త్రీపురుషు లెల్లరు వర్ణాశ్రమధర్మబద్ధులై మానవసేవ చేసి లోక కళ్యాణమునకు తోడ్పడవలయును. మానవసేవయే మాధవసేవ.

శ్లో॥ 19. Whoever looks upon all beings as equal realises Brahma, gets freedom from births and deaths.

ఈశ్వర సృష్టిలోని సమస్త జీవరాసులను సమదృష్టితో జూచువానికి బ్రహ్మసాక్షాత్కారము గలిగి జననమరణముల నుండి విడుదల కలుగును. "The sun shines even on the wicked"-Seneca. సూర్యుడు తన రశ్మి అందరిమీద ప్రస రింప చేయుచున్నాడు.

శ్లో॥ 20. The person who concentrates his mind upon Him, gives up ahamkara, mamakara and takes both success and failure with equanimity will never be elated by success or depressed by failure. అహంకార మమకారముల వదలి, భగవంతునియందు చిత్తము నిలిపినవాడు సుఖదుఃఖముల రెంటిని ఒకే మాదిరి

స్వీకరించును. సుఖము వచ్చిన నుప్పొంగడు, దుఃఖము వచ్చిన కృంగడు.

శ్లో॥ 22. The mind or atma should not be influenced by pleasure or pain. These are all external. The person who realises this, realises Brahma and Atma sukham. The fruits that are obtained from the sensory organs consist of only one part pleasure and ninety nine parts pain.

The whole world if weighed in the balance will be found wanting. So a gnani does not allow his mindto be swayed by worldly pleasures

జ్ఞాని అహంకారమమకారముల వదలి కష్టమువచ్చినను సుఖము వచ్చినను నిర్వికారముగా నుండును. ప్రపంచములో సుఖ మనుకొనునది బాహ్యేంద్రియములకు చెందినదే కాని, ఆత్మకు చెందినదికాదు; మరియు దానియందు సుఖము ఒక పాలు, కష్టము తొంబది తొమ్మిది పాళ్లు.

శ్లో॥ 23. That person who in this very life conquers Kama, Krodha, and restrains himself from their evil effects is a true yogi. ఈ జన్మయందే కామ క్రోధాదుల అరికట్టినవాడు నిజమైన యోగి.

శ్లో॥ 24. The person who attains this state of mind attains moksha. అట్టి ఆత్మానుభవము కలవారికి మోక్షము కలుగును.

శ్లో॥ 25. Rishis, persons who do not commit any sin, persons who do not doubt, persons who conquer the sensory organs and look upon all the beings in the world pulsating with life as equal attain moksha. ఋషులు, పాపకార్యముల జేయనివారును, నిస్సంశయాత్ములును, జితేంద్రియులును, సమస్తకోటి జీవరాసుల సౌఖ్యమునందాసక్తి గలవారును మోక్షము బొందెదరు.

శ్లో॥ 26. అట్టి వారికి మోక్షసుఖ మిహపరములందు కలుగుచున్నది. They realise moksha not even in the world to be, but even now.

ఏ మనుజుడు ఫలాపేక్షవదలి కామక్రోధాదులు అరికట్టి, మనస్సును పరమాత్మయందు లీనముచేసి శబ్దస్పర్శ రూపములయందు దానిని చొరనీయక, ప్రాణవాయువులను యోగాభ్యాసమువల్ల ముక్కులోపల (ఇదివరలో చెప్పబడిన కుంభక, రేచక, పూరకములద్వారా)సంచరించునట్లు చేసి భగవంతుని ఆరాధించుచున్నాడో అట్టివాడు మోక్షము పొందగలడు. అట్టి మోక్షము ఈ దేహమునందును, దేహము విడిచిన పిదపనుకూడ పొందుచున్నాడు. (శ్లో॥ 27-28).

శ్లో॥ 29:— పరమాత్మ యెంత జెప్పినను అర్జునునకు మనస్సు నచ్చినట్లు కనపడనందున, యేమని సెలవిచ్చి యున్నాడు అనగా, అర్జునా! నేను యెట్టివాడనో నీవు యెరుగవు. పిపీలికాది బ్రహ్మపర్యంతము నేను నియామకుడను.

సమస్త దేవతలు పొందు హవ్యకవ్యఫలములు వారు నాకు చెందచేయవలెను. సర్వభూతములను కాపాడువాడను నేను. ఈ సంగతి గుర్తెరిగి జ్ఞానము పొంది వర్ణాశ్రమ ధర్మము నెరవేర్చుము, శాంతిని బొందుము అని వాక్రుచ్చియున్నాడు.

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే కర్మసన్న్యాస
యోగోనామ పంచమోధ్యాయః
సంపూర్ణః

సుఖవాశివేరయ్యాపుస్తకం



# శ్రీ భగవద్గీతోపన్యాసములు

## 6 వ అధ్యాయము.



## ఆత్మసంయమయోగము

### (ధ్యానయోగము)

శ్లో॥ 1:—ఎవడు ఫలాపేక్ష కోరకుండా కర్మచేయునో వాడు సన్న్యాసి, యోగి అనిపించుకొనును. కర్మచేయుటవలన కర్మయోగియు, ఫలాపేక్ష వదలినందువల్ల సన్న్యాసియు అగును. అగ్నిహోత్రము వదలినంత మాత్రమున సన్న్యాసి కాడు. కొందరు వ్యాఖ్యానకారులు, అగ్ని అనగా భార్య అని చెప్పెదురు. (ఛాందోగ్యోపనిషత్తులో స్త్రీ అగ్ని యని చెప్ప బడియున్నది.) గనుక వీరు చెప్పే ప్రకారము భార్యను వదలి నంత మాత్రమున సన్న్యాసి కాడు. వివాహము కాకపోయి నను, స్త్రీ వాంఛ ఉన్నవాడు గృహస్థుడే.

శ్లో॥ 2:—దేనిని సన్న్యాస మని చెప్పెదరో అదే యోగము. పరమాత్మకు సంతోషము కలిగించునదియే కర్మ. అదియే మోక్షము కలిగించునది. 'ఏయ్యది పరమాత్మ విష యము తెలుపునో అదియే విద్య.'

శ్లో॥ 3:—మనుజులు రెండురకములు. 1. ఆరురుక్షులు. Those who aspire to go up. i. e. పైకి పోవలయునని

యత్నించువారు. 2. ఆరూఢులు:— Those who have already gone up. i. e. ఇదివరకే పైకిపోయినవారు. మొదటి తరగతివారు కర్మ చేయవలయును. రెండవతరగతివారికి కర్మానుష్ఠానము అవసరములేదు.

శ్లో॥ 4:—యోగారూఢుడు ఎట్టివా డనగా ఇంద్రియార్థము లగు శబ్దాది విషయములందును, కర్మలయందును మనస్సు విడగొట్టి సర్వ సంకల్పసన్న్యాసి యైనవాడు.

శ్లో॥ 5:—One interpretation. ఆత్మకు ఆత్మయే బంధువు.

Second interpretation :— జీవునకు పరమాత్మ బంధువు.

మొదటి ఆత్మ=జీవుడు. రెండవ ఆత్మ=పరమాత్మ.

నిన్ను నీవు సంసారములో నుండి లేవనెత్తుకోవలయును. నీకు నీవే బంధువు. నీకు నీవే శత్రువు. మనస్సును ఉపయోగించు మార్గమును బట్టి అది నీకు బంధువు లేక శత్రువుఅగును. విషయసంబంధముగల మనస్సు శత్రువు. నిర్విషయమైన మనస్సు మిత్రము. ఈ అభిప్రాయమే 6 వ శ్లోకమందు చెప్పబడినది. బయటివిషయములలో పోవు ఇంద్రియములతో నేకీభవించిన మనస్సు విరోధి. ఇంద్రియముల జయించిన మనస్సు మనకు మిత్రుడు. ఇంద్రియములను మనస్సును గుప్పిట నుంచుకోనవలయును. ఇంద్రియములు మనస్సుకు తాబేదారులు.

శ్లో॥ 7:— మనస్సును జయించి కర్మానుష్ఠానము చక్కగా జేయవలయునంటే శీతోష్ణములు, సుఖదుఃఖములను సమానముగా నెంచుకొనవలయును.

శ్లో॥ 9. జ్ఞాని తొమ్మిది రకముల మనుజులను సమానముగా చూడవలయును. వా రెవరనగా:—

1. సుహృదులు, 2. మిత్రులు, 3. అరి=శత్రువులు. 4. ఉదాసీన (neutral or indifferent people) 5. మధ్యస్థులు, (peace-makers). Even the Holy Bible says "Blessed are the peace-makers for theirs shall be the Kingdom of Heaven" 6. ద్వేషి, 7. బంధువులు, 8. సాధువులు- పరోపకారమైన పనులు చేయువారు. 9. పాపేషు- పాపకార్యములు చేయువారు. వీ రందరియందు జ్ఞాని బ్రహ్మభావము చెందును. వీ రందరు నారాయణమూర్తి వేషము లని తెలియవలెను. ఈ విషయము గుర్తెరిగినవాడు అపకారికికూడా ప్రత్యపకారము చేయడు. జీవకారుణ్యము, భూతదయ, పశ్చాత్తాపము అట్టివారికి యెక్కువగ నుండును. వైష్ణవ సిద్ధాంతప్రకారము ప్రపంచము యావత్తు పరమాత్మ శరీరము. గనుక మనము ఎవరికి హాని చేసినను పరమాత్మకు హానిచేసినవార మగుదుము. (శ్లో 8). మట్టిపెళ్ళ, రాయి, బంగారును సమముగా భావించవలయును. పరమాత్మస్వరూప మొక్కటియే ప్రయోజనము.

శ్లో॥ 10. కర్మానుష్ఠానము ఉపయోగించవలయు ననిన పరమాత్మయందు మనస్సు లీనముచేసి, యేకాగ్రతతో చేయ

వలయును. ధ్యానయోగముతో కూడిన కర్మయోగమే ఉప యోగపడును. ధ్యానయోగము చేయునపుడు ఒంటరిగా నుండి మనస్సు క్రమముగా భగవంతుని తట్టు త్రిప్పవలయును. ఇత రులవలన నేమి పుచ్చుకొనగూడదు.

శ్లో॥ 11-13. దీనికి పూర్వాంగములు:—1. స్థలము శుద్ధిగా నుండవలయును. ఒకవ్యాఖ్యానకారుని ప్రకారము మంచి యిరుగు పొరుగు చూడవలయును.

2. స్థిరమగు ఆసనమున కూర్చొనవలయును. సరిగా కూర్చొనకపోయిన మనస్సునకు విక్షేపము కలుగును. ఏకాగ్రత ఉండదు. యోగగ్రంథములలో కొన్నిటిలో 64 వేలు, కొన్ని టిలో 96 వేల ఆసనము లని చెప్పియున్నారు. అందరికి సులభ సాధ్యమైనది పద్మాసనము. ప్రదేశము మిక్కిలి యెత్తుగా నుండకూడదు. పల్లముగా నుండగూడదు.

3. ఆసనమునకు "చేలాజినకుశోత్తరము." They must be taken in the reverse order. వీనిని తల్ల క్రిం దులుగా అర్థము చేసుకొనవలెను. ముందు పరచవలసినది దర్భ. దానిపైన గృహస్థులయిన జింకచర్మమును, సన్న్యాసు లయిన పులిచర్మమును వేసుకొనవలయును. దాని పైన అవసరమైనచో గుడ్డ పరచుకొనవచ్చును. అట్లు ఆసీనుడై ప్రాణాపానవాయువులను నియమించుకొనవలయును. అందు వలన మనస్సు స్వాధీనమగును. ఈ ప్రకారముగా చేసి మన స్సును ఇహలోక సంబంధమైన విషయములనుండి త్రిప్పి భగ వంతునియందు నిలుపవలయును.

శ్లో॥ 17. దీనికి కొన్ని యుపాంగములు.

మనోనిగ్రహమునకు పథ్యములు:—

(ఎ) చెయ్యకూడనివి (Negative side):—1. ఎక్కువ తినరాదు. ఆహార నియమముండవలయును. కేవలము ఉపవాసము పనికిరాదు. Too much eating and too much fasting must be avoided.

2. Sleep is the balm of life. Too much sleep should be avoided. ఎక్కువగా నిద్రపోరాదు. This is the negative side.

(బి) Positive side. చెయ్యవలసినవి :—(1) మితమైనట్టి ఆహారము.

(2) విహారము.

(3) నిద్ర యుక్తము లేక మితముగా నుండవలెను. తిండిలో ½ Solid, ¼ Liquid, ¼ Empty గా నుంచవలయును.

Another commentator says' you must be able to get up from food with the same ease as when you sit for food. There should not be that sense of heaviness. Six hours sleep (10 p. m. to 4 a. m.) is enough or a normally healthy person.' కడుపున పట్టునంత వాటిలో (capacity) ½ పాలు గట్టిపదార్థము, ¼ పాలు ద్రవ పదార్థము స్వీకరించి, శేషించిన ¼ పాలు ఖాళీగా నుంచవలయును. భోజనాత్పూర్వ మెంత చులకనగా ఒక మనిషి కూర్చొనునో, భోజనానంతర మంతచులకనగా లేవవలయును. సాధారణమైన ఆరోగ్యము గల వారికి రాత్రి 10 నుండి

4 గం॥ వరకు నిద్ర చాలును. ఇట్లు చేసిన యెడల మనస్సుకు విక్షేపము కలుగక బ్రహ్మానందము కలుగును. మనస్సు స్వాధీనమై పరమాత్మయందే లగ్నమై యుండును. అట్టివారు సర్వకామములయందు అభిలాష తొలగి యోగయుక్తు లగుచున్నారు (శ్లో॥ 18).

శ్లో॥ 19-22:—యోగసిద్ధికి లక్షణములు చెప్పబడినవి.

(1) మనస్సు పరమాత్మయొక్క పాదారవిందములలో లీనపరచుట.

(2) దేనికన్న ఎక్కువయిన ఆనందము లేదో అట్టిది.

(3) ఏ ఆనందము పరమపరిశుద్ధ మయిన బుద్ధితో గ్రహింపనగునో అయ్యది. ఎటువంటిదుఃఖము కలిగినను మనస్సు చలించనట్టి స్థితి పొందుట. దుఃఖసంయోగ వియోగము. యోగము=Separation from the contact with misery: You must realise the difference between matter and spirit and that all this misery pertains to the matter alone and be indifferent to woe. That is true Yoga. (శ్లో॥ 23). ఆత్మానాత్మవివేకము కలిగి ఈ ప్రాపంచిక దుఃఖ మంతయు శరీరమునకు జెందినదిగాని, ఆత్మకు కాదని గ్రహించి దుఃఖము వాటిల్లినను నిర్వికారముగ నుండుట నిజమైన యోగము.

శ్లో॥ 24 : చాల ముఖ్యమైన శ్లోకము. ఎప్పుడయితే ధ్యానయోగములో మనస్సు పెట్టవలె నని సంకల్పము కలుగునో అప్పుడు చేయవలసిన పథ్యము ఒకటి యున్నది. i. e'

సంకల్పమువలన కలుగు ఆశలను పూర్తిగా వదలిపెట్టవలెను. కనులు, ముక్కు, చెవులు మొదలగు ఇంద్రియములను మనస్సుతో అరికట్టివేయవలయును.

ఈ శ్లోకముపై రామానుజాచార్యులవారి భాష్యము బహుచక్కగా నున్నది. కామము రెండువిధము లని వారు వ్రాసియున్నారు.

Ramanuja's commentary is the best on this sloka-
Kama is of two kinds:—కామము రెండురకములు.
అవి యేవన :—

1. స్పర్శజ కామములు:— absolute necessities e. g. food, thirst, clothing, house, కేవల మవసరమైనవి. (ఆహారము, నీరు, వస్త్రములు, ఇల్లు etc.)

2. సంకల్పజకామములు:—i.e. special likings, e.g (ప్రత్యేక వాంఛలు) చుట్ట, బీడి, పొడుము, కాఫీ మొదలగు luxuries. These 'Contracted habits must be given up for performing Dhyana yoga. ధ్యానయోగాభ్యాసమందు వీటిని పరిత్యజించవలయును.

శ్లో॥ 25. పట్టుదలతో మనస్సును నిదానముగా విషయాపేక్షనుండి త్రిప్పి భగవంతునియందు నిలుపవలయును. "లాలయేత్ చిత్త బాలకమ్" పిల్లవానిమాదిరి మనస్సును లాలించవలయును. ప్రాపంచిక విషయములు దోషభూయిష్ఠములని గమనించిన పరమాత్మయందు మనస్సు లీనమగును.

పరమాత్మయొక్క సేవ మనము చేయుచో ఆయన మనలను అన్ని విధముల కాపాడును.

శ్లో॥ 26-32. ఇట్లు సంకల్పజకామములను పూర్తిగ పరిహరించుకొని మెల్లమెల్లగ మనసును విషయములనుండి త్రిప్పి ధైర్యముతో పరమాత్మయం దుంచవలయును. ఏయేవిషయములందు మనసు ప్రసరించునో యాయా విషయములన్నిటినుండి దానిని మరలించుటకు యత్నింపవలయును. ఇందువలన యోగి మనశ్శాంతి నంది రజోగుణమును పోగొట్టుకొని పాపపుణ్యములను దాటి గొప్ప యానందము నందును. అట్టి యుత్తమస్థితి నందుటకు ప్రప్రథమమున సకల ప్రాణులను తనయందు, తన స్వరూపము నన్నిటియందును చూచి సమత్వబుద్ధి నందవలయును. మరియు పరమాత్మయగు నన్ను అన్నింటియందును, అన్ని వస్తువులను నాయందును చూడవలయును. అట్టివాడు అన్ని విధముల నాయందే యుండును. వాడు సకల వ్యాపారములను నా పరముగ జేయును. మరియు నర్జునా! అట్టియోగి సకల ప్రాణుల సుఖమే తనసుఖముగను వారి కష్టమే తనకష్టముగను భావించును. "A Sage is one who weeps with those that weep and laughs with those that laugh. i. e. He identifies himself with the universe" — Swami Vivekananda.

శ్లో॥ 33-34. ఈ శ్లోకములందు అర్జునుడు పై విషయములను విని యొక ప్రశ్న వేయుచున్నాడు. "ఓ కృష్ణా! మనస్సు చంచలమైనది. దానిని స్వాధీనపరచుకొనుట, గాలిని మూటకట్టుట మాదిరి దుస్సాధ్యమైనది. ఇద్దానికి తరణోపాయ

మేమి? తెలుపవలసిన'దని కోరెను. మధుసూదనసరస్వతి తన వ్యాఖ్యానమం దొక ఉదాహరణ మిచ్చియున్నాడు. ఒకరోగి జాడ్యము నివారణకై అనేక ఔషధముల సేవించి ప్రాణము విసిగి ఒక బైరాగిదగ్గరకు వెళ్ళి తన రోగము నయమగుటకు ఏదైన మందుకలదా యని ప్రశ్నించ హిమాలయపర్వతముపై గుహాలలో నొకమూలిక కలదనియు, దానికి కాపలాయుండు భయంకరమృగముల చంపి, ఆ మూలిక గొనితెచ్చిన మూడు నిమిషములలో నయముచేయగలననియు చెప్పెను. అనగా చెప్పుట సులభమేగాని, అట్టిపని నిర్వహించుట దుస్తరమని అభిప్రాయము. ఈ జీవు డనేక జన్మలు మెత్తి, ఆ యా జన్మలయందలి అనుభవమువలన కప్పబడియున్నాడు. అందుచేత, మనస్సుస్వాధీన మందుంచు కొనుమని చెప్పుట సులభమే కాని చేయుటకష్టము.

ఇట్లు అర్జునునిచేత ప్రశ్నింపబడి పరమాత్మ అందుకు శ్లో॥ 35-36 లో సమాధాన మిచ్చుచున్నాడు. అర్జునా! మనస్సు నిగ్రహించుట కష్టమే. అయ్యది చంచలమే యనుట నిస్సందేహము. కాని వైరాగ్యముచేతను, అభ్యాసముచేతను దానిని నిగ్రహింపవచ్చును. అట్లు అభ్యాస వైరాగ్యములచేత మనస్సు నిగ్రహింపజాలనివారికి యోగము అలవడదు. అర్జునా! సుఖమైనను దుఃఖమైనను, "తనయందు నిఖిలభూతములందు నొకభంగి సమహితత్వంబున" బరగు వానికి, 32 వ శ్లోకమందు చెప్పినట్లు యోగము అలవడుటయేగాక యోగులలో నెల్ల ఉత్తము డనిపించుకొనును.' అంతట అర్జునుడు, "హే! ప్రభో! ధ్యానయోగము పూర్తియగుటకు మునుపే చనిపోవునట్టి

యోగభ్రష్టుల గతియేమి?' అని ప్రశ్నించెను. (శ్లో॥ 38-39). అందుకు పరమాత్మ యిట్లు సమాధాన మిచ్చుచున్నాడు:- "నాయనా! అర్జునా! అట్టియోగభ్రష్టులకు ఇహలోకమునందు గాని పరలోకమునందుగాని వినాశము వాటిల్లదు. శుభ కర్మలు చేయువా డెన్నడును దుర్గతి పొందడు. (శ్లో॥ 40.) యోగసిద్ధిని పొందజాలక మరణించువారు యజ్ఞయాగాది క్రతువులం జేసినవారికిం బలె పుణ్యలోకముల పొంది, అనేక సంవత్సరము లచట నివసించి, తదుపరి సదాచార సంపన్నులైన ధనికులయిండ్లలో మర్త్యలోకమునందు జన్మించెదరు. అట్లు జన్మించి తమసర్వస్వము పరోపకారార్థమై వినియోగించి తరించెదరు. (శ్లో॥ 41), అథవా, అనగా ఒకవేళ అట్లు కాకున్నను బుద్ధిశాలులైన యోగుల యిండ్లయందు వారు జన్మించి, ధనధాన్యసంపదల గాంచకున్నను, భక్తియోగాభ్యాసములకు అలవడి ముక్తిగాంచెదరు. (శ్లో॥ 42). ఈ జన్మయందు సగము కంటె తక్కువ యోగముచేసినవారు, మొదటితరగతి (ధనికుల యిండ్ల)యందును, సగము, సగముకంటె యెక్కువ యోగము చేసి భ్రష్టులైనవారు రెండవతరగతి (బీదలయినట్టి యోగుల యిండ్లయందును జన్మించెద రని మధుసూదన సరస్వతిగారు వ్రాసియున్నారు,

శ్లో॥ 44:— అట్టివారు పూర్వజన్మ సువాసనవలన మంచిపనులు చేసెదరు.

శ్లో॥ 45:— జీవుడు తరించవలయు ననిన అనేకజన్మలు కావలయును.

శ్లో॥ 46:—తపస్సుచేయువానికన్న, భక్తియోగికన్న, జ్ఞానయోగికన్న, కర్మయోగికన్న ధ్యానయోగము చేయువాడుత్తముడు. ఇది బహుసులభమైనది. ధ్యానయోగమునందు జాతిభేదము లేదు. ఎట్టి పరికరములు దీనికి అవసరము లేదు. అందువలన ధ్యానయోగి చాల యుత్తమమైనవాడని శ్రీకృష్ణుడు సెలవిచ్చియున్నాడు.

1-6 అధ్యాయములతో కర్మషట్కము సంపూర్ణము.

రెండవ షట్కము - భక్తి లేక యుపాసనషట్కము.
[7-12 అధ్యా.]

మూడవ షట్కము - జ్ఞానషట్కము,
[13-18 అధ్యా.]

రెండవ షట్కము భక్తినిగురించి చెప్పుటలో యేమి అభిప్రాయ మనగా, కర్మకు జ్ఞానమునకు రెంటికి భక్తి అవసరమని అభిప్రాయము. తలలేని మనుష్యునిమాదిరి భక్తిలేనికర్మ, భక్తిలేనిజ్ఞానము నిష్ప్రయోజనములు (గేహళీదీపన్యాయము, కాకాక్షిన్యాయము, ఏకాక్షిన్యాయము). 6 వ అధ్యాయము ఆఖరుశ్లోకములో 7 వ అధ్యాయము theme సూచింపబడినది.

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే ఆత్మసంయమ
యోగో నామ షష్ఠోధ్యాయః
సంపూర్ణః



# శ్రీ భగవద్గీతోపన్యాసములు

## 7 వ అధ్యాయము

## విజ్ఞానయోగము.

ధ్యానమునకు ముఖ్యకారణము ప్రేమ. ప్రేమ యెపుడు కలుగు ననగా ఒకవస్తువువలన నష్టముకన్న యెక్కువ లాభ మున్నదని తెలిసినప్పుడు పరమాత్మకు జీవునకున్న సంబంధము తెలిసినయెడల, కనుపడకపోయినను పరమాత్మను ధ్యానించె దము. ఆ భక్తినిగురించి రెండవ షట్కములో చెప్పబడినది. అందు మొదటి యధ్యాయము విజ్ఞానయోగము.

శ్లో॥ 1:—నాయందెక్కువ ప్రేమ కలిగి మనస్సు ప్రవేశపెట్టినయెడల, నా సంగతి తెలిసికొనవచ్చును. భక్తివలన జ్ఞానము కలుగు నని యర్థము. త్రిమతస్థులు భక్తి అవసరమని చెప్పియున్నారు. భక్తివలన భుక్తి, జ్ఞానము, ముక్తి కలుగు చున్నవి.

శ్లో॥ 2:—అర్జునుడు ఏమి అడిగెను అనగా మిమ్ములను భజించి తెలిసికొనకపోతే యేమి?

జవాబు : నా సంగతి తెలిసికొనిన మానవజన్మ సఫల మగును; తరించును. నా విషయము తెలిసికొనిన యింకను తెలియబడవలసిన విషయము లుండవు.

"After knowing which, there will be nothing else which ought to be known.." భక్తివలన సర్వజ్ఞత్వ మేర్పడుచున్నది.

శ్రీ. రామకృష్ణపరమహంస జ్ఞానమును ఒక చెట్టుతో పోల్చియున్నాడు. చెట్టునకు నీరు వేళ్ళదగ్గర పోయుచున్నాము. చెట్టు పడగొట్టవలయు నన్న వేరుదగ్గర నరకవలయును. జ్ఞాన మను చెట్టునకు బ్రహ్మజ్ఞానము వేరువంటిది. జ్ఞాని దానిని గట్టిగా పట్టుకొనవలయును. బ్రహ్మజ్ఞానము గలవారు నిరక్షర కుక్షులైనను సర్వజ్ఞులు. బ్రహ్మజ్ఞానము, జ్ఞానమున కంతటికి Power Station వంటిది. Brahma Gnanam is the Power station for all knowledge. శ్రీ రామకృష్ణపరమహంస గొప్ప జ్ఞానియనుట నిస్సందేహము. ఆయనకు బెంగాలియైనను సరిగా తెలియకుండెను.

శ్లో॥ 3:— అర్జునా! మార్గము సులభము, ఫలము అమోఘము. అయినను దీనికొరకై యెవరో యొకరే ప్రయ త్నించుట యేలనగా దానికి కారణము కర్మఫలము.

బ్రహ్మసాక్షాత్కారమునకు మూడు మెట్లు.

1. శ్రవణము—పురాణ, భజనకాలక్షేపము.

2. మననము—(Recapitulation.)

3. నిదిధ్యాసనము—సందేహములు పెద్దల నడిగి తెలిసి కొనుట. అందుపై బ్రహ్మము నిత్యము, జగత్ మిథ్య అని తెలియును. (The 3rd stage is meditation) అనేక జన్మ

లలో చేసిన పుణ్యవిశేష ముండినగాని భగవద్ధ్యానము కుదురదు.

శ్లో॥ 4, 5:—నేను చరాచర ప్రకృతిని రెండువిధము లుగ సృష్టించి కాపాడుచున్నాను. రెండుప్రకృతులు నా స్వాధీన ములో నున్నవి. For every material object there are three causes:) ప్రతి వస్తువునకు మూడు కారణములు కలవు.

(ఏ) ఉపాదానకారణము— Material cause; e. g. wood for a table. ఒక బల్ల తయారుచేయుటకు కఱ్ఱ కావలయును.

[బి] నిమిత్తకారణము— a person to handle it, దానిని తయారుచేయు పనివాడుకూడ నుండవలయును.

[సి] ఈశ్వరానుగ్రహము—i. e. Divine grace. ఇది అన్నిటికన్న ముఖ్యము.

రెండు విధములైన ప్రకృతు లేవనగా, 1. జడ ప్రకృతి 2 చేతనప్రకృతి.

1. జడప్రకృతి:—ఎనిమిది రకములు. i. e. పంచభూత ములు. (భూమి, ఉదకము, అగ్ని, వాయువు, ఆకాశము) కొన్నిటిలో ఒక element యెక్కువగా నుండును. ఇదిగాక అహంకారము, మనస్సు, బుద్ధి మొత్తము యెనిమిది. మొదటి ఐదు స్థూలశరీరమునకు, మిగత మూడు సూక్ష్మశరీరమునకు ముఖ్యములు. [1] అహంకారము. ఒక మనుష్యుడు నిద్రనుండి

లేచి 'అబ్బా! నేను యెంత మంచినిద్ర పోయి లేచితిని' అను చున్నాడు. 'నేను' అనుటయే అహంకారముయొక్క మొదటి చిహ్నము, or the first manifestation of ego.

[2] మనస్సు—సంకల్ప వికల్పములతో కూడుకొన్నది. (of doubting nature is the mind.)

[3] బుద్ధి is the determinative factor. చింతించు నపుడు చిత్తము అని పేరు. అంతఃకరణ is the same but these are different factors.

2. చేతనప్రకృతి:— జడప్రకృతిని ప్రేరేపించి పనులు చేయించునట్టి Force చేతనప్రకృతి = జీవతత్త్వము or spirit. Paramatma has control over both the Prakrities. God has matter and soul in his control and creates the universe.

But where is God? Is he in the universe? Is he somewhere beyond the clouds? No. He is everywhere in this universe. భగవంతు డెచట నున్నాడు? ఈ ప్రపంచమం దున్నాడా? లేక మబ్బుచాటున నున్నాడా? కాదు, ఆయన అంతట నున్నాడు. "ఇందుగల డందు లేడని సందేహము వలదు చక్రి సర్వోపగతుం, డెందెందు వెదకి చూచిన, నందందే కలఁడు" అని ప్రహ్లాదుడు చెప్పి యున్నాడు.

శ్లో. 7. Like the spider in the web, Paramatma is antaryami in the universe which he has created. He is in it and outside it. He is intra-

cosmic and extra cosmic. There is no object in the three lokas wherein Paramatma is not to be found. చరాచరాత్మకమైన ప్రపంచములోని వస్తువు లన్నియు నాయందు హారములో దారము మాదిరిగా గ్రుచ్చబడినవి. The words "సూత్రే మణిగణా ఇవ" ఈ పదములు ముఖ్యమైనవి. వానికి నాలుగు అర్థములు. 1. గ్రుచ్చబడినవి అసంఖ్యేయములు, దారము ఒకటి i.e. The creator is only one. వస్తుపరిచ్ఛేదము, దేశపరిచ్ఛేదము, కాలపరిచ్ఛేదము లేకుండ అంతట నొక్కటే పరమాత్మ అని ఒక విషయము గ్రహింపవగును.

2. రెండవ అభిప్రాయము : గ్రుచ్చబడినవి. కొన్ని సాత్త్విక, కొన్ని రాజస, కొన్ని తామస వస్తువులు. అన్నిటికి అతీతుడు పరమాత్మ.

3. ఈ యుపమానములోని మూడవ అభిప్రాయము : పూసలు దగ్గరగా గ్రుచ్చియున్నప్పుడు ఆధారమైనతీగ యెట్టిది? అని తెలిసికొనవలయు ననిన శ్రమచేసి ఆ వస్తువులను విడదీసి, Process of elimination వలన స్థూలశరీరములోని వస్తువులను తోసివేసి పరమాత్మను గ్రహించవలెను.

4. I am the connecting link for all the things in the universe. ప్రపంచమందలి వస్తువు లన్నిటికి సంధానకర్త పరమాత్మ.

శ్లో॥ 8, 9:-Arjuna asked the Lord, how he should be worshipped? అర్జునుడు 'పరమాత్మను భజించుట యెట్లు?'

అని అడిగెను: 'ప్రతివస్తువునకు గౌరవముకలిగించెడి ముఖ్యమైన భాగములో పరమాత్మ యున్నట్లు ఆరంభమున భజించవలయును.' అని కృష్ణుడు జవాబు చెప్పియున్నాడు.

Initial stage. This is essence of slokas 8 to 11. Believe that the quality of quenching thirst in the water is God. The light in Sun and Moon is God. So also the sound emanating from the space element, the heroism of warriors, fragrance in things, smelling sweet, in fire, in the minds of the learned and intelligent. *The life principle in all things is God.* God exists in all other things also but the human mind in the initial stage cannot make any bad thing, the object of devotion. Christ realised Divinity in the carcass of a dog.

God exists in legitimate desire and love and in the physically strong and wealthy who use their strength or wealth, to help others. ఈ యుపాసన సిద్ధి చెందగానే పరిపక్వమై అన్నిటియందు పరమాత్మ నిర్లేపుడయి యున్నాడని అర్జునునకు తెలియునని కృష్ణుడు చెప్పియున్నాడు. The sun's rays shine on all objects pure and impure. Similarly, Paramatma is everywhere in all objects good and bad. This is the final stage of Bhakti.

God is everywhere but he can't be seen as our eyes are covered with maya.

Every Jiva is covered by three gunas (Satvic, Rajasic & Tamasic) i.e. maya; so he is not able to see

ప్రారంభదశ శ్లో. 8-11 లలో చెప్పబడినది. నీటి యందలి దాహము, అర్చుశక్తి, సూర్యచంద్రాదులలోని వెలుతురు, భూనభోంతరాళముల యందలి శబ్దము, యోధుల యందలి శౌర్యసాహసములు, సువాసన ద్రవ్యములోని పరిమళము, తియ్యని వస్తువులలోని మాధుర్యము, అగ్నియందలి తేజస్సు, విద్వాంసులయందలి పాండిత్యము, తెలివిగలవారి యందలి మేధాశక్తి - వీటి యన్నిటియందు భగవంతు డున్నాడని గ్రహింపుము. వేయేల? ప్రతివస్తువులోనుండెడి చైతన్యము భగవంతుడే యని చెప్పనగును. "పరమాత్మలేని వస్తువు, పరమాణువు లేదు వంశపావన వింటే" అని భాగవత మందు చెప్పబడినది. అయినను ప్రారంభదశలో నొక చెడువస్తువు చూపి అందు భగవంతు డున్నాడని తెలిపిన మనస్సు అంగీకరించదు. వాని భజించుటకు అంగీకారము పొడమదు. భక్తి పరిపక్వమైనవారికి మంచి చెడుగులయందు భగవంతుడు కానవచ్చుచుండును. యేసుక్రీస్తు కుక్క కళేబరమున భగవంతుని గాంచె నని చెప్పబడియున్నది. సూర్యుడు ప్రపంచమందలి వస్తుసముదాయ మంతటను, సత్పురుషులు దుర్మార్గులు అనెడి విచక్షణలేక ప్రసరించుట చూచుచున్నారము కదా ? అట్లే మంచి వస్తువులు, చెడు వస్తువులు అన్నిటియందు పరమాత్మ యున్నాడని గ్రహింపనగును. కాని మనలను మాయ ఆవరించి యుండుటచేత దీనిని తెలిసికొనజాలకున్నారము. అది సాత్త్విక రాజసిక, తామసికమాయ యని మూడు విధములు.

శ్లో॥ 14:— What is maya ? మాయ యన నెట్టిది ? అనగా అది నా క్రీడకు ఆస్పదమైనది, అది నాశక్తి విశేషము. దానిని దాటుటకు శక్యముకాదు. నీకు కనుపడకపోవుటకు కారణము లేమనగా నీ నా సందున మాయ అను జవనిక (Screen) ఉన్నది. (Screen) జవనిక జీవులకు ప్రతిబంధకమే గాని, పరమాత్మకు ప్రతిబంధకము కాదు. పరమాత్మకు మాయ లోబడియున్నది- త్రాచుపాములోని విషము పాముకు చెరుపు చేయదు. బురదలోని పురుగుకు బురద చెరుపు చేయదు. మాయ పరమాత్మయందు లీనమైనది. పరమాత్మకే గాక పూర్తిగా భగవంతుని నమ్మి భజించువారికి భాగవతోత్తములకు మాయ ప్రతిబంధకము కాదు.

Ramakrishna says that Maya does not obscure the vision of gnanis and bhaktas. He gives an example. A ghosha woman can be seen by two males viz, her husband and son. The son is greater of the two, for the son can enter in at any time but the husband's privilege is limited as he must send previous intimation to enter the zenana. Gnani is similar to the husband and bhakta is similar to the son. Gnani has got an element of ahamkara and relies upon his intellectual conviction to attain mukti, while the bhakta has got implicit faith and goes on worshipping Him.

శ్రీరామకృష్ణపరమహంస జ్ఞానులకు, భక్తులకు, మాయ ప్రతిబంధకముకాదని కొన్ని యుదాహరణములద్వారా తెలియ

బరచియున్నాడు. ఒక ఘోషాస్త్రీని ఆమె పెనిమిటి, కుమారుడు, యిద్దరు చూడవచ్చును. వీ రిద్దరిలో కుమారుడే గొప్ప. ఏలనన అతడు తల్లిదగ్గరకు వెళ్ళవలయు ననినచో యెకాయెకి అంతఃపురములోనికి పోవచ్చును పెనిమిటి వెళ్ళవలయు ననినచో ముందుగా కబురు పంపి అటుపైన లోనికి వెళ్ళవచ్చును. జ్ఞాని పెనిమిటివంటివాడు. భక్తుడు కుమారుని వంటివాడు. జ్ఞాని యందు కొంత అహంకారము గలదు. తన తెలివి తేటలవలన ముక్తి పొందగల నని అత డనుకొనును. భక్తు డట్లుగాక శ్రీమన్నారాయణమూర్తి పాదారవిందములే తనకు ముక్తిదాయకము లనెడి దృఢవిశ్వాసముతో భగవంతుని ప్రార్థించుచుండును.

జ్ఞానమార్గము:—మానవునికి మర్కటకిశోరన్యాయము వంటిది. అనగా కోతిపిల్ల తల్లి కడుపు నెంత జాగ్రతగా పట్టుకొనునో అంత క్షేమముగ నుండునేకాని తల్లి పిల్లక్షేమము తనపై నున్నదని గ్రహించదు. అట్లే జ్ఞాని తన క్షేమమును తానే వెతకుకొనవలయును. భగవంతుని పూచీ లేదు.

భక్తి మార్గము:—మార్జాల కిశోర న్యాయమువంటిది. పిల్లి తన కూనలను తాను నోటితో కరుచుకొనిపోయి కాపాడుచున్నది. అట్లే భగవంతు డను పిల్లి భక్తులను కూనలను కాపాడుచున్నాడు.

Suddha Maya is protecting bhaktas and gnanies. Asuddha maya is troubling the jivas. The palm is given to bhaktas for the gnani goes on wasting all

his time in intellectual research which may not be finished in this lifetime. Bhakta attains moksha earlier in a more easier fashion.

మాయ రెండు రకములు - శుద్ధమాయ, అశుద్ధమాయ అని. శుద్ధమాయ జ్ఞానులను భక్తులను కాపాడుచున్నది. వారిద్దరిలో భక్తులకే అగ్రస్థాన మివ్వబడినది. జ్ఞాని తన కాలము యావత్తు పరిశోధనయందే వెళ్ళబుచ్చును. ఒక్కొకపుడు పరిశోధన ముగియకమున్నె ప్రాణముపోవుట తటస్థించవచ్చును. భక్తి వలన మోక్షము పొందుట అంతకన్న బహు సులభమైనట్టి మార్గము.

బ్రహ్మేంద్రాది దేవతలు, నారదాది మునులుగూడ, శ్రీ విష్ణుమూర్తి యొక్క సంకల్పమాత్రమున నేర్పడినట్టి మాయను జయించజాలకుండిరి. నారదుని వృత్తాంత మిచట గమనించనయ్యెడిని. నారదుడు మాయ యెట్టిదని శ్రీకృష్ణుని ప్రశ్నించ ఆ భక్తుని కృష్ణుడు కొండొకదూరము గొనిపోయి, త్రాగుటకు మంచినీరు తెమ్మని ఆతని పంపెను. శ్రీ కృష్ణుని మాయవలన యెచట చూచినను జలమున్నను, నారదునికంటికెచటను మంచినీరు కానరాలేదు. అచట నొక చిన్నపిల్లను చూచి ఆమెయందు మోహాపరవశుడై, నారదు డామెను వివాహమాడి సంతానము బడసి అచట శ్రీకృష్ణుడు తనను మంచినీరు తెమ్మని బంపినది మరచి హాయిగా కాలము గడుపుచుండెను. కొన్ని సంవత్సరములు గడచిన తరువాత పెద్ద వరద వచ్చినందున భార్యపిల్లలను తీసుకొని, వారల నేతీరుగా నైనను

కాపాడుకొనవలయు నని బయలుదేరెను. ప్రవాహము అంత కంత కెక్కువగుటచే, ముందర పిల్లలను, తదుపరి భార్యను పరి త్యజించి తనప్రాణము దక్కిన జాలు నని, నారదు డెట్టకేలకు బయల్పడి, తన ఆలుబిడ్డల గోల్పోయి తాను బ్రతికియుండుట నిష్ఫల మని దుఃఖించుచుండెను. శ్రీకృష్ణుడు నారదుని భుజముపై చేయివేసి తట్టి, ‹నారదా! మంచినీటికి వెళ్ళి అరగంటసే పెందుకు ఆలస్యము చేసితి'వని యడిగెను. నారదుడు విస్మయ మంది "హే ప్రభో ? నాకు కొన్ని సంవత్సరములు గడచిన ట్లగపడుచున్నది" అని తనకు గలిగిన సుఖదుఃఖముల వివ రించెను. అదియంతయు మాయ యిట్టి దని దృష్టాంతపూర్వ కముగా నారదునికి తెలియపరచుటకు తా నొనర్చిన చిత్రమని తెలియచేసెను. దీనినిబట్టి మనము గ్రహించవలసినది యే మనగా- ఈ జగ మంతయు ఒక కలవంటిది. ఈ ప్రపంచమందు లేనిది యున్నట్టు, ఉన్నది లేనట్టు మాయాంధకారమువలన కన్పట్టుచున్నది. శంకరాచార్యులవారు వివేకచూడామణి యందు—"సన్నాప్యసన్నా ప్యుభయాత్మికా నో" అని వ్రాసి యున్నారు. ఈ ప్రపంచ మున్నదా లేదా అని చెప్పుటకు వలనుపడదు. పసిబిడ్డల నుయ్యేలయందుంచి వారిని నిద్రపుచ్చు టకై పాడెడి జోలపాట- "చుచ్ వుల్లుల్లాయి" ఈ ప్రపంచ మంతయు మిథ్యయనియు ఈ ప్రపంచమందు సుఖము లే దనియు దృఢపరచుచున్నది.

ఈ మాయను జయించుట యెట్లనిన, భగవంతుని పాదార విందముల గట్టిగా పట్టుకొని ఆయనను భజింపుము. అంతకన్న

వేరుమార్గములేదు. భగవంతుని భజించుటకు జాతిమతభేదము లడ్డు తగులవు. రైలుబండిలో అన్ని జాతులవారు ఎట్లెక్కెదరో, అట్లే యెల్లరు జాతి మత వివక్షతలేకుండ భజనచేయవచ్చును.

The only way to conquer Maya is to catch hold of my feet and worship me. మామేవ- the అవ్యయమ్; ఏవ, gives one meaning as it is read in conjunction with one word. మామేవ = నన్నే = me alone and not other deities. య ఏవ = ఎవరైనను = any person irrespective of caste, creed or sex (Chap. I. S. 33 & 34) All persons can worship Him as they can travel in the train. ప్రపద్యంతే ఏవ = whole-hearted devotion (e.g. Ramadoss saying "అడుగుదాటి కదలనివ్వను"). You must sacrifice all ahamkara, vanity, kama, krodha on the "బలిపీఠం" before you enter a temple. "స్వరక్షణే స్వాన్వయం దోషం" అని వైష్ణవగ్రంథములు చెప్పుచున్నవి. తన మానప్రాణధనములు కాపాడుకొనుటలో తనకు కొంత వరకు శక్తి కలదని యే మనుష్యుడనుకొనునో వానికి భగవంతుడు స్వాధీనము కాడు. యావత్తుకు ఆయనయే రక్షకుడని గ్రహింపవలయును.

మాయ ఏవ = మాయలోనుంచియే విముక్తిచెందును. ఇతరములుకూడ జయించనగును.

తరంతి ఏవ = దాటియే తీరును.

Vivekananda says "Maya is statement of facts for which no reason can be assigned." మనము 'దీని కిది కారణము' అని చెప్పజాలని విషయము లెల్ల మాయ యని వివేకానందస్వామి చెప్పియున్నాడు.

శ్లో॥ 15. అర్జునా! మహాపాపులు నన్ను భజించరు. భజించనివారు పాపులు. వారు నాలుగురకములు (1) మూఢులు పరమ అజ్ఞానులు.

(2) నరాధములు=పాపభీతి లేక జీవించువారు.

'There are leopards, cheetas and serpents among men.' మానవులలో పెద్దపులులు, చిరుతపులులు, పాములు, వీనిని బోలినవా రున్నారు.

(3) చదువుకొన్న పాపులు e. g. (Ravana and Hiranyakasipa) రావణుడు, హిరణ్యకశిపుడు ఈ తరగతివారు. వారి జ్ఞానమును మాయ దొంగిలించినది.

(4) రాక్షసస్వభావము కలవారు.

శ్లో॥ 16. భజించు పుణ్యాత్ములు నాలుగురకములు.

1 ఆర్తులు: ఏదో దుఃఖమునకు లోబడి యున్నవారు-వారిలో పుణ్యాత్ములు.

2 జిజ్ఞాసువులు: పరమాత్మ యెట్టివాడో తెలిసికొనగోరు వారు.

3 అర్థార్థి: ద్రివ్యము కోరువారు, వీరిలో పుణ్యాత్ములు.

4 జ్ఞానులు: వీరిలో పుణ్యాత్ములు.

ఈనలుగురిలో జ్ఞాని మిక్కిలి శ్రేష్ఠుడు. మొదటి ముగ్గురికి భగవద్భజన కోరికలకు సాధనము. ఆ కోరికలు కొనసాగిన పిదప వారి భక్తి నశించును. After achieving their objects, they give up bhakti. వారు ఫలాపేక్షతో భగవంతుని భజించువారు. వారికి సాధనముకన్న సాధ్యమెక్కువ. దేవునికన్న కోరిక లెక్కువ. జ్ఞానికి సాధనము, సాధ్యము means and end రెండు నొకటియే. Devotion for the sake of devotion. He worships God always without asking for any fruit, జ్ఞాని యెట్టిఫలముల గోరక భగవంతుని యెల్లప్పుడు భజించుచుండును.

శ్లో॥ 17. ఈ నలుగురిలో జ్ఞాని యెక్కువగా నా ప్రేమను చూరగొనును. జ్ఞాని నా ఆత్మకు సమానము. మొదటి ముగ్గురును నా శరీరమునకు సమాను లని అర్థము అని టీకాకారులు వ్రాసియున్నారు.

శ్లో॥ 19. జ్ఞాని కావడ మనగా అర్థ మేమి? అనేకజన్మ లెత్తి కడపటి జన్మలో అది కలుగును. అంతా బ్రహ్మమయము అని యెరుగుట. He must be a male among males and female among females. He alone is a true gnani. సర్వము వాసుదేవమయ మని గ్రహించుట జ్ఞానము.

శ్లో॥ 20. అర్జునుడు కృష్ణపరమాత్మను "ఏల అందరు నిన్ను కొలువరు? అన్యదేవతల నేల కొలిచెదరు ?" అని అడుగగా, ప్రారబ్ధకర్మ మని పరమాత్మ సెలవిచ్చెను.

21 శ్లోకము మొదలు Paramatma says it is undesirable to worship a cosmogony of Gods ప్రత్యేక దేవతారాధనవలన కోరికలు నెరవేరవచ్చును. ఆదేవతలందరు పరమాత్మస్వరూపములు. ఆయన అవయవవిశేషములు. పరమాత్మయొక్క ఒకొకశక్తి ఒక దేవతగా ఆరాధింపబడుచున్నది. వారిద్వారా పరమాత్మ మనకు ఆ యా ఫలముల నిచ్చుచున్నాడు. పరమాత్మ వేరు. ఆ దేవత వేరు అను అభిప్రాయముతో దేవతారాధన చేసిన లాభములేదు. ఆ దేవతలు పరిచ్ఛిన్నమైన శక్తికలవారు గనుక కేవలము వారిని నమ్మిన లాభములేదు.

These deities are all office-holders or posts of the Almighty. ఆదేవత లందరు భగవంతుని తాబేదారులు.

ఏ దేవతను పూజజేసినను భగవంతుడే అని పూజచేయవలయును. దేవతలద్వారా పూజచేసిన ఫలము స్వల్పము. భగవంతునే ఆరాధించిన మోక్షసామ్రాజ్యము పొందనగును. దేవతాంతరారాధన పనికిరాదని శ్రీకృష్ణుడు తెలిపియున్నాడు. శివుని వైష్ణవులు పూజచేయవచ్చును. వైష్ణవులు శివుని శ్రీమన్నారాయణునియొక్క మరియొకరూప మని గ్రహించవలెను. (e.g. అప్పయ్యదీక్షితులుగారు కృష్ణదేవరాయనికి విష్ణువును శివునిగాను, శివుని విష్ణువునుగాను మార్చి చూపుట). అన్యదేవతలు పరమాత్ముని అంశము లని అభిన్నభావముతో పూజ చేయవలయును.

శ్లో॥ 26. అర్జునా! నాకు ఇదివరకు జరిగినది, జరుగు

చున్నది, ముందు జరుగనున్నది తెలుసును. కాని జీవుడు ఎంత గొప్పవాడైనను నాసంగతిమాత్రము తెలిసికొనజాలడు.

శ్లో. 27-28. పుణ్యకర్మలను అనుష్ఠించి పాపమును పోగొట్టుకొన వలయును. అంతర్జ్వరము ఉన్నంతవరకు టానిక్ (tonic) పట్టదు. పుణ్యకర్మానుష్ఠానమువల్ల పాపము నిర్వీర్యము చేసుకొనిన వాడు సుఖదుఃఖములు, మానావమానములు, జయాపజయములు అను ద్వంద్వములలోను నిర్విణ్ణుడై, చలించని మనస్సు కలవాడై పరమాత్మను భజించును.

శ్లో॥ 29. ఏల జనసామాన్యము నన్ను ఇపుడు భజించుట లేదనగా, వారి అనర్థము వారికి తెలియుట లేదు. ముఖ్యమైన అనర్థములు రెండు—ముసలితనము, చావు. ఈ రెండు అనర్థములకును, రోగములకు లోనయిన లక్షణములు కలిగిన పాంచభౌతిక శరీరము లేకుండ చేయవలసిన దని పరమాత్మను భజించవలెను. రోగము, ముసలితనము, చావు, ఈమూడు, మానవశరీరమునకు అనర్థకములు.

ఈ మూడు అనర్థములు లేని స్థితిని జీవుడు వెదుకవలయును. In order to attain this there must be harmony between word, thought and deed. (Buddhism emphasises our good conduct— సత్ప్రవర్తన) మోక్షము బడయువలయు ననిన తలచినది చెప్పుట, చెప్పిన ప్రకారము నడచుకొనుట, సత్ప్రవర్తన అవసరము. శరీరసంబంధము చాలించుకొనిన మనము బాగుపడుదు మని గ్రహించవలయును.

శరీరసంబంధ మున్నంతవరకు పై మూడు కష్టములకు లోను కావలసినదే.

శ్లో॥ 29, 30. ఎవ డయితే శరీరప్రాప్తిలేకుండ చేయవలయునని నన్ను కోరునో వాడు (1) బ్రహ్మ, (2) కర్మ, (2) అధిభూతము, (4) అధియజ్ఞము, (5) అధ్యాత్మము, (6)అధిదైవము, (7) ప్రయాణకాలములో నన్ను స్మరించుట—ఈ యేడు సంగతులు గుర్తెరుగవలెను. ఈ యేడుమాటల వివరము 8 వ అధ్యాయములో చెప్పబడినది. అందు 1, 2 శ్లోకములు ప్రశ్న; మిగత 26 శ్లోకములు జవాబు.

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జునసంవాదే విజ్ఞాన
యోగో నామ సప్తమోధ్యాయః
సంపూర్ణః



257

# శ్రీ భగవద్గీతోపన్యాసములు

## 8 వ అధ్యాయము.

## అక్షరపరబ్రహ్మయోగము

శ్లో॥ (1) బ్రహ్మము:—నాశనములేని వస్తు వేదో అది బ్రహ్మము. అద్వైత - బ్రహ్మ, అనాది, అనంతము. మాయ అనాదియే గాని అంతము కలది. విశిష్టా - చిత్, అచిత్, ఈశ్వర, ప్రకృతి, జీవుడు, పరమాత్మ, అన్ని అనాది, అనంతములు.

ఆకారములోగాని, ఆయుస్సులోగాని, ఆనందములోగాని అన్నిటికన్న గొప్పది బ్రహ్మ అని ఆనందవల్లిలో చెప్పబడియున్నది.

These are three separate distinct eternal entities. This is common to all three—Vishistadwaities, Dwaities and Saivites. Soul is greater than this dull dead matter. By gnanam there is the realisation that there is a Sarvagna who is the fountain source of all knowledge i. e. Paramatma or Brahma the highest bliss. ద్వైతాద్వైత విశిష్టాద్వైత సిద్ధాంతము లన్నిటియందుగూడ, ఆత్మ, పరమాత్మ, జడప్రకృతి మూడు ప్రత్యేకతత్వములు. జడప్రకృతికంటె ఆత్మ గొప్పది. జ్ఞానమువలన పరమాత్మయొక్క సర్వజ్ఞత్వము సర్వవ్యాపకత్వము, జ్ఞానమున కంతటికిని ఆయన యుత్పత్తిస్థాన మని తెలియుటవలన బ్రహ్మానందము కలుగుచున్నది.

(2) అధ్యాత్మము:— బ్రహ్మవస్తువు స్థూలసూక్ష్మశరీరములతో కలసినప్పుడు జీవుడు అధ్యాత్మము అని చెప్పబడును. Subjective side.

(3) అధిభూతము:—కన్ను అధ్యాత్మము, అధిభూతము చూడబడు రూపము.

(4) అధిభూతమునకు, అధ్యాత్మమునకు రెంటికి చేరిక కలిగించు జీవాత్మ అధిదైవము అనబడును.

(5) అధియజ్ఞుడు:— జీవుడు చేయు కర్మలవలన ఆరాధింపబడు ఈశ్వరస్వరూపము.

(6) కర్మ:—ప్రపంచ సృష్టికి పోషణకు కారణభూతములైన పనులు కర్మయని చెప్పబడును. వేదశాస్త్రపురాణముల నమ్మి వారివారికర్మలను నియమముతో చేయవలయును.

(7) ప్రయాణకాలమందు స్మరణ చాలా ముఖ్యము. Very important i. e. అవసానకాలము. ప్రయాణకాలము అనుట యెందుకనగా ప్రయాణ మగునప్పుడు మూటకట్టుకొని పోవుమాదిరి జీవుడు చచ్చి యీ శరీరమును వదలునప్పుడు తీసుకొనిపోవు మూట ఒకటి యున్నది. ధనముగాని, పశువులుగాని, భార్యగాని, బంధువులుగాని, యింత జాగ్రత్తగా కాపాడిన శరీరముకాని జీవుడు వదలిపోవునప్పుడు వెంట రావు. కాని కర్మ, the sum total of all physical and mental acts జీవునివెంట పోవుచున్నది. అదియే జీవునివెంట పోవు మూట. ఆ మూట కట్టుకొనిపోవుటలో పాపములను వదలివేసి, పుణ్యము మూటకట్టుకొని పొమ్మని (Significance) గ్రాహ్యము.

శ్లో॥ 5-6 అంత్యకాలములో జీవుడు శరీరమును వదలి పెట్టునపుడు నన్ను స్మరించుచు ప్రాణము వదలిన మోక్షము కలుగును. "అంత్యే నారాయణస్మృతిః" అని చెప్పబడినది. అట్లు స్మరణము చేయుచు చనిపోయిన తిరిగి మాతృగర్భ ప్రవేశ ముండదు.

శ్లో॥ 6. This contains an important psychological statement. ఈ శ్లోకములో నొక ముఖ్యవిషయము తెలుపబడినది. జీవుడు దేనిని స్మరించుచు శరీరము చాలించునో ఆ రీతిగా పునర్జన్మము పొందుచున్నాడు. e.g. జడభరతుని వృత్తాంతము. జింకపిల్లయందు సర్వసంగపరిత్యాగి అయిన జడభరతునికి వ్యామోహము కలుగుట, చనిపోవునపుడు జింకపిల్ల జ్ఞాపకము వచ్చినందున తిరిగి జింకగా పుట్టెను. మాదిగభక్తుడైన రోహిదాసు పూర్వజన్మలో గొప్ప బ్రాహ్మణసన్యాసిగా నుండి చెప్పుల స్మరించుచు చనిపోయి నందున చండాలుడై రోహిదాసుగా జనించెను. ఒకమధ్వ మఠాధిపతి చీపురుకట్టను స్మరించుచు దేహము చాలించినందున ఆయన చీపురుకట్టగా జనించెను. If you think of God in the last moments, you attain moksha. భగవంతుని దలచుచు ప్రాణముల వదలిన మోక్షము ప్రాప్తించును.

అవసానకాలములో భగవంతుడు జ్ఞాపకము రావలయు ననగా, ఇప్పటినుంచే కర్మానుష్ఠానము జేసి భగవంతుని ధ్యానము చేయవలయును. e. g. పరీక్ష ప్యాసు కావలసిన విద్యార్థి పరీక్షకుముందు కొద్దికాలము చదివిన లాభములేదు.

మొదటినుంచి శ్రద్ధతో చదువవలెను. బాగా చదివినవారు కర్మవలన తప్పిపోవుటకలదు. అందువలన సర్వకాలసర్వావస్థల యందును భగవంతుని స్మరింపుము. నిద్ర చిన్నచావు. పగలు చేసిన పనులు రాత్రి కలలో వచ్చుట యింకొక నిదర్శనము. 'వార్ధకే మునివృత్తీనాం.' వయస్సు అయిన పిమ్మట వ్యాపార వాంఛలను ప్రాపంచిక వాసనను తగ్గించుకొనవలయును. భగవంతునియందు మనస్సు నిలుపవలయును.

" Have religion at least as a hobby when you are young and in active service." (Swami Vivekananda), What is hobby in youth will become the main thing in old age. నీవు మంచి వయస్సునందుండి తీవ్రముగా పని చేయు రోజులలో 'మతము' నొక విలాసవస్తువుగా నుంచుకొనుము. వార్ధకమున నయ్యది ప్రప్రధానముగా నీ కుపకరించును అని వివేకానందస్వామి చెప్పియున్నాడు.

ఇప్పటినుండి భగవంతునియందు మనస్సు నిలిపిన అవసానకాలమందు భగవంతుడు జ్ఞాపకము వచ్చునను నమ్మకము కలదా ? భీష్మునికి శాపకారణమువలన కృష్ణుడు ప్రక్కనున్నను అంత్యకాలములో భగవంతుడు జ్ఞాపకము రాలేదు. గొప్ప భక్తులకు, జ్ఞానులకు అవసానకాలమందు ఏదో కర్మవలన భగవంతుడు జ్ఞాపకము రాకపోయినను, వారిని వదలిపెట్టను అని పరమాత్మ 'వరాహగీతలో' చెప్పియున్నాడు. అట్టివారికి ఒక్క మెరుపుమాదిరి నా స్వరూపము కనుపరచి వారిని నాయందు కరుణాకటాక్షమువల్ల కలుపుకొనెద నని పరమాత్మ అందులో చెప్పియున్నాడు.

Read Mukundamala of Kulasekhara Alwar—Garland of prayer slokas. కులశేఖరాళ్వార్ విరచిత 'ముకుందమాల' మిక్కిలి పఠనీయము.

శ్లో॥ కృష్ణ! త్వదీయపదపంకజపంజరాంత
మద్యైవ మే విశతు మానసరాజహంసః
ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః
కంఠావరోధనవిధౌ స్మరణం కుత స్తే॥

ఓ కృష్ణా! నా మనస్సనియెడి రాజహంసము నీ పాద పద్మము లనియెడి పంజరమున నిప్పుడే ప్రవేశించునుగాక! అనగా నా మనస్సు నీ పాదపద్మములయందు ఇప్పటినుండియే నిలచి యుండునట్లు చేయుము. అవసానకాలమందు కఫవాతపిత్తంబు లడ్డుపడి నిన్ను స్మరించుటకు వీలు గలుగదు."

ముకుందమాల.

ముసలితనములో భగవంతుని పూజించవచ్చును. ఇప్పు డేమి తొందర అనుకొనుట ఇల్లు అంటుకొన్నపిమ్మట బావి త్రవ్వించుటకై ప్రయత్నించు మాదిరిగా నుండును. "గృహ దాహానంతరం కూపఖనన మివ". శరీర ఇంద్రియపాటవ మున్న పుడే భగవన్నామస్మరణ చేయవలయును. అట్టికాలము వృథ బుచ్చి పెద్దతనములో చేయవచ్చు ననుకొనుట వట్టి వెఱ్ఱితనము. కావున మనోబుద్ధి వ్యాపారములు ఆయనయం దుంచిన పర మాత్మసన్నిధానము చేరవచ్చును.

శ్లో॥ 8. నన్ను స్మరించుటకు అలవాటు చేసికొనుము. Practice makes a man perfect. ఇతర విషయములయందు

పోవుట మనస్సునకు స్వభావము. విషయము లందలి దోష ములను పరమాత్మయందలి గుణగణములను గమనించి వైరాగ్యము, భక్తి కుదుర్చుకొనవలయును. ఎప్పుడు పరమాత్మ యందు భక్తి కుదురునో అప్పుడు ప్రాపంచిక విషయములందు విరక్తి కుదురునని శుకమహర్షి పరీక్షిత్తుమహారాజుకు మరణము సమీపించు చున్న దని దుఃఖపడుచుండగా చెప్పియున్నాడు. పరమాత్మయందు భక్తి, ప్రపంచమందు విరక్తి - ఇదియే వేదాంతగ్రంథముల సారాంశము.

శ్లో॥ 9. సర్వజ్ఞుడైనట్టి నన్ను భజించి నా సాన్నిధ్యము చేరవలయును. భజించుట యెట్లు? ఆరాధించుమూర్తి సర్వజ్ఞుడు అని అనుకొనవలయును. (i. e, You must realise that He is an omniscient being. ఆయన అణువులో అణువుగా నున్నాడు. He is smaller than the smallest and bigger than the biggest. వారివారికి ప్రాచీనకర్మల ననుసరించి ఫలముల నిచ్చువాడని తెలియవలయును. ఆయన రూపము ఊహించుటకు వీలులేదు. సూర్యునివంటి కాంతికలవాడు. అందరిమాయ పోగొట్టువాడు, అనగా మాయాధీశుడు. ఇట్టి గుణములు కలవాడని భగవంతుని పూజించ వలయును. సూర్యుడు ప్రాకృతిక అంధకారమును పోగొట్టునట్లు పరమాత్మ అజ్ఞానాంధకారము పోగొట్టును. "నీ పాదములే గతి" యను వారికి ఆయన స్వాధీనపడును. అన్ని నశించినను పరమాత్మ నశించడు.

శ్లో॥ 16. బ్రహ్మను (పరమాత్మను) ఆరాధించినవారికి పునర్జన్మలేదు. ఆయనదగ్గర చేరినవారిని మరల సంసారములో జారనివ్వడు. అందువల్ల ఆయనకు 'అచ్యుతుడు' అని పేరు వచ్చినది. ఇతర దేవత లందరు కాలమునకు లోబడినవారు. పరమాత్మ కాలాతీతుడు.

శ్లో॥ 17. అనేకవేల యుగములు బ్రహ్మదేవున కొక పగలు. అనేకవేల యుగము లొక రాత్రి, కాలము అనంత మని పరమాత్మ తెలిపియున్నాడు. Time is infinite, అది అంతము లేనిది. Space is also infinite. ఇది గమనించిన యెడల పెద్దలని విఱ్ఱవీగువారుకూడ పేడలో పుట్టు పెదపురుగుల కన్న స్వల్పమని తెలియుదురు.

Ramakrishna gives the example of a glow-worm [మెరుగుడు పురుగు] after dusk thinking it is the cause of all light. When the stars rise, its pride is gone. The Stars think they are giving light; then comes the Moon who in her turn feels prouder still of lighting and bathing the world in beauty. But with the sun-rise all her brilliance wanes into insignficance. Remember that that there are greater beings, there have been in the past, and there will be in the future. Thinking that you are the greatest personality is on the same footing as the frog in the well. If you realise this, you give up the ego or ahamkara.

శ్రీ రామకృష్ణపరమహంస యీ సందర్భమందు మెరుగుడు పురుగు నుదాహరణముగా నిచ్చియున్నాడు. అది రాత్రియందు తన కాంతియే వెలుతురునకు కారణమని మురియు

చున్నది. నక్షత్రములు వెలువడిన పిదప దాని గర్వము తగ్గు చున్నది. అవికూడా ప్రపంచమునకు వెలుతురు తమవలననే కలుగుచున్న దనుకొనును. అటుపై చంద్రుడు వచ్చి అట్లే గర్వ పడును. కాని, సూర్యోదయమైన వెంటనే చంద్రుని కాంతి యంతయు మఱుగుపడును. మనకంటె గొప్పవారెందరో కలరు. ఇదివర కుండిరి, ముందుండగలరు అని గ్రహింపనయ్యెడిని. 'నా అంత గొప్పవాడు ఈ ప్రపంచములో లే'డని విఱ్ఱవీగుట, బావిలోని కప్ప సామెత యగుచున్నది. ఇద్దానిని తెలిసికొని మానవులు తమయందలి అహంకార మమకారముల మొదలంట పెరికివేయవలయును.

శ్లో॥23-24. అర్జునుడు 'ఎవరు ఎప్పుడు శరీరము చాలింతు'రని ప్రశ్నించెను. దానికి పరమాత్మ యిచ్చిన జవాబు యేమనగా - అహంకార మమకారముల వదలిపెట్టిన భక్తుల వ్యుత్క్రమణగతికి మూడుపేర్లు. (వారలు మాతృగర్భ ప్రవేశము లేనట్టివారు). 1. అర్చిరాదిమార్గము లేక శుక్లగతి లేక దేవయానము.

"అగ్ని...ఉత్తరాయణం" కొందరు దేవతలు (గొప్ప వారు) ఆహ్వానముచేసి కొంతకాల ముంచుకొని తరువాత పైకి పంపెదరు. అట్టి దేవతలు గొప్పవారు-అగ్ని, జ్యోతిస్సు, అహస్సు, శుక్లపక్షమునకు అభిమానదేవత, ఉత్తరాయణమునకు అభిమానదేవత. ఈపాదము దేవతలను సూచించునని కొందరు టీకాకారుల అభిప్రాయము.

కొందరు కొన్ని మాటలు దేవతలను, కొన్ని

కాలములను తెలుపు నని, యెక్కువ మాటలు కాలము తెలుపునని చెప్పియున్నారు. గొప్ప భక్తులు, జ్ఞానులు పగలు, శుక్లపక్షములోను, లేదా ఉత్తరాయణ పుణ్యకాలములో శరీరము చాలించుదురని, అగ్ని దేవతవలన, జ్యోతిస్సుకు అభిమాన దేవతవలన సత్కరింపబడుదురని కొందరు వ్యాఖ్యానకారులు వ్రాసియున్నారు. అందువలన శంకరులవారు నిర్యాణ కాలము తెలుపుచున్నా నని మొదటి పాదములో చెప్పినట్లు సమర్థించినారు. క్షీర నీరన్యాయము వర్తించుచున్నది గనుక యెక్కువ పదములు కాలమును సూచించుటచే కాలము తెలుపుచున్నానని పరమాత్మ సెలవిచ్చియున్నాడని వీరి అభిప్రాయము.

దేవత లున్నారా యను వారి సందేహము నివారింపబడును. అగ్ని, జ్యోతిస్సు వగైరా అన్నియు సత్వగుణమును సూచించుచున్నవి. సాత్వికవృత్తి ప్రబలియుండునపుడు గొప్ప భక్తుడు లేక జ్ఞాని శరీరము చాలించునని మూడవవ్యాఖ్యానము.

[భీష్ముడు రామునికన్న పితృవాక్యపరిపాలనాసక్తుడగుటచే, ఆయనకు స్వచ్ఛందమరణము తండ్రివలన వరముగా నియ్యబడినది. అందువలన ఆయన ఉత్తరాయణ పుణ్యకాలములో శరతల్పగతుడై శరీరము వదలెను.]

శ్లో॥ 25. ఫలాపేక్షతో కర్మానుష్ఠానము చేసినవారికి 1. ధూమమార్గము లేక 2. కృష్ణగతి లేక 3. పితృయానము కలుగుచున్నది. వీరు తిరిగి మాతృగర్భ ప్రవేశము చెందవలసినవారు. వీరిని తక్కువ దేవతలు ఆహ్వానించెదరు.

వా రెవరనగా పొగకు, రాత్రికి, కృష్ణపక్షమునకు దక్షిణా యనమున కభిమానదేవతలు ఆహ్వానించెదరు. వారు చంద్ర మండలములోను, అందులోనుంచి మేఘమండలములోను ప్రవే శించి వర్షముగా క్రిందపడి పైరుపంటలు అయి, వాటిని తినిన స్త్రీపురుషుల శరీరమందు శుక్రశోణితములుగా నేర్పడి జనన మంది, చచ్చి, తిరిగి అదేమాదిరిగా జనన మొందుచున్నారు. ఇక్కడ నాలుగుమాటలలో మూడు కాలమును, ఒకటి దేవతను సూచించుచున్నవి.

రజోగుణములు, తమోగుణములు ప్రబలియుండునప్పు డిట్టివారు దేహము చాలించెద రని ఒక వ్యాఖ్యానము.

The above statements are all general and have got exceptions. It does not necessarily follow that the persons who die in the periods mentioned above are bhaktas or otherwise.

ఇందలి అంతరార్థ మేమనగా, భక్తులు జ్ఞానులు బ్రతికి యుండి ఉపకారముచేయుదురు. వారు శరీరముచాలించునప్పుడు ఇతరులకు యెట్టిశ్రమ కలుగకూడని కాలములో దేహము చాలించెదరు. ఎవనియొక్క క్షేమము వినగానే ఆనందము కలుగునో, యెవనికి కష్టము కలిగినదని విని యితరులు దుఃఖ పడెదరో, అట్టివాడు గొప్పవాడు. కనుక అట్టిబ్రతుకు బ్రతు కుము.

శుక్లగతి=white path. మరల మాతృగర్భప్రవేశము లేదు. కృష్ణగతి=dark path. పునర్జన్మ ఉన్నది. The man who is anxious to pass through the first path, should always follow Varnasrama dharma and worship

God with bhakti. శుక్లగతి పొందవలయునని వర్ణాశ్రమ ధర్మము ననుసరించి భగవంతుని భక్తితో భజించవలయును.

You may learn the Vedas, perform several yagnams, perform tapas, but these are all worthless without bhakti, just as all things are tasteless without salt. శ్లో॥ 28. భగవంతునియందు భక్తిలేకున్న యజ్ఞ యాగాది క్రతువులవలనగాని, వేదాధ్యయనమువలనగాని లేక తపస్సువలనగాని లాభములేదు. ఉప్పు రుచుల కెల్ల ముఖ్యము. అట్లే అన్నిటికి భక్తి ప్రధానము. ఉత్తరగీతలో యిచ్చిన యుపమానము — గాడిదమీద చందనము కట్టి వేసిన దాని వాసన అది గ్రహించ జాలదు.—వేదశాస్త్ర పారాయణుడై మంచి వాగ్ధాటి కలిగిన వారికి కూడ భక్తి లేనిదే ముక్తిలేదు. అట్టివారు ప్రపంచమును తమ వాఙ్మయమువలన రంజింపచేయవచ్చునేగాని, భగవంతుని మెప్పించ జాలరు. భక్తిలేని వేదాధ్యయనము, తపస్సు, యజ్ఞము, దానము అన్నియు బూడిదలో హోమము చేసినట్లు వృథ. అవి రాణించవు. భక్తివలన వాటి అన్నిటికన్న అనేకరెట్లు ఫలితము చెందవచ్చును. మానవజన్మ ఉత్తమమైనట్టిది. మంచిగుణము లున్నను వానికి భగవద్భక్తి లేనియెడల వాడు తరింపడు. ఆ గుణము లన్నియు శవాలంకారములు వోలె నిష్ప్రయోజనములు. Character is three-fourths religion. The remainder must be made up by Bhakti. మతము నందు ముప్పాతికపాలు సత్ప్రవర్తన. శేషించిన పాతికపాలు 'భక్తి' వలన పూర్తిచేయవలయును. ఎవనికైతే శ్రీకృష్ణ

పరమాత్మయందు భక్తిలేదో, వానికి ఎంత సంపదయున్నను, ఎన్ని మంచిగుణము లున్నను, అవి యన్నియు అజాగళ స్తన ముల మాదిరి (మేక మెడలోని చళ్ళు) నిష్ప్రయోజనము లని మరియొక శ్లోకమందు చెప్పబడి యున్నది. భక్తి అనే టిక్కెట్టు పొంది కర్మానుష్ఠానము చేసినయెడల ప్రతి మానవుడు మోక్షసామ్రాజ్యము చెందగలడు. Bhakti is the connecting link between man and God.

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే అక్షరపరబ్రహ్మ
యోగోనామ అష్టమోధ్యాయః
సంపూర్ణః.



# శ్రీ భగవద్గీతోపన్యాసములు

## 9 వ అధ్యాయము

---

### రాజవిద్య లేక రాజగుహ్య యోగము.

ఇందలి 34 శ్లోకములు ముఖ్యమైనవి. అర్జునుడు ఎట్టి ప్రశ్నలు వేయకయే పరమాత్మ కృపాకటాక్షపరిపూర్ణుడై చెప్పియున్నాడు.

శ్లో॥ 1. అర్జునా! అన్నిటిలోను రహస్యమైన విషయములు నీకు చెప్పబోవుచున్నాను. ఇదివరకు చెప్పియున్నాను. కారణ మేమనగా నీకు ఓర్వలేనితనములేదు. ఏ స్త్రీ గాని, పురుషుడుగాని యితరుల సిరిసంపదల చూచి ఓర్వజాలరో అట్టివారు వేదాంతోపదేశము పొందుట కనర్హులు అని తెలియవలయును. గాంధారి ఓర్వలేనితనమువలన కడుపు పొడుచుకొనుటచే నూర్గురు దుర్మార్గులు జనించిరి. 'అసూయైకా గుణాన్ హంతి' తొమ్మిదివందల తొంబదితొమ్మిది మంచిగుణములనుగూడ ఒక దుర్గుణము 'అసూయ' చెడగొట్టుచున్నది. కడివెడు మంచిపాలను ఒక్క విషపుచుక్క చెడగొట్టుట యెరుగమా! 18 వ అధ్యాయములో ఈశ్వరశుశ్రూషః, గురుశుశ్రూష చేయనివారికి, ఓర్పులేనివారికి, గీతోపదేశము చేయకూడదని పరమాత్మ సెలవిచ్చియున్నాడు.

నే నిదివరకు చెప్పినది, చెప్పదలచుకొన్నది జ్ఞానము = (Theory) that which is acquired by reading books గ్రంథావలోకనమువలన తెలియునది. విజ్ఞానము = Practical knowledge. అనుభవమువలన తెలియునది. According to others the first is general and the latter detailed knowledge.

Why should this be known? To attain moksha and be rid of the greatest asubham viz., పరిశుద్ధమైన ఆత్మ అశుద్ధమైన పాంచభౌతిక శరీరములో ప్రవేశించుటయే గొప్ప అశుభము. ఆత్మ శరీరములో ప్రవేశించకుండా చేసుకొనుటకు జ్ఞానవిజ్ఞానములు అవసరములు.

శ్లో॥ 2. వేదాంతవిద్య రాజవిద్య. రాజు మనుజులలో శ్రేష్ఠుడు. అట్లే అన్ని విద్యలలో నీ విద్య శ్రేష్ఠమైనది. రాజగుహ్యం—రహస్యములలో రహస్యమైనది. పవిత్రము=అందరిని పరిశుద్ధులచేయును. ప్రత్యక్షావగమము = ఆత్మపరమాత్మలను ప్రత్యక్షమగునట్లు చేసుకొనవచ్చును. It is not an ideal which can never be realised.

సుసుఖం etc. నాశనములేని గొప్పసుఖమును కలిగించునది. వేదాంతవిద్య నేర్చుకొని దానియందు చెప్పిన ప్రకారము అనుష్ఠానము చేయవలయును.

శ్లో॥ 3. ఇట్టి పరమపవిత్రమైన విద్యలో నెవరికైతే శ్రద్ధలేదో, అర్జునా! అట్టివాడు ధర్మానుష్ఠానము చెయ్యడు. మోక్షము చెందడు. మాటిమాటికి అతడు జననమరణములు పొందుచున్నాడు. వానికి కష్టమే గాని సుఖము లేదు.

అట్టి అనర్థపరంపరలకు మనము లోనుగాకుండ వేదాంత విద్య నేర్చుకొనవలయును.

> "భవములకు మందు చిత్త, శ్రవణానందము ముముక్షు
> జనపదము, హరి, స్తవము పశుఘ్నుడు దక్కను, చెవు
> లకు తనివయ్యె ననెడు చెనటియుఁ గలఁడే"

అని భాగవతమందు చెప్పబడినది.

శ్లో॥ 4. ఈ చరాచరాత్మకమైన ప్రపంచ మంతటను నే నున్నాను. నేను ఒక్కవస్తువులోగూడ లేను. అన్నివస్తువులలో నే నున్నానుగాని, తామరాకు నీటిలో నున్నట్లు ఆ వస్తువులయొక్క గుణదోషములతో నాకు సంబంధము లేకుండ నుండుటనుబట్టి నేను వాటియందు లేనని అభిప్రాయము. ఆ యా వస్తువుల గుణదోషములు నన్నంటవు. మనము చేయు కాయిక, మానసిక, వాచిక కర్మలు జీవునికి అంటునే కాని పరమాత్మకు అంటవు.

The rigours of jail life have to be borne by the convict who is serving the sentence, and a non-official or official visitor who goes into the cell and stays there for sometime does not suffer from them at all. Here Paramatma is in the position of a visitor and the Atma is the convict undergoing the sentence. The visitor cannot be said to have been imprisoned. All-containing, all-comprising, all-pervading, all-permeating universal form is Viswarupa.

కారాగృహములోని కష్టములు ఖైదీ అనుభవించవలయునేగాని, దాని తనిఖీకొరకు లోపలికి వెళ్ళిన యుద్యో

గిని బాధించవు. అట్లే పరమాత్మ ఆ యుద్యోగివంటివాడు, ఆత్మ శిక్ష అనుభవించుచున్నట్టి ఖైదీ వంటిది. పరమాత్మ సర్వాంతర్యామి.

దేవుడు మనయం దున్నాడు. ఆయనయందు మన మున్నాము.

పరమాత్మయందు నే నిమిడియున్నా నని, ఆయన సకల వ్యాపారములు గమనించుచున్నా డనెడి బ్రహ్మభావన కలవారికి జీవయాత్ర సుఖముగా జరుగును. God-consciousness makes a man righteous in all his words and deeds. దేవుడు మనయం దున్నాడు. మనము దేవుని యం దున్నామని తెలుసుకొనినవాడు బ్రహ్మభావన చెందు చున్నాడు. అట్టివాని ప్రవర్తనలో నెట్టి తప్పులు నుండవు. ఈ సంగతి వెయ్యిలో 999మంది యెరుగరు. కనుక నాయందు అంద రుండిన్నీ, లేని వా రగుచున్నారు. He is all seeing and all-pervading. Remember you must answer for your acts in a higher tribunal. You may escape punishment in this world, but you cannot throw dust in His eyes, and escape punishment. The paradox in the sloka is apparent but not real.

Divinity manifests itself where contradictions meet or divinity is the meeting place of contradictions. This paradox in the Gita gives the correct Brahmabhavana. విరుద్ధధర్మము లెచట కేంద్రీకరించు చున్నవో అచ్చట బ్రహ్మస్వరూపము కలదని గుర్తెరుగుము. e.g. The mango tree where Ekambarnath was born

in Conjeevaram yields different types of fruits in different branches. కంచిలో యేకామ్రనాథు డుద్భవించిన మామిడిచెట్టు వేరువేరు కొమ్మలయందు వేరు ఫలముల నిచ్చి నట్లు చెప్పబడినది.

శ్లో॥ 6. ఆకాశము=Space అన్నిటిలో నున్నది. మంచి వస్తువులలో నున్నది, చెడ్డవానిలో నున్నది. కాని దోషములు దాని కంటవు. ఆకాశమును భగవంతునితో పోల్చెదరు. ఏలయన నిర్లేపత్వము, సూక్ష్మత్వము, సర్వవ్యాపకత్వము, రెంటికి గలవు.

శ్లో॥ 7. మాయ ప్రకృతిని నా స్వాధీనమందు లేక అధ్యక్షతక్రింద నుంచుకొని చరాచరాత్మకమైన ప్రపంచము యావత్తు నేను సృష్టించుచున్నాను. పరమాత్మయొక్క చేరిక వలన dull dead matter జడప్రకృతిలో నుండి చిత్రవిచిత్రమైన వస్తువులు ఏర్పడుచున్నవి. This is the ontological argument i. e. you infer the existence of the workman after looking at the work. When you look at the sun, moon and all the beautiful things in Nature, you realise that there must be a superior being who has created all this.

పనిజూచి పనివా డొకడు గలడని గుర్తెరుగ వచ్చును. సూర్యుని, చంద్రుని, సృష్టియందలి చిత్రముల జూచిన వీని నన్నిటిని సృష్టించిన గొప్ప వ్యక్తి యుండియే తీరవలయునని మనకు పొడగట్టును.

(శ్లో॥ 10 సూయతే=brings forth.)

శ్లో॥ 8. Why are all persons not born equal? Is God partial? This doubt is cleared up in sloka 8. మానవులందరు సమానముగా యేల జనించరు ? భగవంతునికి పక్షపాత మేదైన కలదా ? అను ప్రశ్నకు ఈ శ్లోకమందు సమాధాన మివ్వబడినది. వారి వారి పూర్వకర్మనుబట్టి వారి వారిని సృజించి సంహరించుచున్నాను అని చెప్పియున్నాడు. పరమాత్మ నిష్పక్షపాతి. వారివారి కర్మానుసారము ఉత్తమ మధ్యమాధమస్థితిగతులయందు ఆయా జీవులను పుట్టించు చున్నాడు; సంహరించుచున్నాడు. You reap what you have sown. వైషమ్యము, నైర్ఘృణ్యము మొదలగు దోష ములు ఆయనయందు లేవు.

శ్లో॥ 11. మూఢులు నన్ను జారుడు చోరు డని నిందించు చున్నారు. నా పరతత్త్వ మెరిగిన జ్ఞానులు అవి యన్నియు లీల లని గ్రహించుచున్నారు. "A prophet is not honoured in his own country and in his own time." రామా వతారము శ్రీమన్నారాయణు డని రాముని జీవితకాలములో సప్తమహర్షులకు మాత్రమే తెలుసును. కృష్ణుడు జీవించియుం డగా పరమాత్మ అవతారమని కొలదిజనులకే తెలిసియుండెను. దైవప్రకృతికలవారు, i.e. మంచిగుణములు గలవారు నా నిజ రూపము తెలుసుకొని నన్ను భజించుచున్నారు. రాక్షస ప్రకృతి గలవారు నన్ను భజించరు.

శ్లో॥ 14. భజనమార్గము ఏది ? ఎల్లప్పుడు నన్ను ఆర్ద్ర హృదయులై స్మరించుటయే. "Religion must penetrate

into the arteries and veins of your system." Your heart must melt when you pray. One commentator says సతతం means not only always but refers to musical accompaniments too like తంత్రి = తాంబూర. one commentator quotes:

"నాహం వసామి వైకుంఠే న మానిహృదయే రవౌ
మద్భక్తా యత్ర గాయంతి తత్ర తిష్ఠామి నారద!"

I will be firmly seated wherever people sing my songs with bhakti. None should sit opposite the pandit who is discoursing on Ramayana with bhakti for that is reserved for Hanuman. మతధర్మములు నీ రక్తనాళములలో ప్రవేశించవలయును. భగవంతుని భజించునపుడు నీ మనస్సు కరగిపోవలయును. 'సతతం' అనగా 'యెల్లపుడు' అనెడి అర్థమేగాక తంత్రి మున్నగు సంగీతవాద్యములతో భగవంతుని స్తోత్రముచేయుట అని యొక వ్యాఖ్యానకారుడు వ్రాసియున్నాడు. మరియొకరు పై చెప్పిన శ్లోకమును నిచట ప్రస్తాపించుచున్నారు. అందలి అభిప్రాయ మేమన భగవద్భక్తులెచట ఆయనను గురించి పాటల పాడుచుండెదరో అచటనే తా నుండెదననియు, వైకుంఠము, మునుల హృదయములు తన వాసస్థలములు కావని శ్రీమన్నారాయణుడు నారదున కెరింగించెను. రామాయణకాలక్షేపము జరుగుచున్నపుడు భక్తితో చెప్పువారికి యెదురుగ నెవరు కూర్చొనరాదనియు, ఆ ప్రదేశము శ్రీరామభక్తుడగు ఆంజనేయస్వామి కి వదలిపెట్టవలయు ననియు చెప్పెదరు. మఱియు అచ్యుతునికథ

యెచట జరుగునో, అచట యమున, గంగ, సరస్వతి అను పుణ్యనదు లుండును.

"యత్రాభ్యుత్థితోదారకథాప్రసంగః తత్రైవ గంగా యమునా సరస్వతీ" అని చెప్పబడినది.

యతంతశ్చ దృఢవ్రతాః— నియమములతో గూడ మంచిరోజులు, ఆహారనియమము లన్నిటికి లోబడవలయును.

నమస్యంతశ్చ మాం భక్త్యా = ఎక్కడ భగవంతుని చూచిన అక్కడ భక్తితో సాష్టాంగపడి నమస్కారము చేయవలెను. దండవత్ప్రణామం = కట్టె పడవేసిన నే మాదిరి పడిపోవునో అట్లు సాష్టాంగపడవలయును.

నిత్యయుక్తా ఉపాసతే—అట్టివానికి నాకు చేరిక సర్వకాల సర్వావస్థలయందు నుండును. e. g. the mariner's compass always points to N & S in whatever direction it may be moved. A true bhakta always sees God wherever he is and whatever he is doing like (తైలధార) everywhere and at all times. నావికుల దగ్గర నుండెడి 'కంపాస్' యేవైపు త్రిప్పినను ఉత్తర దక్షిణముల జూపుచుండును. అట్లే నిజమైన భక్తుడు తా నెచట యే పని చేయుచున్నను భగవంతుని జూచుచుండును.

శ్లో॥ 15. Some people worship one shape and another a different shape. The essential thing is my worship. కొంద రొకమూర్తిని, మరికొంద రింకొకమూర్తిని సేవించెదరు. నన్ను పూజించుట ప్రధానము.

శ్లో॥ 16. Believe that the fire, the yagnam the priests are all forms of God. అగ్ని, యజ్ఞము, యజ్ఞముల చేయించెడివారు భగవత్స్వరూపములు.

People do not worship because they do not understand the relationship between me and them, and the advantages that follow from my worship. నాకు వారికి గల సంబంధము, నన్ను భజించుటవలన గలిగెడి ప్రయోజనము జనులు తెలుసుకొనజాలక నన్ను పూజించుట లేదు.

శ్లో॥ 17. ఈ లోకమునకు నేను తండ్రివంటివాడను. I am the universal father నేను ప్రపంచమునకు తల్లిని. అన్నిటిని భరించి వారివారి ప్రాచీన కర్మలప్రకారము ఫలమును కలిగించువాడను. నేను తాతను. మానవజన్మ మెత్తిన వారందరివలన తెలిసికొనబడవలసిన వాడను. (i.e. వేద్యం.) పవిత్రం = నా స్వరూపము పరమపరిశుద్ధమయినది. ప్రణవం, ఓంకారం = వేదములన్నిటి స్వరూపము.

శ్లో॥ 18. నేను అందరికిన్ని గతి. I am the final goal.

"నివాసవృక్షః స్సాధూనామ్ ఆపన్నానాం పరాయణః, భక్తార్తిభంజనః శ్రీమాన్ కృష్ణఏవ గతిర్మమ" అని చెప్పబడినది. అందరికి భర్తఅనగా అందరిని కాపాడువాడు. మనల అందరిని ఆయన భరించుచున్నాడు. He is the sustainer of the whole universe. అందరికి ప్రభువు = Lord of the universe.

సాక్షి = మనుష్యమాత్రులు చూడని పను లన్నిటిని

పరమాత్మ చూచుచున్నాడు. కాయిక వాచిక మానసిక కర్మ లన్నింటిని ఆయన చూచుచున్నాడు. ఈశ్వరుడు - witness.

నివాసశ్శరణం=అన్నిటికి వాసస్థానము నేను; అందరు నా శరణు చొరవలయును.

సుహృత్ = అందరి క్షేమము కోరు అపుడను. మనచే నొసర్పబడిన అపకారము మరచి, మన క్షేమము కోరువారికి సుహృదులు అని పేరు. (See. Chap. VI. Sloka 9)

ప్రభవః } తజ్జ = ఎవనియందు పుట్టబడునో
ప్రళయః } తన్న = ఎవరివలన కాపాడబడునో
స్థానం. } తల్ల = ఎవరియందు లీనమగునో అన్నియు పరమాత్మలో పుట్టి, అన్నియు ఆయనయందు లీనమగుచున్నవి.

నిధానం బీజ మవ్యయం — అన్నిటికిని Store - house.

I am the seed for the future creation. అవ్యయం = I am the eternal seed for all future creation, సనాతనం (See Ch. VII) I am the endless and eternal seed. Without these qualifications, if God is a simple seed, he will be no more after the seed sprouts out. So He is an eternal, never-decaying seed. He has no beginning nor end (i. e. సనాతనం) The objects created by the juggler may vanish but the juggler is there.

ఈ సృష్టి కంతటికి విత్తనము నేనే. సాధారణముగు విత్తనము మొలకపుట్టిన పిదప నశించును. కాని పరమాత్మ

యనెడి వి_త్తనము, సనాతనము, శాశ్వతము, నాశరహితము. గారడీవాడు జూపెడి వస్తువులు మారుచున్న వేగాని గారడీవాడు మారుటలేదు.

శ్లో॥ 19. ప్రపంచమును తపింపజేసెడి యెండ నావలన కలుగుచున్నది. ఎండలేకుండ చేయునది నేను. వర్షము కలిగించునది, వర్షము లేకుండ చేయునది నేను. అందరికి మోక్షమిచ్చునది నేను. వారివారిని సంసారములో కట్టిపెట్టునది నేను. మనుష్యులు పుట్టుట నావలన, చచ్చుట నావలన, జడపదార్థములు జీవాత్మలు నాస్వరూపములే. చేతనాచేతన తత్త్వములు అన్నియు నావలన నియమింపబడుచున్నవి. ఇంకొక అర్థము:- ఇదివర కుండినవి, యిప్పుడున్నవి, ముందుండబోవు అన్ని వస్తువులు నావలన నియమింపబడుచున్నవి.

శ్లో॥ 20. అర్జునా! నన్ను భజించుటకు బదులుగా స్వర్గమునకు పోవలెనని యజ్ఞయాగాదిక్రతువులను, కామ్యకర్మలను చేయుచున్నారు.స్వర్గములో శాశ్వతమైన సుఖములేదు. వారు తిరిగి మానవజన్మమెత్తి ఫలాపేక్ష లేకుండ కర్మానుష్ఠానము చేసి మోక్షము చెందవలయును. పుణ్యముచేసినవారికి వారి ఫలితము అనుభవించుటకై స్వర్గము = Better world ఒకటి యున్నది. అట్లేపాపులకు నరకమేర్పరచబడినది. ఈలోకమున్నదనుకొనిన ఆ లోకములు కూడ నున్నవి. యజ్ఞయాగాదులు చేసినవారు స్వర్గమునకు పోయి అచ్చట Sensual pleasures multiplied thousand times అనుభవించి పునర్జన్మ మెత్తుచున్నారు. అట్టివారు రంగూన్‌కు నేటాల్‌కు పోయినట్లు "సురైరపి వాంఛితం మనుజదేహ మతిదుర్లభమ్"

Even the deities are anxious to be born as human beings. When that is so we should not waste our time being born in this world. We may not be born as human beings again.

దేవతలుకూడ మానవజన్మ మెత్తవలయునని కోరుచున్నారు గనుక మానవజన్మ మెత్తినట్టివారము కాలము వృథ చేయరాదు. మానవజన్మ దుర్లభము. ప్రాణములు క్షణభంగురములు. తిరిగి మానవజన్మ కలుగునని నమ్మకము మెవరు చెప్పగలరు?

స్వర్గమునకు వెళ్ళినవారికి పతనభయ మున్నది. "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి."

For instance, can a man who has been sentenced to death and counting his days in the cell enjoy the fruits given by the superintendent of the Jail? A man cannot enjoy the pleasure of Swarga for he is sure to be reborn again as a human being. So do not pray or worship for merely pleasures. Worship Me. ఉరిశిక్ష విధింపబడి రోజులు లెక్కపెట్టుకొనుచున్న ఖైదీ జైలుఅధికారి యిచ్చెడి ఫలముల ఆనందముతో అనుభవించగలడా? స్వర్గసుఖములు శాశ్వతముగా నుండవు. పుణ్యము నశించిన వెంటనే పునర్జన్మ మెత్తవలయును. గనుక నిష్కామముగ నన్ను కొలువుము. నన్ను భజించుచో వాక్కువలన వర్ణించుటకు, మనస్సువలన నూహించుటకు వీలులేని శాశ్వతమైన ఆనందము చెందవచ్చును.

శ్లో॥ 22 Very important and oft-quoted Sloka. ఇది చాలా ముఖ్యమైన శ్లోకము.

ఎవడైతే consequences ఆలోచింపకుండ, ఏమి కోరకుండ, నా శరీరము, పరమాత్మసొత్తు అని నాతో ఏకీభావము చెంది నన్ను భజించుచున్నాడో వానికి యోగక్షేమములు నేను కలిగించుచున్నాను. e. g. చంటిపిల్ల తల్లిని నేమి అడుగకున్నను, ఆయా సమయములు కనిపెట్టి తల్లియే యిచ్చుచున్నది. "వహామ్యహం" అనుటలో మోసికొనివచ్చి యిచ్చుచున్నాను అని అర్థము.

1. యోగము—లేనివి సంపాదించుట acquisition of learning and wealth.

2. క్షేమము—Preservation. కలిగినది కాపాడుట. కలిగించునది నేను; కలిగినదానిని కాపాడువాడను నేను. నన్ను త్రికరణశుద్ధిగా నెవరు భజించుచున్నారో వారి యోగక్షేమములు విచారించునది నేను. e. g. భక్తకుచేలునికి క్రొత్తద్వారకను తలమీద మోసికొనివచ్చి సృజించినాడు. అనన్యభక్తి= whole-hearted and unflinching devotion. ఆ భక్తులను కాపాడువాడెవడు? వానినికూడ నేను కాపాడుచున్నాను. వానిని కష్టపెట్టి వాని నోట్లో మెతుకులు వేయుచున్నాను. భక్తులను నీడలోనుంచి కాపాడుచున్నాను అని పరమాత్మ చెప్పియున్నాడు.

పరమాత్మయందు మనకు భక్తి యున్నయెడల అరణ్యములో కూర్చొన్నను మన కేమి కొదువ లేదు. e. g. భర

ద్వాజుడు రాజుకు ఆయనపరివారమునకు అరణ్యములో తపస్సు చేసికొనుచు భగవత్ స్మరణవలన అన్ని పదార్థముల బడసి విందొనగుట. శల్యావశిష్టుడైన బుద్ధునికి ప్రాణము పోవునను సమయములో నొక మాలపిల్ల దివ్యమైన క్షీరాన్నము తెచ్చి యిచ్చినది. Even the Bible speaks of manna dropping from Heaven. A missionary in London used to maintain an orphanage by the efficacy of prayer.

పూర్వము లండన్ నగర మందు అనాథ శరణాలయము స్థాపించిన యొక మిషనరీ అర్ధరాత్రివేళ లేచి భగవంతుని ప్రార్థించుటవలన శరణాలయమునకు గావలసిన సామగ్రి సంతటిని బడయుచుండెనని చెప్పబడి యున్నది. మరియు, సుమారు అరువదిసంవత్సరముల క్రితము కంచియందు నిరుపేదయగు బ్రాహ్మణభక్తు డొక డుండెను. ఆయన తెల్లవారి లేచి స్నానసంధ్యాద్యనుష్ఠానముల నిర్వర్తించుకొని, శ్రీ వరదరాజస్వామి దేవాలయమునకు వెళ్ళి ఆయనను సేవించి వచ్చుసరికి, అప్రయత్నముగా ఆ పూటకు కావలసిన పదార్థములను ఎవరో ఒకరు తెచ్చిపెట్టుచుండెడివారు. ఆయనయు, ఆయనభార్యయు నిరుగు పొరుగువారల పిలిచి విం దొనర్చి తమకు లభించిన పదార్థములను పగలు భుజించి రాత్రి పస్తు పండుకొను చుండెడివారు. కాని ఒకరోజున ఆయనకు తిను బండముల నెవరు తెచ్చి యివ్వనందున కినిసి, గీతయందలి "అనన్యా శ్చింతయంతో మాం..." అను 22 వ శ్లోక మసత్యమని యొక బొగ్గుతో దానిపై పెద్దగీత పెట్టి, నిత్యము గుడికి వెళ్ళునట్లే వెళ్ళి శ్రీ స్వామివారిని దర్శనముచేయగా, నిదివరలో

స్వామివారి ముఖమునందు కానబడని యొకనల్లగీత కానవచ్చెను. ఇంతలో భగవంతుడు వరదరాజు సావుకారను పేరు పెట్టుకొని, కావలసిన సామగ్రి తెచ్చి ఆయన భార్యకు అప్పచెప్పి వెళ్ళగా ఆమె వంటజేయించుచు, ఇరుగుపొరుగువారల భోజనమునకు బిలిచి తన భర్తరాకకై యెదురు చూచుచుండెను. ఆ భక్తు డింటికి వచ్చుచు తనయింటిలోనుండి పొగవచ్చుటయు వంటప్రయత్నము జరుగుటకు విస్మయ మందుచు నింటికి వచ్చి భార్యను పదార్థము లెచటి వని ప్రశ్నించెను. ఆమె వరదరాజు సావుకారు అను నాతడు, ఆమెభర్త నెరిగినవాడ నని చెప్పి యిచ్చిపోయినా డని చెప్పెను. అంతట నా బ్రాహ్మణుడు తా నెరిగినవారిలోగాని, ఆ పట్టణమందుగాని, అట్టిపేరుగలవా రెవ్వరును లేకుండుటచే, ఇది యంతయు భగవంతునిలీల యని గ్రహించి తాను బొగ్గుతో భగవద్గీతలో పెట్టిన గీటును తుడిచి వేసెను. ఈ శ్లోకముపై గీత తుడిచినంతనే శ్రీ స్వామిముఖముపై పుట్టినట్టియు, అర్చకు లెంత ప్రయత్నించినను పోనట్టియు, నల్లనిగీత మాయమైపోయెను. కనుక భగవంతుని నమ్మినవా రెన్నటికిని చెడరని గ్రహించవయ్యెడిని.

Therefore conquer ahamkara, mamakara and catch hold of His Lotus feet. "First seek ye the Kingdom of Heaven, and everything shall be added unto you"—Holy Bible. This is parallel to this sloka in Gita. The significance of the word 'added' 'I will give them whether you want them or not.'

Ramakrishna said "We are neither Saivites nor Vaishnavites, but wifeites and mammonites'

Vivekananda said "Till then, i. e. till we conquer ahamkara and mamakara, we don't realise Divinity.

నీ యందలి అహంకార మమకారముల త్యజించి భగవంతుని పాదారవిందముల నమ్ముము. నీ యోగక్షేమముల ఆయన విచారించును. బైబిలులో ఈ శ్లోకమందలి అభిప్రాయమునకు సరిపోవునట్లు, మోక్షమునకై నీవు ప్రయత్నించుము. మిగతా విషయములన్నియు (నీ కిష్ట మున్నను లేకున్నను) నీకు సమకూరును అని చెప్పబడినది. శ్రీరామకృష్ణ పరమహంస మనము శైవులము గాము, వైష్ణవులము గాము. వనితలకు ద్రవ్యమునకు దాసుల మని తెలిపియున్నాడు. వివేకానంద స్వామి అహంకార మమకారముల రూపుమాపినగాని భగవదనుగ్రహము కలుగదని చెప్పియున్నాడు.

"నమ్మి చెడినవారు లేరు, నమ్మక చెడిపోవుదురు" అని చెప్పియున్నది.

'Money must come for a good cause'

(Vivekananda)

Bhakti has wonderful effects. Serve God and He will be in your service. In Chapter XII it is said "అత ఊర్ధ్వం నసంశయః" Worship me whole-heartedly and what is to happen later on is entirely my look-out.

But persons who worship other Gods, worship me through them, That path is indirect (పెడదారి). భక్తియొక్క మహిమ అత్యద్భుతము. భక్తితో హృదయ

పూర్వకముగ భగవంతుని గొలిచిన, ఆయన నీకొలువులోనుండి అటుపై జరుగవలసిన వన్నియు ఆయన జూచుకొనును. అట్టి వానిని వదలి చిన్న దేవతల భజించుట పెడదారి. వారి వారి విశ్వాసమును బట్టి వారి వారికి ఫలము కలుగుచున్నది. చిన్న దేవతలు స్వల్ప ఫలములు కలిగించుదురు. కాని ఆ మార్గము శాస్త్రవిరుద్ధము. అందు కష్టము ఎక్కువ; ఫలము తక్కువ. నన్ను i. e. పరమాత్మను భజించిన మోక్షము చెందవచ్చును.

పరమాత్మను తృప్తిపరచుట యెట్లు? నే నెంత గొప్ప వాడనో అంత సులభసాధ్యుడ నని స్వామి చెప్పెను.

శ్లో॥ 26. భక్తితో ఒక ఆకుగాని, ఒక పండుగాని, ఉద్ధరిణెడు నీళ్లుగాని, ఎవరు అర్పించు చున్నారో వారికి అన్ని కష్టములను పోగొట్టి సుఖము కలిగించుచున్నాను. కులశేఖర ఆళ్వార్ ముకుందమాలలో నిట్లు వ్రాసియున్నారు.

శ్లో॥ నాథే నః పురుషోత్తమే త్రిజగతా మేకాధిపే చేతసా
సేవ్యే స్వస్య పదస్య దాతరి సురే నారాయణే తిష్ఠతి
యం కఞ్చిత్ పురుషాధమం కతిపయగ్రామేశ మల్పార్థదం
సేవాయైమృగయామహేనరమహోమూఢావరాకావయం॥

ఈ శ్లోకమందలి భావము ఏ మనగా మన మందరము మూఢులము. ప్రపంచముయొక్క ప్రభువును ఆశ్రయించ కుండ పేరులేని వారిని ఆశ్రయించుచున్నాము. పురుషోత్తముని ఆశ్రయించకుండ పురుషాధముల నాశ్రయించియున్నాము. సర్వలోక ప్రభువును ఆశ్రయించకుండ ఒక్క యూరి పెద్దను ఆశ్రయించుచున్నాము. పురుషోత్తముని నెట్లు ఆశ్రయించవలె

నన ఆయనకు మనస్సు అర్పించిన జాలును. స్వల్పదేవతల కే దయిన పండుగాని కాయగాని యివ్వవలయును. ఆయనను అర్చించిన అద్వైత సిద్ధాంతప్రకారము తనలో కలుపుకొను చున్నాడు. విశిష్టాద్వైత ప్రకారము తన మాదిరి చేయు చున్నాడు. ద్వైతుల ప్రకారము తన సాన్నిధ్యము నిచ్చు చున్నాడు. అల్పఫలములకై పరమార్థముల నాశ్రయించుట కేవలము అవివేక మని కులశేఖర ఆళ్వార్ ఈ శ్లోకములో చెప్పియున్నాడు.

పరమాత్మకు మనము అర్పించు వస్తువులలో భక్తి రసము ప్రధానము. కుచేలోపాఖ్యానములోని యీ భావ మును తెలుపు శ్లోకము పోతన చక్కగా తెనిగించియున్నాడు.

"దళమైన పుష్పమైనను; ఫలమైనను సలిలమైన పాయని భక్తిన్, కొలిచిన జను లర్పించిన, నెలమిన్ రుచిరాన్నముగనె యేను భుజింతున్." ,

ఈ శ్లోకము అశక్తులైన వారిని గురించి చెప్పబడినది. ధనికులు ఈ శ్లోకమును బట్టి తాము విరివిగా చేయనగు అర్పణలు మానరాదు. భక్తితో అర్పించునది స్వల్ప మైనను భగవంతుడు సంతోషించు ననుటకు వైష్ణవ వ్యాఖ్యాన కారులు అనేకోదాహరణముల నిచ్చియున్నారు. పాండవ పత్నికి సూర్యుని కటాక్షమువల్ల ప్రసాదింపబడిన అక్షయ పాత్రవలన పాండవులు అరణ్యములో నుండి సంతర్పణలు చేయుచుండగా దుర్వాసుడు కౌరవ ప్రేరితుడై సూర్యాస్త

మయమైన పిదప వెళ్ళి భోజనము పెట్టవలసినదని అడుగగా, ఆమె శ్రీకృష్ణపరమాత్మను ప్రార్థించుట.

భక్తి మూడురకములు:—

(1) ఉచ్చభక్తి (అధమము)=i.e బిగ్గరగ నుచ్చరించుట.

(2) ఉపాంశు = పెదవులు కదలించుచుండుట.

(3) మానసిక= అన్నిటికన్న గొప్పది. ఇది ఉపాంశు కన్న వేయిరెట్లు గొప్పది.

(1) పాండవుల భక్తికన్న ద్రౌపదిభక్తి యెక్కువైనది. ఆమె సర్వకాలసర్వావస్థలయందు మానసికముగా కృష్ణజపము చేయుచుండెడిది. ఆమెయందలి అవ్యాజప్రేమవలననే కృష్ణుడు పాండవుల రక్షించెను. "త్వత్పాణిగ్రహణ పరిపాటీ ఫలమిదం" అని ఈశ్వరునకు పార్వతిని చేపట్టినందున త్రైలోక్యాధిపత్యము కలిగినట్లు చెప్పబడినది. ద్రౌపది ప్రార్థించినతోడనే పరమాత్మ సాక్షాత్కరించి, ద్రౌపది యిచ్చిన గిన్నెకు అంటుకొనిన అవిసెఆకును ఆరగించి తృప్తిపడి త్రేపిన వెంటనే, స్నానమునకు వెళ్ళిన దుర్వాసునికి అతని శిష్యులకు కడుపు నిండి, విందుకు రమ్మని భీముడు పిలిచినను అవసరము లేదని పారిపోయిరని చెప్పబడినది.

(2) శ్రీకృష్ణ తులాభారము:—16107 రు భార్యలు తమసొత్తంతయు పెట్టిన సరితూగని పరమాత్మ, వాటినన్నిటిని తీసివేసి రుక్మిణి ఒక తులసిదళము పెట్టినంత మాత్రముననే సరితూగుట.

ఒక ద్రావిడభక్తుడు ఏమని వ్రాసినాడనిన, మగ వారు గుడికి వెళ్ళిన స్తోత్రమందు, పూజయందు కాలమును గడపెదరనియు, స్త్రీలు గుడికివెళ్ళినయెడల మూడులోకములు తమ పెనిమిటికి లోబడవలయు ననియు, భర్త తమకు లోబడ వలయుననియు ప్రార్థించెదరట.

(3) శివగీత:—అగస్త్యుడు రామునికి శివప్రతిష్ఠ చేయ వలసినదని చెప్పుచు పరమశివునికి ఒక మారేడుదళ మిచ్చిన జాలునని చెప్పియున్నాడు.

"బుద్ధం కించిత్ సమాధాయ క్షుల్లకం జలమేవ వా" ఒక మారేడుదళముగాని, ఒక పువ్వుగాని, ఒక ఉద్ధరిణి నీళ్ళు గాని పరమశివునికి అర్పించిన చాలును.

పుష్పము :—ఉదాహరణములు — (1) గజేంద్రుని వృత్తాంతము. తొండముతో తామరపుష్పము తీసి భగవంతునికి చూపినంతనే భగవంతుడు (ఆదిమూలము) సాక్షాత్కరించి రక్షించుట. "భక్తిలేనిపూజ పత్రిచేటు".

ఫలము :—ఉదాహరణము. (1) "శబరీదత్తఫలాశన రామ."
ఎంగిలి పండు ఇచ్చిన శబరిభక్తికి మెచ్చి మోక్ష మిచ్చెను.

తోయము:—రంతిదేవ మహారాజుయొక్క దృష్టాంతము.

తనకు దొరికిన ఫలముల నిచ్చివేసి 24 రోజులు లేక 48 రోజులు ఉపవాసము ఉండి, యేమి నివేదనకు దొరకక, నీళ్ళు నివేదనచేసి, ఆ నీళ్ళు నోటిలో పోసికొని నాలుక తడుపు కొనబోవుచుండగా, ఒక ముదుసలి వచ్చి దాహము కోర

ఆయన కియ్యగా, ఆ ముదుసలి, శంఖచక్రసమన్వితుడైన విష్ణువె సాక్షాత్కరించి విమానముపై రంతిదేవుని కూర్చుండ బెట్టి మోక్షమునకు తీసుకొనివెళ్ళెను.

"తత్ కురుష్వ మదర్పణం" అనగా నీవు దేవునికి ఆకుగాని, పండుగాని, నీళ్ళుగాని యిచ్చుటకు వీలుపడకున్న, నీవు నీ శరీర సంరక్షణకై చేయు ప్రతిపని నాకొరకై చేయుచున్నట్టు అనుకొని చేసిన జాలును. శివగీతలోకూడ నైవేద్యము పెట్ట కున్నను, గుడికి వెళ్ళి మూడు ప్రదక్షిణములు చేసిన జాలునని చెప్పబడినది. అదియు చేయలేకున్న నీవుకూర్చున్నతావునుండి మనస్సు (thought current) భగవంతునియందు ప్రవేశపెట్టుము.

"Naked thou art born, naked thou shalt return." Everything is God's property. Dedicate what is his own to Him. When brothers quarrel and divide property, mother Earth and God will be laughing at them. Mother Earth will be laughing because they are foolish beings who divide Her. God will be laughing as they are dividing His property. God will be laughing when the doctor promises cure and exalts the efficacy of his medicine. Dedicate everything to His lotus feet and then enjoy. నీవు పుట్టినపుడు నీవెంట యేమియు తీసుకొనిరాలేదు. పోవునపుడు తీసికొని పోజాలవు. సర్వస్వము భగవంతుని సొత్తు. ఆయనసొత్తు ఆయనకే అర్పించుము. ఆయనకు నివేదనచేసి అటుపై నీవు అనుభవింపుము.

మానసికపూజను గురించి యీ శ్లోకము చెప్పబడినది. శంకరులవారు వ్రాసిన శ్లోకము:—

"ఆత్మా త్వం గిరిజా మతిః పరిజనాః ప్రాణాః శరీరం గృహం
పూజా తే విషయోపభోగరచనా నిద్రా సమాధిస్థితిః
సంచారః పదయోః ప్రదక్షిణవిధిః స్తోత్రాణి సర్వా గిరో
యద్యత్ కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనమ్"

పరమశివా! నీకు ఆరాధన యేమనగా నా ఆత్మయే నీవు. నా బుద్ధియే పార్వతి. సహచరులు ప్రాణవాయువులు. నా శరీరమే నీయిల్లు. ప్రాపంచిక విషయములను నేను అనుభవించుటయే నీ పూజ. నిద్రయే సమాధిస్థితి. కాళ్ళతో నడచుటయే నీ ప్రదక్షిణము. నేను మాటలాడు మాటలన్నియు నీ స్తోత్రమే. నేను చేయు సకల కాయిక వాచిక మానసిక కర్మలన్నియు నీ ఆరాధనయే.

శివానందలహరిలో నిట్లు చెప్పబడినది:—

"గభీరే కాసారే విశతి విజనే ఘోరవిపినే, విశాలే శైలేచ భ్రమతి కుసుమార్థం జడమతిః సమర్ప్యైకం చేతస్సరసిజ ముమానాథ భవతే, సుఖే నావస్థాతుం జన యిహ న జానాతి కి మహో"—శంకరాచార్యులు.

ఓ ఉమానాథ! జడమతిగల జనము మిక్కిలి లోతయిన కొలనియందును, నిర్జనమై భయమును గొల్పుచున్న అరణ్యమందును, విశాలమగు పర్వతమందును, పూవులనిమిత్తము పరిభ్రమించుచున్నది. కాని నీకై మనఃపద్మము నొకదాని నర్పించి సుఖముగా నుండుట తెలియకున్నది. ఔరా! ఇదేమి?

The fool goes to the deep lake, to the untenanted and frightful forest and to the big mountain for the sake of flowers. It is a matter for wonder that man, though he has mental powers cannot see that he can obtain endless bliss by worshipping thee with the lotus of his heart.

మనస్సు వాడని పువ్వు. కామ క్రోధ లోభ మోహ మదమాత్సర్యములను పురుగుల నేరి పారవేసి, భక్తి అను నీటిలో దానిని తడిపి, మనస్సు అను పుష్పమును భగవంతుని పాదారవిందములయందు సమర్పించిన, ఆయన దయకు మనము పాత్రుల మగుదుము.

అందరు నాకు సమానులు. భక్తియున్నవారు జాతి మత వివక్షత లేకుండ నా దయకు పాత్రులగుచున్నారు.

Those that are whole, need no doctors.

ప్రాయశ్చిత్తాదులవలన పాపములుపోవు. నన్ను భజించిన వారిని పాపములనుండి విడిపించుచున్నాను. The same idea is conveyed in the charama slokam (Ch. 18, S. 66) ప్రాయశ్చిత్తాదులు చేసుకొని తరువాత భగవంతుని ఆరాధించెద మనుకొనుట తప్పు. మహాపాపులు వర్ణాశ్రమ ధర్మములు తప్పి చరించినవారుకూడ నా అనుగ్రహమువలన చెడుగుణములు పోగొట్టుకొని మంచిగుణములు శీఘ్రములో చెందెదరు. నేను అనుగ్రహించకపూర్వము వారికి మంచిగుణములు కలిగించుచున్నాను. e. g. భూతదయ, పశ్చాత్తాపము, శాస్త్రములయందలి నమ్మకము, విధేయత మున్నగునవి.

శ్లో॥ 32-34: — పాపముచేసి తక్కువజాతిలో పుట్టినట్టి వారును, పుణ్యముచేసి యెక్కువజాతిలో బుట్టినవారును నన్ను భజించి మోక్షము పొందవచ్చును.

మీ మనస్సు నాయందుంచండి. పరమాత్మ అను వృక్షమందు మీ మనస్సు అను తీగెను నిలుపండి. సకల వైదిక కర్మలు నాకు సమర్పించండి. ఇట్లు చేసిన నాలుగు వేదములచే ప్రతిపాదింపబడిన నా సాన్నిధ్యము చేరి మోక్షమును జెందగలరు.

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే రాజవిద్యా
రాజగుహ్యయోగో నామ నవమోధ్యాయః
సంపూర్ణః.



# శ్రీ భగవద్గీతోపన్యాసములు

## 10 వ అధ్యాయము

## విభూతియోగము

శ్లో॥ 1:—ఆధ్యాత్మికమైన నాయొక్క గొప్పమాటలు వినుము. నీకు వేదాంతవిషయములందు ఆసక్తి ఉన్నది. నీ హితము కోరి నేను చెప్పుచున్నాను. హితము అనగా వేప యుండమాదిరి తినునప్పుడు చేదుగానున్నను, ఆచరించునపుడు కష్టము కలిగించినను, ఉత్తరోత్తరమున ఆత్మ సంబంధమైన సుఖము కలిగించునదని అర్థము.

శ్లో॥ 2:—దేవతలకుగాని, ఋషులకుగాని నా సంగతి తెలియదు. వారందరికి సృష్టికర్తను నేను. తండ్రిసంగతి బిడ్డలకు తెలియదు. కాబట్టి నావలననే నావిషయము తెలిసికొనవలయును. ఇతరులద్వారా సాధ్యముకాదు. పుష్పదంతుడు వ్రాసిన మహిమ్నస్తోత్రములో పరమశివునిగూర్చి యిట్లు వ్రాయబడినది.

శ్లో॥ అసితగిరిసమం స్యాత్ కజ్జలం, సింధుపాత్రం । సురతరువర
శాఖా లేఖినీ, పత్త్రిముర్వీ।లిఖతి యది గృహీత్వాశారదా
సర్వకాలం । తదపి తవ గుణానా మీశ పారం న యాతి.

అర్థము. కాటుకకొండ అనెడి సిరాను సముద్రమను పాత్రలో పోసి, కల్పతరువుకొమ్మలను కలముతో, భూమి అను

కాగితముపై సరస్వతీదేవి త్రికాలములయందు నీమహిమ వ్రాయుచున్నను అంతు తెలియకున్నది.

శ్లో॥ 3:—నాసంగతి తెలిసికొనువాడు పాపపుణ్యముల నుండి విడిపింపబడి మోక్షము చెందును. నాకు జనన మరణ ములు లేవని, మూడులోకములకు అధిపతి నని తెలియనగును.

శ్లో॥ 4-5:—ఎవరికి ఏగుణములు కలుగవలయునో అవి యన్నియు నా వలన కలుగుచున్నవి. వారివారి ప్రాచీన కర్మను అనుసరించి వారివారికి బుద్ధి జ్ఞానము మొదలగునవి కలుగుచున్నవి.

శ్లో॥ 6:—మనువులుగాని, సప్త మహాఋషులుగాని నా వలననే సృష్టింపబడుచున్నారు.

శ్లో॥ 7:—ఈ సంగతు లన్నియు చెప్పినమీాదట అర్జు నుడు కృష్ణుని స్తోత్రముచేయ మొదలిడెను.

శ్లో॥ 8—భక్తులు, జ్ఞానులు మీావిషయమును గురించి చెప్పియున్నారు. వారు చెప్పిన దెల్ల యథార్థ మని నేను నమ్మినాను.

శ్లో॥ 9:—భక్తులయొక్క లక్షణము చెప్పెద వినుము. వారిచిత్తము నాయందుంచెదరు. వారి ప్రాణముల నాయం దుంచెదరు. "తద్దినం దుర్దినం మన్యే". నన్ను తలచని దినము వారలకు దుర్దినమై తోచెడిని. భక్తులు నా నామ స్వరూపములు కనుపడనిచో దుఃఖపడుచున్నారు. భక్తులు కలసియుండి బోధ

పరచుకొనుచున్నారు. (Exchange of ideas) Rama Krishna Paramahamsa said that bhakti is an intoxicant that gathers groups round it.

శ్లో॥ 17. భగవదుపాసనచేయుట యెట్లు ? అని అర్జునుడు అడిగినాడు. Reply of Sree Krishna : is contained in slokas 19 onwards. ఆ ప్రశ్నకు 19 శ్లో॥ మొదలు జవాబు యివ్వబడినది.

హన్త : the epithet హన్త : Ha ! alas ! God was overjoyed when Arjuna asked him to indicate the mode of worship. He was pleased because none asked him in the previous avataras and Arjuna was the first person to ask him about it even in this avatara. అర్జును డీ రీతిగా ప్రశ్నించగా శ్రీకృష్ణుడు ఆనంద పరవశు డాయెను. ఏలనన ఈ ప్రశ్నను మునుపటి అవతారములలోగాని, ఈ అవతారములో యింతకుముందుగాని యెవరు ఆయనను అడిగి యుండలేదు.

ఉపాసన రెండువిధములు:—[1] అఖండోపాసన: సర్వ దేశ సర్వకాల సర్వావస్థలయందు నే వ్యాపారము చేయుచున్నను భగవంతుని ఆరాధించుట. ఇది "తైలధారావత్ అవిచ్ఛిన్నం" అని వ్రాసినారు. తైలధారమాదిరి అవిచ్ఛిన్నమైనది. The mind should be like the mariner's compass. కట్టకడపటి జన్మ యెవరికో వారికే అఖండోపాసన కుదురును. [2] ఖండోపాసన - కొన్ని కొన్ని దేశముల యందు, కొన్ని సమయములందు కొన్ని వస్తువులయందు

పరమాత్ముని భజించుట e. g. కాశి, రామేశ్వరము, ఏకాదశి, శివరాత్రి, శ్రీరామనవమి. ఇది సర్వసాధారణులకు.

కొన్నివస్తువులు భగవంతుని మహిమను తెలుపుచున్నవి. విభూతిరూపములు అనగా highest manifestations of Divinity, వాటిని పూజించుట ఖండోపాసన. All objects are equal, but some have intrinsic merit. The Sun shines on a mirror as well as a stone and water, but the former reflects very well, the water reflects a little, and the stone does not reflect at all. కొన్ని వస్తువులు భగవంతుని మహిమ బయటపెట్టుట వాటి వాటి పూర్వజన్మ విశేషము. వాటిని పూజించుట ఖండోపాసన. వానివలన అఖండోపాసన క్రమేపి యేర్పడును.

విభూతిరూపములు:—1. ద్వాదశాదిత్యులలో విష్ణువు నా విభూతిరూపము.

(Significance of caste-marks.)
Caste-marks are all symbols to fix devotion on God with aversion to wordly things. మనము పెట్టుకొను బొట్లు ప్రపంచమందువిరక్తి, పరమాత్మయందు భక్తి కుదుర్చు చిహ్నములు.

విభూతి = (1) Purity of Lord Siva (శివుడు శుద్ధ సత్వము).

(2) The final end of the human body is ashes. అందరు చివరకు పిడికెడు బూడిద కావలసినదే.



నామములు = 1వ నామము ఆత్మ. 2వ నామము పరమాత్మ అడ్డగీత Connecting link జ్ఞానము, పరమాత్మలోని ఒక అంశము అని తెలిసికొనుట. దీనిని సూచించునది క్రిందిపాదము. వడగళైవారికి ఈ పాదము ఉండదు. అదియే వడగళులకు తెంగళులకు గల భేదము.

మధ్వలబొట్టు = శంఖచక్రములు భగవంతుని చిహ్నములు. భోజనాత్పూర్వము బొగ్గు పెట్టుకొనుట గుర్తు యేమనగా నీ ప్రపంచ ధోరణిలో పడి భగవంతుని మరువవద్దు అని సూచన.



కార్తికమాసములో సూర్యుడు విష్ణువు అని వ్యాఖ్యానకారుడు వ్రాసియున్నాడు.

2. వెలుతురు కలిగించు వస్తువులలో సూర్యుడు.

3. నక్షత్రములలో చంద్రుడు.

4. వృక్షములలో అశ్వత్థవృక్షము. (కొన్ని భయంకరమైన రోగములను ఆకర్షించుశక్తి ఆ వృక్షమున కున్నది.)

5. మహాఋషులలో నారదుడు (గొప్ప భక్తుడు).

6. మునీశ్వరులలో వేదవ్యాసుడు (వేదములను విభజించినవాడు కనుక వేదవ్యాసుడు (త్రిమూర్తుల యవతారము).

7. మాసములలో మార్గశిరమాసము (ధనుర్మాసము. మార్గశిర శు ౧౧ గీతోపదేశము చేసినరోజని చెప్పెదరు)

యజ్ఞములుకాని, దండయాత్రలుకాని మార్గశిరములో ప్రారంభించు అలవాటని యింకొక వ్యాఖ్యానకారుడు వ్రాసినాడు.

8. ఋతువులలో వసంతఋతువు - అన్ని యింద్రియములకు సంతోషము కలుగజేయు ఋతువు.

9. అక్షరములలో 'అ' కారము. ఏ భాషలోనైన 'అ' మొదటి అక్షరము.

10. సమాసములలో ద్వంద్వసమాసము. విభూతి రూపము e.g. రెండుపదముల అర్థము ముఖ్యము viz. పార్వతీ పరమేశ్వరులు.

11. ఛందస్సులలో గాయత్రి.

12. ఆయుధములలో వజ్రాయుధము.

13. పర్వతములలో హిమవత్పర్వతము.

14. నదులలో గంగానది.

15. యాదవులలో వాసుదేవుడు.

16. పాండవులలో మధ్యముడైన అర్జునుడను నేను. i.e. నాశక్తి నీయందుంచియున్నాను.

17. కవులలో శుక్రుడు (Author of Sukra Niti)

18. జూదము (మోసపుచ్చువిద్యలలో) వీటికి దూరము నుండి నమస్కారము చేయవలయును.

19. కీర్తి, శ్రీ, మేధ, వాక్కు, ధృతి, క్షమలకు (ఉభయ కులోత్తారిణి సతి) తెలివిగల బుద్ధిమంతురా లయిన స్త్రీ నా విభూతిరూపము. ధృతి—Perseverence; క్షమ=Patience or forgiveness & toleration.

పండితులలోను, యోధాగ్రేసరులలోను, భుజబలము కలిగినవారిలోను పరమాత్మ యున్నాడు. ఖండోపాసనవలన క్రమక్రమముగా అఖండోపాసన కలుగు చున్నది. From the ants creeping on the earth to the stars in the firmament, you can see Divinity. When you look at the several beautiful things in Nature, the worst of atheists will be convinced that there is a Superior Being who is responsible for this Creation-

కొందరియందు పాండిత్యముగాను, కొందరియందు బలముగాను, కొందరియందు ఐశ్వర్యముగాను, కొందరియందు అధికారముగాను నే నున్నాను. వారికి నమస్కరించుము. సృజింపబడిన వస్తువులు, భూమి, ఆకాశము, పూలు, కాయలు, పండ్లు అన్ని నా సృష్టిలోనివే. వానిని చూచి నేనెంతవాడనో గుర్తెరుగుము.

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే విభూతి
యోగో నామ దశమోఽధ్యాయః
సంపూర్ణః

# శ్రీ భగవద్గీతోపన్యాసములు

## 11 వ అధ్యాయము

## విశ్వరూప సందర్శన యోగము

శ్లో॥ 1. హే మహాప్రభో! నాయందు కరుణతో మహా రహస్యమైన సంగతులు చెప్పి నాకు ఆత్మజ్ఞానము కలిగించి నావు. నాకున్న భ్రాంతి పోయినది. కాని ఒక్క సందేహము కలదని అర్జునుడు చెప్పెను.

శ్లో॥ 2. మీరు ఎందుకు అవతరించునది, మీ రూపములు ఎయ్యవి, అన్ని వివరముగా విన్నాను. మీ మాహాత్మ్యమును తెలిసికొన్నాను.

శ్లో॥ 3. కాని మీయందు అన్నివస్తువులు నిమిడియున్న యెడల మీ సంపూర్ణరూపము చూడవలయునని నాకు కుతూహలముగా నున్నది. కనుక చూపవలసిన దని విధేయతతో అర్జునుడు అడిగెను.

శ్లో॥ 4. సర్వత్రి అన్నివస్తువుల యందున్న రూపము నాకు చూచు భాగ్య మున్నదని మీ దివ్యచిత్తమునకు తోచినచో ఈ దీనుని అనుగ్రహించు డని అర్జునుడు కోరెను.

అంతట పరమాత్మ అర్జునుని చూచి కొన్నిమాటలు చెప్పుచున్నాడు. అర్జునా! విశ్వరూపములో కొన్నికొన్ని వస్తువులు గమనించవలయును అని కొన్ని విషయములు

తెలిపి అర్జునుని మనస్సు విశ్వరూప సందర్శనమున కాయత్త పరచెను.

శ్లో॥ 5. నేను చూపబోవు రూపములో అనేకము లగు రంగులుగల చిత్రములయిన వస్తువులను చూచెదవు.

శ్లో॥ 6. అందులో ముఖ్యముగా (1) ఏకాదశరుద్రులు (2) ద్వాదశాదిత్యులు (3) అశ్వినీదేవతలు. ఇదివరకు చూడని వన్ని నీవు చూడనగును. మూడుకాలములయందు జరుగు సంగతులు, ఇంకను ఏమి చూడదలచెదవో అన్ని అందులో చూడుము. జయము కలుగును. యుద్ధము చెయ్యవలసినదని స్పష్టముగా చెప్పుట, ఇదివరలో ఫలాపేక్ష లేకుండ కర్మ చేయవలసిన దని చెప్పిన విషయమునకు విరుద్ధ మగుటచే, పరమాత్మ భావగంభీరముగా ముందు అర్జునునకు జయము లేక అపజయము కలుగునా అను విషయము విశ్వరూపములో చూడనగు నని చెప్పినట్లు ఒక వ్యాఖ్యానకారుడు ఇందును గురించి వ్రాసియున్నాడు.

శ్లో॥ 8. మాంస నిర్మితమైన పుసికండ్లతో నా విశ్వ రూపము చూడజాలవు. ప్రపంచముయావత్తు చూచుట కుప యోగపడు ఈ కండ్లు తమ్ము తాము చూచుకొనుటకు అద్దము కావలసియున్నది. అందువలన శ్రీకృష్ణుడు అర్జునుని స్పృశించి దివ్యమైన జ్ఞాననేత్రము నిచ్చి విశ్వరూపము చూడనిచ్చెను. పామరులకుగూడ జ్ఞాననేత్రముగలదు. కాని సద్గురువుల అను గ్రహమువలన భగవదాశీర్వచనము వలన అది తెరువబడు చున్నది.

రామానుజాచార్యులవారు వీథిని పోవుచుండగా, గొడుగుపట్టుకొని సౌందర్యవతి యగు భార్యను తీసికొనిపోవుచున్న శూద్రుడైన యొక వస్తాదును జూచి, భార్యకన్న కోటి రెట్లు సౌందర్యమైన వస్తువు చూపెద నని చెప్పి ఆ వస్తాదుకు జ్ఞాననేత్రము ఇచ్చి శ్రీరంగనాథుని-ఆదిశేషుని చూపెను. సంజయునికి జ్ఞాననేత్రము ముండుటచే విశ్వరూపము చూచి ఆయన ధృతరాష్ట్రునికి వర్ణించెను. ఎక్కడ చూచిన కాళ్ళు, పొట్టలు. ఆది లేదు, అంతము లేదు. ఎక్కడ చూచిన దివ్యమైన వస్త్రములు, హారములు, వాసనద్రవ్యములు, బహు ఆశ్చర్యమైన రూపము.

విష్ణువునకు శివునికి భేదము లేవన :—

"అలంకారప్రియో విష్ణుః అభిషేకప్రియ శ్శివః
నమస్కారప్రియో భానుః బ్రాహ్మణో భోజనప్రియః"

విష్ణువు అలంకారప్రియుడు. శివుడు అభిషేకప్రియుడు. అని చెప్పబడినది.

కొన్నిచేతులలో భయంకరమైన ఆయుధములు పైకెత్తి పట్టుకొనియున్నాడు. The former is the mild aspect, and the latter the terrible aspect, ready to punish the wicked. కోటిసూర్యుల తేజస్సునకు సమానముగా నున్నది ఆయనకాంతి. ఏకకాలములో అనేకకోటిసూర్యులు ప్రకాశించిన నెంతకాంతియో అంతకాంతి కనబడెను. ఈ యుపమా

నము సరిగలేదని, పరమాత్మ తేజస్సు అంతకన్న చాలయెక్కువ అని యొక వ్యాఖ్యానకారుడు చెప్పియున్నాడు. ఈవిశ్వ రూపము చూచి అర్జునుడు గద్గదస్వరముతో ఆనంద పారవశ్యము చెందినవాడై, పడి పడి నమస్కారముచేసి లేచి నిలువంబడి రెండుచేతులు జోడించుకొని కొన్ని శ్లోకములద్వారా పరమాత్మను స్తుతించెను. 15 వ శ్లో॥ మొదలు ఇరువదిశ్లోకములు ప్రార్థన శ్లోకములుగ నుపయోగించవచ్చును. ఇయ్యవి calendar slokas అని మధ్వ శ్రీ పండిత లక్ష్మణాచార్యులు గారు చెప్పిరి.

నీయొక్క కాంతిపుంజ మైనట్టి అన్నివస్తువులను చూచుచున్నాను. అందులో చతుర్ముఖ బ్రహ్మ, శివుడు, సంహారకర్త కనబడుచున్నారు. (Vishnu is the container, Siva and Brahma are 'contained therein') వైష్ణవ సిద్ధాంతము నాలాయిర ప్రబంధములో విష్ణువు బ్రహ్మను సృజించినాడని, ఆయన శివుని సృజించినాడని చెప్పియున్నది. శైవసిద్ధాంతములో శివుడు బ్రహ్మను, బ్రహ్మ విష్ణువును సృజించెను అని చెప్పబడినది. సప్తఋషులు మీ రూపములో నున్నారు. (ఋషులు అనగా జ్ఞానముయొక్క ఆవలిఒడ్డును చూచినవారు), లోకకంటకములయిన పాములు కానవచ్చుచున్నవి. అనగా సాత్విక, రాజస, తామస వస్తువులన్నియు కానవచ్చుచున్నవి. అర్జునుడు పరమాత్మఅనుగ్రహము పొందినవా డగుటచే పాములను చూచి భయపడలేదు. పతంజలియోగసూత్రము "తత్సన్నిధౌ వైరత్యాగః" అనియున్నది. పితృదేవతలు, గంధర్వులు

మీ రూపములే. మీ భయంకరమైన నోళ్ళలో సైన్యములు దూరుచున్నవి. ద్రోణుడు మొదలగు వీరులు మీ కోరలలో నొక్కబడి, వారిరక్తమును మీ కఱకు అయిన నాలుకతో ప్రళయకాలాగ్నితో సమానమైన మీ నోటిలోనికి పీల్చుచున్నారు. హే మహాప్రభో! ద్రోణాదివీరులు సైన్యముతో మీనోట నెట్లు ప్రవేశించుచున్నారనగా, నదులన్నియు పోయి సాగరములో ప్రవేశించి నామరూపములు పోగొట్టు కొను మాదిరి, పురుగులు దీపముపై వ్రాలి ప్రాణములనుపోగొట్టు కొనుమాదిరిని మీ నోటిలోనికి పోవుచున్నారు అని అనేకవిధముల స్తోత్రముచేసి, తదుపరి ఆ విశ్వరూపము శ్రీకృష్ణుడు చూపగలిగెనా అను అనుమానముగలిగి, నీచస్వరముతో, విధేయతతో రెండుప్రశ్నలు అడిగెను. (1) మీ పేరేమి ? (2) మీరు ఈ రూప మెందుకు తాల్చినారు? అని అడిగెను. అంత పరమాత్మ ఉచ్చస్వరముతో "నేను కాలుడను, సర్వచ్ఛేదకుడను, అందరిని నాశనముచేయుటకు వచ్చినాను, కాని నిన్ను నీ సోదరులను తప్ప ఇతరు లందరిని రూపుమాపెదను" అని చెప్పెను. ఇంకొక వ్యాఖ్యానకారుడు, అర్జునునికి తన సహాయము భగవంతునికి గావలసిన దని కొంత అహంకార మున్నట్లును దానిని నశింపుచేయవలయు నని భగవంతుడు అర్జునునకు నీవు యుద్ధముచేసినను చేయకున్నను వీరిలో ఒక్కరు జీవించి యుండరనియువారిసంహారము తనచే నిదివరకే చేయబడెననియు వారు జీవచ్ఛవములనియు పరమాత్మ చెప్పెనని వ్రాసియున్నాడు.

అయినను అర్జునా! లెమ్ము! నీవు యుద్ధము చేయుము. ఏలయన, కీర్తి నీకు రావలయును. చచ్చినపామును కఱ్ఱతో కొట్టినట్లు, (కాకతాలీయన్యాయముగ) నీసాయము నాకు అవసరములేదు. "Perfection needs no addition. You are imperfect and you must get the glory" అందుమీద అర్జునుడు 'ఈ కీర్తి నాకేల' అనెను. అందుకు 'కీర్తియేకాదు' రాజ్యము అనుభవింపు'మనెను. అప్పుడు అర్జునునకు ఒక సందేహము కలిగెను. ఏమనిన, భాగము కృష్ణుడు కావలయు ననునేమో అని. ఆ సంశయము తీర్చుటకై కృష్ణుడు రాజ్యము మొత్తము తీసికొను మని చెప్పెను.

నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్:—వీటిని బంగారు అక్షరములతో వ్రాసి పెట్టుకొనవలయును. భీష్మ ద్రోణాదులసంహార మిదివరకే జరిగినది. వారితలలు నా కోరలలో ఏరీతిగ నొక్కబడియున్నవో నీవు చూచియున్నావు గనుక నీవు యుద్ధము చేయుట నీకు కీర్తి రాగలందులకు యుద్ధము చేయుమనుచున్నాను. ఏల యింత వాత్సల్యము అనగా అర్జునుడు తన భక్తు డగుటయే కారణము.

ఈ వాక్యములలో గృహస్థులు గమనించవలసిన విషయ మొకటి యున్నది. అందరి సుఖమునకు పరమాత్మ కారకుడు. కాని Keen sense of duty తో ఎవరి పనులు వారు చేసితీరవలయును. ఫలము వచ్చినపుడు నూటికి నూరు

వాళ్ళు అది అంతయు భగవదనుగ్రహము వలన కలిగినదని తెలియవలయును. I am only an instrument in His hands. Let all the credit be to Him'' గృహస్థుడు విపరీత వేదాంతమునకు లోబడి అదృష్టముండిన వచ్చును, ఆయువుండిన బిడ్డలు బ్రతుకుదురు అని అశ్రద్ధ చేయక, భగవంతుడు తనను సముద్ధారుగా నియమించి కొంత సొత్తును, భార్యబిడ్డల నప్పచెప్పినా డనియు వాటిని జాగ్రత్తతో కాపాడ వలయుననియు, లేనియెడల భగవంతుడు విధించిన పని (duty) చెయ్యక తప్పిపోయినవాడ నగుదు ననియు, "ఈ సంసారము యావత్తు నేను ఈదుచున్నాను, నా ప్రయోజకత్వము'' అని అనుకొనుట గొప్ప పొరపాటు అనియు గ్రహించవలయును. ఘట్టుప్రభువు కుచేలోపాఖ్యానములో "తేరుక్రింది ప్రతిమ వోలె'' చిన్న బొమ్మపై రథము యావత్తు ఆధారపడియున్నట్లు కనపడుచున్న దని చెప్పియున్నాడు. కనుక మానవుడు 'నేను నిమిత్తమాత్రముగానే యున్నాను. కాపాడువాడు పరమాత్మయే. అని గుర్తెరిగి సంసారసముద్రమును ఈదవలయును. (There are two stories in English e. g. a rat holding the rope before the camel imagining that it is leading the camel, and a crow sitting on an elephant thinking it is riding on the elephant.)

శ్లో॥ 36. ఇది చాల ముఖ్యమైన శ్లోకము. ఋషులు మీ రూపమును స్తోత్రము చేయుచున్నారు. సిద్ధులు నమస్కారము చేయుచున్నారు. రాక్షసులు చూచి భయపడి పారిపోవుచున్నారు.

మధుసూదన సరస్వతి యీ శ్లోకములో బీజాక్షరములు ఇమిడియున్న వని తన వ్యాఖ్యానములో వ్రాసియున్నాడు. అందువలన దీనిని పారాయణచేసిన భూత ప్రేత పిశాచములు పారిపోవు నని మంత్రశాస్త్రములో దీనిని జేర్చుకొన్నారు.

అంతట అర్జునుడు, "నీ మహిమ నెరుగక నేను చేసినట్టి తప్పులు మన్నించవలయును. నీకు అన్నిప్రక్కల నమస్కార ములు" అని వేనవేలు నమస్కారములు చేసెను. (శ్లో॥ 39) తాను చేసిన పరిహాసముల మన్నించవలయు నని కోరెను. తండ్రి, కుమాళ్ళతప్పులు ఏరీతిగా మన్నించునో అట్లే మన్నించ వలసినదని అర్జునుడు as a matter of right కోరెను. జగత్తు నకు అంతకు పితను అని పరమాత్మ 9వ అధ్యాయములో చెప్పి యున్నాడు. (1) పితృ పుత్రభావముతో (Jesus refers to God as Father) ఈశ్వరోపాసన చేయవలయు నని చెప్పి యున్నాడు. (2)V.29శ్లో॥ ముందు స్నేహితుడనిన మీరు చెప్పి యున్నారుగనుక, నన్ను స్నేహితునిమాదిరిగా మన్నించుమని కోరెను. ఇది సఖ్యభావము. (3) పరమాత్మ యొక్కడే పురుషుడు. జీవు లందరు అస్వతంత్రులు, స్త్రీలకు సమానము గనుక వైష్ణవసిద్ధాంత ప్రకారము కొందరు స్త్రీలమాదిరి దుస్తులు వేసికొని పరమాత్మను భజించెదరు. రామకృష్ణ పరమహంస అట్లు చేసెను. ఇది నాయికానాయకభావము. గోపికలకు Lust కాదు. Craving of the spirit to realise Paramatma. భార్య తప్పులు భర్త మన్నించునట్లు మన్నించు

మని అర్జునుడు కోరెను. ఉపలక్షణముగా మరి రెండుమార్గము లున్నవి:-

4. వాత్సల్యభావము - పరమాత్మ బిడ్డయని యెంచి బాలకృష్ణుని బొమ్మ పెట్టుకొని, నందగోపయశోదలు పోషించి నట్లు సేవించుట.

5. సేవకభావము:— స్వామి భృత్యభావము e. g., Hanuman is the symbol of service. హా ను మ ం తు డు సేవవలన ముక్తి సంపాదించుట. మొదటి మూడుమార్గములు 41 వ శ్లోకమునందు తెలుపబడినవి.

కాని మహాప్రభో ! నీ రూపమును జూచి భరింప లేకున్నాను. కనుక విశ్వరూప మువసంహరించి నాలుగు భుజ ములతో శంఖచక్రగదాపద్మములతో నాకు చిన్నరూపము చూపించుమని కోరెను.

శంఖం (Sankham) indicates that he is the Lord of space.ఆకాశము నాకు లోబడియున్నది. ఆకాశము నుండి అన్ని పుట్టుచున్నవి.

చక్రం (Chakram) I am the Lord of time. మనము అందరము కాలచక్రమునకు లోబడియున్నాము.

గద (Gada) : I destroy the wicked; నేను దుష్ట సంహారకుడను

పద్మం (Padmam) : Lotus is the emblem of peace & happiness, మంచివారికి ఆనందము కలుగజేయుచున్నాను.

కనుక నాలుగుభుజములతో దర్శనము ఇమ్మని కోరెను. నాలుగు భుజములకు అర్థ మేమి అని వ్యాఖ్యానకారులు ప్రశ్నించియున్నారు. కృష్ణునికి పుట్టుకలో నాలుగు భుజము లుండెననియు, వెంటనే రెండుభుజముల దాచెననియు కంస సంహారమునకు పూర్వము రెండుభుజములతో నుండి, తదుపరి నాలుగు భుజములతో అగుపడుచుండెనని కొందరు, మరి కొందరు భక్తులకు నాలుగు భుజములతోడను, అభక్తులకు రెండు భుజములతోడను కానవచ్చుచుండెననియు, కొందరు ఆయ నలో మార్పు లేదనియు, ధర్మార్థ కామమోక్షము లనెడి నాలుగు పురుషార్థములు ఇవ్వ సమర్థుండగుటంజేసి నాలుగు భుజములు కలవనియు, ఇంకొకరు నాలుగుచేతులు భుజములు అనుటలో అన్నిటిని విరివిగా ఇచ్చు వాడనియు, కొందరు నాల్గు వేదములు నాల్గుభుజములనియు చెప్పియున్నారు.

అర్జునుడు కోరగానే పరమాత్మ నాలుగు భుజములతో దర్శన మిచ్చెను. శ్లో॥ 52-53 "అర్జునా! యెన్ని దానములు చేసినను, యజ్ఞములు చేసినను, తపస్సు చేసినను, వేదాధ్యయ నము చేసినను ఈ విశ్వరూపము కానరాదు. భక్తియుండుట వలన నీకు చూపితిని. అనాదిగా దేవతలు కోరుచున్నను వారికి చూపియుండలేదు. ఎన్ని ప్రశ్నలు అడిగినను నీ భక్తికి మెచ్చి సమాధానము నిచ్చియున్నాను. నీవు కొంచెము భక్తియున్నను ఈ విశ్వరూపము చూడగలిగితివి గనుక నీవు ఎక్కువగా నన్ను భజించి సకలదుఃఖములను పోగొట్టుకొనుమని చెప్పెను. అర్జు నుడు, భగవంతుని భక్తిని గురించి చెప్పుచున్నాడు,

కర్మవిషయమై మరచిపోయినా డనుకొనెనుగాని, భగవంతుడు మఱువలేదు. ఎటులన (1) కడపటిశ్లోకములో "భక్తి అనగా కర్మచేసి నాకు సమర్పించవలయును. (Karma is the pivot on which the whole Gita turns) కర్మ యేమ్చుచు చేయవద్దు. నాయందు ప్రేమ యుంచి, ఫలాపేక్ష వదలిపెట్టి ఈశ్వరార్పణబుద్ధితో అహంకార మమకారములు వదలి చేయుము అని తెలిపియున్నాడు.

Secondly in the dictionary of a bhakta hatred must not find place. మృగములను గాని, మనుష్యులను గాని యెవరిని భక్తుడు ద్వేషించగూడదు. Love me and love my dog. ఏ ప్రాణిని ద్వేషించగూడ దనుట రెండవ అంగము. ఈ రెండు అంగములతో భక్తి గలిగి భగవంతుని పూజించిన శాశ్వతసుఖము నిచ్చు మోక్షము గలుగును.

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే విశ్వరూప
సందర్శనయోగో నామ ఏకాదశోధ్యాయః
సంపూర్ణః

---

# శ్రీ భగవద్గీతోపన్యాసములు



## 12 వ అధ్యాయము

## భక్తియోగము.

వెనుకటి అధ్యాయము కడపటి శ్లోకములో కృష్ణుడు 'మత్' అను First personal pronoun లు నాలుగుసార్లు ఉపయోగించినాడు. అది ఈ అధ్యాయమునకు మూల సూత్రము.

శ్లో॥ 1. అద్వైతవ్యాఖ్యానము:—సగుణోపాసన చేయువాడా, నిర్గుణోపాసన చేయువాడా గొప్పవాడు? వీరు చెప్పునది యేమనిన పరబ్రహ్మమునకు నిర్గుణ సగుణావస్థలు రెండు. మొదటిదానికి నామరూపములు లేవు. ఎట్టి వ్యాపారము లేదు. చుట్టుకొని పండుకొనిన పాము మాదిరిగా సృష్టి స్థితి సంహారము అంతయు అంతర్గతముగా నున్నది. ఆ నిర్గుణపరబ్రహ్మము మాయలో ప్రతిబింబించి సగుణ మగుచున్నాడు. చుట్టుకొన్న పామును కఱ్ఱతో కొట్టినట్లు రజోగుణముతో కూడి సృష్టించినపుడు బ్రహ్మ, కాపాడునపుడు (సాత్త్విక) విష్ణువు, సంహరించినపుడు (తామసగుణముతో చేరినపుడు) మహేశ్వరుడని పేరు. పరబ్రహ్మము ఒక్కటియే కాని సృష్టి స్థితి సంహారములు చేయునపుడు వేరువేరునామములతో పిలువబడు

చున్నాడు. They are all like the convex and concave sides of the same mirror.

శ్లో॥ (2) సగుణబ్రహ్మమైన నన్ను ఎవ డుపాసన చేయునో వాడే శ్రేష్ఠుడు. నిర్గుణోపాసన బహు కష్టము, అసాధ్యము అని (5వ శ్లో॥) చెప్పబడినది. సగుణుడనైన నన్ను పాసన చేయువాడు సిద్ధిచెందును. అద్వైతసిద్ధాంతప్రకారము కూడ ఉపాసన సగుణమైన దానికే వర్తించును. ఉపాసనకు ఉపాసింపబడు నామరూపములతో కూడిన వస్తువు, ఉపాసన చేయువాడు, ఉపాసన చేయుసాధనము మూడునుండవలయును. సగుణోపాసనవలన నిర్గుణ పరబ్రహ్మప్రాప్తి జీవుడు పొందుచున్నాడు. ప్రాప్యవస్తువు నిర్గుణపరబ్రహ్మ. సాధనము సగుణోపాసన. దీనివలన జీవుడు పరబ్రహ్మముతో ఐక్యమగుచున్నాడు. నిర్గుణోపాసన is a misnomer like a square circle. నిత్యము అద్వైతులు "ఆదిత్యం అంబికాం విష్ణుం గణనాథం మహేశ్వరం" అని పంచాయతనపూజ చేయుచున్నారు. శ్రీ శంకరాచార్యులవారికి లక్ష్మీనరసింహమూర్తి అభిమానదేవత. ఆయనను గూర్చి అనేక స్తోత్రములు చెప్పియున్నారు. మనోరాజ్యము నశించినగాని నిర్గుణపరబ్రహ్మమును పొందజాలము గనుక విగ్రహారాధన ద్వైత విశిష్టాద్వైతులమాదిరి అద్వైతులు కూడ ఒప్పుకొనుచున్నారు. జీవుడు, బ్రహ్మ మేకమనుట అతీతమైన అవస్థ. విగ్రహముల రూపము మనుష్యుడు చేసినను ఆకఱ్ఱ, లోహము పరమాత్మవలన సృష్టింపబడినవే గదా! క్రైస్త

వులు కాసును, మహమ్మదీయులు పీర్లను చిహ్నములు symbols గా పెట్టుకొనియున్నారు. విగ్రహారాధనవలన ఎట్టి తప్పు లేదు. రాజుపటమును పూజించిన రాజును పూజించినట్లే.

Vivekananda said speaking about his Guru Ramakrishna that he was a great idol worshipper. He worshipped Kali, Saguna Brahma is like the priest officiating at a marriage with Paramatma as the bridegroom and Jeevatma as the bride. He brings about the marriage or alliance between the two. విగ్రహారాధనచేయు మతాంతరులు గూడ Oh! Father in heaven! Hallowed be Thy Holy Name" అని చెప్పుచున్నారు. Even the relationship of Fatherhood is saguna worship. శ్రీరామకృష్ణ పరమహంస గొప్ప విగ్రహారాధకుడని ఆయన శిష్యుడగు వివేకానందస్వామి . చెప్పియున్నాడు. ఆయన నిత్యము కాళీమాతను పూజించుచుండెడివాడు. పరమాత్మయనెడి పెండ్లికుమారునకు, జీవాత్మయనెడి పెండ్లికుమార్తెకు ( వీ రిరువురికి ) ముడిపెట్టు పురోహితుడు సగుణబ్రహ్మ యని పోల్చవచ్చును. క్రైస్తవులు సహితము భగవంతుని 'తండ్రి' యని సంబోధించుచున్నారు. అదిగూడ సగుణోపాసనయే యని తెలియనగును.

విశిష్టాద్వైత వ్యాఖ్యానము:— (1) నారాయణుని ఉపాసన చేయువాడొకడు, (2) శుద్ధజీవుని ఉపాసన చేయువాడొకడు. వారు చెప్పుప్రకారము జీవునకు శుద్ధాశుద్ధము లను రెండు అవస్థలున్నవి. ప్రకృతిసంబంధమువలన అశుద్ధుడయినం

దున శుద్ధజీవుని జ్ఞానానందములు మరుగుపడినవి. ఈయిద్దరిలో నెవరు ఎక్కువ అని అర్జునుడు అడిగినా డనియు, దానికి పరమాత్మ యేమిచెప్పినా డనగా నారాయణుడ నగు నన్ను ఉపాసన చేయువాడే శ్రేష్ఠుఁడు. శుద్ధజీవుని ఉపాసనచేయుటకు ఇంద్రియనిగ్రహ మనోనిగ్రహములు ఎంతో యెక్కువగా నుండవలెను. నారాయణుని ఉపాసన చేయునెడల కొన్నిలోపములున్నను ఆయన అనుగ్రహించుటయే కాక ఐశ్వర్య, కైవల్య, భగవల్లాభములు కలుగుచున్నవి. శుద్ధఆత్మ నుపాసనచేసినందువలన ఆత్మసంబంధమైన జ్ఞానము ఆనందమే కలుగుచున్నది. ఫలము స్వల్పము; కష్ట మధికము.

ద్వైతసిద్ధాంత ప్రకారము :— (1) నారాయణుని ఉపాసన చేయువా డొకడు, (2) జగన్మాత ప్రకృతికి అభిమానదేవతను, లక్ష్మిని, ఉపాసన చేయువా డొక డని, వీరిలో నెవరు గొప్ప అను ప్రశ్నకు, న న్నుపాసన చేయువారు గొప్ప వారనియు, లక్ష్మిని ఉపాసనచేయుటకు ఇంద్రియమనోనిగ్రహ మెక్కువ కావలయు ననియు ఆమె పరమాత్మ సాన్నిధ్యము చేర్చగలదేగాని, స్వతంత్రించి ఆమె యెట్టి ఫలము నివ్వజాల దనియు తిరిగి నారాయణోపాసన చేసి కైవల్యము పొందవలయుననియు పరమాత్మ చెప్పియున్నాడని వీరివ్యాఖ్యానము. స్త్రీదేవతలను, బాలాత్రిపురసుందరిదేవతల నుపాసనచేయుట పదునైన కత్తులమీద నడచినట్లు. ఏమాత్రము మనోనిగ్రహము, ఇంద్రియనిగ్రహము లేకున్నను ఆ దేవత లుపాసకుల తలలు అణచుచున్నవి. ఆడపిల్లలకు చదువు సంగీతము

చెప్పువారు, వంటవారు, గాజులు తొడుగువారు ఒడలు తమ దగ్గర పెట్టుకొని తమతమపనులు చేయవలసి యున్న దను విషయము లోకవిదితమే. పురుషుడు స్త్రీరూపమును పూజించుట కష్టము. Sex idea కలుగకముందు స్త్రీ=మాత యని అభిప్రాయ మేర్పడినచో పెద్దయైన తరువాత స్త్రీ ఉపాసన కష్ట మనిపించదు. కనుక నారాయణోపాసన మంచిది. దీనినిబట్టి యేమి తెలిసికొనవలయు ననిన పురుషులు పురుష రూపమైన నారాయణుని, స్త్రీలు స్త్రీరూపమైన లక్ష్మిని పూజించవలయును. This is based upon human psychology. ఆడువాండ్రు దేవతార్చన ఎందులకు చెయ్యగూడ దన్నారనగా, సాలగ్రామములలోను శంఖములలోను ఉన్న vibrations రజోదోషము కలవా రగుటచే వారు భరింప జాలరు. The reason for the exclusion of the females from touching the devatarchan is scientific. అనసూయ శివలింగమును పూజించెనుగద, మనము చేయరాదా అని కొందరు స్త్రీలు ప్రశ్నించెదరు. ఆమె యినుపగుగ్గిళ్లను వండిన మహాపతివ్రత. అంత శక్తిగలవారు ఈ కాలమందు స్త్రీలున్నచో శివపూజచేయవచ్చును. రామకృష్ణపరమహంస ఈశ్వరాంశసంభూతు డగుటచే కాళిని పూజించి ముక్తిపొందెను. లక్ష్మిఉపాసనచేసి నా సాన్నిధ్యము చేరుట బహుకష్టము. గనుక నన్నే ఉపాసన చెయ్యవలసిన దని పరమాత్మ చెప్పియున్నాడు.

నిర్గుణపరబ్రహ్మమును, లక్ష్మిని ఉపాసన చేయుటకు ఇంద్రియమనోనిగ్రహము పూర్తిగా ఉండవలయును. సగుణో

పాసన నారాయణోపాసన చేయువారికి కొన్ని లోపములున్నను ప్రమాదములేదు.

This chapter mentions the positive qualities of a bhakta, while the last sloka in the previous chapter emphasizes the negative aspect.

భక్తుని లక్షణములు.

(1) భూతదయ, సకలప్రాణికోటిని సమముగా జూచి వారిని కష్టములనుండి తొలగించు మార్గము చూడవలెను. (2) సుఖదుఃఖములను సమముగా చూడవలయును. ఇట్లు చేయువారిని "భవజలధి మగాధం దుస్తరం నిస్తరేయం" అని చెప్పినట్లు ఈ సంసారసాగరమునుండి భగవంతుడు ఒడ్డుకు చేర్చుచున్నాడు.

కులశేఖర ఆళ్వార్ ముకుందమాలలో నిట్లు చెప్పియున్నాడు.

శ్లో॥ భవజలధి మగాధం దుస్తరం నిస్తరేయం
కథ మహ మితి చేతో మా స్మ గాః కాతరత్వం
సరసిజదృశి దేవే తావకీ భక్తి రేకా
నరకభిది నిషణ్ణా తారయిష్య త్యవశ్యమ్॥

అనగా, "ఓ మనస్సా! నేను ఎట్లీ సంసారసముద్రము దాటుదునా యని మనంబున భయంబు నొందకుము. ఏమన, దాని కొక్క చక్కని త్రోవగలదు. నీ వా విష్ణువు నందు నిశ్చలమైన భక్తిని కలిగియున్నచో ఆ విష్ణు భక్తియే నిన్ను సంసార సముద్రమును దాటింపగలదు. సంసారసము

ద్రమును తరింపవలెనన్న విష్ణుభక్తికంటె వే రుపాయము లేదు.* మరియు,

శ్లో॥ తృష్ణాతోయే మదనపవనోద్ధూతమోహోర్మిజాలే
దారావర్తే తనయసహజగ్రాహసంఘాకులే చ
సంసారాఖ్యే మహతి జలధౌ మజ్జతాం న స్త్రిధామన్
పాదాంభోజే వరద భవతో భక్తినావం ప్రయచ్ఛ॥

అనగా, "ఓ కృష్ణా! సంసార సముద్రమును దాటుట మిగుల కష్టము. ఆ సముద్రము ఆశ యను నీటితో నిండినది. కామ మనెడు గాలిచే మోహ మను తరంగపంక్తు లెగురగొట్ట బడుచుండును. భార్యలు సుడులు; అన్నదమ్ములు, పుత్రులు, గొప్ప కూ్రరములైన నీటి జంతువులు. దీనిని దాటుట మహా కష్టము. నీ పాదంబులందు భక్తికలిగియుండుటయే దీనిని సుల భముగా దాటుటకు నావ యగును. ఇతరసాధనములచే దాట వీలుగాదు. అందులకై నీపదభక్తినిశ్చలత్వము నొసంగుము''

సంసారసముద్రములో భార్యలు అను సుళ్లు, కొడుకులు అనునట్టి మొస ళ్లున్నవి. రామనామనౌకయే యీసముద్రమును దాటుటకు మార్గము. భక్తితో భజించినవారికి చేయూతనిచ్చి పరమాత్మ వారిని ఒడ్డుకు జేర్చును. మయ్యేవ=నాయందే నీ మనస్సును ఉంచవలయును. "Be devoted unto my Lotus feet." బుద్ధి నాయందే యుంచవలయును. బుద్ధి is the determinative faculty.

త్రికరణశుద్ధిగా నన్ను భజించుము. పై విషయములు నేను చూచుకొందును. భగవంతుని భజించుచున్న భార్య పిల్ల

లను ఎవరు పోషించెద రని దిగులుపడ నవసరములేదు. పరమా త్మయే వారిని కాపాడగలడు.

మనస్సును నిలుపుట కష్టము. అయ్యది కల్లు త్రాగి నిప్పులు త్రొక్కిన కోతిమాదిరి చెదరిపోవుచున్నది. దానిని అభ్యాసమువల్ల త్రొక్కిపట్టవలసిన దని 6 వ అధ్యాయములో చెప్పియున్నాడు. "అభ్యాసము కూసువిద్య" గనుక నిత్యము అన్ని పనులతోపాటు మనస్సును నిలుపుటకు రోజు ప్రయత్నము చేయవలయును.

మనస్సు నిలుపుటకు వీలులేకపోతే "మత్కర్మపరమో భవ" నా సంబంధమైన పనులు చేయవలయును.

విశిష్టాద్వైత వ్యాఖ్యానము బహుబాగుగా నున్నది.

మత్కర్మలు:— రామానుజాచార్యులవారు వ్రాసినది ఏ మనగా - ఆలయనిర్మాణోద్యానకరణ ప్రదీపారోపణమార్జ నాభ్యుక్షణోపలేపన పుష్పాహరణ పూజాప్రవర్తన నామసంకీ ర్తన ప్రదక్షిణస్తుతినమస్కారాదులు. అనగా గుళ్లుకట్టించుట; దీపములు వెలిగించుట, చెరువులు త్రవ్వించుట, పూలహార ములు గ్రుచ్చుట మొదలగు భగవత్సంబంధ మగు కైంకర్య ముల చేయుట దీని అర్థ మని చెప్పియున్నారు.

ఇదియు చేతకాకపోయిన ట్లయితే నీ శరీరపోషణకొరకు నీ వానరించు కర్మను రామార్పణము; కృష్ణార్పణము అని నాకు సమర్పించవలయును. ఈ రీతిగా పరమాత్మ భక్తిసాధనసోపా నములను వివరముగా తెలిపియున్నాడు.

భక్తుని లక్షణములు:—

(1) సుఖదుఃఖములు సమముగా అనుభవించుట. దేవాలయమునకు పోయినపుడు చక్కెరపొంగలి యిచ్చినను కట్టెపొంగలి యిచ్చినను భగవంతుని ప్రసాద మని స్వీకరించుట. You must believe that everything is a blessing in disguise.

(2) భక్తుడు ఇల్లు వాకిలి లేకుండ నుండును. ఈ ఇల్లు వాకిళ్ళను భక్తుడు నమ్మడు. నిజమైన భక్తునకు పరమాత్మయే యిల్లు.

(3) స్థిరమతి: Stability of purpose = పట్టుదల. Another Commentator: స్థిరమైన వస్తు వగు పరమాత్మతో సంబంధించిన మనస్సు కలవాడు.

(4) శతృవులు మితృలు అందరిని పరబ్రహ్మ స్వరూప ముగా చూచువాడు.

(5) ఎవరిని ద్వేషించడు. మనుష్యులు, పురుగులు, పక్షులు, క్రిమికీటకాదులు - వేనిని ద్వేషించడు. ఇంకొకరు ఏమి వ్రాసినారన, తనకన్న గొప్పవారిని చూచి ద్వేషించ కుండుట, సమానస్థితిలోనున్నవారితో మైత్రి కలిగి యుండుట, తక్కువస్థితిలో నున్న వారియందు కరుణకలిగి యుండుట—ఇవి భక్తుల లక్షణములు.

శ్లో॥ 15. ఎవరిని చూచి యితరులు ఎవ్వరును భయ పడరో, ఎవరికి ఏవస్తువును చూచినను భయము కలుగదో అట్టి వాడు నిజమైన భక్తుడు.

Bhakti has got magnetic influence and attracts all beings. What is the psychology of fear? The more you identify yourself with the mortal coil, the greater the fear; the greater the detachment, the lesser the fear.

భక్తుని సన్నిధినిగురించి "తత్సన్నిధానే వైరత్యాగః" "జంతువులుకూడ వారి సన్నిధిలో వైరము పోగొట్టుకొనుచున్నవి" అని చెప్పబడినది.

శ్లో॥ 20. ఈభక్తిని యథోక్తముగా చేయవలయును. గ్రంథములకన్న నీ బుద్ధిని ప్రమాణముగా గలిగియుండుట పొరపాటు. నమ్మిన గ్రంథములను పూర్తిగా నమ్మిన వాటిలో చెప్పినమాదిరి యథోక్తముగా చేయవలయును. వేదశాస్త్రములలో చెప్పినప్రకారము వారివారి జాతిధర్మముల ననుసరించి భక్తితో పరమాత్మను భజించిన అటువంటివాడు నాయొక్క అనుగ్రహమునకు పాత్రుడగుచున్నాడు.

భక్తిని గురించి వ్యాఖ్యానకారులు చెప్పిన అభిప్రాయములు:—

మనస్సుయొక్క లక్షణములు, I. Thinking, (ఆలోచించుట) 2. Feeling, (తెలిసికొనుట) and 3. Willing. (సంకల్పించుట.) మనస్సుయొక్క భావమునకు ప్రేమ యనిపేరు. అది తీగెమాదిరి ఏదోయొకవస్తువుపై ప్రసరించుచున్నది. ఆమనో భావమునకు స్త్రీ అధిష్ఠానమైనచో దానికి కామము లేక అనురాగము అని పేరు. ఆ తీగెను బిడ్డలను వృక్షములపై నిలిపిన పుత్రవాత్సల్యము, దేశమందుంచిన దేశభక్తి, సద్గురువులయం

దుంచిన గురుభక్తి, ధనమం దుంచిన ధనాశ యని యీామాది రిగా వేరువేరు పేర్లతో పిలువబడుచున్నది.

ఈ వస్తువులలో దేనిని ప్రేమించినను కష్టసంబంధము లేనట్టి ఆనందము నివ్వజాలవు. అవి తొంబదితొమ్మిది పాళ్ళు కష్టము, ఒకపాలు సుఖము కలిగించుచున్నవి. మనస్సును పరమాత్మయందు నిలిపిన ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక దుఃఖరహిత ఆనందము కలుగుచున్నది. అట్లు నిలుపుటయే భక్తి యని చెప్పబడును. శంకరాచార్యులవారు శివానంద లహరిలో ఇట్లు చెప్పి యున్నారు.

శ్లో॥ అంకోలం నిజబీజసంతతి రయస్కాంతోపలం సూచికా। సాధ్వీ నైజవిభుం లతా క్షితిరుహం సింధు స్సరిద్వల్లభమ్।ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవిందద్వయం।చేతోవృత్తి రుపేత్య తిష్ఠతి సదా సా భక్తి రిత్యుచ్యతే॥

ఊడుగు చెట్టుగింజలు పోయి చెట్టు కంటుకొనునట్లును, అయస్కాంతము (సూదంటురాయి) లోహమును లాగునట్లును, పతివ్రత భర్తను అనుసరించునట్లును, నదులుపోయి సముద్రములో పడునట్లును భక్తునియొక్క మనస్సు పరమాత్మయందు లీన మగుచున్నది. మనస్సు పరమశివునియందు లీన మగుటయే భక్తి.

"నీపాదకమలసేవయు,నీపాదార్చకులతోడి నెయ్యమును నితాం,తాపారభూతదయయును, తాపసమందార! నాకు దయ

సేయగదే', అని సుదాముడు (మాలాకారుడు) శ్రీకృష్ణుడు తన యింటికి వచ్చినప్పుడు ప్రార్థించిచెప్పెను.

భక్తి మూడు రకములు:—

1. అధమభక్తి. ఇహలోక స్వర్గలోక సుఖమును గోరి భజించుట.
2. మోక్షము కావలయునని భజించుట- మధ్యమభక్తి.
3. మోక్షముకూడ కోరకుండ ఊరక భజించుట.

Devotion for the sake of devotion. ఇది ఉత్తమమైన భక్తి.

కులశేఖర ఆళ్వారు ముకుందమాలలో ఇటుల చెప్పి యున్నాడు.

"నాస్థా ధర్మే న వసునిచయే నైవ కామోపభోగే
యద్యద్భవ్యం భవతు భగవన్ పూర్వకర్మానురూపం
ఏతత్ప్రార్థ్యం మమ బహుమతం జన్మజన్మాంతరేపి
త్వత్పాదాంభోరుహయుగగతా నిశ్చలా భక్తి రస్తు."

రంగనాథా! ధర్మార్థకామమోక్షములు అనబరగు చతుర్విధ పురుషార్థములు నిన్ను నేను అడుగదలచుకొనలేదు. వెనుకటి జన్మములయందు జేసిన కర్మను అనుసరించి ఫలము కలుగును. నీవు నాకు ఎన్ని జన్మములు, ఎట్టి జన్మములు కలిగించినప్పటికిని నీ పాదములు మాత్రము మరచిపోకుండు నట్లు భక్తిభావము అనుగ్రహింపవలయును.

భక్తి నవవిధములు :—

1. శ్రవణము. 13 వ అధ్యాయములో శ్రవణమువలన తరించెద రని చెప్పబడినది.
2. కీర్తనము.
3. విష్ణుస్మరణము.
4. పాదసేవనము.
5. అర్చనము.
6. వందనము.
7. దాస్యము.
8. సఖ్యము.
9. ఆత్మనివేదనము.

ఒక్కొక్క యుగములోని జనులు ఒకమాదిరి భక్తివలన తరించినారు. 1 కృతయుగములో ధ్యానమువలనను, 2 త్రేతాయుగములో యజ్ఞము, కర్మయోగమువలనను, 3 ద్వాపరములో పరిచర్యవలనను తరించిరి. 4 కలియుగములో హరికీర్తనవలన జీవులు తరించెదరు. కలియుగములో ఒకసుగుణ మున్నదని శుకమహర్షి పరీక్షిత్తునకు చెప్పెను. ఏమన- కృష్ణుని స్మరించినందువలన సర్వసుఖములు కలుగును.

"శ్లో॥ కలే ర్దోషనిధే రాజన్ అస్తి హ్యేకో మహాన్ గుణః
కీర్తనాదేవ కృష్ణస్య ముక్తబంధః పరం వ్రజేత్॥

అని శ్రీశుకుడు పరీక్షిత్తునకు చెప్పెను. (భాగవతము)

నారదుడు నరకములోని పాపుల జూచి యిట్లు చెప్పెను. "నారాయణోనామ నరో నరాణాం । ప్రసిద్ధచోరః కథితః పృథివ్యాం । అనేక జన్మార్జిత పాపసంచయం । హరత్యశేషం స్మృతమాత్రమేవ".

శివుని గురించికూడ "తస్కరాణాం పతయే" అని చెప్పబడినది. నారాయణ మంత్రము బహుసులభమైనది. నారాయణ అనుపేరు మూడుసార్లు చెప్పినంత మాత్రముననే పాపులందరు నరకమునుండి విడుదలకాబడి మోక్షము చెందిరి.

నారాయణ నామస్మరణనుగూర్చి కులశేఖర ఆళ్వార్ ముకుందమాలలో నిట్లు చెప్పియున్నాడు.

"శ్లో॥ హే మర్త్యాః పరమం హితం శ్రుణుత వో వక్ష్యామి సంక్షేపతః । సంసారార్ణవ మాపదూర్మిబహుళం సమ్యక్ప్రవిశ్య స్థితాః । నానాఽజ్ఞాన మపాస్య చేతసి నమో నారాయణాయే త్యముం । మంత్రం సప్రణవం ప్రణామసహితం ప్రావర్తయధ్వం ముహుః॥

అనగా "ఓజనులారా ! సంసారము మహాసముద్రము. అందనేకరూపంబులుగ సంభవించు పాపంబులు కష్టములు సముద్రముమీద వచ్చు తరంగములవంటివి. దానినుండి తప్పించుకొనుటకు ఒక్కటే యుపాయము కలదు. అదేమందురా, అనేక రీతులుగా నున్న అజ్ఞానమును పోగొట్టి

'నమో నారాయణాయ' యను మంత్రమును పలుమారులు జపించిన సంసారసాగరమునుండి తరింపగలరు. శ్రీకృష్ణుని తలంచినవారి కాపద లుండవు" మరియు-

శ్లో॥ శత్రుచ్ఛేదైకమంత్రం
సకల ముపనిషద్వాక్యసంపూజ్యమంత్రం
సంసారోత్తారమంత్రం
సముపచితతమస్సంఘనిర్యాణమంత్రం
సర్వైశ్వర్యైకమంత్రం
వ్యసన భుజగసందష్టసంత్రాణమంత్రం
జిహ్వే! శ్రీకృష్ణమంత్రం
జప జప సతతం జన్మసాఫల్య మంత్రమ్"

అనగా "ఓ కృష్ణా ! నీ మంత్రమును ప్రతిదినమును జపించిన లోపలి శత్రువు లగు కామ క్రోధ లోభాదులు నశించును. బహిశ్శత్రువులు నశింతురు. సంసారబంధము త్రెంప వీలగును. అజ్ఞానంబు నశించి యైశ్వర్య మభివృద్ధి పొందును. దుర్వ్యసనములు నాశనమగును. జన్మ సార్థకమగును. ఆ మంత్రము సకలవేదాంతసారములయందు విశదముగ జెప్పబడును". మరియు-

శ్లో॥ వ్యామోహ ప్రశమౌషధం
మునిమనోవృత్తిప్రవృత్త్యౌషధం
దైత్యేంద్రార్తికరౌషధం
త్రిభువనే సంజీవనైకౌషధం

భక్తాత్యంతహితౌషధం
భవభయపరిధ్వంసనైకౌషధం
శ్రేయఃప్రాప్తికరౌషధం
పిబ మనః! శ్రీకృష్ణదివ్యౌషధమ్"

అనగా, "ఓ చిత్తమా! శ్రీకృష్ణమంత్రంబు జపించితి వేని అది యజ్ఞానమును పారదోలును. మునుల హృదయంబులను వేరొక దానిమీదకు బోకుండ వారించి భగవంతుని యందే లీనమొనర్చును. రాక్షసరాజు లనెడి రోగముల పారదోలును. మూడులోకంబులను సంజీవని యను నోషధిమాదిరి బ్రతికించును. భక్తుల కమృతము నొసంగును. సంసారములోని భయంబులను జెల్లాచెదరు గావించును. ఇహ పర లోకంబుల యందు సుఖము గలిగించును. ఇంతియేగాక అనేక శుభంబులిచ్చి విష్ణుసన్నిధానమును గూడ లభింపజేయును."

బిడ్డకు భగవత్సంబంధమైన పేర్లు పెట్టి నోటినిండ పేరుపెట్టి పిలువవలయును. ఇది సాంకేతికము. భగవంతుని పేరు పరిహాసములోకాని, స్తోభములోకాని (to fill up gap), హేళనలోకాని వైకుంఠనాథుని నామస్మరణ చేసిన మోక్షము కలుగును. క్రిందపడ్డప్పుడుగాని, కష్టము కలిగినప్పుడుగాని, జ్వరములోగాని భగవత్ స్మరణ చేయుటవలన జీవుడు తరించవచ్చును.

భక్తిలేనివాడు స్మరణవలన ఎట్లు తరించును? ఎట్లన, ఔషధము మహిమ తెలిసి పుచ్చుకొన్నను, తెలియక పుచ్చు

కొన్నను దానిపని అది చేసితీరును. నిప్పు మహిమ తెలిసిన వారిని, తెలియనివారినికూడ ముట్టుకొనిన కాల్చుచున్నది. భగవంతునినామము దాని మహిమ తెలియక స్మరణచేసినను దానిఫలితము అది తప్పక యిచ్చును.

చెంచుగురువు తన శిష్యులకు చెప్పినమాటలు:—

'వనే చరామో, వసు చాహరామో, నదీ స్తరామో న భయం స్మరామః' అనగా అడవిలో తిరుగవలయును, సొత్తు హరించవలయును, నది దాటవలెను, భయము అనుకొనగూడదు అను అర్థముతో చెప్పిన శ్లోకములో రామనామము నాలుగుసార్లు చెప్పబడుటచే వా రందరికి మోక్షము కలిగెను.

గుహుని పూర్వజన్మ వృత్తాంతము ఏమనగా పూర్వ జన్మలో ఋషికుమారుడై యుండి రామనామము యొక్క సంపూర్ణమగు విలువ తెలియక తండ్రిశాపమువలన తక్కువ జాతిలో పుట్టెను. బ్రహ్మహత్యచేసిన రాజును మూడుమార్లు రామనామోచ్చారణ చేయవలసిన దనెను. అత డట్లే చేసి పవిత్రుడాయెను.

రామకర్ణామృతములో శంకరాచార్యులవారు ఇట్లు వ్రాసియున్నారు:—

"రాశబ్దోచ్చారణా దేవ ముఖా న్నిర్యాంతి పాతకాః
పునఃప్రవేశభీత్యాచ మకారస్తు కవాటవత్"

అనగా "రా" కలుషంబులెల్ల బయలం బడద్రోయును; "మ" కవాటమై నిరోధించునని అందలి భావము.

103 వ ఉపనిషత్తులో

హరే రామ హరే రామ రామ రామ హరే హరే
హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే;

అను 16 నామములు జపించిన మోక్షము కలుగు నని చెప్పియున్నది.

అష్టాదశ రహస్యములలో ముముక్షుపడిలో చెప్పిన విషయములు:—

వాచకం= పేరు, వాచ్యం=పేరుకలిగిన వస్తువు.

Though He turns a deaf ear to our prayers and He is at a distance, His name will be near us to protect us, as it protected Droupaidi.

భక్తి, ఐశ్వర్య, కైవల్య, భగవల్లాభము లను మూడింటిని ఇచ్చును. భగవన్నామము కన్నతల్లిమాదిరి భక్తుని కాపాడును. భగవన్నామము అశుద్ధిని పోగొట్టును. God's name is the magnet and it attracts God.) భవరోగ మునకు లోబడినవారికి భగవన్నామము రుచించదు.

[Jayadeva, a great Bengail Bhakta used to worship God till He (in the picture before him) nodded his head. Tyagaraja is an Avatar of Narada, so also in the case of Purandaradoss. Balakrishna used to appear before Purandaradoss (Note his song "నీక్నాన్యాకో"]

Vivenkananda saw Rama by repeating Rama's name according to the directions of Ramakrishna Paramahamsa. God's name has intrinsic value: it will make a man a great bhakta in the long run though he may not know its efficacy in the beginning.

జయదేవుడను గొప్ప బెంగాలీభక్తుడు తన యెదుట పటములోనున్న భగవంతుడు తలయూచునంతవరకు ఆయనను భజించెడివాడట! త్యాగరాజు నారదుని అవతార మని చెప్పెదరు. పురందరదాసు భగవంతుని స్తోత్రము చేయుచుండ, బాలకృష్ణు డాయనయెదుట కనబడుచుండెనట! పురందరదాసు కీర్తన 'నిన్యాకో' పఠనీయము. శ్రీరామకృష్ణపరమహంస చెప్పిన తీరున వివేకానందస్వామి రామనామము పలుమారు జపించి శ్రీరాముని దర్శనము బడసెను. భగవన్నామ మమోఘమైనది. మొదట దాని విలువ తెలియకున్నను క్రమేపి స్మరించు వారిని నిజమైన భక్తుల జేయును.

( Siva :—The worship of Siva will purge a person of all sins of omission and commission.) శివుని పూజించిన అన్ని పాపములు పరిహార మగును.

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే భక్తి
యోగో నామ ద్వాదశోధ్యాయః
సంపూర్ణః

# శ్రీ భగవద్గీతోపన్యాసములు



## 13 వ అధ్యాయము

## క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము

శ్లో॥ 1. హేప్రభో! వెనుకటి అధ్యాయములో ఆరు మాట లుపయోగించినారు. ప్రకృతి, పురుషుడు, జ్ఞానము, జ్ఞేయము, క్షేత్రము, క్షేత్రజ్ఞుడు; వీటి వివర మేమి? అని అర్జునుడు అడిగెను. ప్రకృతి - క్షేత్రము రెండును ఒకటి. పురుషుడు - క్షేత్రజ్ఞుడు రెండును ఒకటి. జ్ఞానము, జ్ఞేయము వేరు. మొత్తము ఆరింటిని నాలుగుగా తగ్గించి పరమాత్మ జవాబు ఇచ్చెను. ఈ శ్లోకము కొన్నిపుస్తకములలో లేదు. దీనితో కలిపిన గీతలో మొత్తము 701 శ్లోకములు.

శ్లో॥ 2. ఈ శరీరము క్షేత్రము అని చెప్పబడును.

స్థూలశరీరము=పంచభూతములతో కూడినపై కవచము (outer coat) ఇది నశించును.

సూక్ష్మశరీరము=(inner) లోపల 19 తత్త్వములతో కూడినది. ఇది జీవత్వము నశించినగాని నశించదు. కర్మలు నశించిన జీవుడు మోక్షము చెందును. ఈ రెండు శరీరములకు క్షేత్రమని పేరు. ఎందువల్లననగా, శరీరసంరక్షణకు భూములు ఎట్లు అవసరమో, అట్లే జీవుని సంరక్షణకు పాంచభౌతిక

శరీరము భూమివంటిది. శరీరమును ఆహార నియమాదులవలన కట్టుబాటులో నుంచినగాని పరమాత్మయందలి జ్ఞానానందములు తెలిసికొనజాలము. క్షతము = గాయము. ఆత్మకు గాయము తగులకుండ కాపాడు కవచము శరీరము. అందువలన క్షేత్రము అని పేరు. బ్రహ్మాండమగు క్షేత్రములో యజమానుడు పరమాత్మయని గుర్తెరుంగవలయును.

ఈక్షేత్రమను శరీరమును ఎవరు తెలిసికొనుచున్నారో వానిని క్షేత్రజ్ఞు డనెదరు. క్షేత్రజ్ఞుడు = పురుషుడు. క్షేత్రములో నేమేమి జరుగునది తెలిసికొనువాడు క్షేత్రజ్ఞుడు.

శ్లో॥ 3. అన్ని క్షేత్రముల యందుండి వాని సంగతి తెలిసికొనువాడను నే నని గుర్తెరుంగుము. ఒక్కొక్క శరీరములో నిద్దరు క్షేత్రజ్ఞులు. అముఖ్యుడు జీవుడు, ముఖ్యుడు పరమాత్మ. పరమాత్మకు మన శరీరమునందలి సంగతులే కాకుండ, ఆత్మయందలి సంగతులుకూడ తెలియుచున్నవి. మన శరీరములు ఆత్మలు అన్నియు ఆయనకు క్షేత్రములు కనుక వైష్ణవసిద్ధాంత ప్రకారము శ్రీమన్నారాయణుడు సర్వశరీరి అని చెప్పబడియెను. శేషి, శేషము అనగా మనశరీరము సొత్తు. దానికి యావత్తు పరమాత్మ యజమాని. అందువల్ల శరీరశరీరిభావము, శేషి శేష భావము అనబడును. మాండూక్యోపనిషత్తులో ఒక ఉదాహరణ మివ్వబడినది. ఒక చెట్టునకు రెండుకొమ్మలు. క్రింద కొమ్మమీద పక్షి కొమ్మకొమ్మకు, రెమ్మరెమ్మకు పరిభ్రమించుచు, పుల్లనిపండు తినినప్పుడు మొగము చిట్లించుకొని,

తియ్యనిపండు తినినప్పుడు మొగము వికసింపజేసికొనుచు వేసారి, యేకారణమువల్లనో తలపైకెత్తి పైకొమ్మపై నున్న ఆనందమయమైనట్టి పక్షిదగ్గరకు మెల్లమెల్లగా చేరి ఐక్యమగు చున్నది. క్రిందికొమ్మమీది పక్షి జీవుడు. పైకొమ్మమీది పక్షి పరమాత్మ అని Analogy.

జ్ఞానమనగా ఆత్మానాత్మ వివేకము. The discrimination between God, Soul and Matter. ఇది తెలిసికొనుటయే, నిజమైన జ్ఞాన మని కృష్ణుడు చెప్పెను. సాధారణవిద్య అహంకారమమకారములను వృద్ధిపరచి, రామకృష్ణపరమహంస చెప్పినట్లు పాశములవలె జీవుని సంసారములో కట్టివేయుచున్నది. ఆత్మోద్ధరణకు హేతుభూతమైన ఆత్మ పరమాత్మ విచక్షణ, నిజమైన జ్ఞానము.

శ్లో॥ 4. ఆక్షేత్రము, ఏ యే వికారములతో, తత్త్వము లతో కూడుకొనియున్నదో వివరముగా చెప్పెదను. వినవలసినది అని కృష్ణుడు అనెను.

శ్లో॥ 5. అర్జునుడు ఇదివరకు చెప్పినదానికి ఇక చెప్ప బోవుదానికి ఏమైనా ప్రమాణము కలదా? అని ప్రశ్నించెను. అప్రత్యక్షమైన వేదాంతవిషయమును గురించి చెప్పునపుడు ఎంత బ్రహ్మాండనాయకు నైనను ప్రమాణము చూపవలసిన దని అడుగవలయును. ఋషీశ్వరులు దీనిని వేదములలో చెప్పియున్నారు. వాటిని i. e, బ్రహ్మసూత్రములు ఉపనిషత్తులను ప్రమాణముగా పెట్టుకొని నేను చెప్పుచున్నాను.

నా స్వకపోలకల్పితము కాదని శ్రీకృష్ణుడు తెలిపెను. పరమాత్మ యొక్క విధేయత మిక్కిలి గమనించవలసిన విషయము.

శ్లో॥ 6, 7. క్షేత్రములోని తత్త్వములు వర్ణించబడినవి.

పంచభూతములు:—పృథివి, జలము (ఆపః), తేజస్సు, వాయువు, ఆకాశము, ఇయ్యవి స్థూలశరీరము.

సూక్ష్మశరీరము:—అహంకారము, బుద్ధి=నిశ్చయాత్మిక i. e. Determinative faculty. అవ్యక్తం=మూలప్రకృతి e. g కుండలు, పెంకులు అన్నిటికిన్ని మట్టి మూలకారణము. i.e. Premordial matter.

11 ఇంద్రియములు:—5 జ్ఞానేంద్రియములు—కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము; 5 కర్మేంద్రియములు—వాక్, పాణి (చెయ్యి), పాద, పాయు, ఉపస్థలు. వీటి నన్నిటిని నియమించు ( Supervisor or Overseer ) సూపర్వైజర్ లేక ఓవర్సీర్ మనస్సు. అందువలన దానిని జ్ఞానకర్మేంద్రియముల రెంటిలో చేర్చుకొనవచ్చును. ఈ యింద్రియములవలన గ్రహింపబడు శబ్దస్పర్శరూపరస గంధములు, మొత్తము 24 ముఖ్యమైనవి.

అనురాగము, ద్వేషము, ధైర్యము, తెలివి, అంతఃకరణధర్మములు - ఇవి చిన్నతత్త్వములు. 24 తత్త్వములలో 5 స్థూలశరీరములోను 19 తత్త్వములు సూక్ష్మశరీరములోను నున్నవి. వీటియన్నిటిపైన ఉన్నది ఆత్మ. గాయత్రిలో 24 అక్షరములు. రామాయణములో 24,000 శ్లోకములు. ప్రతి

వెయ్యిశ్లోకములలో మొదటి శ్లోకములోని మొదటి అక్షరము దీసి పఠించిన గాయత్రి 24 అక్షరములు ఏర్పడుచున్నవి. గాయత్రి 24 అక్షరములు 24 తత్త్వములపైన ఆత్మ ఉన్నదని సూచించుచున్నవి. కొండమీద దేవాలయములకు మెట్లు 24 గాని, వాటి multiple గాని ఉంటున్నవి. ఈ 24 గును subdivide చేసిన 96 తత్త్వములు వచ్చుచున్నవి.

శ్లో॥ 8-12 (Calendar slokas) వీనిని కాలెండర్ శ్లోకములని చెప్పనగును. 3 శ్లో॥ రెండవపాదములో చెప్పబడిన క్షేత్రక్షేత్రజ్ఞజ్ఞానము ఈ శ్లోకములలో వివరింపబడినది.

సత్ప్రవర్తన—Character is three fourths religion. (16 వ అధ్యాయము దీనిని గురించి ప్రత్యేకముగా చెప్పబడినది.)

(i) అమానిత్వం :—మానము అనగా విద్యనుబట్టి ద్రవ్యమునుబట్టి, సంతానమునుబట్టి, అధికారమునుబట్టి, జాతిని బట్టి యుండు పొగరుబోతుతనము. This is false prestige. ఒకరికన్న తా మెక్కువ అనుకొనుట మానము i.e. you ought not to have conceit and vanity. ఆ మానము లేకుండ ఉండవలెను. అదే అమానిత్వ మనబడును.

(ii) దంభము=పొగరుబోతుతనమును బయట చూపించుట. ఇది నడకలో, చూపులో, మాటలలో కనబడును. జ్ఞానికి దంభము ఉండరాదు.

(iii) అహింస :—ఎవ్వరికి నేవిధమైన హింస, కాయికముగా గాని, వాచికముగా గాని, మానసికముగా గాని,

చేయరాదు. 'అహింసా పరమో ధర్మః' అని చెప్పబడినది. ఇదియే నారాయణునికి మిక్కిలి సంతోషము కలిగించునది.

(iv) క్షాంతి :—Forgiveness and toleration అపకారము మరచిపోయి అపకార మొనర్చినవారికి నుపకారము చేయుట.

క్షాంతినిగురించి శ్లోకము:-Humility is a sign of greatness.

శ్లో॥ తృణాదపి సునీచేన తరో రివ సహిష్ణునా
అమానినా మానదేన కీర్తనీయ స్సదా హరిః.

తృణాదపి సునీచేన — తాను ఎంతగొప్పవాడైనను గడ్డిపోచకన్న నీచు డనుకొనవలయును. (Emerson said "Humility shall be exalted") పరమవిధేయతతో చరించు వారిని పరమాత్మ అనుగ్రహించు ననుటకు పెద్దలు గడ్డిపోచను ఉదాహరణముగా నిచ్చినారు. మన కాలిక్రింద త్రొక్కబడి సలాముచేయుమాదిరి వంగి గరిక పైకి లేచుచున్నది. గరికతో మనము వినాయకుని పూజచేయుచున్నాము.

'తరోరివ సహిష్ణునా' కొమ్మను ఛేదించుటకు, వేరును ఛేదించుటకు వచ్చినవానిపైన వృక్షము ఆగ్రహపడక వానికి కూడ పండ్లు, గాలి, నీడ యిచ్చుచున్నది. అట్లే మనము మహాపకారము చేయువారికికూడ అది అంతయు మరచిపోయి వారికి నుపకారము చేయవలయును. Jesus did not utter one word against his enemies when he was about

to die on the cross. యేసుక్రీస్తును కొరతవేయునపుడు ఆ మహాపురుషు డెదిరివారల పల్లెత్తుమాట అనలేదు. నీళ్ళమీద గీటుమాదిరిఅపకారమును మరచిపోవలయును. స్వల్పోపకారము అయినను శిలాశాసనముమాదిరి జ్ఞాపక ముంచుకొనవలయును.

ఎంతటి అధమస్థితిలో నున్నను వానితో మంచిగా మాటలాడవలయును. శ్రీరామచంద్రమూర్తి పరమాధములతో గూడ కలసి మాట్లాడుచుండెడివాడు. Simplicity is the real characteristic of greatness.

(v) ఆర్జవము:- Frankness; Harmony between thought, word, and deed. తలచినది చెప్పుట, చెప్పినట్లు చేయుట (నిష్కపటము) ఇదియే మహాత్ముల లక్షణము. బుద్ధుడు ఆర్జవమును గురించి యెక్కువగా చెప్పియున్నాడు.

శ్లో॥ మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనాం
మనస్యన్యత్ వచస్యన్యత్ కర్మణ్యన్యత్ దురాత్మనామ్.

(iv) ఆచార్యోపాసన:-గురువును గురించి శ్లో॥ గుశబ్ద స్త్వంధకారఃస్యాత్ రుశబ్ద స్తన్నిరోధకః అంధకారనిరోధిత్వాత్ గురు రిత్యభిధీయతే॥

గు=అజ్ఞానమును, రు=పోగొట్టువాడు. అహంకారమమకారములను పోగొట్టుకొని కామినీకాంచనములపై ఆశ వదలి వేదశాస్త్రము లన్ని చదివి మార్గదర్శకుడగువాడు సద్గురువు. "గురవో బహవ స్సంతి శిష్యవిత్తాపహారకాః, ఏక ఏవ గురు స్సాక్షాత్ శిష్యహృత్తాపహారకః" శిష్యుల సొత్తపహరించు గురువు లనేకులు గలరు. కాని నిజమైన సద్గురువు శిష్యుని

తాపము పోగొట్టువాడు. గురువుయొక్క శరీరము కాపాడు జవాబుదారి శిష్యునియం దున్నది. శిష్యుని ఆత్మసంరక్షణ గురువుచేతిలో నున్నది. ఇదియే ఆచార్యోపాసన అని చెప్ప బడును.

(vii) శౌచము=శుద్ధి Cleanliness is next to Godliness. You must keep your house, clothes, and all your belongings clean. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యముల బోగొట్టుకొని అంతశ్శుద్ధి యేర్పరచుకొనవలయును. నీయిల్లు వాకిలి దుస్తులు మున్నగునవి పరిశుభ్రముగా నుంచుకొనవలయును.

(viii) స్థైర్యము=పట్టుదల(Steadfastness of purpose)

ఏదైన ఒక గ్రంథ పారాయణము ప్రారంభించిన విఘ్నములు వచ్చినను స్థైర్యముతో కొనసాగించవలయును.

శివాజిగురువు సమర్థరామదాసుగారు ఒక గ్రామము వెళ్ళగా బీదరాలు పిలిచి భిక్ష చేయవలయు ననుకొని ధైర్యము చాలక భయపడుచుండెను. ఆయన అంతర్ముఖు డగుటచే ఆమె అభిప్రాయము గ్రహించి ఒకరోజు తనంతట తానే ఆమె యింటికివెళ్ళి భిక్షపెట్టుమని అడిగి, ఆమె అరువుకు పోకుండ వాకిలికి అడ్డునిలుచుండి ఎవరింటికి పోయి అరువు తేగూడ దనిచెప్పి, చేదైన ఆనపకాయ కూర వడ్డించగా దానిని ఆరగించి, విస్తరి వదలిన ఆ బీదరాలు దుఃఖపడునని యెంచి, నాలుకను సంబోధించి, "ఓ నాలుకా! యిదివరకు అనేకరుచ్యము లయిన పదా

ర్థములు భుజించినావు. నేను జిహ్వాచాపల్యమునకు లోబడి యుంటిని. ఇకమీదట నీవుఅన్నివస్తువులు తినవలయును. నాకు లోబడవలయును. ఇంతటినుంచి ఈ ముసలిది నాకు గురువైనది" అని జిహ్వాచాపల్యమును జయించి అప్పటినుంచి భాగ్యవంతుల యిండ్లకు వెళ్ళుటమాని, బీదల యిండ్లకే వెళ్ళుచు, చివరకు ఆ బీదరాలగు ముసలిని తన గురువుగా నెంచెను.

(ix)ఆత్మవినిగ్రహః :-Control over the sensory organs. According to one commentator it means control over the mind. ఇంద్రియములను స్వాధీనమందుంచుకొనుట. మరియొక వ్యాఖ్యానకారుడు మనస్సు గుప్పిటయం దుంచుకొనుట అని వ్రాసియున్నాడు.

(x) ఇంద్రియములవల్ల గ్రహింపబడు వస్తువులయందు ఆశ తగ్గించవలయును. ఇంద్రియ సుఖము లన్నియు తాత్కాలికములు. వాటిని ఎక్కువగా అనుభవించినకొలది దుఃఖమే గాని సుఖము లేదు. పాములు, జింకలు, ఏనుగులు ఒక ఇంద్రియమునకు లోబడి చెడిపోవుచున్నవి. మనుష్యునకు తెలివి యెక్కువ అను పేరేకాని వాడు పంచేంద్రియములకు బానిసయై ఎక్కువ దుఃఖ మనుభవించుచున్నాడు. ఇంద్రియజన్యసుఖము పైకి రమణీయముగా కనుపడుచున్నదిగాని అయ్యది ఆంతర్యమున దుఃఖపూరితము. అందువలన జ్ఞానము పొందుటకు ప్రాపంచికసుఖములయందలి భ్రాంతి త్యజించవలెను.

(xi) అనహంకారము:— అహంకారము = ఒకరికన్న తాను ఎక్కువ అనుకొనుట తప్పు. అహంకారమునకు మించిన

శత్రువు జీవునికి మరియొకటి లేదు. "నేను కాబట్టి తపస్సు, దానము, సంధ్య వగయిరా చేయుచున్నాను. ఒకరికన్న ఎక్కువ" అనుకొనుట తప్పు. A man must always remember he is only a tool of God and give all the credit to Him, ద్రావిడములో తాయిమానవరు అను భక్తుడు "అన్నియు నీయొక్క సొత్తు. అందరు నీయొక్క దాసానుదాసులు; అందరు చేయు సర్వవ్యాపారములు నీవలననే జరుగుచున్నవి" అని వేదసారము మూడువాక్యములలో ముచ్చటగా చెప్పెను. రామకృష్ణుని గురువగు తోతాపురి యను అవధూత అంతర్ముఖుడు. ఎచటను కొన్ని నిముసము లయిన నుండనివాడు, 11 మాసములు రామకృష్ణుని దగ్గర నుండి తాను 45 సం॥ లో నేర్చుకొన్న విద్య అతనికి నేర్పి, రామకృష్ణుని స్నేహితునిగా భావించుచుండెను. ఒకరోజు ఆయనముం దుండు అగ్నిగుండమం దెవరో చుట్ట ముట్టించు టకు రాగా ఆయనకు ఆగ్రహము వచ్చెను. అందుపై రామ కృష్ణుడు 'అతడుకూడ బ్రహ్మస్వరూపుడు కాడా?' అని ప్రశ్నించ, తోతాపురి శిష్యుని అంతటినుండి గురువుగా భావించెను. "నాహం నాహం తుహు తుహు" = "Not I, Not I, but thou, thou" అను రెండు మాటలే తోతాపురి తన శిష్యుడగు రామకృష్ణపరమహంసకు చేసిన ఉపదేశము.

(xii) "జన్మమృత్యు ... దర్శనమ్" latter part of sloka 9 is very important. జన్మసంగతి జ్ఞాపక ముంచు కొమ్ము. ఈ శరీరము ఎట్లు కలిగినది? మాతృకోశములో

పదినెలలు పడిఉండినది. అప్పుడు జీవుని దుస్థితి చెప్పవీలులేదు. కడుపులో అమేధ్యములో నుండు పురుగులలో ఒక పురుగుగా పడియుండినాడు. సప్తమమాసములో కదలిక కలుగుచున్నది. అపుడు జీవునికి మంచి జ్ఞానము కలిగియున్నది. అతడు ఏమను కొనుచున్నాడనగా గర్భోపనిషత్తులో ఇట్లు చెప్పబడినది.

శ్లో॥ ధిగజ్ఞానం ధిగజ్ఞానం ధిక్కామక్రోధసంకటమ్
సంసారశృంఖలం దిగ్ధిగాచార్యాద్జ్ఞాన మాప్నుయామ్॥

అనగా, అజ్ఞానమును తగులబెట్టవలయును. కామక్రోధముల పరిహరించుకొనవలయును. సద్గురువును ఆశ్రయించిసంసారమను సంకెలలను నాశపరుపవలయు నని జీవుడు గర్భములో నున్నప్పు డనుకొనుచున్నాడు. కాని భూమిమీద పడగానే మాయావర ణమునకు లోబడి యీసంగతి మరచిపోయి అందరితోపాటు కామక్రోధాదులకు లోబడుచున్నాడు. కడుపులోనుండి బయట పడుట ఒక కష్టము. ప్రసూతివాయువువలన ప్రేరేపింపబడి యోనిద్వారమునుండి బయటపడుట పెద్దజీవమునకు చిన్న జీవమునకు రెంటికిప్రమాదకరమైన విషయము. పుట్టినవెంటనే బిడ్డను చూచినయెడల పరమాసహ్యాము. ఇది జ్ఞాపకపరచు కొన్న ఈశరీరముమీద వైరాగ్యము ఏర్పడుచున్నది.

మృత్యు:—చావుసంగతి జ్ఞాపక ముంచుకొనుము. "జాతస్య హి ధ్రువో మృత్యుః" ఎటువంటివాడైనను, పాంచభౌతిక శరీరము వదలవలయును. పాలు పెరుగు పోసి పెంచినట్టి యీశరీరము కట్టకడపట ఇల్లు వాకిళ్ళు వదలి

కట్టెలలో చేరి పిడికెడు బూడిద కావలసియున్నది. " For dust thou art and unto dust shalt thou return"—Bible. చచ్చేసమయములో జీవుడు పడు కష్టము వర్ణనాతీతము. ఏ వస్తువునందు అభిమానముకలదో దానిని కలిపి నీరు గొంతులోపోసినగాని ప్రాణముపోదు. పెండ్లికి మించిన సుఖము లేదు. చావునకు మించిన కష్టములేదు. అందువలన అవసానకాల మందు బిడ్డలు దగ్గర కూర్చొని ఒక్క-చీమగాని, దోమగాని మరణబాధ పడువారి శరీరముపై వ్రాలకుండా విసనకఱ్ఱతో విసరుచుండవలయును. మృత్యువు తప్పదని జ్ఞాపకమున్న నీ శరీరముపై వైరాగ్యము ఏర్పడుచున్నది.

ముసలితనము=జరా:—ముసలితనములో స్వాధీనము తప్పి శరీరము బహుకష్టపడుచున్నది. ఇది జ్ఞాపక ముంచుకొన వలెను.

వ్యాధి :—నీ శరీరములోని అశుద్ధపదార్థములు వ్యాధి కాలమందు బయల్పడును. వాటిని మరువవద్దు, పైకి మిసమిస లాడు ఈ శరీరములోనుండియే దుర్గంధభూయిష్ఠ మగు చీము నెత్తురు వెలువడుచున్నది.

దుఃఖదోషానుదర్శనమ్—ఆ యా కుటుంబములోని దుఃఖములను గమనించవలెను. ఈ సందర్భములో బౌద్ధావ తారములోని ఒక చిన్న కథ చెప్పనగును. బుద్ధుని దర్శించు టకు అనేకలక్షలప్రజలు వచ్చిరి. ఆయన సంచారముచేయుచు ఒక గ్రామములో అడుగుపెట్టిన రోజున ఒక బీదరాలికి ఏకపుత్రవియోగము కలుగగా ఆ శవమును ఆమె తీసుకొని

పోయి బుద్ధుని కాళ్ళమీద పడవేసి బ్రతికించుమని కోరగా ఆయన వేదాంతమును బోధించెను. ప్రతియింట నేదో దుఃఖమున్నది. (There is a skeleton in every cupboard.) అని చెప్పెను. అది ఆమెకు నచ్చలేదు. అంతట బుద్ధుడు ఆమెను నువ్వులు తీసుకొనిపోయి సుఖముగా నున్నవారి చేతుల కిచ్చి దానిని తిరిగి వారి చేతులలోనుండి తీసుకొని పిల్ల వానికి వాసన చూపించిన బ్రతుకగల డని చెప్పెను. ఆమెకు ఏ యింట చూచినను ఏదోయొక దుఃఖమే కానవచ్చినందున ఆమె తిరిగి బుద్ధునిదగ్గరకు రాగా బుద్ధుడు పుట్టుట కష్టపడుట కొరకే అని చెప్పెను. బిడ్డలు భూమిమీద పడుటతోడనే ఏడ్చు చున్నారు. "Babes when they are sent forth into this world cry that they have come into the world of fools", said an English theologian. A little introspection will reveal that happiness in the world is only .0001 and sorrow is .9999. Every human being has some sorrow. If you remember this and know that there is suffering in every home you attain knowledge.

(xiii) అసక్తి రనభిష్వఙ్గః = Too much attachment should be avoided towards house, family and children. భార్య బిడ్డలయందు, ఇల్లు వాకిళ్ళయందు ఎక్కువగా మమకారము కలిగియుండరాదు.

(xiv) వివిక్తదేశసేవిత్వము:—ఒంటరిగా ఒక ప్రదేశములో కూర్చొని భగవంతుని ఆరాధించుట. శంకరుల వారు నదియొడ్డున, దేవాలయ సమీపమున, పర్వతగుహాల

పర్వతశిఖరముల సమీపమున కూర్చొనిన ఆధ్యాత్మికవాతావరణమువలన ఏకాగ్రత యేర్పడునని చెప్పియున్నారు ? ఇది సందర్భపడని-చో, రామానుజులవారు ఇంటిలో దేవతాగృహమును నిర్మించుకొను మని చెప్పియున్నారు. అచటికి పిల్లలనుగాని భార్యనుగాని రానివ్వగూడదు. అచట కూర్చొని కిటికీలోగుండ చూచి read the book of nature. Then you will be able to turn your mind towards God. ఉపనిషత్తు లన్నియు అరణ్యములో వ్రాసియుండుటచే వానికి ఆరణ్యకములని పేరు. Alexander in his soliloquy said "Oh! solitude, where are the charms that sages have seen in thy face?"

(xv) అరతి ర్జనసంసది = Aversion to the company of worldy minded i.e. keep good company. మంచివారితో సహవాసము చేయవలయును. ప్రాపంచిక విషయములందు మగ్నులై యుండువారికి దూరముగ నుండుట శ్రేయస్కరము.

(xvi) అధ్యాత్మజ్ఞాననిత్యత్వము = Study, realise and always remember the relation between Atma and P-ramatma. అధ్యాత్మజ్ఞాన మెల్లప్పుడు కలిగియుండవలయును. తాయిమానవరు మనము చేయు పను లన్నియు రెండు అని చెప్పియున్నాడు—తినుట, నిద్ర. ఈరెంటితో మానవులు తమ జన్మను వృధాగా వెళ్ళపుచ్చక పై చెప్పిన సాధనానుష్ఠానముచేసి జ్ఞానమును బడయవలయును. లేనివారు చదువుకొన్న మూర్ఖులు.

Do not waste precious time. [కాలము వ్యర్థపుచ్చక భగవంతుని భజింపుము.] భాగవతము ద్వితీయస్కంధమం దిట్లు చెప్పబడినది.

సీ॥ వాసుదేవశ్లోకవార్త లాలించుచుఁ
గాల మే పుణ్యుండు గడపుచుండు
నతని యాయువుదక్క నన్యులయాయువు
నుదయాస్తమయముల నుగ్రకరుఁడు
వంచించికొనిపోవు వాఁడడి యెఱుఁగక
జీవింతుఁ బెక్కేండ్లు సిద్ధ మనుచు
నంగనాపుత్త్రగేహారామవిత్తాది
సంసారహేతుకసంగసుఖముఁ
తే॥ దగిలి వర్తింపఁ గాలంబుతఱి యెఱింగి
దండధరకింకరులు వచ్చి తాడనములు
సేసికొనిపోవఁ బుణ్యంబు సేయనైతిఁ
బాపరతి నైతి నని బిట్టు పలువరించు.

మఱియు,

సీ॥ విష్ణుకీర్తనముల విననికర్ణంబులు
కొండలబిలములు కువలయేశ!
చక్రిపద్యంబులఁ జదువని జిహ్వలు
కప్పలజిహ్వలు కౌరవేంద్ర!
శ్రీమనోనాథు నీక్షింపని కన్నులు
నేకిపింఛాక్షులు కీర్తిదయిత!

కమలాక్షుపూజకుఁ గాని హస్తంబులు
శవముహస్తంబులు సత్యవచన!

ఆ॥ హరిపదతులసీదళామోదరతి లేని
ముక్కు పందిముక్కు మునిచరిత్రి
గరుడగమను భజనగతి లేని పదములు
పాదపముల పాదపటల మనఘ!

సీ॥ నారాయణుని దివ్యనామాక్షరములపైఁ
గరఁగని మనములు కఠినశిలలు
మురవైరి కథలకు ముదితాశ్రురోమాంచ
మిళితమై యుండని మేను మొద్దు
చక్రికి మ్రొక్కని జనుని యాదల నున్న
కనకకిరీటంబు కట్టెమోపు
మాధవార్పితముగా మనని మానవుసిరి
వనదుర్గచంద్రికావైభవంబు

ఆ॥ కైటభారిభజన కలిగియుండనివాఁడు
గాలిలోన నుండి కదలు శవము
కమలనాభుపదము గననివారి బ్రతుకు
పసిఁడికాయలోని ప్రాణిబ్రతుకు.

మఱియు ప్రథమస్కంధమందు ఇట్లు చెప్పబడినది.

తే॥ చేతులారంగ శివుని బూజింపఁడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేని
గలుగనేటికి తల్లుల కడుపుచేటు.

జ్ఞేయము—శ్లో॥ 13. ఉత్తమోత్తమమైన మానవజన్మ యెత్తిన తరువాత ఆత్మ తరించుటకు ముఖ్యముగా నెరుగబడ వలసినది 'పరమాత్మవిషయము.' తతిమ్మా విద్యలు పొట్టకూటి కొరకే. Socrates said, "Know thyself. 'నేను' అనునది తెలుసుకొనుటయే వేదాంతవిద్య, 'Man liveth not by bread alone, but by word of God.'

శ్లో॥ దుర్లభో మానుషో దేహః ప్రాణినాం క్షణభంగురః
తత్రాపి దుర్లభం మన్యే వైకుంఠప్రియదర్శనమ్॥

కనుక మనవలన తెలిసికొనబడవలసినవి ఆత్మనుగురించి తెలుపు శాస్త్రములు. నచికేతుడు యమునిదగ్గరకు వెళ్ళి ఆత్మవిచారణ చెప్పవలసినదని అడుగగా, ఆయన 2 అధ్యాయములో చెప్పిన "నైనం ఛిందంతి శస్త్రాణి"అను శ్లోకములలోని అభిప్రాయమే కఠోపనిషత్తులో చెప్పియున్నాడు. అదియే కొన్ని మార్పులతో గీతలో చెప్పబడినది.

రామానుజాచార్యులవారి భాష్యప్రకారము,జ్ఞేయము= శుద్ధజీవుడు. జడప్రకృతి సంబంధము లేనట్టి శుద్ధజీవుడు ఎట్టివాడని తెలియుట జ్ఞానము.

ఆత్మసంగతి పరమాత్మ సంగతి తెలుసుకొనుటవలన మోక్షము కలుగుచున్నది.

దాని లక్షణములు:—(1) అనాది, యెనుబదినాలుగు లక్షలయోనివర్గములకు మూలప్రకృతి, (primordial matter) ఒకటియే. పరమాత్మ, జీవుడు, ప్రకృతి, విశిష్టాద్వైత ద్వైత సిద్ధాంతముల ప్రకారము అనాదులు.

(2) ఇది సత్ అని చెప్పుటకు వీలులేదు. అసత్ అని చెప్పుటకు వీలులేదు. ప్రత్యక్షముగా కనపడు దానిని లేక శబ్ద స్పర్శ రూప రస గంధముల ద్వారా గ్రహించ గలుగు దానిని కాని సత్ అని చెప్పము. ఆత్మ అనువస్తువు 'బుద్ధి గ్రాహ్య మతీంద్రియం' i.e. ఇంద్రియములకు గోచరము కానిది. అంతమాత్రమున లేదనగలమా? ఉన్నది. అది యుండుట వలననే పంచేంద్రియములు పనిచేయుచున్నవి. జ్ఞేయము విచిత్రమైన తత్వము. ప్రాపంచిక విషయముల మాదిరి ఉన్నదని గాని లేదనిగాని అనుటకు వీలులేదు.

ఇంకొకరు, సత్ = జీవాత్మ; అసత్ = జడప్రకృతి అని వ్రాసియున్నారు.

(3) ఆ జ్ఞేయవస్తువునకు ఎక్కడచూచిన చేతులే, కండ్లే కాళ్లే, అనగా పరబ్రహ్మ మెట్టివా డనగా ఆయనకు ప్రతి ప్రదేశములో అన్నియిందిౖయముల వ్యాపారములు జరుగు చున్నవి. పాములకు చక్షుశ్శ్రవములని పేరు. కండ్లు, చెవులు రెండు ఒకటియే. భగవంతునిచే సృష్టింపబడిన ఒక పాములకే అట్లున్నచో పరమాత్మకు అన్నియింద్రియములవ్యాపారములు ప్రతిప్రదేశములో జరుగుట యేమి ఆశ్చర్యము? (He is all eyes and all ears.) మన కళ్ళన్ని ఆయన కళ్ళే. మన కాళ్ళన్ని ఆయన కాళ్ళే. మనవి అనుకొనునవి అన్నియు పరమాత్మవి. మనము పరమాత్మ సొత్తు అనుకొనుట బ్రహ్మ భావన, God-consciousness పోగూడదు.

Bible:—The Son of man has not a stone which he can call his own'. 'Verily, verily thy hairs are

numbered'. మానవుడు తన దనుకొనగలది యొక్క రాయి అయినను లే దనియు అతని వెండ్రుకలు సహితము లెక్క కట్టబడి యున్నవనియు బైబిలులో చెప్పబడినది.

పరమాత్మవాదము—"జీవుడా! నీవు నావాడవు." జీవునివాదన—"నేను నా వాడను" ఈ రెంటికి అనాదినుండియు వాదము జరుగుచున్నదనియు, శ్రీరంగనాథునికి తడిబట్ట అడ్డు కట్టి కర్పూరహారతి యిచ్చుచున్నపుడు ఆయన వాదన సరియైన దని ప్రమాణపూర్తిగా భగవంతుడు తనకు తెలిపినట్లు స్ఫురించిన దని భట్ట రను వైష్ణవభక్తుడు చెప్పియున్నాడు.

(4) ఆ తేజస్సు సకలవస్తువులయందుండి వాటిని ప్రకాశింపజేయుచున్నది. ఇంద్రియములు ప్రకాశింప చేయువాడు ఆయన యైనను ఆయనను తెలుసుకొనుటకు ఇంద్రియము లుపయోగపడకున్నవి. మనము విను ఉపన్యాసములు, పురాణములు పరమాత్మను చేరుటకు దారి చూపించుటయేగాని, పరమాత్మ యిట్టివాడని వర్ణించుటకు ఎట్టివారికి సాధ్యపడదు. పురాణప్రవచనమును చెప్పువారు మతబోధకులు అందఱు sign boards వంటివారు. వాటిని అనుష్ఠించి సాధనముల ప్రకారము నడచుకొనని యెడల కల్పకోటి కాలమైనను నిష్ప్రయోజనము. పరమాత్మ యిట్టివాడనిచెప్పుటకు మనస్సునకు వాక్కునకు మించిపోయిన విషయము - వాక్కుస్థానమును పరమాత్మ ప్రేరేపించుటవలన మనము మాట్లాడుచున్నాము. కాని బ్రహ్మవస్తువును వాగింద్రియముతో వర్ణించవీలులేదు. అందు

వలన బ్రహ్మవస్తు వొక్కటిమాత్రి ముచ్ఛిష్టము కాలేదని రామకృష్ణపరమహంస సెలవిచ్చియున్నాడు.

(5) పరమాత్మ సర్వాంతర్యామి. చరాచరరూపకమైన ఎనుబదినాలుగులక్షల యోనివర్గములలో చేరినఅండజ=గ్రుడ్లలో నుండి వచ్చునట్టి పాములు, పక్షులు మొదలగు వానియందును, స్వేదజ=చెమటలోనుంచి వచ్చునట్టి దోమలు, పేనులు, మున్నగువానియందును, ఉద్భిజ్జ = భూమిని పెళ్ళగించుకొని వచ్చునట్టి వృక్షములు పర్వతములందును, జరాయుజ = తల్లి గర్భమున సంచిలో కొంత కాల ముండి వెలువడునట్టి మనుష్యులు, మృగములు మున్నగువానియందును పరమాత్మ అన్నిటిలోపల బయట మధ్యలో నున్నాడు. దావిడములో ఒక రిట్లు వ్రాసియున్నారు. "పరమశివా! నీకు అన్నిశక్తులున్నవని వేదములు పురాణములు చెప్పుచున్నవి. కాని నీకు ఒక శక్తిలేదు. (నీవు ఒకప్రదేశము చూపి) ఇచట లేకుండాపో-అనిన పోజాలవు" అని సొగసుగా పరమాత్మ సర్వాంతర్యామి అని తెలిపియున్నారు. మనము అజ్ఞానమను అంధకారములో మునిగియున్నాము. గనుక మనకు ఈ విషయము గోచరించదు. ప్రహ్లాదునకు, త్యాగరాజునకు, కబీరునకు, రామదాసునకు,తదితరభక్తాగ్రేసరులకు అంతట పరమాత్మ గోచర మగుచుండెను.

(6) ఆ పరమాత్మ మనకంటికి గోచరింపని బహుసూక్ష్మమైన వస్తువు. He is subtler than the subtlest. Therefore you cannot conceive Him.

(7) 'దూరస్థం చాన్తికే చ తత్' పరమాత్మ చాలా దూరములో నున్నాడు. చాల దగ్గర నున్నాడు. Divinity manifests where contradictions meet. ఇంద్రియనిగ్రహము మనోనిగ్రహము కలిగినవారికి శుద్ధజీవుడుగాని, పరమాత్మకాని దగ్గరలో నున్నాడు. వారికి బ్రహ్మవస్తువు ఈశరీరములోనే కానవచ్చుచున్నది. అట్టి యింద్రియ నిగ్రహము మనోనిగ్రహము లేనివారికి పరమాత్మ చాలా దూరములో నున్నాడు. డబ్బులేనివారలు, శరీరములో ఆరోగ్యము లేనివారలు, ఈ శరీరములోనే కాశీ రామేశ్వరములు, ఇంద్రియ మనోనిగ్రహమువలన చూడవచ్చును! అట్టి నిగ్రహము లేని యెడల మనము కాశీ రామేశ్వరములకు వెళ్ళినను ప్రయోజనములేదు. ఉన్నతావులలోనే నీయందలి కుళ్ళు పోగొట్టుకొనుము. పెట్టెలోని చిమటను దులిపి పారవేయకుండా యేదేశమునకు ఆ పెట్టెను తీసుకొనిపోయినను అచట ఆ పెట్టె తెరవగానే చిమట కానవచ్చుచున్నది.

శ్లో॥ "అంతస్థ మాత్మాన మజం న దృష్ట్వా
భ్రమంతి మూఢా గిరిగహ్వరేషు"

అని చెప్పబడినది. అద్దమును బాగుచేసికొనక యెన్ని సార్లు అద్దములో చూచినను మొగము కానరాదు. నీయందు పరమాత్మ ఉన్నాడని తెలుసుకొనకుండ, డబ్బు ఖర్చుపెట్టి, శ్రమపడి కొండలు గుహలు తిరిగిన ప్రయోజనములేదు. కస్తూరి మృగము తనలో నుండి వచ్చు సువాసన యెచటనుండి వచ్చుచున్నదో తెలియక, దానిని తెలిసికొనుటకై పుట్టపుట్టకు గుట్ట

గుట్టకు తిరుగుచున్నదని రామకృష్ణపరమహంస చక్కని ఉదాహరణము ఇచ్చియున్నారు. శంకరాచార్యులవారు "స్వకంఠాభరణం యథా" అని మెడలో వస్తువు మరచిపోయి యిల్లిల్లు తిరిగివెతకుచున్న సామెత చెప్పియున్నారు. అట్లే గొల్లపిల్లవాడు మేకను మెడపై వేసుకొనిమఱచి పోయినదనియేడ్చుచున్నాడు. కనుక పరమాత్మ మనయందున్నాడని తెలుసుకొని అనుష్ఠానము వలన మనోనిగ్రహము సంపాదించినచో బ్రహ్మభావన, మనము ఎచట నున్నామో అచటనే పొందనగును.

(8) బ్రహ్మవస్తువు వెలుతురు కలిగించుచున్నది. దాని వెలుతురు, వెలుతురును కలిగించు ప్రాకృతిక వస్తువుకన్న యెక్కువ అయినది. సూర్యుని తేజస్సు బ్రహ్మ తేజస్సులో కోటిలో నొక భాగము లేదు. ఆ తేజస్సు యావత్తు పరమాత్మ వలన కలిగినదేయని 15 వ అధ్యాయములో చెప్పియున్నాడు. సూర్యుడు, చంద్రుడు, దీపమువలన కలుగు వెలుతురు ప్రకృతి సంబంధమైన చీకటిని పోగొట్టి ప్రపంచమందలి వస్తువులను చూచుటకు అవకాశ మిచ్చుచున్నవి. పరమాత్మ తేజస్సు ఎటువంటిది అనగా ఉత్తచీకటిని పోగొట్టునదిగాక అజ్ఞానాంధకారమును పోగొట్టి జ్ఞానమును కలుగ చేయుచున్నది. తేజఃపుంజమైన సూర్యచంద్రాదులకు అట్టి శక్తిలేదు.

(9) తమసః పర ముచ్యతే=ప్రకృతికి అతీతమైనది.

(10) జ్ఞానం జ్ఞేయం = Fountain source of all knowledge. జ్ఞానమునకు ఉత్పత్తిస్థానము.

(11) జ్ఞానగమ్యం = By wisdom you can attain Brahmabhavam. జ్ఞానమువలన బ్రహ్మభావన బడయునగును.

(12) హృది సర్వస్య ధిష్ఠితం=ఆయన అందరి హృదయమందున్నాడు. హృదయములో నున్నట్లు ధ్యానము చేయవలయును. He is everywhere. The heart is his head quarters. హృదయము సరిగా నున్నగాని శరీరమందలి అవయవములు పనిచేయవు. అందువలన అది Head-quarters గా నియమింపబడినది.

మరియొక అభిప్రాయము:— You must have a kind heart. జీవకారుణ్యము, భూతదయ, పశ్చాత్తాపము, నున్నచో మానవునకు పరమాత్మ సాక్షాత్కారము కలుగుచున్నది. Divinity manifests itself in people who have a good and pure heart.

శ్లో॥ 23-24. ఇట్టిపరమాత్మను 'జీవుడుపోయిచేరవల'యుననిన నేది మార్గము ? మార్గము లనేకము లున్నవి.

(1) ధ్యానయోగము = రాజయోగము. This is for those who can exercise good concentration and meditation. ఇది యేకాగ్రత కలిగి ధ్యానముచేయు శక్తి గల వారలకేగాని సర్వసాధారణుల కుపయోగించదు. సాధారణ మానవులకు నిద్రతెప్పించు వస్తువులు:—(1) స్వభార్య, (2) పుస్తకము (3) జపము. నిద్రపోగొట్టు వస్తువులు:— (1) పరస్త్రీ, (2) ద్యూతము, (3) చౌర్యము.

(2) రాజయోగము:—for persons of psychic temperament (ఇది మనోనిగ్రహము కలవారలకు.)

(3) జ్ఞానయోగము:—for intellectual people (ఇది బుద్ధివికాసము కలవారలకు.)

(4) కర్మమార్గము:—for persons with physical strength (ఉపవాసములు, సూర్యనమస్కారములు, యజ్ఞయాగములు జేయ సమర్థత కలిగిన బలశాలురకు.)

(5) భక్తిమార్గము:—for persons of emotional temperament, this is the easiest course.

"ధ్యేయో నారాయణ స్సదా". ఇది మిక్కిలి సులభమార్గము.

(6) శ్రవణము:— వినుట, గోపికాగీతలలో:—

"తవ కథామృతం తప్తజీవనం, కవిభి రీడితమ్ కల్మషాపహం, శ్రవణమంగళం శ్రీమ దాతతం, భువి గృణంతి యే భూరిదా జనాః."

మధ్వాచార్యులుగారు భాగవతాది గ్రంథములు సతతము పఠనజేయుటవలన జన్మ తరించునని వ్రాసిరి. శుకమహర్షి వంటివానికిగాని భాగవతార్థము తెలియదు.

రాధ is the embodiment of ఆరాధన. ఆమెయందు భగవద్భక్తి మూర్తీభవించినది.

Whatever may be your position on the circumference, catch hold of the nearest radius and proceed and ultimately you reach the centre of the

circle. అనగా, నీవు చక్రముపై నెచట నున్నను, నీకు సమీపమున నున్న అడ్డగీతను పట్టుకొని పోయినచో కేంద్రస్థానము జేరగలవు.

అన్ని మతములు అన్నియోగములు సమరసపరచునది గీత. Vivekananda said "It is the universal scripture."

శ్లో॥ 27. ఏది యేది పుట్టుచున్నదో జడపదార్థముగా కనుపడుచున్నను ప్రతిదానిలో చైతన్య మున్నది. జడవస్తువేది లేదని బోసు కనిపెట్టియున్న విషయము ఈ శ్లోకమందున్నది. చెట్లయందు, పర్వతములయందు అన్నిటియందు (Vitality) చైతన్యము ఉన్నది. ఉత్తమజన్మ మెత్తి కాలము వృథాపరచినవారు అధోగతిపాలై, తక్కువజన్మల నెత్తుదురు. చైతన్యము లేని జడపదార్థము లేదు. అన్ని వస్తువులను నేను చైతన్యయుతములుగా చేయుచున్నాను.

శ్లో॥ 35. శరీరము, ఆత్మ, పరమాత్మ వీనిసంబంధము తెలుసుకొనువారు ఐహికసుఖములు అనుభవించి కడపట మోక్షము చెందుదురు. భూత ప్రకృతి మోక్షంచ=ప్రకృతిలో నుంచి విడుదల, రాబోవు అధ్యాయముయొక్క సూచన.

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే క్షేత్రక్షేత్రజ్ఞ
విభాగయోగో నామ త్రయోదశోఽధ్యాయః
సంపూర్ణః

# శ్రీ భగవద్గీతోపన్యాసములు

## 14 వ అధ్యాయము.

## గుణత్రయ విభాగయోగము

శ్లో॥ 1. ప్రకృతి యేవిధముగా జీవుని కట్టివేయుచున్నది యీ అధ్యాయములో చెప్పబడియున్నది. మునీశ్వరులుకూడ దేనిని తెలుసుకొని మోక్షముచెందిరో అట్టిదానిని; నీకు చెప్పు చున్నాను. శ్రద్ధతో వినుము.

శ్లో॥ 2. జ్ఞానము పొందినవారికి మోక్షము కలుగును. వారు నాదగ్గరకు వచ్చి చేరుచున్నారు. వారు జననమరణము లకు సృష్టిసంహారములకు అతీతు లగుచున్నారు.

శ్లో॥ 3. ప్రపంచములో ప్రతివస్తువుయొక్క ఉత్పత్తికి స్త్రీ పురుషుల అంశములు రెండుండవలయును. అటులే యీ ప్రపంచమునకు తల్లిదండ్రు లుండవలయును.

నేను తండ్రిని. మాయ లేక ప్రకృతి తల్లివంటిది. పురుషుడైన నేను స్త్రీతత్వమైన ప్రకృతిలో గర్భాధానముచేసి by injecting divine energy సర్వభూతములను పుట్టించు చున్నాను. i.e. అండజ స్వేదజ ఉద్భిజ్జ జరాయుజములగు 84 లక్షల యోనివర్గములు ప్రకృతిలోనుండి పరమాత్మ తేజస్సువల్ల బయటపడుచున్నవి. Union between matter and spirit-

మధ్వ:—మనుష్యుల యిష్టప్రకారము ఎంత ప్రియత్నముచేసినను సంతానముకలుగదు. పరమాత్మఅనుగ్రహము కావలెను. శ్రీ మధ్వాచార్యులవారు చెప్పునది యేమనగా ఎచట సంతానము కలిగినను లక్ష్మీనారాయణ సంభోగము వలన నని తెలియవలయును. వారి అనుగ్రహము లేనిదే సంతానము కలుగదు.

ప్రీతినిమిషము ప్రకృతిపురుష సంయోగము కలుగుచున్నదని తెలుపుటకు గుళ్ళలో నిమిషనిమిషమునకు దేవునికి పెండ్లిండ్లు చేయుచున్నారు. ఈ సంయోగమువలన కలిగెడు సంతానముయొక్క భావివృద్ధికి తల్లిదండ్రిలలో ఒకరు అనుకూలము, ఒకరు ప్రతికూలము. తండ్రి తనసంతానమును విద్యకొరకు ద్రివ్యార్జనకొరకు, ఎక్కడ పట్టిన అక్కడకు పంపుచున్నాడు. తల్లి బిడ్డలను విడనాడక వారిపురోభివృద్ధికి ప్రతిబంధకము కలిగించును. అట్లే జీవుల అభివృద్ధికి తండ్రియగు పరమాత్మ అనుకూలుడేగాని, తల్లియగు ప్రకృతి ప్రతికూలమై ఆత్మ పరమాత్మవిచారణ తెలిసికొననియ్యక, జ్ఞానము కలుగకుండ జీవులను సంసారములో కట్టిపెట్టుచున్నది. e. g. త్రాటితో దూడను గుంజకు కట్టినట్లు ప్రకృతి (మాయ) ముప్పిరి త్రాడు వంటిది.

అది త్రిగుణాత్మికమాయ — సత్వగుణము, రజోగుణము, తమోగుణము. (గుణము అను శబ్దమునకు త్రాడు అనియు అర్థము కలదు.) జీవుడు పరమాత్మను చేరి సుఖపడుట అతనికి జన్మహక్కు. కాని యీ మూడుత్రాళ్ళు జీవుని పైకి

పోనియ్యకుండ కట్టిపెట్టుచున్నవి. సత్వగుణము [తెల్లనిది], రజోగుణము [ఎర్రనిది], తమోగుణము, [నల్లనిది], ఏగుణము ప్రబలముగా నుండునో అది వ్యవహారముచేయును. కాని అందరికి ఈ మూడుగుణములు కలవు.

[1] సత్వగుణము ఏరీతిగా బంధించుచున్నది? అన్ని యింద్రియములు చక్కగానుండి ప్రపంచిక వస్తువులను అనుభవించుటవలన, అనేక గ్రంథములు చదివి జ్ఞానము పొందుట వలన సుఖము చెందించి జీవుని కట్టివేయుచున్నది. అట్టి సుఖము జ్ఞానము జీవుని బంధించునవి. ఏలనన, మనము చనిపోయినతరువాత ఈసుఖము కలదో లేదో యని యిదే బాగుగా నున్నదని మనస్సునకు తోచునట్లు చేసి సంసారమందలి బంధము గట్టిపరచుచున్నది. ప్రపంచమందు మోహ మెక్కువై పరమాత్మ సాన్నిధ్యము దూరమగుచున్నది.

[2] రజోగుణము- "రాగాత్మకం విద్ధి" ఉన్నదానితో తృప్తిపడనివ్వదు. [శంకరులవారు వ్రాసిన ద్వాదశమంజరికా స్తోత్రము లేక మోహముద్గరము చదివిన మోహము పోవును] వయస్సు ముదిరిన కొద్ది స్త్రీలయందు, ధనమందు వాంఛ తగ్గించుకోవలయును. "వార్ధకే మునివృత్తీనాం" అని రఘువంశములో చెప్పబడినది. రజోగుణము పేరాసను కలిగించుచున్నది. Greed and lust are the manifestations of Rajogunam.

(3) తమోగుణము—"అజ్ఞానజం విద్ధి"—ఆత్మ విచారణ పరమాత్మ విచారణ యేమాత్రము మనస్సున చొర

నివ్వదు. తామసుడు, తినుటకు తిండి కట్టుటకు బట్ట యున్న తృప్తిపడి శరీరమే శాశ్వత మని యెంచి పాపపుణ్యముల విచారించడు. ఎప్పుడు చూచిన తమోగుణము ప్రధానముగా కలవారియందు నిద్ర, ప్రమాదము, (ఒకపనిచేయుటకు పోయి మరొకటి చేయుట,) సంశయజ్ఞానము, [ఎంతచెప్పినను, నమ్మక సందేహపడుచుండుట]. విరుద్ధజ్ఞానము, తలక్రిందులుగా అర్థము చేసికొనుట, మున్నగు లక్షణములు కన్పట్టును. సత్వగుణము ఉద్రేకముగా నున్నప్పుడు శరీరము చాలించువాడు ఉత్తమమైన జన్మపొందుచున్నాడు. రజోగుణము ఉద్రేకముగా ఉన్నప్పుడు చనిపోయినయెడల మధ్యమయోనిలో ప్రవేశించి (మానవజన్మమెత్తి) ఆ సంబంధమైన పనులు చేయును. తమోగుణము ప్రధానముగా నున్నప్పుడు శరీరము చాలించిన యెడల మూఢయోనిలో పుట్టి కుక్క, పంది, చెట్లు, చేమలుగా పుట్టును.

In the first case there is promotion, in the second case there is neither promotion nor depromotion, and in the last, depromotion. మొదటి తరగతి వారికి ప్రమోషన్ ఇవ్వబడుచున్నది. రెండవ తరగతి వారికి ప్రమోషన్‌గాని డిప్రమోషన్‌గాని లేదు. మూడవ తరగతి వారికి డిప్రమోషన్ కలుగుచున్నది.

భాగవతము ఏకాదశస్కంధములో పరమాత్మ ఈగుణముల విషయమై యెక్కువగా చెప్పియున్నాడు.

జీవుడు త్రిగుణాతీతుడైనగాని మోక్షము లభించదు. సత్వగుణము is only a sign-board to reach Paramatma

Unless you rise even above it, you can't attain Mukti- సత్త్వగుణము పరమాత్మకు మార్గముచూపునేగాని మోక్ష మివ్వజాలదు. త్రిగుణాతీతునికి మోక్షము కలుగును. త్రిగుణాతీతుడగుట అనగా నేమని అర్జునుడు అడుగగా, కొన్ని లక్షణములు సంపాదించవలయునని పరమాత్మ చెప్పెను. అవి యేవనగా,

త్రిగుణాతీతుని లక్షములు:—

(1) ఉదాసీనుడు—He is perfectly indifferent to all the worldly things. He never takes sides. అందరియందు బ్రహ్మస్వరూపము గ్రహించి మనస్సు నెమ్మదిగా నుంచుకొని, ప్రతివస్తువునందు మంచియే గమనించును. e. g. బోగముదానియందు మాతృభావము (దాని పిల్లలకు అది తల్లి అను అంశమే) గమనించుచున్నాడు. రామకృష్ణ పరమహంస యిచ్చిన ఉదాహరణము, i. e. అశుద్ధజీవునకు చెడుపే కాన వచ్చును. ఈగ శరీరమంతయు వదలిపెట్టి అశుద్ధమైన నెత్తురు, చీము గల కురుపు అంతర్భాగమం దుండగా దానిని నాకుటకు అచట ప్రవేశించుచున్నది. "యద్భావం తద్భవతి" యోగ్యుడు జల్లెడమాదిరి ఉండవలయును. మంచిని గ్రహించి, రాయి రప్పను పైపైన వదలి వేయవలయును.

(2) సుఖదుఃఖములను సమానముగా భావించును.

(3) సమలోష్టాశ్మకాంచనః—బంగారును, మట్టిపెళ్ళను, రాయిని ఒకమాదిరిగా చూచుచున్నాడు. ఈమూడు గుణములతో గూడినట్టి మాయను దాటుటకు పరమాత్మను భజించ

వలయును. You must worship His lotus feet with unflinching and whole - hearted devotion. భక్తి లేకుండ నెంత కర్మానుష్ఠానము చేసినను లాభము లేదు. (శ్లో॥26). నేను శాశ్వతమయిన ధర్మస్వరూపిని, గనుక నా అనుగ్రహము పొందవలె ననిన వారివారి ధర్మము నెరవేర్చవలయును. Heaven helps those who help themselves- ప్రకృతిని గుప్పిట నుంచుకొని, నన్ను వారి వారి వర్ణాశ్రమధర్మములు నెరవేర్చుచు భజించిన ధర్మస్వరూపినైయెనట్టి నా సాన్నిధ్యము చేరి మోక్షసామ్రాజ్యమును పొందగలరు. [శ్లో. 27].

రామకృష్ణ పరమహంసగారిచ్చిన ఉదాహరణము:— ఒకడు మూట పట్టుకొని పోవుచుండగా ముగ్గురు దొంగలు ఎదురై వాని మూట కాజేయ వలయునని తీర్మానించుకొనిరి. కాని, ఒకడు ఆ బాటసారిని చంపి నూతిలో వేయవలయునని, మరొకడు ప్రాణముతీయకుండ కాళ్ళుచేతులు కట్టివేయవలయునని, మూడవవాడు మూటతీసికొని పొలిమేరవరకు తీసుకొనిపోయి వదలి తప్పించుకొనుట మంచిది అని అనుకొనిరి. జీవుడు జ్ఞానము ఆనందము అను మూట తీసికొని సంసారము అను అరణ్యములో తిరుగుచున్నాడు. సత్త్వ రజస్తమోగుణములు పై ముగ్గురు దొంగలవంటివి. చంపుతా మనుకొను దొంగ = తమోగుణము. వీనిని స్వరూపనాశనము చేయుచున్నది. బంధించుదాము, ప్రాణము తీయవద్దు, ఎవరైన వచ్చి వదలిపెట్టి పోనిమ్ము అనుకొను దొంగ = రజోగుణము. ఇట్టి జీవుడు తరించుటకు కొన్ని అవకాశములు

కలవు. సత్వగుణము = పొలిమేరవరకు వెళ్లిన వానికి ఊరు చూపి తప్పుకొను దొంగ ఉన్నసొత్తు కొట్టుకొనిపోయినను ఉత్తరోత్తర పరమాత్మను చెందుటకు దారి చూపుచున్నది.

రెండవ ఉదాహరణము—మూడుబొమ్మలు.

1. పంచదారతోగాని లేక ఉప్పుతోగాని చేయబడ్డ బొమ్మ.
2. ఒకటి గుడ్డతో చేయబడినది.
3. ఒకటి రాతితో చేయబడ్డ బొమ్మ.

మూడుకలిసి సముద్రస్నానమునకు బయలుదేరిపోవుచు తూకము వేసుకొనెను. పంచదార బొమ్మ 5 సేర్లు, గుడ్డ బొమ్మ 10 శేర్లు, రాతిబొమ్మ 50 శేర్లు ఉండెను. మూడు మునిగెను. రెండు బయటికి వచ్చెను. మూడవ బొమ్మ కానరా లేదు. ఎంత వెదకినను కానరాదు. అది, పంచదార లేక ఉప్పు బొమ్మ, కరిగిపోయినది. సాత్వికుడు మునిగినతరువాత పరమాత్మతో ఐక్యమగుచున్నాడు. He loses his individuality and becomes assimilated with Divinity. స్నానము చేసిన తరువాత గుడ్డబొమ్మ తడివల్ల బరువ ఎక్కువ అయినది. రాజసుడు బట్ట నీరు పీల్చినట్టు మంచి సహవాసము శ్రవణము మున్నగు వాటివలన జ్ఞానమును బడసి దినదినాభివృద్ధి పొందుచున్నాడు. మూడవ బొమ్మ తామసుడు. రాతితో చేయబడి ఒక్కచుక్క నీటిని పీల్చలేదు. తామసులైన వారు "అచ్చపు చీకటింబడి" తరించుట అసంభవము.

ఉ॥ అచ్చపుఁజీఁకటిం బడి గృహవ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచుఁ బుట్టుచుం మరలఁ జర్వితచర్వణు లైనవారికిం
జెచ్చెరఁ బుట్టునే పరులు సెప్పిననైన నిజేచ్ఛనైన నే
మిచ్చిననైనఁ గానలకు నేగిననైన హరిప్రబోధముల్.

అని ప్రహ్లాదుడు తండ్రితో చెప్పియున్నాడు.

(భాగవతము, సప్తమస్కంధము)

పరమాత్మ ప్రత్యేకానుగ్రహము వచ్చి special clemency చూపినగాని తామసులు ఈ సంసారబంధమునుండి విడుదల కాజాలరు.

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే గుణత్రయ
విభాగయోగోనామ చతుర్దశోధ్యాయః
సంపూర్ణః



# శ్రీ భగవద్గీతోపన్యాసములు



## 15 వ అధ్యాయము.

## పురుషోత్తమప్రాప్తియోగము

ఇది అన్ని అధ్యాయములలో గొప్పది. ఏలననగా -

1. శిష్యుడు ఏమియుఅడుగకుండా గురువు తనంతటతానే అపారప్రేమతో ఆద్యంతమును చెప్పియున్నాడు. 7,9,15,16, అధ్యాయములు అట్టివి.

2. వీనిలో 15వ అధ్యాయము ముఖ్యమెట్లన:—ఇందు శ్లోకములసంఖ్య తక్కువ. ఇది భావగర్భితమైనది. 12 వ అధ్యాయములోకూడ 20 శ్లోకములే కాని ఆరంభములో అర్జునుని ప్రశ్న యున్నది.

3. ఈఅధ్యాయములోకొన్నిబీజాక్షరములిమిడియున్నవి.

4. ఈ అధ్యాయము కావ్యసరళిగా ఉపమానోపమేయములతో పరమాత్మ చెప్పియున్నాడు. Poetry in philosophy గనుక గీతలోని తక్కిన 17 అధ్యాయముల కంటె ఈ అధ్యాయము గొప్పది. తమాషాగా దీనిని కూటి అధ్యాయము అని పిలిచెదరు. ఏలననగా: విస్తరిముందు కూర్చొని వడ్డన చేయు లోపల సులభముగా దీనిని పఠింపవచ్చును.

ఈ అధ్యాయములో సంసారమును ఒక వృక్షముగా పరమాత్మ వర్ణించుచున్నాడు. పాశ్చాత్యులుకూడ ఈ ఉపమానమును ప్రయోగించినారు. Bible refers to it as "Fig tree." Grecian mythological works లో కూడా "Igdrassy" అని ప్రపంచమును చెట్టుగా వర్ణించినారు.

శ్లో॥ 1. ఈ జగత్తు ఒక వృక్షము వంటిది. ఒక చిన్న విత్తనమునుండి పెద్దచెట్టు వచ్చినట్లు ఒక మూలపురుషునినుండి సంసారము వృద్ధిపొందుచున్నది. ఈ జగత్ వృక్షము విచిత్రమైనది. దీనికి వేరు మీదను, శాఖలు క్రిందను నున్నవి. (మామూలుగా నుండు చెట్లు అధోమూలము, ఊర్ధ్వశాఖ కలిగినవి). అందరికి సౌఖ్యము కలుగజేయును. తలక్రిందుగా నున్న చెట్లు రాకపోకలకు బండ్లకు బాటసారులకు ప్రతిబంధకము. అట్లే యీ సంసార మను చెట్టు పరమాత్మ యను గమ్యస్థానము చేరనివ్వక అడ్డుతగులునట్టిది.

చెరువుకట్టమీద నున్న వృక్షము నీటియందు ప్రతిబింబించునపుడు తలక్రిందులుగా కనపడుచున్నది. కనుక అద్వైత వ్యాఖ్యానము ప్రకారము అది అట్లు కనపడుచున్నదే కాని దానికి నిశ్చయమైన existence లేదు. ఇది మిథ్య; అశాశ్వతమైనది. ప్రపంచము ఉన్నట్లు కనుపడుచున్నదే కాని, యిది ఉత్తది. 'బ్రహ్మ సత్యం జగన్మిథ్య' అని ఈ శ్లోకము తెలుపుచున్నది అని అద్వైతవ్యాఖ్యానకారుల అభిప్రాయము.

మధుసూదన సరస్వతిగారు వ్రాసినది యేమనగా, గాలి వలన త్రోయబడిన చెట్టు నది కట్టక్రింద నడచువారికి తల క్రిందుగా కానవచ్చును. ఇది విపరీతస్థితి.

మరియొకరు వ్రాసినది—ఈ జగత్తునకు మూలస్థానమైన పరబ్రహ్మ పైన నున్నాడు. పరమాత్మవలన సృష్టింపబడిన వస్తువులు అన్ని క్రింద నున్నవి. పరమాత్మ ఇంద్రియములకు అతీతుడు. సులభముగా కానరాడు. సృష్టిలోని వస్తువు లన్నియు సులభముగా అందరికి గోచర మగుచున్నవి.

భగవంతుని సంగతినిగురించి మాట్లాడునపుడు మనకు దృష్టి పైకిపోయి చెయ్యి పైకి చూపుచున్నాము. ప్రపంచము సంగతి మాట్లాడునపుడు క్రిందికి చూపుచున్నాము.

పరమాత్మ మూలము, ఏకము. దానినుండి పుట్టిన శాఖోపశాఖలు అనేకములు.

ఈ వృక్షము అశ్వత్థము = రావిచెట్టు అని చెప్పినాడు. దాని పుల్లలు హోమములలో ఉపయోగపడునేగాని ఆ చెట్టు నిష్ప్రయోజనమైనది. అట్లే యీ సంసారవృక్షము పైకి గొప్పగా కానవచ్చినను నిరుపయోగమైనది. ఇంకొక అర్థము ఏమనగా, అశ్వత్థము=రేపు లేక మరియొక క్షణములో నుండనిది అని వ్యుత్పత్త్యర్థము. ప్రపంచము అశాశ్వత మైనది. "ప్రాణినాం క్షణభంగురః" నీశరీరము, దార పుత్రాదులు, బంధువులు, ధనధాన్యములు, వస్తువాహనము లన్నియు అశాశ్వతములని గుర్తెరుంగుము.

"ప్రాహు రవ్యయం"=నాశనరహితమైనది అని ప్రపంచమునుగురించి చెప్పినాడు. ఇది యెట్లనగా ప్రవాహరూపేణ-నీళ్ళు కాలువలో పారుమాదిరిగా క్రొత్తనీరు వచ్చి ప్రాతనీరు పోవుచున్నను నది లేక కాలువ శాశ్వత మని యెంచబడుచున్నది. అట్లే వ్యక్తులు పోవుచున్నను స్థలము మారిపోవుచున్నను ప్రపంచమునకు నాశనము లేదు.

వృక్షమునకు ఆకులవలన గౌరవము ఏర్పడుచున్నది. అట్లే ఈ జగమను వృక్షమునకు వేదములు ఆకులు. అనగా వేదములు జదివి సంసారములో కష్టములులేకుండ చేసికొనవలయును. ఇంకొకరు చెప్పునది యేమన, శాస్త్రములు చదివినవాడు ఇహపరసుఖముల పొందును. చెప్పులు తొడుగుకొన్నవాడు హాయిగా రాళ్ళు రప్పలు తగులకుండ గమ్యస్థానమునకు నడచిపోవుచున్నట్లు, వేదములు శాస్త్రములు చదివి కర్మానుష్ఠానము చేయువాడు పరమాత్మసాన్నిధ్యము సులభముగా చేరగలడు.

"యస్తం వేద స వేదవిత్" ప్రపంచము అశాశ్వతమని, పరమాత్మ శాశ్వతమని తెలియవలెను. ఈసంగతి తెలియనివాడు వేదశాస్త్రపురాణాదులు చదివినను నిష్ప్రయోజనము. చందనపుకట్టెను మోసికొనిపోవు గాడిదకు దాని వాసన యేమి తెలియును?

శ్లో॥ 2. ఈ చెట్టునకు కొన్ని కొమ్మలు పైకి ఉన్నవి. జ్యోతిష్టోమము మున్నగు యాగాదులు చేసిన గొప్ప

సుఖము పొందవచ్చును, దేవతలై పుట్టవచ్చును. కాని, "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" అనగా ఆ పుణ్యము అయిపోయినవెంటనే తిరిగి మాతృగర్భ ప్రవేశము చెందవలసినదే. పైలోకములు కొమ్మల వంటివి. అవి శాశ్వతమైన సుఖమివ్వవు గనుక పరమాత్మనే భజింపుము. తిరిగి మాతృగర్భ ప్రవేశము కలుగదు.

"గుణ...ప్రవాళాః"... ఈ చెట్టునకు నీరు సత్త్వ రజస్తమోగుణములు. ఇవి సంసారమును అభివృద్ధిపరచునవి. వీటిని దాటినగాని మోక్షమురాదు. శబ్ద స్పర్శ రూప రస గంధములు ఈ చెట్టునకు చిగుళ్ళవంటివి. నిషేధింపబడిన వస్తువులు అలవాటుపడిన, వాటిని మానుట కష్టము. e.g. పరస్త్రీ గమనము, జూదము, త్రాగుడు. అగ్నిహోత్రమునకు కావలసిన పదార్థములు నెయ్యి, పెట్రోలు ఇచ్చిన చల్లారదు కాని జ్వాల యెక్కువగుచున్నది. మట్టిపోసిన చల్లారుచున్నది. అట్లే మనస్సునకు చెడ్డకోరిక గలిగినప్పుడు దానిపై మట్టిపోసి అణగగొట్టవలయును. మొక్కగా నుండగానే చెడుకోరికలను త్రుంచివేయనిచో అవి ముదిరిపోవును. ఇంద్రియములను విషయములతో కలియనీయకుండ వేరుచేయవలయును.

"అధశ్చ మూలాని"—మూలము క్రింద నున్నది. పరబ్రహ్మము తనవలన సృష్టింపబడిన వస్తువులన్నిటిలోనున్నాడు.

He is intracosmic as well as extracosmic. Do not think that He is somewhere beyond the

clouds. He is everywhere in this creation inside and outside every object.

"కర్మానుబన్ధీని మనుష్యలోకే"—జగద్వృక్షము మన సంసారము. 'చిత్తమేవ హి సంసారం తత్ప్రయత్నేన శోధయేత్' దారపుత్రాదులు ఈ సంసారములో ప్రతిబంధకములు కారు. మనస్సే ప్రతిబంధకమగుచున్నది. భార్యబిడ్డలు లేని బ్రహ్మచారి, తనకు వివాహము కాలేదని దిగులుపడువాడు, సంసారవృక్షములో బంధింపబడినవాడు. అంటిఅంటకుండ చింతకాయగుల్లమాదిరి detach అయియుండువాడు సంసార వృక్షమునుండి దూరస్థుడగుచున్నాడు. ఆస్ట్రేలియాదేశములో ఘోరమైన అరణ్యములలో కొన్ని చెట్లున్నవని, అవి మనుష్యుని ఆకర్షించి రక్తము పీల్చి మాంసకండరముల భుజించి, ఎముకల వదలివేయుచున్నవని చెప్పెదరు. అట్లే యీ సంసారము మనలను పీల్చి పిప్పిచేయుచున్నది. సంసార మనగా శరీరముతో జీవుడు సంబంధపడియుండుటయే.

When you realise that all the world is a stage and we are all actors thereon, and discharge your duties with a sense of detachment, these fetters do not bind you at all. The Jiva has come into this human body on account of the Karma in the previous birth.

మొట్టమొదట కర్మ యెట్లు వచ్చినది? జీవత్వ మెట్లు వచ్చినది? అని కొందరు ప్రశ్నించుచున్నారు. There is a logical fallacy in this question. Time has no beginning, so also Karma has no beginning. ఆ ప్రశ్న పొర

పాటు. కాలమునకు ఆదియెట్లులేదో అదేరీతిగా కర్మకు ఆదిలేదు.

అనాది వస్తువులు ఆరు—వేదము, కర్మ, పరమాత్మ, జీవుడు, మాయ, కాలము. వీనికి మొదలు అనునది లేదు. Kanty said, 'Space and time are *apricri* forms of the mind."

బీజాంకురన్యాయము—చెట్టు ముందా, విత్తు ముందా? అని భగీరథ ప్రయత్నము చేసినను జవాబు ఇవ్వ వలను పడదు. శంకరాచార్యులవారు భవరోగ మెట్లు వచ్చినదని కనుగొనుటకు ఎంత శ్రమపడినను ప్రయోజనము లేదని, జ్ఞాన, భక్తిమార్గమువలన దానిని పోగొట్టుకొను మని సెల విచ్చిరి. రోగమునకు, అగ్నికి మూలకారణములు వెదకుచు నీ ఆయుర్దాయము వృథాగా వెళ్ళపుచ్చక కర్మానుష్ఠానముచేసి భగవత్సాన్నిధ్యము చేరుము. బ్రహ్మసాక్షాత్కారము ఎపుడు కలుగునో అప్పుడే అన్నిసందేహములు నశించును.

శ్లో॥ 3. నానావిధములైన కర్మలు చేయుటకు మానవ జన్మ మిక్కిలి ఉపయోగకరమైనది. కర్మశరీరము మానవ శరీరము. పశుపక్ష్యాదులు ప్రాచీనకర్మను అనుభవించు చున్నవి. దేవతలుకూడ పూర్వకర్మను అనుభవించు చున్నారు. వారు క్రొత్తగా చేయునది యేమి లేదు. కనుక దేవతలుకూడ మానవజన్మ కాంక్షించెదరు. The man is the architect of his own fortune. కర్మానుష్ఠానము వలన లోగడ కర్మకాఠిన్యమును తగ్గించుకొని ఉత్తమగతి పొంద వచ్చును. జగత్తను వృక్షమునకు ఆది లేదు. అంతము లేదు. జైలులోనుండి కొందరు విడుదల అగుచున్నారు; కొందరు

ప్రవేశించుచున్నారు. జైలు శాశ్వతమే. అటులే సంసారవృక్షము అనాదిగా అనంతముగా నుండును. శ్రీరామకృష్ణపరమహంసగా రిచ్చిన ఉదాహరణము గాలిపటము వదలిపెట్టుట అనాదిగా అనంతముగా నున్నది. కొన్ని పటములు చినిగిపోవుచున్నవి. కొన్ని మాంజావల్ల కోయబడుచున్నవి. కొన్ని తిరిగి చేరుచున్నవి. పిల్లల ఆటలు మొదటినుంచి ఉన్నవే. అటులే మాయ అను సూత్రముతో పరమాత్మ ఈ జీవులను గాలిపటముల మాదిరి ఆడించుచున్నాడు. కొందరు గమ్యస్థానము చేరుచున్నారు. కొందరు తప్పించుకొనిపోవుచున్నారు, కొందరు బంధములోనే యుండెదరు.

జగత్తను వృక్షమునకు ఆధార మేమి? దానికి అదే ఆధారము. ఫలానిది అని చెప్పుటకు వీలులేదు. మాయ పరమాత్మలో నిమిడియున్నది. విషము ఒక విధముగా పాములో నున్నది. మరియొక విధముగా పాములో లేదు. ఏలయనగా అది పామునకు చెరుపు చెయ్యదు.

అశ్వత్థము:—అశాశ్వతమైనది. దుఃఖభూయిష్ఠము.

సువిరూఢమూలము:—సంసారవృక్షము వేళ్లు మిక్కిలి పాతుకొనిపోయినవి. దానిని పెకలించుట కష్టము. అనేక జన్మలు ఎత్తినందున విషయవాసనలు దళసరిగా నున్నవి. e. g. చిన్నపిల్లలు డబ్బు పట్టుకొని వదలరు. జీవులు సప్తసాగరముల కన్న ఎక్కుడు తల్లిపాలను పూర్వజన్మలలో త్రాగి తిరిగి యీ జన్మలో త్రాగుచున్నారు.

కాని ఆవృక్షమును ఛేదించి గమ్యస్థానముచేరుట అవసరము. Religion=i. e. Re=back Ligo=to bind-లక్ష్మీనారాయణులు మన తల్లిదండ్రులు, భక్తులు మన బంధువులు గనుక వారిని భజించి యెచటనుండి బయటపడినామో అచటికి పోయి చేరవలెను.

దీనిని ఛేదించుటకు కావలసిన శస్త్రము ఏది? వైరాగ్యము. ఆశను జయించువారికి భయములేదు. ఆశకు దాసుడైనవాడు మూడులోకములకు దాసుడు. ఆశ యెవరికి వశమగుచున్నదో అట్టివారు మూడు లోకములను జయించినవారగుదురు. త్యాగమున్నగాని మోక్షము జెందుటకు వీలులేదు.

"కౌపీనవంతః ఖలు భాగ్యవంతః" అని శంకరులవారు వ్రాసియున్నారు. వైరాగ్యమును గురించి భర్తృహరిసుభాషితమం దిట్లు చెప్పబడినది.

శ్లో॥ భోగే రోగభయం కులే చ్యుతిభయం విత్తే నృపాలాద్భయం । మానే దైన్యభయం బలే రిపుభయం రూపే జరాయా భయం । శాస్త్రే వాదభయం గుణే ఖలభయం కాయే కృతాన్తాద్భయం । సర్వం వస్తు భయాన్వితం భువి నృణాం వైరాగ్యమే వాభయమ్॥

అనగా "సంపూర్ణభోగము లనుభవించుచో, రోగము లెక్కడవచ్చునో యను భయము కలదు. పేరుప్రతిష్ఠలుగల సత్కులమందుఁ బుట్టితి మనుకొనునపుడే చేయరాని పనులు చేయుటవలన నెప్పుడప్రతిష్ఠవాటిల్లునో యనుభయము కలదు-

ఐశ్వర్యవంతుల మనుకొనునపు డెప్పుడు రాజు కైకొనునో యను భయము కలదు. అభిమానవంతుల మనుకొనునప్పుడు దైన్యమెప్పు డవలంబింపవలయునో యను భయముకలదు. బల వంతుడనుగదా యనుకొనునప్పుడు శత్రువు లోడింతురో యను భయము కలదు. చక్కదనము గల దనుకొనునపుడు ముసలి తనము వచ్చునో యను భయము గలదు. శాస్త్రజ్ఞుడనుకొను నప్పుడు ప్రతివాదులవలన భయముగలదు. సద్గుణములు గల వాడను గదా యనుకొనునప్పుడు దుర్మార్గులవలన భయము గలదు. శరీరమును జూచుకొనునప్పుడు మరణమువచ్చునో యను భయము గలదు. అరసిచూచిన సర్వవస్తువులును భయాన్విత ములే. వైరాగ్య మొక్కటియే నిర్భయమైనది."

మధ్వాచార్యులుగారి వ్యాఖ్యానము:- అ ఇతి బ్రహ్మ; ఆ ఇతి విష్ణుః—విష్ణుమూర్తి భజన, భగవద్భక్తివలన సంసార మను వృక్షమును ఛేదించవచ్చును అని వ్రాసినారు. శుక మహర్షి పరీక్షిత్తుమహారాజునకు పరమాత్మయందు భక్తి, ప్రపంచమందు విరక్తి, ఇదియే అన్ని మతగ్రంథముల సారాంశము అని తెలిపియున్నాడు.

శ్లో॥ 4. ఏలోకమును, స్థితిని జెందినపిమ్మట మరల ఈ సంసారములో పడమో అదియే వైకుంఠము. దానిని వెదుక వలయును. పరమాత్మ అన్నిటికి ఆధారభూతుడు. ఆయన శరణాగతి జొఱవలయును. తమకే శాశ్వతసుఖము లేనివా రయిన దేవతాంతరుల భజించి యేమియు లాభములేదు.

శ్లో॥ 5. పరమాత్మ శరణాగతి జొచ్చుటకు కొన్ని ముఖ్యలక్షణము లుండవలయును. అవి యేమనగా—

(1) 'నిర్మానమోహా జితసంగదోషాః' నేను జాతిలోను నుద్యోగములోను ఎక్కువ యను నహంకార ముండరాదు. 'Pride goeth before a fall'. 'Humillity is a sign of greatness.' మనకన్న గొప్పవా రెందరో కలరని గుర్తెరుగ వలయును. పెద్దలసహవాసము వలనను, గ్రంథపఠనమువలనను, ప్రాపంచికవిషయములయందు ఆసక్తి తగ్గించుకొనవలయును.

(2) సుఖదుఃఖములు, లాభనష్టములు అను రెంటిలో నేది వచ్చినను సమబుద్ధితో స్వీకరించవలయును.

ద్వైతసిద్ధాంతప్రకారము వైకుంఠమునుగాని కైలాసమునుగాని చేరిననేగాని శాశ్వతసుఖము లేదు. వారి కది ప్రత్యేక లోకము. అద్వైతులకు అదియొక దశ. అద్వైతసిద్ధాంత ప్రకార మీ శరీరములోనే యాపదవిని ఇంద్రియ నిగ్రహ మనోనిగ్రహములవలన జ్ఞానమువలన పొందదగును. According to them moksha is not a thing to be achieved from outside but to be manifested from within.

శ్లో॥ 6. ఆ వైకుంఠ మెట్టిది? అనగా ఆలోకము తెలిసికొనుటకు సూర్యచంద్రులకాంతి యుపయోగపడదు. చాలదు. సూర్యుడు, చంద్రుడు, అగ్ని జడ ప్రకృతిలోని వస్తువులు చూచుట కుపయోగపడును. వైకుంఠమును చూచుటకు జ్ఞానమను వెల్తురు కావలయును. ఇట్టి గొప్పలోకమునకు ప్రభువు

నైన నన్ను జీవులు ఏల భజించుట లేదన, నావలన ప్రపంచ మున కుండు లాభములు గుర్తెరుగక పోవుటయే కారణము.

శ్లో॥ 7. ఆలాభములను పరమాత్మ వివరించుచున్నాడు. సకలమైన జీవులు నా అంశసంభూతులు, అనగా నాశరీరములో నుండి వెలువడినవారు. ఒక వ్యాఖ్యానకారుడు వ్రాసినది యేమనగా, అంగాంగిభావము:-మనము ఉత్తర్వుచేసిన పనులను మన అంగములు చేయవలసియున్నవి. అటులే అందరు జీవాత్మ లకు పరమాత్మ నియామకుడు. He is the propellor, భగవంతుడు మనయందు ప్రాణప్రతిష్ఠచేసి ఆయన రూపము మనలో ప్రవేశపెట్టినాడు. పరమాత్మ అనాది. అటులే జీవుడు కూడ అనాదియే. జీవుడు ఈ శరీరములో నుండి పంచేంద్రియ ములద్వారా మనస్సుతో చేరి, వస్తువులను అనుభవించు చున్నాడు.

శ్లో॥ 8. మనముచేయు పనులయొక్క (impressions) అన్నియు మన సూక్ష్మశరీరముపై పడుచున్నవి. పుష్పముల మీదనుండి వచ్చుగాలి వాని సూక్ష్మభాగములను మననాసికా రంధ్రములలో చేర్చుచున్నవి. అటులే యీ జీవుడు ఈ శరీ రము వదలి మరియొక శరీరములో ప్రవేశించునపుడు పూర్వజన్మ కర్మవాసనతో అనగా, కాయిక, మానసిక వాచికకర్మలలోని సూక్ష్మభావముతో పోయి చేరుచున్నాడు. ఆ సూక్ష్మశరీరము, జీవత్వము నశించుటయే మోక్షము.

సుఖదుఃఖములను అనుభవించునది మనస్సే. గౌరవా గౌరవములు రాజునకేగాని, రాజప్రతినిధికిగావు. మనోరాజ్యము

నకు వచ్చినగాని ఆ సుఖదుఃఖములు పొడగట్టవు. e.g. దుఃఖ విషయము జరిగినవెంటనే మనకు దుఃఖము రాదు. అటులే సుఖ విషయము మనకు తెలిసిన తరువాతగాని, ఆయా భావములు ఏర్పడవు. జీవుడు రాజు, మనస్సు మంత్రి. ఈ శరీరము ప్రవేశించునపుడుగాని, శరీరములో నుండునపుడుగాని, శరీరము విడుచునపుడుగాని, యీ సుఖదుఃఖములు శరీరమునకు అంటవు. జీవుడు శరీరముద్వారా సుఖదుఃఖముల ననుభవించుచున్నాడు. ఇంద్రియములు మనస్సుద్వారా వానిని గ్రహించుచున్నవనిన్నీ కర్మానుష్ఠానముచేసిన మహానుభావులు మాత్రము గ్రహించుచున్నారు. Read Carlyle's lecture "Now and then-"

ఈ మనస్సు కొన్ని నియమములకు లోబడునట్లు చేసి కొనినగాని, ఆత్మజ్ఞానము బ్రహ్మజ్ఞానము కలుగదు. జీవునికి పరమాత్మకుగల సంబంధము పంచదార కొండకు, పంచదార ముక్కకు ఎట్టి సంబంధము కలదో అట్టిది.

శ్లో॥ 12. పరమాత్మ జీవుల సృజించి వారిక్షేమము నిమిత్తము పితృపుత్రభావముతో అనేక విషయములు ఏర్పరచియున్నాడు. ప్రజల సౌకర్యార్థము ఆయన వెలుతురు కలిగించుచున్నాడు. i. e పగలు సూర్యునిద్వారా, రాత్రి చంద్రుడు నక్షత్రములద్వారా కలిగించుచున్నాడు. వాటి అన్నిటికి నిధి పరమాత్మ. (He is the fountain source of all light and effulgence.) వాటి తేజస్సు వాటికి స్వతస్సిద్ధముకాదు. పరమాత్మ తన తేజస్సులో కొంత వాటియందు నిలిపియున్నాడు. సూర్యచంద్రాదులు పరమాత్మవలన నియమింపబడిన

ఉద్యోగస్థులు, Office holders. వాటిని చూచి మనము జ్ఞాపక పరచుకొనవలయును. సూర్యుడు చంద్రుడు అనాదినుండి ఒక పాట పాడుచున్నారని చెప్పబడినది. viz మమ్ములను పుట్టించినవాడు ఒక పరమాత్మ యున్నాడు. (పశుర్వేత్తి శిశుర్వేత్తి వేత్తి గానరసం ఫణిః) The hand that made us is Divine. సూర్యునికి అర్ఘ్య మిచ్చుట, స్త్రీలు చంద్రుని పూజించుట ఏల ననగా వారు పరమాత్మచిహ్నము లనియే. ఇవియే యింత కాంతిగా నున్నపుడు పరమాత్మ తేజస్సు ఎంత దేదీప్యమాన ముగా నుండునో గుర్తెరుగుము.

శ్లో॥ 13. నా తేజస్సును భూమియందు ప్రవేశపెట్టుచున్నాను. అందువల్ల ఈభూమి యెన్నియోవస్తువుల భరించుచున్నది. అందువలన వైష్ణవ సిద్ధాంతములో పరమాత్మ భార్యలు (శక్తివిశేషములు) శ్రీదేవి (లక్ష్మి), భూదేవి (భూమి) నీళాదేవి అని చెప్పియున్నాడు. ఆదిశేషునిపై భూమి నిలిచియున్న దని చెప్పుచున్నారు. భూమిపై నుండు నానా విధములైన వృక్షములు కాయలు పండ్లు వీటి అన్నిటియందు నేను ప్రవేశించుచున్నాను. పరాత్పరుడు ఆయావస్తువులకు ఆయాశక్తులు ఇచ్చియున్నాడు.

Browne in his Religio Medicii says, "that doctors in general do not realise this. There is no good of saying that everything is nature; you must realise that there is an intelligent force propelling all things from behind in this world." "Perhaps, a fool sayeth in his heart of hearts that there

is no God. Why is it that mangoes are so very sweet? Is it due to the owner of the garden or gardener'? 'Neither of the two, but it is due to God, said Swami Vivekananda.

వైద్యులు సాధారణముగ ఈ విషయము గ్రహింపజాలకున్నారని బొర్రిను, "రెలిజియో మెడిసీ" అను గ్రంథమందు వ్రాసియున్నాడు. ప్రతిది 'నేచర్' అని చెప్పినా ప్రయోజనమేమియు లేదు. ఈ ప్రపంచమం దన్ని పదార్థములలో దివ్య చైతన్య మొకటి కలదనియు, అయ్యదియే ఆయా పదార్థములకు ఆయాగుణముల నిచ్చుచున్నదనియు మనము గ్రహింపవలయును. తన హృదయాంతరాళమున "భగవంతుడే లేడు అనుకొనువాడు మూఢుడు. మామిడి పండ్లయందలి మాధుర్యమునకు తోటమాలియా, లేక తోట యజమానియా కారకులు? వీ రిరువురు కాదు. దానికి ఆ సృష్టికర్త (పరాత్పరుడు) కారకు డని వివేకానందస్వామి చెప్పియున్నాడు.

శ్లో॥ 14. నేను ప్రతివానియొక్క కడుపులో జఠరాగ్ని స్వరూపముగా నున్నాను. సముద్రములో బడబానల స్వరూపముగా నుండి యెన్నినదులు వచ్చిపడినను పీల్చి నిర్వికారముగా జేయుచున్నాను. జఠరాగ్నిగా నుండి భక్ష్య భోజ్య చోష్య లేహ్యములను నాలుగువిధములైన పదార్థములను జీర్ణింపజేయుచున్నాను. బయటనుండు అగ్నిలో అరటిపండు కాలజాలదు. జఠరాగ్నిలో అరటిపండు దహనమగుచున్నది. కనుక బయట నుండు అగ్నికంటె జఠరాగ్ని పెద్దది. పరమాత్మఅనుగ్రహము లేనిదే ఒక్కమెతుకు జీర్ణముకాదు. అందువలననే భోజనా

త్పూర్వము నారాయణస్మరణ చేయవలయునని పెద్దలు చెప్పి యున్నారు. భక్ష్య=అపూపములు (విరిచి తినునవి); భోజ్య= ఉండలుగా చేసికొని తినునవి (అన్నము, కూర, పప్పు) చోష్య = జుఱ్ఱబడునవి (చారు, పులుసు, క్షీరాన్నము) ( liquids ); లేహ్యపదార్థములు=నంచుకొనునవి. (పచ్చళ్ళు, ఊరగాయలు మొదలగునవి.)

మరియొక వ్యాఖ్యానము—మీరు తినుపదార్థములను నాలుగువిధములుగా జీర్ణమగునట్లు చేయుచున్నాను. రామ కృష్ణపరమహంస యొకయుదాహరణము నిచ్చియున్నాడు. ఇల్లు కట్టుకొనుటకు ఒక మేస్త్రి, కూలివాడు ఇద్దరు కావలయును. అటులే యీ శరీరములో పరమాత్మ ఇంజనీరు (divine architect or world engineer.) జీవుడు ఒకకూలి. అటులే శరీరమునకు ఏవస్తువు కావలెనో, ఆయాసమయములందు జీవునికి ఆ యా అపేక్షలను, ఆకలి, దప్పి మొదలగునవి పరమాత్మ అను ఇంజనీరు కలిగించుచున్నాడు, జీవుడు తన శరీరము అను ఇల్లును తన యిష్టప్రకారము కట్టుకొన వీలులేదు. దాని నియామకుడు పరమాత్మ. పదార్థములను నాలుగు విధములుగా జీర్ణమగునటుల చేయుచున్నాడు. రక్తముగా, మాంసముగా, పుసిల్లుగా, మలముగా, మూత్రముగా, శుక్రముగా, మేదస్సుగా ఇట్లు అనేక విధములుగా మార్చుచున్నాడు. భోజనము చేయునపుడు నన్ను స్మరింపుము.

శ్లో॥ 15. ప్రతివారి హృదయములో నేనుండి కొన్ని పనులు చేయుచున్నాను. ఎవని కెప్పు డే శాస్త్రములయందు

పాండిత్యము ఉంచవలెనో, ఎవని కే విషయమున అజ్ఞానము కలిగించవలెనో, ఎవని కేసమయమందు ఏ విషయము జ్ఞాపకముండునట్లు చేయవలయునో, అది అంతయు నాచేతిలో ఉన్నది. " It is folly to be wise where ignorance is bliss." అందువలన మంచి విషయములలో జ్ఞానముండుట మంచిదే కాని, చెడు విషయములనుండి తాను బాగుపరచ దలచుకొన్న వారికి భగవంతుడు అజ్ఞానము కలుగజేయుచున్నాడు. ఇది వారివారి ప్రాచీనకర్మల ననుసరించి భగవంతుడు కలిగించుచున్నాడు. చదివిన విషయములు జ్ఞాపక ముండుట పరమాత్మ అనుగ్రహము వలననే. అనుగ్రహము లేనియెడల జ్ఞాపకముండవు. మరపుకూడ ఆయనవలననే కలుగుచున్నది. మరపుండుట కొన్ని సందర్భములలో అత్యవసరము, క్షేమము. చదివిన విషయములన్నియు జ్ఞాపకమున్న ప్రవాహమునకు అరికట్ట వీలులేదు. గనుక కొన్ని విషయములందు మరపు మనకు తెప్పించుచున్నాడు. ముఖ్యులగు బంధువులు చనిపోయినప్పుడు బంధు వియోగము ద్రవ్యనష్టమువలన కలుగు దుఃఖము మరపునకు వచ్చునట్లు చేయుటవలననే ప్రపంచములో జీవయాత్ర నడచుచున్నది. Forgetfulness of certain events is the solace of life.

15 శ్లో॥ 2వ భాగము:—కనుక నా విషయమై తెలిసికొనవలయు ననిన వేదములు చదువవలెను.

మూడవ పాదములో "ఏవ" అను పదము ఒక్కొక మాటతో కలిపి చదివిన, ఒక్కొక అర్థము వచ్చుచున్నది.

వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః—వేదములవలననే పరమాత్మను తెలిసికొనవచ్చును. ఇతర శాస్త్రములవలన కాదు. అవి శరీర సుఖ సంబంధమైన విషయములను తెలుపుచున్నవి. వేదములు శాఖాచంద్రన్యాయమువలె పరమాత్మను తెలుపుచున్నవి. ముసలివారికి విదియ తదియరోజులలో చంద్రుడు కానరాడు. బాలురకు కానవచ్చుచున్నాడు. బాలుడు ముసలివానికి చూపుటకై ఒక యిల్లు, దిశను, ఒక గుర్తునుచూపి అచట చంద్రుని చూపించుచున్నాడు. అనేక వస్తువులను చూపి, చివరకు ఒక కొమ్మను చూపి, ఆ చంద్రుడు (from the gross to the subtle) పై కొమ్మకు సూటిగా నున్నాడని తెలుపుచున్నాడు. పరమాత్మ వేదప్రతిపాద్యుడు. ఊరేగింపులో విగ్రహము ముందు వేదఘోష జరుగు చున్నది. అవియే పరమాత్మను చూపించు signboards.

అహమేవ—సకల వేదములవలన నన్నే తెలుసుకొనవచ్చును. ఏ దేవతను స్తోత్రముచేసినను అది పరమాత్మకు చెందుచున్నది. నారాయణుడు సర్వశరీరి యగుటచేతను, అన్ని దేవతలు ఆయన శరీరములో చేరినవా రగుటచే ఆయనకు పూజా పునస్కారము లన్నియు చేరుచున్నవి.

'వేద్య' అను పదముతో ఏవ కలిపిన 'వేద్యఏవ—వేదములు చదివిన 'వేద్య ఏవ' నన్ను తెలుసుకొనియే తీరవచ్చును. Knowing is becoming. మన మనస్సు పరమాత్మమాదిరి అయిననేగాని పరమాత్మ విషయము గ్రహింపజాలము

వేదాన్తకృత్ — వేదాంత గ్రంథము లన్నియు వ్రాసినది నేను. వేదాంతములు జ్ఞానమును, వేదములు కర్మమార్గమును తెలుపుచున్నవి. వాని నిజమైన అభిప్రాయములు నాకే తెలుసును. కవిహృదయము కనిపెట్టుట యితరులకు సాధ్యముకాదు. ఇతరు లూహింపవలసియున్న నిష్కర్షగా కవిభావ మిట్టిదని చెప్ప వలనుపడదు. అందువలననే భగవద్గీత అద్వైత, ద్వైత, విశిష్టాద్వైతములవారు వారివారి అభిప్రాయముల ననుసరించి తమ తమ వాదనల సిద్ధాంతములను బలపరచుచున్నదని అష్టదిగ్గజములవంటి మతగురువులు వాదించుచున్నారు. పరమాత్మయే, గీతకు వ్యాఖ్యానము వ్రాసిన బాగుండెడిదని ఒకరు సొగసుగా చెప్పియున్నారు.

Sri Ramakrishna Paramahamsa gives the example of four blind men of Hindustan going to see an elephant. One thought it was like a pillar, the second like a winnow, the third like a club and the fourth thought it was like a big jar. Every one was in the right partly and partly wrong; all the descriptions put together represent the real elephant. So also the different systems of philosophy are partly right and partly in the wrong and one should read all the different systems to have a true conception of Paramatma.

When you go into a garden and look at a chameleon, it appears in different colours to different persons [ఊసరవెల్లి రంగులు మారిపోవుచున్నవి]. When

they refer it to the gardener, who knows its true nature, he will say that it is the same but changing its hue from time to time. So also the different schools of philosophy refer to different view-points of the same divinity. Persons who go to a river to fetch water carry vessels of different sizes and bring as much water as the vessels can hold. You should study all these systems, complement and supplement one another to attain true knowledge of Divinity. He alone knows the true meaning of Gita, i.e. Paramatma.

శ్రీ రామకృష్ణ పరమహంస యిచ్చిన యుదాహరణ మేమన, పూర్వకాలమున హిందూస్థానమున నలుగురు గ్రుడ్డివాండ్రు ఏనుగును చూచుటకు వెళ్ళిరి. వారిలో నొక్కొక్కరొక భాగమును తడవిచూచి, ఒకరు ఏనుగ గుంజమాదిరిగా నున్నదనియు, రెండవవాడు చేటమాదిరిగా నున్నదనియు, మూడవవాడు గదమాదిరిగా నున్నదనియు, నాలుగవవాడు అది పెద్దబాన మాదిరి యున్నదని వివాద పడిరట. అన్ని వాదనలు కొంతవరకు సరిగా కొంత తప్పుగా నున్నను అన్నిటి కలిపి జూచినగాని నిజస్వరూపము తెలియదు. అట్లే ఒక్కొక్క సిద్ధాంతము ఒక్కొక్క దృక్పథమును సూచించుచున్నది. 'పరమాత్మతత్వము చక్కగా గ్రహించుటకు అన్ని సిద్ధాంతములు తెలుసుకొనవలయును. ఊసరవెల్లి రంగులు మారుచున్నదని తోటమాలికి తెలియును. దాని నిజస్వభావము యెరుగని చూపరులు, దాని రంగును గురించి వివాదపడుట మరియొక

దృష్టాంతము. మరియు నదికి నీరు తెచ్చుకొనుటకై వెళ్లువారు కొందరు పెద్దపాత్రలు కొందరు చిన్న పాత్రలు తీసుకొని వెళ్ళు చున్నారు. వారి పాత్రలు పట్టినంత వరకే నీరు తెచ్చుకొను చున్నారు. ఆయా సిద్ధాంతముల వారు పరమాత్మతత్త్వము తాము గ్రహించిన విధముగ మనకు తెలిపి యున్నారు. వాటి నన్నిటిని చదివి, అనుసంధాన మొనర్చి సమరసపరచి చూచిన గాని పరమాత్మయొక్క యథార్థ తత్త్వము మనకు బోధ పడదు. భగవద్గీతయందలి నిశ్చితార్థము గీతాచార్యుడగు శ్రీ కృష్ణ పరమాత్మకే యెఱుక.

శ్లో॥ 17. పురుషులు:— (1) క్షరపురుషులు— all wordly objects which exist in name and form, are all perishable entities. నశించిపోవునవి. (2) అక్షర పురుషులు—శరీరము నశించినను, దానిలోని తత్త్వము నశిం చనిది ఒకటి కలదు. i. e. ఆత్మ. It is the imperishable and eternal spirit.

నానావికారములతో కూడి జననమరణములు కలిగిన శరీరములు క్షరపురుషులు. నిర్వికారమై, నాశనములేని ఆత్మ అక్షరపురుషుడు. దిమ్మపై కొట్టు కడ్డీలు మారుచున్న వేగాని దిమ్మకు మార్పులేదు. అటులే శరీరమునకు ఆస్థానమైన ఆత్మ మారుటలేదు. అది నిర్వికారమైనది. ఈ క్షరాక్షరపురుషుల కన్న నెక్కువైనవా డొకడున్నాడు. ఆయన పురుషోత్తముడు. ఈ శరీరము పురి. అందులో నుండు ఆత్మ పురుషుడు. అన్ని ఆత్మలలో శ్రేష్ఠుడు పురుషోత్తముడు పరమాత్మ. ఆయన,

మూడు లోకములు భరించుచున్న జగదాధారభూతుడు. జీవుడు అణుప్రాయుడు. పరమాత్మ సర్వవ్యాపకుడు. అన్ని లోకములయందున్నాడు.

శ్లో॥ 18. క్షరపురుషుని కన్న అక్షరపురుషు డెక్కువ. జడప్రకృతివలన నేర్పడు శరీరముల కన్న తెలివిగలిగినట్టి Conscious entity జీవాత్మ యెక్కువ. అక్షరపురుషులకన్న పరమాత్మ యెక్కువ. అందువలన పరమాత్మ సకలవస్తువులలో శ్రేష్ఠు డగుటచే పురుషోత్తముడని చెప్పబడుచున్నాడు.

సకలక్షేత్రములలో ముఖ్యమైనది పూరి(జగన్నాధం)= the town = పురుషోత్తమునిస్థాన మనిపేరు. పురి = The celebrated town of Purushothama.

శ్లో॥ 19. ఎవడు అజ్ఞానమును పోగొట్టుకొని పురుషోత్తమునకును, పురుషాధమునకును నుండు తేడా తెలుసుకొనుచున్నాడో వాడు పురుషోత్తముని సేవించుచుండును. వాడు అన్నివిధముల పరమాత్మను భజించుచున్నాడు. ఆ విధములన్నియు 11 వ అధ్యాయములో చెప్పబడినవి (1) పితాపుత్రభావము. (2) సఖ్యభావము (3) నాయికానాయకభావము (4) వాత్సల్యభావము (5) స్వామిభృత్యభావము.

శ్లో॥ 20. అన్నిశాస్త్రములలో గీత మిక్కిలి రహస్యమైనది. ఈ పుస్తకము చదివిన అన్ని పుస్తకములు చదివినట్లే. అన్ని శాస్త్రముల సారాంశము నిందులో నిమిడియున్నది. Vivekananda said 'the Gita is unique and unrivalled. If at all there is one universal scripture it is

Gita and Gita alone. ఇట్టి పరమ రహస్యమైన గీత నావలన నీకు చెప్పబడినది. మయా = సర్వలోకనియామకుడ నైన నావలన, అనఘా=పాపరహితుడా. ఇట్టి పవిత్రమైనగీతా శాస్త్రము అందులో 15 వ అధ్యాయము చెప్పిన పిమ్మట, చదివిన పిమ్మట, వినిన పిమ్మట, సర్వపాపములు నశించును.

శ్రీరామకృష్ణపరమహంస మంచియుదాహరణ మిచ్చినాడు. జీవుని పాపము ఎట్లుపోవును? జీవుడు అణుమాత్రుడగుటచే వాని కిమ్మతు సున్న. కనుక ఒక జీవుడు మరియొక జీవుని కలిసికొనిన వారిని ఉద్ధరించజాలడు. జీవ సమ్మేళన మైనను దానివిలువ సున్నయే. ఒకప్పుడుసున్నకువిలువయేర్పడు చున్నది; ఎప్పుడనగా అంకెప్రక్కను సున్నలు ఉంచిన విలువ కలుగుచున్నది. అంకెప్రక్క నున్న సున్నకు విలువ హెచ్చు. దూరముగా నుండుదానికి విలువ తక్కువ. జీవులు పరమ పాపులు. వారికి విలువలేదు. పరమాత్మసాన్నిధ్యము చేరిన వారికి పాపముపోయి విలువ గలుగుచున్నది. పరమాత్మభజన నామసంకీర్తనల వలనను, భక్తులసహవాసమువలనను, హరికథా పురాణప్రవచన సత్కాలక్షేపముల వినుటవలనను పాపముల బోగొట్టుకొని, అంకెప్రక్కను సున్నచేరి విలువ పొందుమాదిరి, పరమాత్మసంబంధము పొంది జీవులు పాపరహితు లగుచున్నారు. రాములవారు సీతను అరణ్యమునకు రావద్దని, కష్టభూయిష్ఠమని తెలుపగా, రామునిచాటున నున్న తన కెట్టి కష్టము లేదని సీత తెలిపెను. రాము డనగా పరమాత్మ, సీత

అనగా జీవాత్మ. జీవుడు భగవంతుని సాన్నిధ్యము పొందిన నెట్టి భయములేదు. శాశ్వతమైన సుఖము కలుగుచున్నది.

అర్జునా! యిట్టి విషయములు తెలిసికొని నన్ను భజించువాడు జన్మసాఫల్యము పొంది జీవించునంతవరకు అన్ని సుఖములు అనుభవించి, శరీరము పోయిన తరువాత పరలోకములో శాశ్వతమైన సుఖము చెందును.

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే పురుషోత్తమ
ప్రాప్తియోగో నామ పంచదశోధ్యాయః
సంపూర్ణః

# శ్రీ భగవద్గీతోపన్యాసములు



## 16 వ అధ్యాయము

## దైవాసుర సంపద్విభాగ యోగము

(Ethical side of Philosophy.)

1 - 3 శ్లో॥ దైవాంశములో పుట్టినవారి లక్షణములు చెప్పబడినవి. స్థూలదృష్టినిబట్టి, బయటి వేషములను బట్టి దైవాంశములో బుట్టినవారైనది, రాక్షసాంశములో బుట్టిన వారైనది చెప్ప వీలులేదు. వారి లక్షణములను బట్టి చెప్ప వలయును.

దైవాంశములోనివారికి 26 గుణములు ఉండవలయును. ఈ అధ్యాయము 4-24 శ్లోకములలో రాక్షసాంశములోని వారి లక్షణములు చెప్పబడినవి.

దైవాంశములో బుట్టినవారి 26 గుణములు ఏవియనగా

1. అభయము. i. e. fearlessness. ధరలు ఎక్కువగానున్నను వ్యాధులు ప్రబలియున్నను ఏమి భయపడగూడదు. మరియొక అర్థము, ధర్మబోధచేయునపుడు ఎవరేమనుకొనెదరో అను భయము ఉండరాదు.

2. సత్త్వ సంశుద్ధి=(mental purity) మనశ్శుద్ధి.

3. జ్ఞానయోగవ్యవస్థితి = జ్ఞానసంపాదనయందే దృష్టి నిలిపి, నిన్నటికన్న నేడేద్దైన భగవత్సంబంధమైన విషయము

నేర్చుకొనియున్నానా? అని ఆత్మపరీక్ష చేసికొని చూచుకొనుట. You must have acquisition of knowledge as your ideal.

4. దానము=ఈవి (Charity)

5. దమము=మనోనిగ్రహము. Control over the mind.

6. యజ్ఞము=వారివారి మత వర్ణాశ్రమధర్మములననుష్ఠించుట.

7. స్వాధ్యాయము=Scriptural study (వేదశాస్త్ర పఠనము).

8. తపస్సు = Restraint over body, mind and speech. (ఇంద్రియముల నియమించుట).

9. ఆర్జవము= Frankness or harmony between thought, word and deed (కపటములేకుండుట)

10. అహింస=Non-injury (ఇతరుల బాధింపకుండుట).

11. సత్యము Truthfulness.

12. అక్రోధము=కోపములేకుండుట, లేక శాంతము.

13. త్యాగము=Spirit of self-sacrifice

14. శాంతి=Calmness or patience.

15. అపైశునము=చాడీలు చెప్పకుండుట. i. e. not carrying tales;

16. దయా భూతేషు= Kindness to men, animals and vegetables etc.

17. అలోలత్వం = not having too much indulgence in sensual pleasures.

18. మార్దవం = Softness or Gentility,

19. హ్రీ=Modesty మరియొక అర్థము : తినగూడని పదార్థములు తినునప్పుడు, చెయ్యగూడని పనులు చేయునపుడు పెద్దలు ఏమనుకొందురో అని సిగ్గుచెందవలెను.

20. అచాపలం=not having wavering tendency. Stability of purpose.

21. తేజస్సు=Effulgence ముఖవర్చస్సు.

22. క్షమ=Forbearance

23. ధృతి= Perseverance=పట్టుదల; or fortitude on occasions of danger - బంధువియోగము, ద్రవ్య నష్టము మొదలగునవి వచ్చినపుడు ధైర్యముగా నుండుట.

24. శౌచము = Cleanliness, external and internal. Keep the body externally clean and mind internally pure. Also keep your house and belongings clean.

25. అద్రోహము = Not betraying. నమ్మించి గొంతు కోయకుండుట.

26. నాతిమానిత = నాకంటె పూజ్యు డెవడు లేడను కొనకుండుట. Not being puffed up with vanity, conceit etc. ఈ ఇరువదిఆరు గుణములు దైవాంశసంభూతుల కుండును.

శ్లో 4. రాక్షసాంశములో పుట్టినవారి లక్షణములు ముఖ్యముగా ఏవనగా:—దంభము, దర్పము, అభిమానము

తన పొగరుబోతుతనమును physical గా, mental గా, verbal గా చూపించుచున్నాడు. కోపము, కఠిన పరివర్తన ie. cruelty in word or deed- ఈ దుర్గుణము లన్నియు అజ్ఞానమువలన కలుగుచున్నవి. పరమమూఢుడై తాను శాశ్వతమని యెంచి యితరులకు హింస కలిగించువాడు రాక్షసాంశములో బుట్టినవాడు.

శ్లో॥ 5,6. There are two sorts of natures divine and diabolical, of which I have dealt with the divine nature. Now let us proceed; you need not be afraid because you come within the former category. You are born with divine qualities therefore don't be aggrieved. ఇంతవరకు దైవాంశలోఁ బుట్టినవారి లక్షణముల జెప్పితిని. రాక్షసాంశలో బుట్టిన వారిని గురించి చెప్పబోవుచున్నాను. అర్జునా! నీవు భయపడకుము. ఏలనన నీవు దైవాంశసంభూతుడవు అని శ్రీకృష్ణుడు చెప్పి, రాక్షసాంశమందు బుట్టినవారి లక్షణముల విశదీకరించుచున్నాడు.

శ్లో॥ 7. రాక్షసాంశములో బుట్టినవారు విధినిషేధముల గమనించరు. ఏపని చేయవచ్చును, ఏపని చేయరాదు అని ఆలోచించరు. శుభ్రత ఆచారము వారికి లేదు. యథార్థము మాట్లాడరు.

శ్లో॥ 8. మరియు వారు చార్వాకమతమును అవలంబింతురు. (i.e. Rank materialism or atheism.) వారికి భగవంతుడుగాని జీవుడుగాని, లోకాంతరముకాని లేదు. పాప

పుణ్యములులేవు. 'ఋణం కృత్వా ఘృతం పిబేత్' "అప్పుచేసి యైనను పప్పు తినవలెను" అని వీరిమతము. ప్రపంచము తన తట తానే పుట్టినదిగాని, దీనికి కర్త ఒకడులేడు. స్త్రీపురుషులకు ఒండొరులమీద నుండు కామమే సృష్టికి కారణమని వీరు వాదింతురు. ఉత్తరక్రియలు మొదలగునవి నిష్ప్రయోజనములని చెప్పుదురు.)

శ్లో॥ 9. అట్టినాస్తికదృష్టిని అవలంబించి తమ ఆత్మలను చెడగొట్టుకొని అల్పబుద్ధి కలవారై లోకులకు అహితమైన భయంకరమైన పనులను చేయుదురు. e. g. కొట్టుట, తిట్టుట, తప్పుపత్రముల సృజించుట—యివి యన్నియు రాక్షసప్రకృతి యొక్క లక్షణము.

శ్లో॥ 10. నింపుటకు సాధ్యముగాని ఆశకు బానిసలై డంబము, మదము భ్రాంతితో కూడుకొన్న పట్టుదలకలవారై అశుద్ధమైన పనులను చేయుదురు. e. g స్త్రీలను, ధనికులను వశపరచుకొనుటకై శ్మశానములో పీనుగులపైన కూర్చొని లేక ఒంటికాలిపై నిలుచుని జపముచేయుట మున్నగునవి రాక్షస కృత్యములు.

శ్లో॥ 11. అపరిమితమైన చింతకు లోబడి (ప్రళయకాలమున అన్ని నశించినను నాశనము చెందని విపరీతచింతకు లోబడి) కామమును పూర్తిచేసికొనుటయే ప్రధానముగా తలచి తదనుగుణముగా ప్రవర్తింతురు.

శ్లో॥ 12. అనేకవిధములైన ఆశలు అను త్రాళ్ళచేత కట్టబడి ఆశ, కోపము వీటిని ఎక్కువగా అవలంబించి తమ

కోరికల నెరవేర్చుకొనుటకై అన్యాయమార్గములో ధనము సంపాదించెదరు. e. g. లంచాలు, మామూళ్ళు వగయిరా తీసికొనుట.

శ్లో॥ 13. అట్టివానికి మరియొక లక్షణ మేమనగా:— తన ధనమును ఎల్లప్పుడు చూచి మురియుచు, గొంతెమ్మ కోరికల కోరుచుండును. e. g. ఒక్క నువ్వుగింజను పట్టుకొని తాను కుబేరుడై వివాహము అయినట్లు ఎంచిన బ్రహ్మచారి అరుగు నుండి దొర్లి క్రిందపడుట. అవివాహితుడైన బీద బ్రాహ్మణుడు సిరిసంపదలతో తులదూగుదు నని యెంచి భార్య యను భ్రాంతితో తా నిద్రించుచున్న కుమ్మరింటిలోని కుండల తన్నుట. కుమ్మరిది కర్రతో చావమోదుట, ఉదాహరణములు. ఈశ్వరాజ్ఞ లేనిదే మనుష్య ప్రయత్నమువలన నెట్టి ప్రయోజనము లేదని వారు గుర్తెరుగరు. చాల ఆశ్చర్యమైన విషయ మేమి అని యక్షుడు అడుగగా, ధర్మరాజు ఏమని చెప్పినాడనగా "మన కన్న చిన్నవారు ఎందరో నశించుచున్నారు. శేషించినవారు మనము శాశ్వతముగా నుందు మని తలచుచున్నారు. ప్రాణము నీటిబుగ్గవంటిది. ఇదియే ఆశ్చర్యము."

శ్లో॥ 14. నాతో విరోధము పెట్టుకొన్నవాడు ఎవ్వడు బ్రతుకును? నేను ఎందరినో చంపినాను, కొంపలు కూల్చినాను, దేవుడనగా నెవడు? నాకన్న ఎవడుభోగి, బలవంతుడు? నన్ను మించినవా రెవ్వరు ముల్లోకములలో లేరు అని రాక్షసాంశములో జన్మించినవాడు విఱ్ఱవీగుచుండును.

ఈశ్వరోహ మహం భోగీ:—ద్వైతులు ఏమనుచున్నా

రనిన అద్వైతులందరు " ఈశ్వరోహం " అనుచున్నారు. కనుక వారు రాక్షసాంశములో చేరిన వా రనుచున్నారు. అది పొరపాటు. "సోయందేవదత్తః" అను న్యాయమును అనుసరించి జహదజహల్లక్షణ ప్రకారము జీవునికి కలిగియుండు చెడులక్షణములు తీసివేసి అట్లే ఈశ్వరునియందలి సృష్టి స్థితి సంహారము చేయు గొప్పలక్షణములను తీసివేసి రెంటికిని సరిపోల్చి చూచిన యెడల రెండుచోట్లనుండు చైతన్యము ఒకటియే అని తెలియ నగును. జ్ఞానపటుత్వములేనివారు నేను ఈశ్వరుడ ననుకొన్నచో అట్టివారు రౌరవాదినరకముల పాలగుదురు.

సిద్ధోహం=నేను సిద్ధుడను అనుకొనుచున్నాడు. రాక్షసాంశములో చేరినవారు తమ సంతానముచూచి మురియుచున్నారు. వారికి రోగము వచ్చిన అందు బిడ్డలు పాల్గొనరు. సంతాన మున్న మాత్రమునసే తరించరు. ధృతరాష్ట్రుడు నూర్గురు కొడుకులున్నను తరించలేదు. శుకమహర్షికి సంతానము లేకున్నను తరించెను. "ఋణానుబంధరూపేణ పశుపత్నిసుతాదయః" అని వేదాంతము బోధించుచున్నది. బిడ్డలున్నను లేకపోయినను మోక్షము వారివారి చేతులలో నున్నది. ద్రవ్యమువలన, మనుష్యులవలన పొందుసుఖము తాత్కాలికమైన దని దేవాంశసంభూతులు తెలియగలరు.

శ్లో॥ 15. ఆత్మస్తుతి రాక్షసాంశమందు పుట్టినవారి లక్షణము. వారు పూర్వికుల గొప్పతనము గురించి బడాయి కొట్టుకొనుచుందురు. జ్ఞాని తనసంగతి తాను చెప్పుకొనగూడదు. నేను యాగముచేయగలను, దానములుచేయగలను అని యెల్ల

ప్పుడు రాక్షసాంశసంభూతుడు విర్రవీగుచుండును; వారి మొగము ఎప్పుడు నేడ్చుచుండును. తనకు సంబంధములేని విషయములను గురించి దుఃఖించుచుండును పోగొట్టుటకు వీలైన విషయములనుగురించి, పోగొట్టుకొనుటకు వీలులేని విషయములను గురించి రాక్షసాంశములో బుట్టినవాడు దుఃఖించుచుండును. ప్రళయమువచ్చి ప్రపంచము మునిగిపోయినను వాని దుఃఖము అంతరించదని శంకరాచార్యులవారు చెప్పియున్నారు.

రాక్షసాంశములో బుట్టినవారు నాదగ్గర చేరరు. రాను రాను అధోగతి చెందుదురు. అట్టివారు మనుజులుగా జన్మించి భగవత్సాన్నిధ్యము చేరుమార్గము వెతుకక, కామినీకాంచన లోలురై పశుపక్ష్యాదులుగా జన్మించుచున్నారు. రాక్షసాంశములో బుట్టినవారు నరకములో పడుటకు మూడు వాకిళ్ళు కామ, క్రోధ, లోభములు. దైవాంశము గలిగినవారికి సద్గతి చెందుటకు నాల్గు ద్వారములు - ఇంద్రియనిగ్రహము, మనోనిగ్రహము, సంతోషము, మంచివారి సహవాసము అనిమహోపనిషత్తులో చెప్పబడినది. నరకమునకు ద్వారము లగు కామ, క్రోధ, లోభములను మూటిని వదలిపెట్టవలయును.

ఎవరు శాస్త్రములయందు, పెద్దలు చెప్పిన ప్రకారము నడవక, కామోద్రేకమున స్వేచ్ఛగా ప్రవర్తించెదరో అట్టివారికి ఇహపరలోకములందు సుఖము లేదు. వారు రాక్షసాంశసంభూతులు. వారికి శరీరసుఖములేదు. ఆత్మసుఖములేదు. కనుక దైవాంశములో చేరవలయును. అందులకు ధర్మశాస్త్ర

ములు, వేదములు ప్రమాణముగా నుంచుకొన వలయును. వానిలో చెప్పబడినట్టి కట్టుబాట్లకు లోబడి ప్రవర్తించిన యిహపరలోకములయందు సుఖము పొందవచ్చును.

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే దైవాసుర
సంపద్విభాగయోగోనామ షోడశోధ్యాయః
సంపూర్ణః



# శ్రీ భగవద్గీతోపన్యాసములు

## 17 వ అధ్యాయము.

## శ్రద్ధాత్రయ విభాగయోగము

"16 వ అధ్యాయము ఆఖరుశ్లోకములో శాస్త్రములను నమ్మి నడచువారు దైవాంశసంభూతు లని తెలిపియున్నారు గదా! విద్యాగంధము లేనివారికి అది యెట్లు ఉపయోగపడును? విద్యలేని కారణముచేత వా రందరు రాక్షసాంశములో చేరె దరా?" అని అర్జునుడు శ్రీకృష్ణపరమాత్మను 1 వ శ్లోకములో ప్రశ్నించుచున్నాడు. విద్యాశూన్యులైనను వారు సాంప్రదాయానుసారము నడచిన దైవాంశములో చేర్చెదరా? వారిని రాజసతామసులుగా భావించెదరా? ఇది మొదటి శ్లోకములో ప్రశ్న.

ఒక ద్రావిడభక్తుడు "హే పరమశివా! చదువుకొనిన వానికన్న చదువనివాడే మేలు, ఏలయన, చదువుకొన్న వాని విద్య పండితులతో వాగ్వాదము పెట్టుకొని వారిని పరాభ వించుటకే యుపయోగపడుచున్నది గాని నిన్ను భజించుట కుపయోగించుట లేదు. చదువులేనివాడు మూఢభక్తి గలిగి శ్రద్ధతో నిన్ను భజించుచున్నాడు" అని చెప్పియున్నాడు.

అర్జునుని ప్రశ్నకు పరమాత్మ జవాబు ఈ అధ్యాయములోని 2 వ శ్లోకము మొదలు ఇచ్చియున్నాడు. విద్య ప్రధానమా? శ్రద్ధ ప్రధానమా?

శ్లో॥ 2. అర్జునా! విద్యకన్న శ్రద్ధయే ప్రధానము. శ్రద్ధ అనగా వేదాంత వాక్యములయందు సద్గురువులయందు విశ్వాసము. నమ్మకముతో పెద్దలు చెప్పిన విషయములు అనుష్ఠానము చేసినయెడల ఉత్తరోత్తరమున అవి యుక్తమని తోచును. ఆ శ్రద్ధ మూడువిధములు.

1. సాత్త్విక శ్రద్ధ, 2 రాజస శ్రద్ధ, 3. తామసశ్రద్ధ. శ్రద్ధ=application = ఏకాగ్రత. "దేహినాంసా స్వభావజా" పూర్వకర్మను అనుసరించి ఆయావిషయములందు శ్రద్ధకలుగును.

1. సాత్త్వికశ్రద్ధ—గాయత్రి, పారాయణ, దేవతార్చన. ఆత్మ సుఖమునకు కారణభూతమైన పనులయందు శ్రద్ధ.

2. రాజస శ్రద్ధ—పేరుప్రతిష్ఠలు కలిగించు ద్రవ్యార్జనాది విషయములయందు శ్రద్ధ.

3. తామసశ్రద్ధ—ఒకరికి హింసకలిగించు విషయములయందు శ్రద్ధ. ఈ మూడువిధములు వివరింపబోవుచున్నాడు.

శ్లో॥ 3. అర్జునా! ప్రతిమానవుడు బహిర్ముఖముగా చేయుపనులు వాని వాని అంతఃకరణను వెలిబుచ్చుచున్నవి.

వారివారి శ్రద్ధ వారివారి అంతఃకరణనుబట్టి యేర్పడుచున్నది. ప్రతి పురుషుడు శ్రద్ధామయుడు. ఒక మంచిపనిలోగాని చెడు పనిలోగాని జయము కలుగవలయుననిన ఆపనియందు దీక్ష, యేకాగ్రత ఉండితీరవలయును. ఏ రకపు శ్రద్ధ యున్నవాడు ఆయాపేరులతో సాత్త్విక, రాజస, తామస పురుషులని, లేక స్త్రీలని చెప్పబడుదురు. ఏరకపు మనుష్యులైనది గుర్తించుటకు వారు దేవతార్చన చేయునపుడు వెళ్ళి ఏ దేవతను ఏయుద్దేశముతో పూజించుచున్నారో గమనించుట మొదటి విషయము e. g. శ్రీమన్నారాయణుని, లేక పరమశివుని మోక్షార్థమై పూజచేయునాడు సాత్త్వికుడని తెలియనగును; లేక డబ్బుకావలెననిగాని, సంతానము కావలయునని గాని యితర ఇహలోక సుఖములు కావలయుననిగాని పరమాత్మనుగాని, దేవతాంతరుల గాని పూజించువాడు రాజసు డని తెలియవలయును. మరియొక్కడు సంవత్సరమునకు ఒకసారి నైనను దేవాలయమునకు బోక ఒక కొబ్బరికాయనైనను కొట్టక, భూతప్రేతపిశాచగణముల పురస్కరించుకొని క్షుద్రదేవతలకు కల్లు, మాంసములతో జీవహింసతో పూజసేయునో అట్టివాడు తామసు డని గుర్తెరుగుము. జగజ్జనని జీవహింస, రక్తపాతము కోరుచున్నదనుకొనుట గొప్పపొరపాటు. సహస్రనామములతో కుంకుమార్చన చేసిన ఆమె మిక్కిలి సంతసించును, మేకలను కోళ్ళనుచంపి మన పాపములు అభివృద్ధిపరచుకొనగూడదు. గణాచారులకు ఆవేశించుట అంతయు బూటకము. యజ్ఞములలో నెల్ల జపయజ్ఞము గొప్పదని ఆనందగిరి శంకరభాష్యముపై టీకలో వ్రాసి

యున్నాడు. ఏలయన అందులో జీవహింసలేదు. జీవహింసతో కూడిన యజ్ఞము intermediate stage. స్మార్తులు ఎక్కువగా యజ్ఞముచేసెదరు. వారిది జ్ఞానమార్గము. వైష్ణవులకు, మధ్వలకు భక్తి ప్రధానము. మధ్వలు యజ్ఞము చేసిన వారు పిష్టముతో పశువును చేయుచున్నారు.

పూజ చేయనివారు ఏజాతిలో చేరినది యెట్లు తెలిసికొనవలెను? Prof. Rangachariar in his lectures on Bhagavadgita has beautifully dealt with this chapter. ప్రొఫెసర్ రంగాచార్యులు గా రొసగిన గీతోపన్యాసములయందు ఈ విషయము బహుచక్కగా విమర్శింపబడినది. గోడలమీద అలంకారార్థము పెట్టుకొన్న పటములు చూచిన ఆయన యేతీరు మనుష్యుడైనదియు తెలిసికొనవచ్చును. దేవుని సంబంధమైన పటము లున్న మొదటిజాతి. అధికారుల సంబంధమైన పటములున్న రెండవజాతి. వారకాంతల పటములు మొదలైన పటములు పెట్టుకొనువాడు మూడవజాతి.

శ్లో॥ 5, 6. ఏ పటములు లేకపోయిన వానిని పరీక్షించుట యెట్లు? శరీరమును ఆత్మను పాడుచేసికొని రాక్షసాంశములో బుట్టినవారు క్షుద్రదేవతల ననుసరించి ఆభిచారిక హోమములచేసి నరకము పా లగుచున్నారు. వీరు రాక్షసాంశ సంభూతు లని తెలిసికొనుము. కొంతమంది యోగులమని వేషము వేసికొని స్త్రీలను, ధనికులను గుండములో త్రోయుచున్నారు.

శ్లో॥ 7. దేవతార్చన, పటములు, లేనివారికి కొన్ని

పరీక్ష లున్నవి, (1) ఆహారము, భోజనము చేయునపుడు ఆకు నెదుట కూర్చుని పరీక్షచేయుము. (2) యజ్ఞము (3) తపస్సు (4) దానము.

(1) "ఆహారశుద్ధౌ సత్వశుద్ధిః" అని చెప్పబడినది. Vivekananda said "Why is the lion in the cage so fierce, and why is the lamb or the goat so very mild?" The answer is "Much depends on the food you take." This is a general statement. మానవుని గుణము లతని యాహారమునుబట్టి కలుగునని సాధారణముగా చెప్పనగును. వివేకానందస్వామి 'బోనులోని సింహ మంత భీకరముగాను, వెలుపలనున్న మేక లేక గొర్రెపిల్ల మృదువుగా నుండుటకు కారణమేమి? వానిఆహారము'అని చెప్పియున్నాడు.

మాంసాహారము మన దేశములో కేవలము అనవసరము. కొందరు అది జాతిధర్మమని పొరపడుచున్నారు. అది పొడుము పీల్చుట, వ్యభిచారము, కల్లుత్రాగుట యిత్యాదుల వలె దురభ్యాసము. మాంసమునకు మనుస్మృతిలో వ్రాసిన వ్యుత్పత్త్యర్థము- ఆ హింస చేయబడిన జీవము-మాం-నన్ను,సః-వాడు (కోసి తినుచున్నాడు) మరుజన్మములో వీనిని నేను మ్రింగెదను అని లేచిపోవుచు ఆ జీవము శపించుచున్నది. కొన్ని కొన్ని కూరలు నిషేధింపబడినవి - ముల్లంగి, మునగకాడలు. ఇవి కామోద్రేకము కలుగజేయునవి. సన్న్యాసులు, బ్రహ్మచారులు, వితంతువులు వాటిని వాడగూడదు. ఆహారనియమము మిక్కిలి అవసరము. ఏ ఆహారమైతే ఆయుస్సును అభివృద్ధిపరచునో, ఏది మనస్సునకు,శరీరమునకు బలము కలిగించునో, ఆనందము

కలుగజేయునో స్వతస్సిద్ధమైనరసముతో కూడియున్న ఆహారము సాత్త్విక ఆహారము e. g. పచ్చికూరలు సాత్త్విక ఆహారము.

1. రసః = ఒక వ్యాఖ్యానకారుడు నేతితో కూడినది అని వ్రాసియున్నాడు. నూనె రాజసములో చేరినది.

2. స్నిగ్ధః=బాగుగాఉడికినది.ఉడికియునుడుకని అన్నము కూరలు విషముతో సమానము.

3. స్థిరాః=The meals must be substantial and nutritious- శరీరమునకు మేలుచేయునవిగా నుండవలెను.

4. హృద్యాః – ఆకులో పెట్టినతోడనే యెప్పుడు తిందుమా అని ఆశాజనకముగా, రమణీయముగా నుండవలెను. ఎంత రుచ్యమైనను కంటికి ఇంపుగా లేకపోయిన పరిత్యజించ వలయును.

(ఆడవాళ్ళు ముఖమునకు పసుపు, కాళ్ళకు పారాణి రాచుకొనవలెను. Females should smear turmeric on their face as it detroys superfluous hair and gives it lustre. ఆడవాళ్ళు పసుపు రాచుకొనిన రోమములు రాలి పోయి ముఖము కాంతిగా నుండును. parani; నీళ్ళలో నాను కాళ్లు పాచిపట్టకుండ ఉండుటకై యేర్పరచబడినది పారాణి).

రాజసాహారము:— అతికారము, అతియుప్పు etc. షడ్రసములు అతిగా వేసుకొని తినువారు ఈ తరగతివారు. అట్టి వస్తువులు కోపోద్రేకము, ఉష్ణము, ఆరోగ్యభంగము కలిగించుచున్నవి. సాత్త్వికాహారము తినువారికి జీవకారుణ్యము భూతదయయు, పశ్చాత్తాపమును ఉండును. పచ్చిమిపరపకాయ

లను ఎలుకలును, ఎండుమిరపకాయలను కాకులును తిను చున్నవి. వానికి దుర్గుణములు మెండు. The crows are the most mischievous creatures in the world అతికారము తినువారు అట్టివారే. వీరికి కామక్రోధములు హెచ్చు.

శ్లో॥ 10. తామసాహారము :—

(1) యాతయామం— వండి జాము అయిపోయినట్టి ఆహారము. వండిన అన్నము ఆపూట తినవలయును. రెండు పూటలకు ఒకసారి వండరాదు.

(2) గతరసం—స్వతస్సిద్ధమైన రసముపోయినట్టికూరలు, నేతి సంబంధము లేనివి.

(3) పూతి—కుళ్ళిపోయినది, పాసిపోయినది. దుర్గంధమువచ్చునది. అట్టివి మనము తినకూడదు. ఇతరులకు నివ్వరాదు.

(4) పర్యుషితము—చద్దియన్నము, etc. అంత ఛండాలము మరొకటి లేదు. అది సోమరిపోతుతనము నెక్కువ చేయుచున్నది.

(5) ఉచ్ఛిష్టము— ఎంగిలి. ఎంత మన కడుపులో బుట్టిన బిడ్డకైనను మన యెంగిలి పెట్టరాదు. మన యెంగిలి మనకే పనికిరాదు. ప్రత్యేక ప్రత్యేకముగా భోజనము చేయవలెను. ఎంగిలివస్తువులు దాసీవాళ్ళకుకూడా వేయకూడదు. ఎంగిలి తమోగుణమును వృద్ధిపరచునది. (వీరికి నిద్ర, సోమరిపోతుతనము etc. లక్షణములు.)

(6) అమేధ్యము. మేధ్యము=భగవంతునికి నివేదన చేసినది. అమేధ్యము=భగవంతునికి నివేదన చేయనట్టిది. పవిత్రముకానిది. అట్టిది తినువాడు పందియై పుట్టునని వరాహపురాణములో చెప్పబడియున్నది. ఆహారసంబంధమైన విషయమై చెప్పబడ్డ మూడుశ్లోకములలో ఆ యా విషయములను గురించి చెప్పునపుడు యుక్తమైన పదములు ఉపయోగింపబడినవి. వానికి ఒకరు అర్థము చెప్పకయే యందలి భావము పదగుంభన బట్టియే తెలియుచున్నది.

(2) యజ్ఞములు గమనించుట :—

శ్లో॥ 11. ఫలాపేక్షలేకుండ, ఇహలోక పరలోక సుఖము కోరకుండ (మరియొకరు చెప్పుప్రకారము పరమాత్మ అనుగ్రహము అపేక్షించి) వేదశాస్త్రములచే నియమింపబడిన కర్మలు (duties) చేయువాడు సాత్త్వికుడు. యష్టవ్యమేవ=భగవంతుడు నాకీ ధర్మముల విధించినాడు కనుక వానిని అనుష్ఠించియే తీరవలయును. ఏమ్చుచు చేయరాదు. ఉత్సాహముతో యజ్ఞము చేయువలయును.

శ్లో॥ 12. రాజసయజ్ఞము ఎట్టిది? స్నానము, సంధ్య పూజలు, పునస్కారాదులు, ఇహలోక పరలోక సుఖము కోరిగాని, దంభము కోసరముగాని చేయుట. దంభము అనగా బడాయి. ఇట్టికర్మ అశాశ్వతమైనది. రాజసిక యజ్ఞము అని చెప్పబడును.

శ్లో॥ 13. తామసికయజ్ఞము ఎట్టిది? శాస్త్రవిరుద్ధమైనది,

అన్న శాంతి లేనట్టిది, మంత్రహీనమైనట్టిది, దక్షిణ లేనట్టిది, శ్రద్ధలేనటువంటి యజ్ఞమును, తామసయజ్ఞమని చెప్పెదరు.

(3) తపస్సునుబట్టి మానవులు ఏ జాతిలోనివారైనది గమనించుట యెట్లు?

(1) శారీరతపస్సు:— Physical restraint ఈ శరీరమును ఏ పనులు చేయుటయందుపయోగింపవలయును? ఈ శరీరములో ఒక గొప్ప తత్వ మున్నదనియు, దానిని గుర్తెరుగుటకు మానవ శరీరమును మనకు పరమశివుడు ప్రసాదించినట్లు అవ్వై అను ద్రావిడభక్తురాలు చెప్పియున్నది.

శరీరము నుపయోగించు విధములు ఎవ్వి?

1. భగవత్సంబంధమైన కైంకర్యముల చేయుట.

2. వేదముల చదివిన సద్బ్రాహ్మణుల పూజచేయుట.

3. జ్ఞానభక్తి వైరాగ్యముల బోధించి శిష్యుల అజ్ఞానాంధకారము పోగొట్టిన గురువుల పూజించుట. (వారి శరీర రక్షణకు ఆవశ్యకమైన దెల్ల చేయుట.)

4. శౌచము = స్నానము, శుభ్రత.

5. ఆర్జవము=చెప్పినది తలచినది చేయుట Harmony between thought, word and deed.

6. బ్రహ్మచర్యము:— అన్ని యింద్రియములు నియమించి ప్రాపంచిక విషయములనుండి త్రిప్పి భగవంతునియందు

లీనపరచుట. కులశేఖర ఆళ్వార్ ముకుందమాలలో నిట్లు వ్రాసియున్నాడు.

శ్లో॥ జిహ్వే కీర్తయ కేశవం మురరిపుం చేతో భజ శ్రీధరం పాణిద్వంద్వ సమర్చయాచ్యుతకథాం శ్రోతద్వయ త్వం శ్రుణు కృష్ణం లోకయ లోచనద్వయ హరేర్గచ్ఛాంఘ్రియుగ్మాలయం జిఘ్ర ఘ్రాణ ముకుందపాదతులసీం మూర్ధ న్నమాధోక్షజం॥

"అనగా, ఓ నాలుకా! శ్రీకృష్ణుని బొగడుము. ఓ మనసా! మురాసురునకు శత్రువైనట్టి కృష్ణుని సేవింపుము. ఓ రెండు చేతులారా! కృష్ణుని పూజసేయుడు. ఓ రెండు చెవులారా! మీరు విష్ణుకథలను వినుడు. ఓ కన్నులజంటా! కృష్ణుని చూడుము. ఓపాదద్వయమా! విష్ణు సాన్నిధ్యమునకు జనుము. ఓ ముక్కా! శ్రీకృష్ణుని పాదములయందలి తులసిని ఆఘ్రాణింపుము. ఓ శిరమా! విష్ణుమూర్తికి నమస్కరింపుము. మానవులు తమ కరచరణాద్యవయవంబుల భగవంతుని కైంకర్యమునకై యుపయోగించవలయును."

వల్లభాచార్యులు—శుద్ధాద్వైతస్థాపకులు. వీరు గృహస్థులు. ఆయన వ్రాసిన మధురాష్టకములో నిట్లు చెప్పియున్నారు.

"అధరం మధురం వసనం మధురం నయనం మధురం గమనం మధురం ........మధురాధిపతే రఖిలం మధురం"

బ్రహ్మచర్యము :—

సాధారణముగా బ్రహ్మచారి యన అవివాహితుడుగా నుండుటఅని అర్థముచెప్పెదరు. కాని అదినైష్ఠికబ్రహ్మచర్యము. గృహస్థాశ్రమములో నున్నవారికైనను బ్రహ్మచర్య ముండవలెను. i. e. అగ్నిసాక్షిగా వివాహమాడిన భార్యతో రమించి, పరకాంతలను మాతృభావముతో చూడవలెను. ఆ భార్యతోనైనను తిథివారనక్షత్రముల చూచి రమించువాడు బ్రహ్మచారికి సమానుడు. గృహస్థాశ్రమములో నున్నవారు స్త్రీవాంఛను గుప్పిటయందుంచుకొనవలయును. ధర్మసమ్మతమైన కామము తన రూపమే యని పరమాత్మ 7 వ అధ్యాయములో చెప్పియున్నాడు.

అహింస:—శరీరముతో నేవిధమైన హింస యితరులకు జేయరాదు. కేవలము కొట్టుట, తిట్టుటయేగాక తప్పుడు పత్రములు వ్రాయుట, యిండ్లు తగులబెట్టుట యివి యన్నియును హింసలో జేరుచున్నవి.

శ్లో॥ 15. (2) వాఙ్మయతపస్సు :— వాగింద్రియము పుక్కిటిపురాణములలో వృథాపుచ్చక కొంతకాలమైనను భగవన్నామస్మరణమందు ఉపయోగపరచవలయును. దానిని ఏ పనులు జేయుటయందు నియమింపవలయును ? (ఎ) ఒక సంఘమునకుగాని, వ్యక్తికిగాని ఉద్రేకము కలుగు మాటయందుపయోగించరాదు. (బి) చెప్పు మాటలు

యథార్థముగా నుండవలెను. అనేక యజ్ఞములకంటె సత్యము పలుకుటవలన ఎక్కువ ఫలమున్నదని భారతములో చెప్పబడినది. మనుస్మృతిలోను నిట్లు చెప్పబడినది.

శ్లో॥ సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్
మాబ్రూయాత్ సత్య మప్రియమ్
ప్రియంచ నానృతం బ్రూయాత్
ఏష ధర్మ స్సనాతనః॥

అనగా నితరులకు సుఖముకలిగించు యథార్థము చెప్పవలయును. ఇతరులకు హింసకలిగించు యథార్థము చెప్పరాదు. ఒకనికి సుఖముకలుగునని అబద్ధము చెప్పకూడదు.

వామనచరిత్రలో నెపుడు అబద్ధమాడిన దోషము లేనిది చెప్పబడినది? "వారిజాక్షులందు వైవాహికములందు। ప్రాణవిత్తమానభంగమందు। చకితగోకులాగ్రజన్మ రక్షణమందు। బొంకవచ్చు నఘము బొంద దధిప॥" అని శుక్రుడు బలిచక్రవర్తికి బోధించియున్నాడు. బలి గురువుమాటల లక్ష్యపెట్టక సత్యము పాలించుటవలన పాతాళ లోకాధిపతియై శ్రీమన్నారాయణుని కాపుదారి జేయు నౌకరిగా పెట్టుకొనియున్నాడు. (సి) వాగింద్రియమును భగవంతుని మహిమనుప్రతిపాదించు గ్రంథపఠనయం దుపయోగించవలయును. చదువురానివారు, భగవన్నామస్మరణ జేయనగును. Vivekananda said, "Die, die repeating the names of God, just as a frog croaks during the rainy nights." You must close your lips finally with the utterance of God's

name. "వర్షాకాలమున కప్ప యేతీరున గోండ్రించుచుండునో, అదేవిధముగ భగవన్నామము స్మరించుచు ప్రాణముల వద లుము" అని వివేకానందస్వామి చెప్పియున్నాడు.

భాగవత షష్ఠస్కంధమం దజామిళోపాఖ్యానములో ఇట్లు చెప్పబడినది.

తే॥ అరయఁ బుత్రోపచారితమైన విష్ణు
నామ మవసానకాలంబునను భజించి
శార్ఙ్గినిలయంబుఁ జేరె నజామిళుండు
నిట్లు సద్భక్తిఁ బలికిన నేమి సెప్ప॥

శ్లో॥ 16. (3) మానసిక తపస్సు:—

(ఎ) నిర్మలముగా మనస్సునుంచుకొనుము. కలియుగ మందు అష్టాక్షరీ "ఓం నమో నారాయణాయ"కు బదులు "ఎవరికొంప కూల్తునా" యను అష్టాక్షరి ప్రబలి యున్నది. "సర్వే జనాః సుఖినో భవంతు" అని గుర్తెరుగ వలయును. సంధ్యావందనములో బ్రాహ్మణులక్షేమము, గోవు క్షేమము కోరుట యేలననగా - బ్రాహ్మణులు సరిగా నున్నచో అన్ని జాతులవారు, వారి మార్గము ననుసరించి చక్కగా నుండె దరు. ఆవునేతితో యజ్ఞముచేసిన దేవతలు మెచ్చి వర్షము కురిపించెదరు. అందువలన సస్యములు చక్కగా ఫలించి ప్రపంచ మంతయు బాగుపడును.

(బి) మౌనము = అనవసరమైన మాటలు మాట్లాడ నను నియమ ముండవలయును. భగవత్సంబంధమైన మాటలు పరోపకారము కలుగజేయు మాటలు, వీటిని మాత్రమే

మాటలాడుము. మౌనము చాల మంచిది. Silence is golden. Speech is silvery. ఒక దృష్టాంతము. ముగ్గురు గంధర్వులు విమానములలో పైకిపోవుచు క్రింద ఒక పాము కప్పను మ్రింగుట చూచిరి. వారిలో ఒకడు పామును చూచి "ముంచ ముంచ మహాసర్ప" అనగా ఆ కప్ప నేల హింసించెద వనియెను. ఆమాట అనుటతోడనే అతడు దభాలున క్రింద బడెను. ఏలనన దానికి వేద విహితమైన ఆహారము వదలి చావుము అన్న దోషము చేయుటచే క్రిందపడెను. రెండవ వాడు,"మాముంచ భుజగాధిప"అనగా వదలిపెట్టవద్దు, దానిని చంపుము అని చెప్పిన దోషమువలన ఆతడుగూడ క్రింద పడెను. మూడవవాడు, మౌనమువహించి గమ్యస్థానము చేరెను. కనుక "మౌనము సర్వార్థసాధనము" అని చెప్పబడి నది. మౌనమువల్ల శక్తిని నిలువ (Store) చేయవచ్చును. i.e. Conservation of energy. మౌనవ్రతమును పట్టి, కాగిత ముపై వ్రాయుట మనకాలము, శక్తి వృథా (Time and energy waste)చేయుట. అది మంచిదికాదు. భగవత్సంబంధ మైన మాటలు ఎన్ని అయినను చెప్పవచ్చును

(సి) నిష్కపటమైన యోచనచేయవలయును. నమ్మించి గొంతుక కోయరాదు.

తపస్సు మొత్తము తొమ్మిదివిధములు. ఎట్లన సాత్విక రాజసిక, తామసికతపస్సు. మూడురకములలో ఒక్కొక్క దానియందు శారీర, వాఙ్మయ, మానసిక తపస్సులను మూడు రకములు గలవు.

(3) దానమునుబట్టి యేరకము మనుజులైనది యెట్లు తెలియును ? కొందరికి ధనము, కొందరికి విద్య, కొందరికి శరీర బలము భగవంతుడు ప్రసాదించి యున్నాడు. దానిని అందరికిని ఉపయోగపడునట్లు చేయవలయును. దానము నెవరు ఏ ఉద్దేశముతో చేయుదురో చూచి, అయ్యది సాత్వికమా, రాజసికమా, తామసికమా అని తెలియనగును.

(1) సాత్వికదానము. (ఎ) భగవదర్పణముగా నితరులకు విరివిగా తన కున్నదానిని దానముచేయుట. ధనముండి దానము చేయనివానిని, తపస్సుచేయని దరిద్రుని ఇద్దరిని పడవలో నెక్కించుకొనిపోయి వారిమెడకు రాయికట్టి సముద్రములో ముంచివేయు మని చెప్పియున్నది.

ఈ ఐశ్వర్యము మధ్యలో వచ్చినది. "Naked thou art born and naked shalt thou return" అని తెలుసుకొనుము. పుట్టినపుడు మనవెంట నేమియు తీసికొనిరాలేదు. చనిపోవునప్పుడు మనవెంట చెడిపోయిన ఒక్కసూది అయినను రాదు అని తెలిసికొనుము. భగవంతుడు మనల ననుగ్రహించి సముద్దారుగా నియమించి ఆయన మనకు ధనము నిచ్చినాడని గ్రహించి సద్వినియోగము చేయుము. నీవు కేవలము స్వార్థపరుడవై దానిని హరించవద్దు. సర్కారుసొమ్ము లేక ఇతరులసొత్తు అపహరించు ఉద్యోగస్థులకు కారాగృహ ప్రాప్తి కలుగుచున్నది. గవర్నమెంటువారి టంకసాల (mint) లో పనిజేయు నౌకర్లు అక్కడనున్న కొంచెము సేపు

తమ బంగారము తమవెండి అని భ్రమపడుచున్నారు. లోపల పోవునపుడుగాని బయటకు వచ్చునపుడుగాని ఒక దమ్మిడి తీసికొనిపోవుటకుగాని తీసికొనివచ్చుటకుగాని వారికి యోగ్యత లేదు. ప్రపంచమంతయు భగవంతుని టంకసాల. వారి వారి శక్తిసామర్థ్యముల ననుసరించి ఒకరికి బంగారు, మరియొకరికి వెండి, మరియొకరికి రాగి యివ్వబడినది. అటులే వారి వారి పూర్వకర్మను అనుసరించి కొందరికి ధనము, మరికొందరికి దరిద్రము ఈశ్వరుడు ప్రసాదించుచున్నాడు.

(బి) దానము చేసియే తీరవలయును అని దృఢనిశ్చయముండవలయును.

(సి) అహంకార మమకారముల వదలి భగవంతుని సొత్తు భగవంతుని బిడ్డలకు పెట్టుచున్నా నను ఉద్దేశముతో చేయవలయును.

(డి) ప్రత్యుపకారము చేయలేనివారికి దీనులకు దానము చేయవలెను.

(ఇ) దేశకాలపాత్రముల నెరిగి దానము చేయవలెను. తీర్థములయందు క్షేత్రములయందు చేయు దానమువలన మిక్కిలి ఫలితము కలుగుచున్నది. అచట నెవరికి ఎంత యిచ్చినను అది సాత్త్వికదానమే యగుచున్నది. అట్టి పుణ్యక్షేత్రములయందు ఉత్తమమైన బ్రాహ్మణుడు దొరకలేదని సందేహమువలదు. కాలము మంచిదైన, పుచ్చుకొనువా రెట్టివారైనను ఏదేశములో నిచ్చినను సాత్త్విక దానము అగు

చున్నది. e. g. మకరసంక్రమణము, ఏకాదశి మొదలగు దినము లట్టివి. మంచిపాత్రము దొరకినపుడు దేశకాలముల ఆలోచించ పనిలేదు. రైలులో ప్రయాణము చేయునపుడు, సత్పురుషుడు తటస్థించిన, ఇచ్చెడివారు పుచ్చుకొనువారు మొగము కడుగుకొనకపోయినను దానము నివ్వనగును. ఈ మూటిలో నే రెండు అనుకూలమైనను అది మరి మరి సాత్వికదానము. అన్నియు దేశ, కాల, పాత్రములు మూడు సందర్భపడిన అది అనేక రెట్లు సాత్వికము. ఈ మూటిలో పాత్రమునకు ఎక్కువ ప్రాధాన్యము ఇవ్వవలయును. అట్టి దానములలో అనేక విషయములు గమనించవలయును. (1) ఏజాతికి ఏది యివ్వవలయునో గమనించుము. (2) ఏ ఆశ్రమములో వారికి వారికి తగ్గ వస్తువుల నివ్వవలయును. (3) ఏకాలములో నేది యివ్వవలయునో గమనించవలయును. (4) స్త్రీ, పురుషవ్యక్తిత్వము గమనించవలెను. మొగవాళ్ళకు ఇవ్వవలసినది మొగవారికి, ఆడవాళ్ళకు ఇవ్వవలసినది ఆడ వారికి ఇవ్వవలెను.

అన్నదానము—అన్నిటికన్న గొప్పది. తీసికొనిన వానికి తృప్తియిచ్చునది అన్నదానమే. ఎంత భూములు, ద్రవ్యము, గుడ్డలు ఇచ్చినను, మనిషి తృప్తిపడడు. అన్నము అందరికి అవసరము. మరియు, అన్నము పెట్టిన వెంటనే తృప్తి కలిగించవచ్చును. అందువలన అన్నము పెట్టిన వానికి ఎక్కువ పుణ్యము. "అహా, అహా, ఉహూ ఉహూ" అను నప్పుడు విస్తరిలో దొరలించి పొమ్ము. ఎంతవరకు అనిన

ఆకున కడ్డముగ పండుకొనునంతవరకు వడ్డించుము. అన్నము పెట్టుటలోకూడ ఒక ప్రక్రియ గమనించవలెను. సాధ్యమైనంత వరకు సత్పాత్రునికి అన్నదానము చేయవలయును. అన్నము తినువాడు పరోపకారముచేయు పనులుజేసి భగవన్నామస్మరణ జేసి అన్నము జీర్ణము చేసుకొనినయెడల వాడు ఈ తరము అటుపది యిటుపది మొత్తము ఇరువదియొక్క తరములు తరింపజేయుచున్నాడు, అని ఉత్తరగీతలో చెప్పబడియున్నది.

శ్లో॥ "కుక్షౌ తిష్ఠతి యస్యాన్నం యోగాభ్యాసేన జీర్యతే
కులం తారయతే తేషాం దశపూర్వాన్ దశాపరాన్॥

అన్నము తినువాడు దుర్మార్గప్రవృత్తిలో అన్నము జీర్ణము చేసికొన్న 21 తరములవారు నరకము పాలగు చున్నారు. ఇచట భారతమందలి దృష్టాంతము చెప్పనగును. పాండవులు దివ్యమైన అన్నదానము చేయు చుండగా శుక మహర్షి అచటి కరుదెంచి ఒక్క మెతుకు వాసనచూచిన వెంటనే కోట్లకొలది జనులకుచేసిన అన్నదానముకన్న ఎక్కువ ఫలితము కలిగినదని గంట ఒక అరగంటసేపు గణగణమోగి నట్లు భారతములో చెప్పబడియున్నది.

ఇట్టి గుణములతో కూడినది సాత్వికదానము.

శ్లో॥ 21. రాజసికదానము ఎట్టిదనగా—ఫలాపేక్ష తోడ, ఇహలోక సుఖముగాని పరలోకసుఖముగాని కోరి యిచ్చునది. రాజసుడు దుఃఖముతో నిచ్చుచున్నాడు. సాత్వి

కుడు చేయు దానము గుప్తము. కుడిచేతితో చేయు దానము ఎడమచేతికి తెలియదు. సాత్వికుడు చేయుదానము భార్య, పిల్లలకుకూడ తెలియనివ్వడు. సంతోషపురస్సరముగా మంచి వస్తువుల దానముచేయును. 'దీయతే చ పరిక్లిష్టం' = దుఃఖముతో నిచ్చుట ఇంకొక అర్థము—చెడ్డవస్తువుల నిచ్చుచున్నాడు. మనము ఏమాదిరి వస్తువుల అనుభవించెదమో అట్టివానిని ఇతరులకు దానమివ్వవలయును. దుఃఖముతో అమంగళ వస్తువుల నిచ్చుట రాజసిక దానము.

తామసిక దానము:—

శ్లో॥ 22. మంచి దేశములో, మంచి కాలములో, మంచి పాత్రకు నివ్వకుండ సామాన్యదేశములో సామాన్య కాలములో అపాత్రునకు దానమిచ్చుట. ఒకవేళ మంచి దేశములో మంచికాలములో నిచ్చినను, మంచిమాటలు మర్యాద లేకుండ నిచ్చినయెడల, అది తామసికదాన మనబడును. భోజనమునకు ఆదరణయే రసము.

అర్జునునకు ఇవి అంతయు విన్నతరువాత ఒక సందేహము కలిగెను. దేవతార్చన, కర్మానుష్ఠానము, తపస్సు, దానము లేనప్పుడు ఒక్క ఆహారమునుబట్టి మనుష్యులు, సాత్వికులో, రాజసికులో, తామసికులో గుర్తెరుగవచ్చునా? ఎంత సాత్వికునికైనను కొన్నిసమయములలో నితరుల యిండ్లకు భోజనమునకు పోవలసివచ్చినపుడు సాత్వికాహార నియమములు

'రస్యాః, స్నిగ్ధాః, స్థిరాః, హృద్యాః' తనకు కావలయునని దీక్ష పెట్టుకొనిన సాగునా? అపు డేమి చేయవలయును? అట్టి సందర్భములలో వారు పెట్టినది రాజసిక తామసిక ఆహారమైన యెడల దానికి ఒక ప్రక్రియ పరమాత్మ చెప్పియున్నాడు. అట్టి సమయములో ఒక మంత్రము (Spiritual formula) జ్ఞాపక ముంచుకొనుమని సెలవిచ్చినాడు.

శ్లో॥ 23. అట్టి సందర్భములలో, అనగా రాజసిక తామసిక ఆహారము విధిలేక స్వీకరించవలసినప్పుడు లేక రాజసిక తామసికులకు దాన మివ్వవలసినప్పుడు "ఓం తత్ సత్" అని అనుకొనుము. Invoke the blessings of God. His name is the best disinfectant. బ్రహ్మవాచకము స్మరించిన రాజసిక తామసికగుణములు నశించి సాత్వికరూపము గలుగుచున్నది. ఓం తత్ సత్ అనగా అర్థమేమి? అది మిగిలిన శ్లోకము 24-27 లోనే తెలుపబడినది. ఓం తత్ సత్ వల్లనే బ్రాహ్మణులకు గౌరవము. వారు బ్రహ్మజ్ఞానము కలిగినవారు. వేదములకుకూడ ఈ మంత్రమహిమను వర్ణించుట వలన విలువకలిగినది. కర్మయజ్ఞములు చేయవలయునని గ్రంథములు ఏల ఉద్ఘోషించుచున్నవనగా, ఓం తత్ సత్ ను చెందుటకు సాధనములు యజ్ఞములు గనుక ఓం తత్ సత్ వలన బ్రాహ్మణులకు, వేదములకు యజ్ఞములకు విలువకలిగినది.

శ్లో॥ 24. ఓంకారము=ప్రణవము. అ. ఉ. మ. విష్ణు, బ్రహ్మ, మహేశ్వరులు; సృష్టి, పాలన, సంహారకర్తలను

తెలుపును. పరమాత్మ, జీవాత్మ, ప్రకృతిని తెలుపును. మూడువేదములు, ఋగ్వేద, యజుర్వేద, సామవేదముల సారాంశముల తెలుపుచున్నవి. అధర్వణ వేదము లెక్కలో లేదు. It deals with arts and sciences, photography, manufacture of bombs etc- It is not found here. It has been taken to Germany. అధర్వణ వేదములో చేరిన వారెవరు మన దేశములో లేరు. సత్, చిత్ ఆనంద మును తెలుపును. Eternity, wisdom, and highest beatitude or bliss. రేచక పూరక కుంభకములు ఓంకార ముచ్చరించినందువల్ల కలుగుచున్నవి. ప్రణవోచ్చారణ చేయు టకు బ్రాహ్మణయతులకు మాత్రమే అధికారమున్నది. ఇతరులకు లేదు.

శ్లో॥ 25. మోక్షము కావలయు నని కోరువారు ఏపని ప్రారంభించినను "ఓం" అని ఆరంభించుచున్నారు. తత్ -అది (దూరములో నుండునది. మనకు ఇపుడు కనబడనిది) పరమాత్మ యింద్రియములకు గోచరము కానివాడు. ఇంద్రి యాతీతుడు- He cannot be perceived by your sensory organs.

శ్లో॥ 26. సత్ సద్భావే, సాధుభావే మొదలగునవి. మూడుకాలములయందు నాశనములేనట్టిది సత్. త్రికాల ములలో నుండునది. అనాదిగా, అనంతముగా నుండునది సద్వ స్తువు. ఘటపటాది ప్రపంచము - అసద్వస్తువు, ఇదివరకు

కొంతకాలముక్రితము లేదు. ఇపుడున్నది ముం దుండబోదు. i. e. పర్వతములు, చెట్లు, శరీరము, నామరూపములతో కూడిన వస్తువులు. నామరూపములు లేని అనాద్యనంతమైన సద్వస్తువు ఆత్మ. మరియు పరమాత్మ అనంతకల్యాణగుణసమేతుడు. He is the repository of all good qualities, and devoid of all evil qualities. "అనంతకల్యాణగుణసమేత హేయగుణరహిత" అని వైష్ణవులు చెప్పెదరు.

ఈ మంత్రము జ్ఞాపక ముంచుకొనుట యెట్లు అని అర్జునుడు అడుగగా: భోజనాత్పూర్వము పంచాక్షరి, అష్టాక్షరి జపించుమనియు, అవి తెలియకపోయినచో, రామా, కృష్ణా అని భగవంతుని నామస్మరణచేసిన అన్నము మొదలగువాని లోని రాజసిక తామసిక గుణములు నశించుననియు పరమాత్మ సెలవిచ్చి యున్నాడు. వేదమంత్రములను స్వరయుక్తముగా నుచ్చరించు నెడల మంచి Vibrations గలిగి అంతశ్శుద్ధి, బహిశ్శుద్ధి యేర్పడును.

శ్లో॥ 28. శ్రద్ధ లేకపోయిన నేమి? అశ్రద్ధతో నెవడు కర్మలు, యజ్ఞము, తపస్సు చేయునో వాడు ఎట్టి ఫలమును పొందడు. అది కేవలము నిష్ప్రయోజనము. యజ్ఞము తపస్సు, ఒకరి తృప్తికొరకై చేయకూడదు. మతసాంప్రదాయములో నమ్మకములేకుండా అశ్రద్ధతో చేసిన ఇహలోక మందుగాని పరలోకమందుగాని సుఖములేదు. అవి అన్నియు అసత్ కర్మలు. అశ్రద్ధతో కర్మచేయువాడు రాక్షసాంశసంభూ

తుడు. శ్రద్ధతో వేదశాస్త్రపురాణములు నమ్మి యజ్ఞము, తపస్సు చేసినయెడల వా డెంత మూఢుడైనను ఇహపరలోక సుఖము పొంది తరించును. అట్టి దే సత్ కర్మ యని అనబడును. కనుక శ్రద్ధయే ప్రధానము.

మరియొకరు వ్రాసినది— వేదశాస్త్రముల నమ్మక, అశ్రద్ధతో కర్మ చేయువారికి ఈ ప్రపంచమందు త్రివర్గము— అనగా ధర్మము, అర్థము, కామము లేదు. చనిపోయిన వెనుక అపవర్గము, మోక్షము ఈనాలుగింటిలో నేదియులేదు. శ్రద్ధతో కర్మానుష్ఠానము చేయువారికి ధర్మార్థకామమోక్షము లను నాలుగు పురుషార్థములు కలుగును. కడపటి మూడు పురు షార్థములకు ధర్మము పునాది యని యెరుగవలయును. ధర్మముతో అర్థము, ధర్మముతో కామము, ధర్మముతో మోక్షము పొందుటకు ప్రయత్నించవలెను. ధర్మము అన్ని టికి ఆధారము. e. g. రామదాసు సర్కారు సొమ్ము అపహరించి గుడికట్టుటచే కారాగృహమందు 12 సంవత్సరము లుండెను. లంచముల గొట్టి శివ, విష్ణు ఆలయముల కట్టిన ప్రయోజనము లేదు. అది ఆవును చంపి చెప్పుల దానము చేయుమాదిరి. It is like robbing Peter and paying Paul. కష్టార్జితమై ధర్మముగా సంపాదించిన సొమ్ముతో నొక చిన్న మందిరము నిర్మించిన లేక దానము చేసిన నెంతయో ఫలిత మున్నది. దానివలన మోక్షమున్నది. ఈ అభిప్రాయమే భీష్ముడు శరతల్పగతుడై శాంతి, అను శాసనిక పర్వములలో నుపదేశించి యున్నాడు. మోక్షము

జెందుటకు ధర్మమే మార్గము. అన్ని పురుషార్థములకుధర్మమే ప్రధానము. "The end justifies the means" — This is not the highest morality. సాధనముకూడ ధర్మమునకు అనుగుణముగా నుండవలయును. విద్యకన్న శ్రద్ధయే ప్రధానము. ఆ శ్రద్ధ మూడువిధములు. అందులో సాత్విక శ్రద్ధ యుత్తమము. దానిని అవలంబించుము.

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే శ్రద్ధాత్రయ
విభాగయోగో నామ సప్తదశోధ్యాయః
సంపూర్ణః.



# శ్రీ భగవద్గీతోపన్యాసములు



## 18 వ అధ్యాయము.

## మోక్షసన్న్యాసయోగము

శ్లో॥ 1. అర్జునుడు త్యాగ మన నేమో, సన్న్యాసమన నేమో తెలిసికొనగోరెను. అందుకు పరమాత్మ వివరముగా తెలుపుచున్నాడు.

శ్లో॥ 2. కొందరు కామ్యకర్మలు వదలిపెట్టుటలో సన్న్యాసశబ్దమును, సకల కర్మలు చేయుచు ఫలాపేక్ష వదలి పెట్టుటలో త్యాగశబ్దమును ఉపయోగించు చున్నారు. మొత్తముమీద త్యాగము, సన్న్యాసము పర్యాయపదము లనియే నా అభిప్రాయము.

శ్లో॥ 3. యజ్ఞము, దానము, తపస్సు, ఈ మూటివలన జీవుడు తరించుచున్నాడు.

యజ్ఞము=పంచమహా యజ్ఞములు. వీటిని గురించి 3 వ అధ్యాయములో చెప్పబడినది. ఈ అయిదింటిని బ్రహ్మా ర్పణముగా జేసితీరవలయును.

దానము - భగవంతుడు ఇచ్చిన ద్రవ్యము, విద్య, శరీరము నితరుల యుపయోగముకొరకు ఉపయోగించవలెను.

తపస్సు—ఆహారనియమాదులవలన శరీరము స్వాధీన ములో నుంచుకొనవలెను. ఈ మూడు ఆత్మోద్ధారణకు హేతు భూతము లగుటచే అత్యావశ్యకమైనవి. వీటిని వదలరాదు. ఇవి జీవుని పరిశుద్ధుని జేయును. అవసరమైన luxuries వదలి పెట్టవలయును. (పుణ్యక్షేత్రములకు వెళ్ళి వచ్చినవారు కామ క్రోధముల వదలి పెట్టవలయును.)

శ్లో॥ 4. త్యాగము, సన్న్యాసము, మూడువిధములు.

శ్లో॥ 7. Prescribed duties i.e. విధ్యుక్త ధర్మములు చేసి తీరవలయును. వాటిని పరిత్యజించుటకు వీలులేదు. వాటిని వదలిపెట్టిన తామసికత్యాగ మని చెప్పబడును. e. g. సంధ్యా వందనము, తర్పణము, శ్రాద్ధము మొదలైనవి. అట్టివి పరిత్యా జించిన వారికి రౌరవాదినరకము కలుగును.

శ్లో॥ 8. రాజసిక సన్న్యాసము ఏదనగా—శరీరమునకు కష్టమని భయపడి భగవత్ స్మరణ, ధ్యానము, పురాణశ్రవణము మొదలగు మంచికర్మలను మానుట రాజసికసన్న్యాసము. అట్టి దానికి సన్న్యాసఫలితము దక్కదు. కష్టమునకు లోబడి కర్మల నాచరించి సన్న్యాసము చేసిననే ఫలము కలుగును. రాజసిక త్యాగికి, సన్న్యాసికి ఫలితము దక్కదు.

శ్లో॥ 9. సాత్వికసన్న్యాసము, త్యాగము ఎట్టిది అనగా, అత్యావశ్యకమైన వేదశాస్త్రములచే విధింపబడిన కర్మలను అహంకార మమకారముల వదలిపెట్టి ఫలాపేక్ష లేకుండా

జేయునో, అది సాత్వికసన్న్యాసము, త్యాగ మనిపించుకొనును. మోక్షము కలుగును.

శ్లో॥ 13-14. కర్మానుష్ఠానము వలన జీవుడు తరించునా? అనగా, జీవుడు ఇపుడుజేయు కర్మానుష్ఠానమువలన తరించు నని చెప్పుటకువీలులేదు. ప్రతికార్యమునకు అయిదు కారణము లున్నవి. అవి సాంఖ్యశాస్త్రమందు, జ్ఞానశాస్త్రమందు చెప్ప బడినవి. ఇచట పరమాత్మ ప్రమాణపురస్సరముగావిధేయతతో చెప్పుధోరణి మిక్కిలి గమనించవలసిన విషయము. సాంఖ్య శాస్త్రము—కపిలమహర్షి వ్రాసినది. జైమిని పూర్వమీ మాంసలో పరమాత్మను ఒప్పుకొనలేదు. వేదవ్యాసుని ఉత్తర మీమాంస = బ్రహ్మసూత్రములు, ఆత్మను పరమాత్మను ఒప్పుకొనుచున్నవి. కపిలమహర్షి వ్రాసిన సాంఖ్యములో పర మాత్మను ఒప్పుకొనలేదు. కణాదమహర్షి వ్రాసిన వైశేషిక సూత్రములు పరమాత్మను ఒప్పుకొనలేదు. గౌతముని తర్క సూత్రములు సేశ్వరములు. పతంజలి యోగసూత్రములు సేశ్వరములు. మొత్తము దర్శనములు ఆరు—మూడు పర మాత్మను ఒప్పుకొనును. మూడు ఒప్పుకొనవు.

శ్లో॥ 14. అయిదు కారణములు యేవనగా:—

కారణములు రెం డుదాహరణములలో నిముడ్చనగును. 1. వంట 2. శ్రవణము.

(1) శ్రవణమునకు వంటకు అయిదు కారణములు కావల యును. స్థలము (అధిష్ఠానము) (2) రెంటికి కర్త కావలయును.

2 కరణములు-సామగ్రిలు. (4) వివిధాచ పృథక్ చేష్టా-ఆయా సమయములలో ఏమేపనులు చేయవలయునో అట్టినానావిధము లైన చేష్టలు చేసి తీరవలయును. (5) దైవము - The last and the most important is God's grace. ఈశ్వరానుగ్రహము అన్నిటికన్న ముఖ్యముగా నుండవలెను. There is many a slip between the cup and the lip. అటులే ప్రతికార్యమునకు అయిదుకారణములు. నాలుగు అముఖ్య కారణములు. స్థలము, కర్త, పరికరములు, నానావివిధములైన చేష్టలు, అయిదవది ముఖ్యకారము, దైవబలము. దైవబలముండుట వలననే పాండవులు తమకు ఇతరబలము తక్కువ అయినను గెలిచిరి. నాలుగు అముఖ్యకారణములలో ఒక్కడైన జీవుడు, ముఖ్యకారణమును గమనించక, తానే కర్తయని విఱ్ఱవీగుచున్నాడు. నాది అనుటకు బదులు భగవంతునిదని తెలుసు కొనవలయును.

The ways ot Providence are inscrutable. He has created different things in different ways with some purpose or other.

భగవంతుని లీలలు అతిగూఢములు, ఆయన ప్రతి దానిని యేదోయొక యుద్దేశ్యముతో నేర్పఱచుచున్నాడు.

మంచిపనులకు, చెడ్డపనులకు అన్నిటికి అయిదు కారణములు. అందులో ముఖ్యము దైవబలము అవసరము. ఇది యెరుగనివాడు దుర్మతి. దైవబలమును గురించి చెప్పిన శ్లోకము.

శ్లో॥ జాతం బ్రహ్మకులేఽగ్నిజో ధనపతి ర్భ్రాతా కుంభకర్ణానుజః
పుత్రో శక్రజిత స్స్వయం దశశిరాః పూర్ణా భుజా వింశతిః
స్వేచ్ఛః కామచరో రథాశ్వవిజయే మధ్యేసముద్రం గృహం
సర్వం నిష్ఫలితం తదైవ విధినా దైవేబలే దుర్బలే.

శ్లో॥ 18. మానవ జన్మ మెట్లు సఫలము చేసుకొనవలయును? అనగా జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత, కర్త, కర్మ, క్రియ, ఆత్మ, పరమాత్మ అన్నియు తెలిసికొనవలయును.

You must always be God-conscious whatever you might do. You must make hay while the sun shines. A man is mortal. He must learn all these things at the earliest opportunity and regulate his life accordingly.

నీవు ఏపని చేయుచున్నను భగవంతుడు కలడని గుర్తెరిగి చేయుము. పుట్టుట గిట్టుటకొరకే. ఈ శరీరము అశాశ్వతమని తెలిసికొని, దీపముండగానే యిల్లు చక్కబెట్టుకొనునట్లు, ఆత్మానాత్మవివేకము శీఘ్రముగా బడసి జీవయాత్ర గడుపుము.

శ్లో॥ 19. ఈ విషయము తెలుసుకొన్నవాడు జ్ఞాని, లేనివాడు దుర్మతి.

శ్లో॥ 20. జ్ఞానము మూడువిధములు. 1. సాత్వికజ్ఞానము. జ్ఞానస్వరూపియైన పరమాత్మను అన్నిటి యందు నున్నటుల తెలిసికొనుట సాత్వికజ్ఞానము. ఇట్టి జ్ఞానము కలవాడు మోక్షసామ్రాజ్యము చెందును.

2. రాజసికజ్ఞానము— శరీరములలో భేదమున్నట్లు ఆత్మలో భేద మున్నదనుకొనుట. ఇందువలన తరించడు.

3. తామసికజ్ఞానము—ఆత్మ శరీరముతోపాటు అభివృద్ధి యగు ననుకొనుట. ఇందువలన జీవుడు నరకాద్యధోలోకములలో పడును. పటము, విగ్రహము ఎంతో దేవుడు అంతే అనుకొనువారు శరీర మెంతో జీవుడు నంతే యనుకొనువారు, పరమాత్మ వైభవమును తెలుసుకొననివారు. అట్టివారు నరకము పాలగుదురు. ఇట్టివారి అజ్ఞానాంధకారము పోగొట్టుటకు యేసుక్రీస్తు, మహమ్మద్, సాక్రిటీస్ మొదలగు మహాపురుషులు ఆవిర్భవించి పరమాత్మ సర్వజ్ఞత్వము సర్వవ్యాపకత్వము ప్రజలకు బోధించియున్నారు.

ఈ మూటిలో సాత్వికజ్ఞాన ముత్తమమైనది. ఈ జ్ఞానముచెందుటకు కర్మచేయవలయును. ఆ కర్మలు మూడు విధములు. 1. సాత్వికకర్మలు. వేదశాస్త్ర పురాణముల జదివి, వర్ణాశ్రమధర్మముల ననుసరించి విధింపబడిన కర్మలను అహంకార మమకారములు లేకుండ ఫలాపేక్ష విడిచి చేయుట. 2. రాజసికకర్మలు-ఫలాపేక్షతో చేయునవి. 3. తామసికకర్మలు-అభిచారిక హోమములు మొదలగునవి.

కర్మలుచేయు కర్తలు మూడువిధములు:—

1. ఫలాపేక్ష లేకుండా ఈశ్వరార్పణబుద్ధితో జేయువాడు సాత్వికకర్త.

2. ఫలాపేక్షతో జేయువాడు రాజసికకర్త.

(శ్లో॥ 28.) 3. తామసికకర్త యెవడనగా—

(1) అయుక్తః- One who has no control over his body and sensory organs. శరీరమును ఇంద్రియములను మనస్సును తన స్వాధీనములో నుంచుకొనలేనివాడు.

(2) ప్రాకృతః-దీనికి రెండుమూడు విధములుగా అర్థములను జెప్పినారు. 1. విద్యావిహీనుడు. అట్టివాడు పశువుతో సమానము. **2.** వయస్సు ముదిరినప్పటికి చిన్నపిల్లలమాదిరి క్రీడలయందు కాలము గడుపువాడు. వయస్సు మిగిలిన పురుషులు స్త్రీలు ఆటపాటలయందు కాలము గడిపినయెడల వారు తామసికులు. 3. వయస్సు ముదిరినకొలది గంభీరమైన యోచన లుండవలెను. ఇతరుల క్షేమముకోరి కర్మలనుజేయువారు అని యొక అర్థము.

(3) స్తబ్ధః-పొగరుబోతుతనము.ఎంతఐశ్వర్యము సంతానమున్నను విఱ్ఱవీగకూడదు. పెద్దలయందు వినయ విధేయతలతో నడచుకొనవలెను. చదువుకొన్నవారిని, భాగ్యవంతులను, అధికారులను విభూతిరూపములని యెరిగి వారికి మర్యాద చూపవలయును. Pride will have a fall.

(4) శఠుడు = నమ్మించి గొంతుకోయువాడు. పైకి నవ్వుచు వినయవిధేయతల నటించుచు, తడిగుడ్డతో లోపల గొంతు కోయువాడు.

(5) అలసః - ఆలస్యము- Laziness (Late Latif's story) "Idle man's brain is the workshop of the Devil"

(6) విషాది—దుఃఖము. ఎప్పుడు యేడుపు.

A man who has always a morose countenance without being content with what God has given him. God gives to every person according to his capacity. Don't weep because others are more prosperous. భగవంతుడు ప్రసాదించిన వానితో తృప్తిచెందవలయును. వానిని భగవంతుడు నీ యోగ్యతకొలది ప్రసాదించును. ఇతరుల యైశ్వర్యముజూచి వగవకుము.

Another meaning is - మరియొక యర్థము:- భగవంతుడు సిరి,సంపద, సంతానము నిచ్చినను డబ్బు సద్వినియోగము జేయక యినుపపెట్టెలో పెట్టి తాళమువేసి, ప్రపంచము చెడిపోవుచున్నదని దుఃఖించువాడు.

(7) దీర్ఘసూత్రిచ— త్రుటి కాలములో చేయదగిన పనిని, అంతులేకుండ కాలము గడిపి దీర్ఘకాలములో చేయువాడని ఒక అర్థము. చురుకుగా పనిచేయువాడు సాత్వికుడు.

రెండవ అర్థము— ఎవడైన పొరపాటుచేసి తనను మన్నించుమని కోరగా వెంటనే వానిని మన్నించి దానిని అంతటితో మరచిపోవుట ఉత్తముల లక్షణము. అట్లు దానిని మరచిపోక పగబట్టి యెక్కువగా మనస్సులోనుంచుకొని వారిని యేదోవిధముగా సాధించి పరీక్షించువారు (దీర్ఘక్రోధము కలవారు) తామసులు. శ్రీరామచంద్రప్రభువు ఏమని చెప్పినాడనగా, నా భార్యను ఇంతకాలమునుంచి స్వాధీనములో నుంచుకొన్న రావణాసురుడు వచ్చి "నేను నీవాడను, మన్నింపుము"

అని యొకతూరి యనినను ఆతని మన్నించి కాపాడుట తన ధర్మమని గంభీరముగా తెలిపియున్నాడు. బుద్ధి, ధృతి యివి గూడ వారివారి గుణముల ననుసరించి మూడువిధములుగా నున్నవి.

(1) సాత్వికబుద్ధి:—ధర్మము ధర్మముగా, అధర్మము అధర్మముగా, ఏది చేయవచ్చును, ఏది చేయరాదు, అని ధర్మశాస్త్రములు విధించునో దానిని తెలుసుకొని అనుష్ఠించి బాగుపడుట.

(2) రాజసబుద్ధి:—ధర్మశాస్త్రములలో చెప్పిన విషయములు ప్రస్తుత కాలపరిస్థితులకు వర్తించునో, వర్తించవో పరమాత్మ యున్నాడో లేడో, శాస్త్రములు నమ్మవచ్చునో నమ్మకూడదో అని సందేహించువారు రాజసబుద్ధికలవారు. వీరికి తినుటకు అన్నము, కట్టుటకు బట్ట యున్న చాలును. దీనిని గేదెవేదాంత మనెదరు. గేదెకు గడ్డి, కుడితి యున్న చాలును. ఇతరవిచారణ వారి కనవసరము (ie., Buffaloe's' philosophy—it is content with water and fodder రాజసబుద్ధికలవాడు బాగుపడడు.

(3) తామసబుద్ధి:— ధర్మమును అధర్మముగా అధర్మమును ధర్మముగా అనుకొనువాడు తామసబుద్ధి కలవాడు. వీనికి నరకము కలుగును.

సాత్వికబుద్ధి కలవాడు మోక్షసామ్రాజ్యము చెందును.

ధృతి, ధైర్యము, పట్టుదల ఇవి మూడు రకములు:—

(1) సాత్త్వికధృతి—నేను సంధ్య, పారాయణ జేసిన గాని కాఫీతాగను, స్నానముజేసి పూజజేయనిదే నోటిలో నీళ్ళుపోసుకోను, అని అనుకొనువారు. ఆత్మోద్ధారణకు హేతు భూతములయిన స్నానము, సంధ్య, జప తపములయందు వీడని పట్టుదల సాత్త్విక ధృతి యనబడును.

(2) రాజసికధృతి-ధనార్జన మొదలగు ఐహిక విషయములలో సుఖమునకు కారణభూత మగు విషయములలో పట్టుదల.

(3) తామసికధృతి - ఇతరులకొంప కూల్చవలయు నను పట్టుదల.

శ్లో॥ 35 to 37. అన్నిప్రాణులు సుఖము కావలయు ననియు దుఃఖము అవసరము లేదనియు కోరుచున్నవి. పిపీలికాది బ్రహ్మపర్యంతము అందరు సుఖమునే కోరుచున్నారు. పసిపిల్ల అగుపడ్డ వస్తువుల నోటిలో పెట్టుకొని నిస్సారమైన వస్తువుల చవిచూచి దుఃఖించి మాతృస్తన్యము త్రాగి ఆనందము చెందు చున్నది. అటులే అన్నివస్తువులయందు నీ ప్రపంచములో సుఖమున్నదని భ్రమసి కొంతకాలము భార్యయందు కొంత కాలము, పిల్లలయందు కొంతకాలము పేరుప్రతిష్ఠల సంపా దించుటకై యెలక్షన్లయందు ఇత్యాదివ్యాపారములలో దిగి ధనవ్యయముచేసి, చివరకు ప్రాణము వేసారి ఇవియన్నియు నిర్గంధకుసుమము లని గుర్తెరిగి శ్రీలక్ష్మీనృసింహస్వామిపాదార విందములపై వ్రాలి మకరందమును గ్రోలి జీవులుతరింపనగును.

శంకరులవారు పంచరత్న స్తోత్రమందు ఈ విషయమై ఇట్లు వ్రాసినారు.

శ్లో॥చేతోభృంగ భ్రమసి వృథా భవమరుభూమౌ విరసాయాం
భజ భజ లక్ష్మీనరసింహానఘ పదసరసిజ మకరందమ్॥

సుఖము మూడువిధములు:—

(1) సాత్త్వికసుఖము:— ఆధిభౌతిక, ఆధ్యాత్మిక, ఆధిదైవికదుఃఖము లన్నియు ఏ సుఖము అనుభవించిన నశించునో యేది పొందిన అంతకన్న అతీతమైన సుఖములేదో యేది ఆదిలో కష్టముగా నున్నను అంత్యములో సుఖము నిచ్చునో (వేపయుండమాదిరి) అట్టిది సాత్త్వికసుఖము. ఇది ఇంద్రియ నిగ్రహ మనోనిగ్రహములవలన మనస్సును పరమాత్మయందు లగ్నపఱచి పొందునది.

(2) రాజసికసుఖము:—ఆరంభములో సుఖము అంత్యములో దుఃఖము. e. g. టాకీస్, డ్రామాలు, మైసూరు పాకు మొదలగునవి. ఇంద్రియములు విషయములలో ప్రవేశింప చేయుటవలన గలుగు సుఖము, contact born pleasure.

(3) తామసికసుఖము:—ఆదిలో కష్టము అంత్యములో కష్టము. e. g పొగము పీల్చుట, కల్లు, సారాయి మొదలగు పానీయములత్రాగుట, లాహిరివస్తువులు పీల్చుట, పరస్త్రీ గమనము మొదలగునవి. ఇవి మొదలు మనుష్యునకుగిట్టకున్న నుసహవాసదోషమువలన కష్టముపై అలవాటుచేసికొని అంత్యములో దానివలన మిక్కిలి కష్టము అనుభవించుచున్నాడు. వీటివలన ధనవ్యయమును, శరీరమునకు జబ్బును ఏర్పడుచున్నవి.

త్రాగుబోతుతనము, వ్యభిచారమువలన అనేక కుటుంబములు నాశనము లగుచున్నవి. ఈ చెడ్డ అలవాట్లు కష్టముపై అల వాటుపడి, నడుమ సుఖము కలుగజేయుచున్నట్లు భ్రాంతి కలిగించి, కడపట కష్టసాగరమందు ముంచుచున్నవి. "భ్రష్టస్య కావా గతిః" ఒక దురభ్యాసము వెంట మరొక దురభ్యాసము అలవాటుపడును. పరమాత్మయందు మనస్సును లీనపరచి ఇంద్రియముల గుప్పిట నుంచుకొని సాత్విక సుఖము పొందుట యుత్తమము.

శ్లో॥ 40. ప్రపంచములో అందరియందు ఈ మూడు గుణము లున్నవి. ఏగుణము ప్రకోపముగా నుండునో దానిని బట్టి వారు ఏ తరగతిలో జేరినది నిర్ణయించవచ్చును. అందరు సంసార చక్రములో కట్టుబడి, మూడుగుణములకు లోబడి యున్నంతవరకు జననమరణములు అంతులేకుండా పొందు చున్నారు. మూడుగుణముల జయించిన, సంసారచక్రమునుంచి విడుదల కలుగుచున్నది, దీనికి జ్ఞానభక్తివైరాగ్యములు అవసరము. ఇది మానవులకే సాధ్యము. దేవత లందుచేత మానవజన్మ తమకు కావలయు నని కోరుచున్నారు. గనుక అట్టి మానవజన్మ జ్ఞానభక్తివైరాగ్యములు పొందుటకు ఉప యోగించి పునర్జన్మ లేకుండ చేసికొనవలెను.

శ్లో॥ 41. ఈ మూడుగుణముల జయించుట యెట్లు? అని అర్జునుడు అడిగినాడు. ఒక కర్మవలన జననము, మరి యొకకర్మవలన జన్మరాహిత్యము కలుగుచున్నవి. కర్మయే అన్నిటికి సూత్రము. మొదటినుంచి చివరకు కర్మయే ప్రధా

నము:—Every one should discharge his duty బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు తమకు విధింపబడిన కర్మలను చక్కగా అనుష్ఠించవలయును.

బ్రాహ్మణజాతివారి ధర్మము లెవ్వి? ఇంద్రియనిగ్రహము, మనోనిగ్రహము ఎక్కువగా నుండవలయును. మనస్సు నియమించుకొనవలయును. ఎల్లపుడు కాయక్లేశాదులు, ఆహార నియమమువలన శరీరము కృశింపజేసుకొనవలెను. వారికి అంతశ్శుద్ధి (మానసిక) బహిశ్శుద్ధియు నుండవలెను. కోప ముండరాదు. దూషణవాక్యము లమృతము మాదిరి భావించవలయును. ఏల ననగా, అందువలన తాను ఎంత మంచివాడైనను మానవుల తృప్తిపరచలేనని గ్రహించి పరమాత్మను తృప్తిపరచుటకై యత్నించుటకు అవకాశము కలుగుచున్నది. ఆర్జవము—తలచునది, చెప్పునది, చేయునది యొకటియై యుండవలెను. వేదశాస్త్రపురాణముల చదివి విజ్ఞానము పొంది తాను ప్రాక్టికల్ (practical) గా అనుభవించి, తాను ఆత్మసుఖము పొంది,యితరులకు తతిమ్మాజాతుల వారికి ఆ జ్ఞానము వెదజల్లవలయును. తతిమ్మా జాతులవారిని తరింపజేయు బాధ్యత బ్రాహ్మణుల యందున్నది. రైల్వేఇంజన్ 1,2,3 తరగతుల బండ్లను ఈడ్చుకొనిపోయి తానుగూడ ఏమాదిరి గమ్యస్థానమును జేరునో, అటులే బ్రాహ్మణుడు తన్ను తా బాగుపరచుకొని ఇతరజాతులవారిని పరమాత్మ సాన్నిధ్యము చేర్చవలెను.

43. క్షత్రియ ధర్మము — వారి ముఖమున మంచి

తేజస్సుండవలయును. ధైర్యము, పట్టుదల, సమయోచిత బుద్ధి యుండవలెను. యుద్ధములో జయములేక ప్రాణత్యాగము చేయవలయునేగాని శత్రువునకు వెన్నుచూపి పారిపోయి రాకూడదు.

రాజు = ప్రజల రంజింపచేయువాడు. ప్రజల కష్టముల తన కష్టములుగా భావించి వారికి తగిన సౌకర్యముల నేర్పరచ వలయును.

44. వైశ్యధర్మము—వర్తకవ్యాపారముల చేయుట; కల్తిలేకుండ న్యాయమైన లాభమునకు వస్తువులు అమ్మిన అందరు క్షేమముగా నుండెదరు.

శూద్రధర్మము—మోటుపనులు. e. g. ఇండ్లుకట్టుట, బండ్లులాగుట మొదలగు పనులు. నాలుగు వర్ణములవారు ఒకరికొకరు సహాయభూతులుగా నుండిన సర్వసుఖములు చెంద నగును. ప్రతిదేశములో నీ నాలుగువిధము లయిన జాతులు ఉండియే తీరవలయును. వీరిలో ఒకరు ఎక్కువ, ఒకరు తక్కువ అని కొట్టుకొని చావకూడదు. అన్నిజాతులు, అన్ని ఆశ్రమములు, పురుషులు, స్త్రీలు అందరు నీ జగత్కళ్యాణమునకు అవసరమే. వారివారి ధర్మములు ఈశ్వరార్పణబుద్ధితో చేయునెడల పరమాత్మ సంతోషించి ఇహపరలోకసుఖముల నిచ్చుచున్నాడు. Carlyle said. "Work is worship."

ఒకజాతివారి ధర్మము మరియొకరికి కష్టముగా తోచినను ఆజాతివారికి తప్పుకాదు. e. g. కసాయివాడు గొడ్లనుచంపుట తప్పుకాదు. ఉత్తమజాతివాడు ఆ పని చేయరాదు. ధర్మ

వ్యాధుడు (కసాయి) కౌశికునకు వేదాంతము బోధించెను. యుద్ధములో హింస యున్నదని యితరు లనుకొన్నను క్షత్రియుడు దానిని వదలరాదు. కనుక ప్రతిదానిలో హింస యున్నది. e. g. హైకోర్టు జడ్జి ఎందరికో ఉరిశిక్ష విధించుచున్నాడు. మేష్టరు పిల్లలను బెంచిపై నిలువవేయు చున్నాడు. వేదాంతబోధవలన వినువారి ఆటపాటలకు యిబ్బంది కలుగుచున్నది. చెప్పువారికి కొంత దేహశ్రమ కలుగుచున్నది. హింసలేనిపని ప్రపంచములో లేదు. గనుక యేమి చేయవలెనంటే మన జాతిధర్మము మనము నెరవేర్చవలయును. "స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః" అట్టి వారల పరమాత్మ అనుగ్రహించి వారి కైహికాముష్మిక సుఖముల నిచ్చుచున్నాడు.

మనోనిగ్రహమునకు కావలసిన విషయములు :—

(1) నిర్జనప్రదేశములో నుండుట.

(2) లఘ్వాశి=తేలికగా భోజనము చేయుట.

(3) మనస్సు మంచి విషయములయందు పరమాత్మయందు ఉపయోగించవలయును. అట్టివారు పరమాత్మానుగ్రహమునకు పాత్రులై సంసారమునుండి తరింతురు.

శ్లో॥ 59. అర్జునా ! నేను నీకు ఎన్నివిధముల కర్మచేయుట అవసరమని తెలిపినను నీవు గ్రహింపక, యుద్ధము చేయనని అనుకొన్నను, నీ ప్రాచీనకర్మ నిన్ను దాన ప్రవేశపెట్టును. నాచేతులలో మీరు బొమ్మలవంటివారు. Your resolution

not to wage war will go to dogs. మన యిష్టప్రకారము మనము చేయలేము. భగవంతుడు ఎట్లు ప్రేరేపించునో అట్లు నడువవలయును.

శ్లో॥ 63. శ్రీమన్నారాయణుడు ప్రతివారి హృదయమునం దున్నాడు. మనము బొమ్మలను స్ప్రింగుద్వారా ఎట్లు త్రిప్పుదుమో అట్లే పరమాత్మ మనల నందరిని ఆడించుచున్నాడు. పరమాత్మసంకల్పము ఎట్లున్నది, ఏసమయములో నేది రానున్నది జీవులకు తెలియదు. పరమదరిద్రుడు నిమిషములో కోటీశ్వరు డగుటయు, కోటీశ్వరుడు మఱుక్షణములో దరిద్రు డగుటయు జరుగుచున్నది. మనచేతులలో బొమ్మల మాదిరి జీవులందరు పరమాత్మచేతులలో చిక్కుపడియున్నారు. ప్రపంచము రంకులరాటమువంటిది. పరమాత్మ రంకులరాటము త్రిప్పువానిమాదిరి. 84 యోనివర్గముల తనమహిమవల్ల గిరగిర త్రిప్పుచున్నాడు. ప్రపంచ మంతయు ఒక నాటకము. జగన్నాటక సూత్రధారి శ్రీమన్నారాయణుడు. జీవులనందరిని వారి వారి ప్రాచీన కర్మల ననుసరించి పరమాత్మ నడుపుచున్నాడు. జీవులకు స్వాతంత్ర్యములేదు. గనుక అర్జునా! నీవు యుద్ధము వద్దనుకొనిన నా సంకల్పప్రకారము జరిగియే తీరును. పరమాత్మ సర్వతంత్రుడు. జీవుడు అస్వతంత్రుడు.

కనుక సర్వనియామకుడైన ఆ పరమాత్మను శరణుజొచ్చి, నీ పాదములే గతియని, "నీపాదముల వదలను" అని పరమాత్మపాదారవిందములను గట్టిగా పట్టుకొనుము. అందు

వలన ఆయన అనుగ్రహమునకు పాత్రులమై దుఃఖ సంబంధము లేని శాశ్వతమైన సుఖము జెందెదము.

అర్జునా! ఈ భగవద్గీత మిక్కిలి రహస్యమైనది. దాని వలన కలుగు లాభనష్టములు నీకు తెలియచెప్పినాను. గనుక నీ యిష్టమువచ్చినట్లు ఆచరించుము. విమర్శచేసి నీకు ఏది మంచిదని తోచునో అట్లుచేయుము, అని శ్రీకృష్ణ పరమాత్మ సెలవిచ్చెను. గురువు శిష్యుని ఎన్నడు బలవంతపెట్టరాదు. మంచిమార్గ మిదియని తెలిపి ఊరుకొనవలయును. బాగుపడ వలసిన వా డద్దానిని అవలంబించును.

ఏమనగా—మనస్సు నాయం దుంచుము. నీ దారపుత్రా దులయం దుంచకుము. ఇతరుల ఆశ్రయించవద్దు. వారు అశా శ్వతమైనవారు. ఏ యజ్ఞములు జేసినను నాకు అర్పించుము. నాకు నమస్కరించుము. అట్లుజేసి పరమాత్మనగు నన్ను పొందవచ్చును. ఇది ముమ్మాటికి సత్యము. నీవు నాకు చాలా యిష్టుడవుగనుక హితమైన మాట చెప్పియున్నాను. నీవు నాకు ప్రీతిపాత్రుడ వగుటచే నీ మంచికోరి యీ విషయము తెలుపు చున్నాను.

శ్లో॥ 66. ఇది చరమశ్లోకము. ఏల ననగా:—

(1) మొదటిఅధ్యాయము 47శ్లోకములు 2అధ్యాయము లోని 1—11 శ్లోకములు గీతలో పూర్వపీఠిక. ఈ అధ్యా యములో 67-78 శ్లో॥ వరకు ఉత్తరపీఠిక. 66 శ్లో॥ ఉపదేశ ములో కట్టకడపటిది గనుక చరమశ్లోకమని చెప్పెదరు.

(2) అవసానకాలమందు జ్ఞాపక ముంచుకొనవలసిన శ్లోకముగనుక చరమశ్లోకమని కొందరు చెప్పినారు.

(3) వైష్ణవవ్యాఖ్యాతలు వ్రాసినది యేమనగా:— అన్నిటికన్న ముఖ్యమైనమార్గము శరణాగతి. ప్రపత్తిని గురించి చెప్పినారు గనుక నిందు చరమోపాయ ముండుటచే దీనిని చరమశ్లోక మని చెప్పియున్నారు. (Last and the greatest means) ఈ శ్లోకమునుగురించి యెన్నేని భాష్యములు వ్రాయబడినవి. శ్రీవైష్ణవగురువులు శిష్యుల సమాశ్రయముచేసి ఉపదేశము జేయు రహస్యత్రియములో అష్టాక్షరీ ద్వయము, చరమశ్లోకములలో ఈ శ్లోకము ఒకటియై యున్నది.

దీనికి ముఖ్యమైన అద్వైతవ్యాఖ్యానము ఏమనగా— కర్మవలన అజ్ఞానము నశింపజేసికొని జ్ఞాననిష్ఠలో అంతశ్శుద్ధితో Conception of time, conquer జేసి, జీవ బ్రహ్మైక్యము పొందనగును. సగుణోపాసనచేసిన నాలో కలుపుకొనెదను. అజ్ఞానదశలో కర్మానుష్ఠానమును, జ్ఞాననిష్ఠలో కర్మసన్న్యాసమును జీవబ్రహ్మైక్యము అని చెప్పబడినది. పాపములు తీర్థయాత్రలవలన నశింపుచేసి తదుపరి భగవద్భజన చేసెద ననుట పొరపాటు. పాపము లున్నను పరమాత్మను భజించి అన్ని పాపములు పోగొట్టుకొనవచ్చును. పాపములు పోయిన తరువాత నన్ను భజించవలసిన అవసరము లేదు. "What is the use of sitting in a dark room and crying darkness, darkness? Strike a lucifer match and all the

darkness will vanish" said Vivekananda. పరమాత్మ భజన అను ఏకమూలికాప్రయోగమువలన భవరోగము లన్నియు హరించును. అజ్ఞానాంధకారము పటాపంచలై పోవును. వేరే తీర్థయాత్రలు ప్రాయశ్చిత్తములు అవసరములేదు. అట్టివి శరీరబలము కలవారికి ధనముగలవారికి ఒకవిధముగ ఉపయోగపడును. కాని పరమాత్మను భజించిన అట్టి శరీరదార్ఢ్యము, ధనము లేనివారుకూడ సులభముగా తరించవచ్చును. మహాపాపులుకూడ తన్ను ఆరాధించిన పాపములన్నియు నశించును, మోక్షము గలుగును. గనుక అధైర్యపడవద్దు, అని యీశ్లోకములో పరమాత్మ దయతో అర్జునుని వ్యాజముగా పెట్టుకొని మనబోటి పామరులందరికి తెలియబరచియున్నాడు.

శ్లో॥ 70. అర్జునా! ఇది జ్ఞానయజ్ఞము e.g. గీతచెప్పుట, పశువును వధించుట కర్మయజ్ఞము. కర్మయజ్ఞముకన్న జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమైనది.

అర్జునా ! ఈశ్వరుని శుశ్రూష, గురుశుశ్రూష చేయని వారికి, శాస్త్రములయందు నమ్మకము లేనివారికి భగవద్గీత చెప్పరాదు. నాపరతత్త్వము గ్రహించనివారికి, వేదపురాణముల యందు నమ్మకము లేనివారికి, ఇతరుల ఔన్నత్యము చూచి ఓర్చలేనివారికి, గీతచెప్పిన ప్రయోజనములేదు. ఎవరైతే శ్రద్ధతో మూలముగాని, అర్థముగాని యితరులకు చెప్పినగాని, భక్తిశ్రద్ధలతో వినినగాని అట్టివారు నా సంపూర్ణానుగ్రహము నకు పాత్రులగుచున్నారు. అట్టివారితో సమానులైనవారు నాకు

లేరు. వారికి మోక్షము కలుగును. ఎవరు గీతను అర్థము తెలిసినను తెలియకున్నను పారాయణము చేసెదరో, లేక పుస్తకము ఇంటిలో నుంచుకొన్ననుసరే, ప్రారబ్ధకర్మవలన పొందిన శరీరసంబంధము విడిచినతరువాత మోక్షము చెందెదరని ఫలశ్రుతి యిచట చెప్పబడినది.

ఇది అంతయు సంజయుడు ధృతరాష్ట్రునకు, తాను వేదవ్యాసుని అనుగ్రహమువలన దూరదృష్టి దూరశ్రవణము పొందినందువలన కృష్ణార్జునసంవాదము స్వయముగా వినియున్నాను అని చెప్పియున్నాడు. మరియు, "ధృతరాష్ట్రా! నేను ఆ విశ్వరూపమును చూచియున్నాను. ఆ సంభాషణ, విశ్వరూపము తెరలు తెరలుగా నా మనస్సునందు పొర్లి మహానందము కలిగించుచున్నవి. అవి జ్ఞాపకపరచుకొనిన నాకు మైమఱపు కలుగుచున్నది. ఆ యుపదేశము విని అర్జునుడు స్వధర్మమైన యుద్ధము చేసెను" అని సంజయుడు ధృతరాష్ట్రునకు తెలియపరచెను.

ధృతరాష్ట్రుడు యుద్ధఫలితమేమి? అని అడిగెను. దానికి సంజయుడు ఈ క్రిందివిధముగా జవాబు చెప్పెను.

శ్లో॥ 78. ఏపక్షమున సకలయోగులకు అధిపతి యగు శ్రీకృష్ణుడు, భక్తులలో అగ్రగణ్యుడగు అర్జునుడు నున్నారో ఆపక్షమున చేరినవారికే సకలదుఃఖనివృత్తి, తేజస్సు, జయము, సత్ప్రవర్తన, మోక్షఫలము కలుగు నని నా అభిప్రాయము, అని సంజయుడు ఆనందపరవశుడై ధృతరాష్ట్రునికి చెప్పెను.

యోగీశ్వరః—కర్మ, జ్ఞాన, భక్తి, ధ్యానయోగముల ననుష్ఠించువారికి పరమాత్మయే గమ్యస్థానము. సకల యోగులకు కృష్ణుడే పరమప్రభువు. కనుక ఆయన యోగీశ్వరు డనబడును.

ధనుర్ధరుడు అను పదప్రయోగమునకు అర్థము ఏమనగా "ప్రణవోధనుః, శరోహ్యాత్మా, బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే, అప్రమత్తేన వేద్ధవ్యం, శరవత్తన్మయోభవేత్" అను ముండకోపనిషత్తువాక్యమును అనుసరించిన ప్రణవము(ఓంకారము)ధనుస్సు. జీవుడు బాణము, బ్రహ్మవస్తువు లక్ష్యము. ఈ జీవుడను బాణమును, బ్రహ్మ మను లక్ష్యమును చెందునట్లు జాగ్రత్తతో ప్రయోగించవలయు ననుట, అనగా ప్రణవోపాసనయొక్క గొప్పతన మిందు సూచింపబడినది.

సంజయుడు కౌరవులకు అపజయము కలిగెనని స్పష్టముగా చెప్పక భావగర్భితముగా సూచించెను. ఒకరికి కష్టము కలిగించుమాటలను తొందరపడి స్పష్టముగా చెప్పరా దనుట గ్రాహ్యము.

గీతయొక్క మూడుషట్కములయందలి సారాంశము మూడుముక్కలలో చెప్పనగును. కర్మ, భక్తి, జ్ఞానము, i.e. Work, Worship and Wisdom. ఆత్మ నేను, అను జ్ఞానమును ఆధారముగా కలిగి భక్తితో వారి వారి ధర్మములను ఆచరింపవలయు ననుట తిలక్ మహాశయుని గీతారహస్యముయొక్క సారాంశము.

శ్రీ రామకృష్ణపరమహంసస్వామి తన శిష్యుడగు వివేకానందునికి గీత యను మాటనే కొన్ని పర్యాయము లుచ్చరించిన 'గీతా' 'గీతా' 'గీతా' అనుటలో తాగీ, తాగీ = త్యాగి యగు నని తెలుపుచున్నదని బోధించెను.

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే మోక్షసన్న్యాస
యోగోనామ అష్టాదశోధ్యాయః
సంపూర్ణః.



# సింహావలోకనము



## గీతాసారము

అధ్యా 1. ధర్మక్షేత్రమయిన కురుక్షేత్రమున పాండవులు కౌరవులు యుద్ధముచేయుటకు చేరిరి. సమావేశమైన కౌరవులను చూచి అర్జునుడు తన సారథియగు కృష్ణునితో ఇట్లనెను. "ప్రీతిపాత్రులైన స్నేహితులు, బంధువులు, పూజనీయులగు గురువులు శత్రుపక్షమున జేరియుండగా వారిమీద బాణముల నెట్లు ప్రయోగించగలను? అందువలన అఖండ భూమండలము స్వాధీనమగున ట్లున్నను, త్రైలోక్యాధిపత్యము వచ్చునట్లున్నను, యుద్ధముచేయుటకు నాకు ఏమాత్రము నిష్టము లేదు. శరీరము తపించుచున్నది, మనస్సు పరిభ్రమించుచున్నది, గాండీవము జారి పడిపోవుచున్నది" అని చెప్పి యుద్ధముచేయుటకై రథమునకు ముందు నిలువబడిన అర్జునుడు వెనుకకు నొదిగిలబడిపోయెను. ఈ అధ్యాయమువలన వారు వారు చేసిన కాయిక వాచిక మానసిక దోషములను తలచి తలచి పశ్చాత్తాపము చెందవలయును. Repentance is half cure. ఇతరుల కష్టములు మన కష్టములవలె తలచి వాటిని పోగొట్టుటకు ప్రయత్నించవలయును. నిప్పుసెగవలన మైనము కరుగునట్లు ప్రాపంచిక దుఃఖములచే మన మనస్సు కరుగవలయును. ద్రవ్యార్జన చేయునపు డితరులకు ఏవిధమైన కష్టము కలిగింప

కుండవలయును. ఇట్లు దుఃఖపడు అర్జునుని వ్యాజముగా నుంచు కొని పిపీలికాది బ్రహ్మపర్యంతము వ్యాపించి యుండెడి సకల జీవుల నుద్ధరించుటకై పరమాత్మ శ్రీకృష్ణుడు 108 ఉపనిష త్తుల సారాంశము నుపదేశించుటకు ఆరంభించుచున్నాడు. ముక్తికి సమీచీనసాధనమైన జ్ఞానమును మొట్టమొదట నుపదేశించుటకు ప్రారంభించుచున్నాడు.

అధ్యా 2. "ఓ అర్జునా! పరమాత్మనగు నేను కాని నీవంటి యేజీవుడు కాని భూతభవిష్యద్ వర్తమాన కాలముల యందు నాశనములేని తత్వములము. ఈజీవాత్మగాని, పరమాత్మ గాని అస్త్రశస్త్రాది ఆయుధములచే ఛేదించుటకు, భేదించుటకు తడుపుటకు సాధ్యముకావు. కనుక ఆత్మలు నిర్వికారమై శాశ్వ తమై జ్ఞానమయమై ఆనందమయమైనవి. అట్టి ఆత్మలను గురించి దుఃఖపడువారు మూఢులే. శరీరములన్ననో జడములు, దుఃఖ మును కలిగించునవి, అజ్ఞానమయమైనవి, పరమాశుద్ధమైనవి. గనుక అశాశ్వతమైన శరీరముల గురించి దుఃఖపడి ప్రయోజ నములేదు. శాశ్వతమైన ఆత్మలనుగురించి దుఃఖపడవలసిన అవ సరములేదు. ఇల్లు వేరు, యజమానుడు వేరు నెట్లో, చొక్కా వేరు, ధరించువాడు వేరగుటయెట్లో, పంజరము వేరు, పిట్ట వేరు నెట్లో, అట్లే శరీరము వేరు ఆత్మ వేరు అని యెరుంగవలయును. అట్టి యెరుకవల్లనే సకలదుఃఖములను పోగొట్టుకొని సకల ఐహి కాముష్మిక సుఖముల నన్నిటిని చెందనగును. ఇదియే జ్ఞానమా ర్గము. అంతఃకరణశుద్ధిగలిగిన మహానుభావులకు జ్ఞానయోగము

సాధనము. అంతఃకరణశుద్ధి లేనివారికి కర్మయోగమే సాధనము. అట్టి కర్మయోగమును చెప్పుటకు ఆరంభించుచున్నాడు.

"ఓ అర్జునా! వారివారి జాతి, మత, వర్ణాశ్రమ ధర్మములు, ద్రవ్యార్జనకొరకు ఏర్పరచబడిన వృత్తులు, సకల లౌకిక వైదిక కర్మలు (Secular and spiritual duties.) ప్రతిరోజు చేయబడవలసిన స్నానసంధ్యాది నిత్యకర్మలు, ఆయా తిథి వార నక్షత్రములందు చేయవలసిన శ్రాద్ధాది నైమిత్తిక కర్మలు, లేక కాయిక వాచిక మానసిక కర్మలు, i.e. physical, verbal and mental acts ఫలాపేక్షతో చేయుట ప్రవృత్తిమార్గమని చెప్పబడును. మోక్షఫలమునే కోరియుండుట నివృత్తి మార్గమని చెప్పబడును. ఈ నివృత్తికర్మానుష్ఠానమే జీవునిపాప పుణ్యముల నుండి విడిపించి అంతఃకరణశుద్ధిద్వారా మోక్షమును కలిగించును. నివృత్తి కర్మానుష్ఠానముద్వారా జ్ఞానము చెందినటువంటివాడు ఎల్లపుడు సమాధియోగమునం దుండ నవసరము లేదు. అట్టివాడు జాగ్రదవస్థ చెంది బహిర్ముఖుడై ప్రపంచమున సంచరించునపుడు స్థితప్రజ్ఞు డనబడును. అట్టివాడు ప్రపంచసంబంధమైన కోరికలను జయించి ఎట్టి గొప్ప సుఖదుఃఖములు కలిగినను వికారమును చెందక, తనప్రాణము నైన ఇతరుల కిచ్చుటకు సంసిద్ధుడై, తాబేలువలె ఇంద్రియములను ఒక్కనిముసములో ఉపసంహరించుకొనును. అట్టిబ్రహ్మజ్ఞానికి ప్రాపంచిక విషయములు రాత్రివంటివి; అనగా స్ఫురింపవు. ఆత్మస్వరూపము, పరమాత్మస్వరూపము అతనికి పగలు

వంటివి, అనగా చక్కగా స్ఫురించును. పామరజనులకు ప్రాపంచిక విషయములు పగలువంటివి. ఆత్మవిషయము రాత్రివంటిది. ఇట్టి జ్ఞాననిష్ఠ కర్మనిష్ఠ పరమవార్ధక్యదశలో అనుష్ఠింపబడినను ముక్తిచెందనగును, అనుట, ద్వితీయాధ్యాయము యొక్క సారాంశము.

అధ్యా 3. కర్మలు ఎప్పుడు చేయకున్నను, కొంత కాలము చేసియుండి అపక్వస్థితిలో వదలినను జ్ఞానము కలుగ నేరదు. జనకుడు, అశ్వపతి, ప్రియంవద మున్నగు రాజర్షులు బ్రహ్మజ్ఞానులుగా నున్నను వారివారిస్వధర్మములు వదలకుండిరి. ముక్తిప్రదాతయగు నేను గూడ కర్మానుష్ఠానము చేయుచున్నాను. సంఘమున నుండు బ్రహ్మజ్ఞాని తనకు ప్రయోజనము లేకున్నను లోకసంగ్రహార్థము కర్మలను చేయవలయును. అజ్ఞాని స్వోపయోగార్థమై కర్మలను జేయవలయును, విధ్యుక్తకర్మలను (prescribed duties) చేయనీయక అడ్డుపరచునట్టి శత్రువులు కామక్రోధములే, వాటిని అన్నివిధముల పరిహరించుటకు ప్రయత్నింపవలయును.

అధ్యా 4. ఎపుడు అధర్మము ఎక్కువై ధర్మము తగ్గుచున్నదో అపుడు దుష్టనిగ్రహశిష్టపరిపాలనాది కార్యముల ద్వారా నానావిధధర్మములను భగవంతుడు స్థాపించుటకు రామకృష్ణాద్యనేకావతారముల నెత్తుచున్నాడు. అట్టి పరమాత్మను ఏ రూపముతో నున్నట్లు భజింతుమో ఆరూపముతోనే ప్రసన్నుడగును. రామకృష్ణాద్యవతారములయందుగాని, శివ

కేశవులయందుగాని భేదముల పాటించక వారివారి అభిమాన దైవమునే యుపాసించవలయును. అట్టి యుపాసనవలన సకల ఐహికాముష్మిక సుఖముల చెందవచ్చును. ఈశ్వరుని యుపాసన చేయుటకు కర్మానుష్ఠానము ముఖ్యాంగము. ద్రవ్యయజ్ఞము, మతగ్రంథములను చదువుట, యాగములు, ఆహారనియమము, ప్రాణాయామము మున్నగునవి నానావిధనివృత్తికర్మలు. ఇవి జీవుని జ్ఞానమునందు చేర్చును; జీవుడు అనేకజన్మలయందుచేసిన పాపపుణ్యము లగు కర్మరాశిని భస్మీభూతముగా చేయును. శ్రద్ధకలిగినవానికే జ్ఞానము కలుగును. మూఢుడు, శ్రద్ధలేని వాడు, సందేహపడువాడు ఇచట సుఖములను చెందడు; పర లోకమునను సుఖమును జెందడు. కనుక బ్రహ్మార్పణబుద్ధితో కర్మల ననుష్ఠించి తద్ద్వారా జ్ఞాన మను కత్తిని పొంది పరమ శత్రువగు సందేహమును తెగనరుక వలయును.

అధ్యా 5. సన్న్యాసము బాహ్యము,ఆంతరంగికము అని రెండువిధములు. ఆంతరంగిక సన్న్యాసము (mental renunciation) అన్ని జాతుల వారికి, సకల ఆశ్రమస్థులకు స్త్రీలకు పురుషులకు సమాన ధర్మము. బాహ్యసన్న్యాసము (external renunciation) = వేషముల మార్చుకొనుట. జాతులలో బ్రాహ్మణులకు, ఆశ్రమములో సన్న్యాసులకు, స్త్రీలలో వితంతువులకు నుపరిగా నుండి తీరవలయును. ఈబాహ్యసన్న్యాసము కూడ చాలవరకు ఆంతరంగిక సన్న్యాసమునకు సాధనము. కర్తృత్వము జడ ప్రకృతియందో, పరమాత్మయందో సమ

ర్పించి విధ్యుక్తకర్మలను వదలక ఆచరించుటయే కర్మ సన్న్యాస మనబడును. అట్టి సన్న్యాసమువలన బ్రహ్మజ్ఞానము పొంద నగును. బ్రాహ్మణునియందు, చండాలునియందు, కుక్క, యేనుగు, ఆవు మున్నగు వాటియందు పరబ్రహ్మ స్వరూప మును గుర్తెరుంగుటయే జ్ఞానము. ఎవరి పాపపుణ్యములను వారే అనుభవింప వలయును. కనుక శాస్త్రములందు విధింప బడిన కర్మలను అహంకార మమకార ఫలాపేక్షలను వదలిపెట్టి యాచరించువాడే కర్మసన్న్యాసి.

అధ్యా 5. ప్రాపంచిక విషయములందు ప్రసరించు టయే స్వభావముగా కలిగిన మనస్సును వానినుండి త్రిప్పి, పర మాత్మయందు లీన మగునట్లు చేయవలయును. అదియే ధ్యాన యోగము. మితముగా భుజించుట, మితముగా నిద్రపోవుటయు నుండవలయును. అనవసరమైన భోజన పదార్థములు, పానీయ ములు, సువాసన ద్రవ్యములు మున్నగు వానిని వదలిపెట్టవల యును. విషయములందలి దోషములను గమనించుటవలనను, పరమాత్మయందలి అనంతకల్యాణగుణముల స్మరించుటవలనను, ధ్యానయోగము కుదురును. ఈధ్యానయోగము జీవుడు అనేక జన్మలయందు చేయు కృషివలననే యేర్పడును. జ్ఞానయోగము కర్మయోగము మున్నగువానికన్న ధ్యానయోగము మిక్కిలి శ్రేష్ఠమైనది. సర్వాంతర్యామియగు పరమాత్మను భజించి ధ్యానించువాడే సర్వోత్తముడని శ్రీకృష్ణుడు ఈ యధ్యాయము నందు తెలిపియున్నాడు. ఈ మొదటి షట్కమునందు ప్రస్తావింప

బడిన ముఖ్యాంశము కర్మయోగము. i.e. Duty for duty's sake or duty for God's sake. The former motto is for westerners, and the latter motto i.e. "Duty for God's sake" is ours.

అధ్యా 7. అనేకవేల ప్రజలలో నొకానొకడే నా విషయము శ్రవణముచేయును. అట్లు శ్రవణముచేయు అనేకులగు వేల ప్రజలలో నొకానొకడే మననము చేయును. అట్లు మననము చేయు అనేకవేల ప్రజలలో నొకానొకడే నిదిధ్యాసనము (i.e. concentration or meditation) చేయును. ఈ చరాచరాత్మకమైన ప్రపంచమును జడప్రకృతి, చేతన ప్రకృతి అను రెండు సాధనముల వలన సృజించి, కాపాడి సంహరించుచున్నాను. నేను హారములో దారము మాదిరిగా అన్నిటియందు వ్యాపించి జగదాధారభూతుడనై యున్నాను. ప్రతివస్తువునకు గౌరవము కలిగించు అంశమునందు ఆరంభ దశలో నన్ను నుపాసన చేసేయెడల, కాలక్రమమున అన్నిట సాత్విక, రాజస, తామస పదార్థము లన్నిటియందు నన్ను నుపాసింపనగును. జీవులకును పరమాత్మనగు నాకును, మధ్యలో మాయ యను పరదా వేయబడియున్నది. మాయ జీవునికి ప్రతిబంధకమే. కాని నాకు ప్రతిబంధకముకాదు. కనుక నేను, మాయాధీశుడను (Lord of Maya). జీవుడు మాయకు లోబడిన వాడు (Subject to maya) ఇట్టిమాయను దాటుటకు నన్ను త్రికరణశుద్ధిగా భజించుటయే సాధనము. ఫలాపేక్షతో నన్ను భజించువారు నాశరీరమువంటివారు. ఫలాపేక్ష

లేక నన్ను భజించు జ్ఞాని నా ఆత్మవంటివాడు. వానికి నాకును భేదములేదు. ముసలితనము, వ్యాధి, మరణము మున్నగునవి శరీరధర్మములు. ఇట్టివానికి లోబడక ముక్తిచెందుటకై నన్ను భజింపవలయును, అని విజ్ఞానయోగ మను 7వ అధ్యాయము నందు పరమాత్మ ప్రతిపాదించియున్నాడు.

అధ్యా 8. ప్రయాణకాలమున నన్ను స్మరించుట, అనగా జీవుడు శరీరమును వదలిపెట్టిపోవునపుడు నన్ను స్మరించ వలయుననుట. బాల్యమునుండి కర్మానుష్ఠానము భక్తితో చేయుచున్న నే అవసానకాలమున ఈశ్వరధ్యానము కలుగును. దానివలన ముక్తి చెందనగును. అవసానకాలమున దేనిని స్మరించుచు శరీరము చాలించెదమో, తదనుగుణమగు జన్మాంతరమే కలుగును. నిష్కామయోగులు, భక్తులు, జ్ఞానులు— పగటిపూట, శుక్లపక్షమున, నుత్తరాయణ పుణ్యకాలమున శరీరము చాలించుదురు. ఉత్తమ దేవతలవలన సత్కరింపబడి వైకుంఠమునకు పోవుదురు. అట్టివారి గతి అర్చిరాది మార్గము, దేవయానము లేక శుక్లగతి యని చెప్పబడును. కర్మశేషముగల ప్రవృత్తి మార్గావలంబకులు—రాత్రిపూట-కృష్ణపక్షమున లేక దక్షిణాయనమున శరీరము చాలించి అధమదేవతలచే సత్కరింపబడి మరల మాతృగర్భ ప్రవేశము నొందుదురు. అట్టివారి గతి ధూమమార్గము, కృష్ణగతి లేక పితృయానమని చెప్పబడును. జన్మరాహిత్యము ద్వారా బ్రహ్మానుభవమునకు భక్తియే కారణమని అక్షరపరబ్రహ్మ

యోగ మను నెనిమిదవ అధ్యాయమునందు ప్రతిపాదింప బడినది.

అధ్యా 9. చరాచరాత్మకమైన ప్రపంచమునకు నేనే తల్లిని, తండ్రిని, గురువును. వర్షము కలిగించుట నేనే, ఆపుట నేనే, ఎండను కలిగించుట నేనే, జీవులను పుట్టించుట నేనే, చంపుట నేనే, బంధించుట నేనే, విడిపించుట నేనే. నా సేవ యందే యెవడు మగ్నుడై యున్నాడో అట్టివాని యోగ క్షేమములను నేను గమనించుచున్నాను.(యోగము=లేనిదానిని సంపాదించుట = Acquisition of wealth and knowledge etc. క్షేమము = ఉన్నదానిని కాపాడుట.=Preservation of what is obtained.) భక్తితో నొకపువ్వు, ఒకపండు, ఒక కాయ, కొంచెమునీరు మున్నగువానిని సమర్పించినను నేను సంతుష్టిచెంది, ఆ భక్తుని అన్నివిధముల అనుగ్రహించు చున్నాను. మహాపాపులు నన్ను భజించినను నా అనుగ్రహము ద్వారా సకల పాపములను పోగొట్టుకొని సకలైహికాముష్మిక సుఖములను చెందుదురు. జాతి మత వివక్షతలేక యెల్లరు నన్ను భజించి తరించనగును అని శ్రీకృష్ణుడు రాజవిద్యా రాజగుహ్య యోగమను 9 వ అధ్యాయములో తెలిపియున్నాడు.

అధ్యా 10. సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందు పరమాత్మనగు నన్ను తైలధారవలె అవిచ్ఛిన్నముగా నుపా సించుట అఖండోపాసన యనబడును. అట్టి అఖండోపాసన, పునర్జన్మ లేనివారికే కుదురును. అట్టిభాగ్యము లేనివారి

సౌకర్యార్థము ఖండోపాసన యేర్పడియున్నది. కొన్ని కొన్ని వస్తువులు తమ పూర్వపుణ్య విశేషముచేత ఈశ్వరునియొక్క మహిమను (అద్దము సూర్యుని కిరణముల వెలిబుచ్చునట్లు) బయటపెట్టును. అట్టివస్తువులు విభూతిరూపము లనబడును. (Those are the highest manifestations of Divinity.) అవి యేవనగా నదులలో గంగానది, పర్వతములలో హిమవత్పర్వతము, మాసములలో మార్గశీర్షము, ఋతువులలో వసంతఋతువు, యాదవులలో శ్రీకృష్ణుడు, పాండవులలో అర్జునుడు మున్నగునవి. ఒక వస్తుసముదాయములో ఇతర వస్తువులకు లేని విశేషమహిమ దేనియందున్నదో అది విభూతిరూప మనబడును. ఆ విభూతిరూపముల నుపాసించుట యనబడు ఖండోపాసన క్రమముగా అఖండోపాసనకు సోపాన మనుట విభూతియోగ మను 10 వ అధ్యాయముయొక్క సారాంశము.

అధ్యా 11. సకల జగత్తును తనయందిముడ్చుకొని తా నన్నిటియందు వ్యాపించి యుండునట్టి సంపూర్ణమైన విశ్వరూపమును (All-permeating, All-pervading, universal form) చూపించవలసిన దని అర్జునుడు కోరగా శ్రీకృష్ణుడు అతనికి జ్ఞాననేత్రమును ప్రసాదించి చూపించెను. ఆ రూపమున సకలప్రదేశములయందు నేత్రములు, చెవులు, కాళ్ళు మొదలగు సకలేంద్రియములు, అవయవములు కనుపించెను. ఆద్యంతములులేక కోటిసూర్యుల తేజస్సుకన్న నెక్కువ తేజస్సు స్ఫురించుచుండెను. భీష్మద్రోణాదులు ఆ విశ్వరూపము

యొక్క నోళ్ళలో ప్రవేశించి కోరలసందున వారి తలలు చిక్కుపడి నొక్కబడి పొడుము పొడుముగా గావింపబడి రక్త ప్రవాహమగుట అర్జునుడు చూచి పరమాత్మను అనేకవిధముల స్తుతించి, 'ఆ రూపము నుపసంహరించి చిన్నరూపము చూపవలయు'నని కోరెను. పరమాత్మ ఆ ప్రకారమే చూపించి, భక్తిలేని వేదాధ్యయనాదులు నిష్ప్రయోజనమనియు, భక్తికి కర్మానుష్ఠానము, ద్వేషరాహిత్యము ముఖ్యాంశము లనియు, విశ్వరూపసందర్శనయోగ మనబడు 11 వ అధ్యాయమునందు ఉపదేశించెను.

అధ్యా 12. నామరూపములతో కూడుకొనిన సగుణ బ్రహ్మము నుపాసించుటయే నిరపాయమైన మార్గము. సగుణోపాసనవలన జీవుడు నిర్గుణపరబ్రహ్మము పొందగలడు. శత్రులు, మిత్రులు, సుఖదుఃఖములు, లాభనష్టములు మున్నగు ద్వంద్వములను సమముగా భావించుట, ఎవ్వరికిని తన ద్వారా భయము కలిగించకుండుట, తాను ఎట్టివస్తువును చూచి భయపడకుండుట, అన్నిటికన్న దారపుత్రాదులకన్న ఈశ్వరునియందే యెక్కువ ప్రేమ నుంచుట మున్నగునవి భక్తుల లక్షణములు. మోక్షమును గూడ కోరకుండ భగవంతుని భజించుట ఉత్తమభక్తి. (Devotion for devotion's sake.) మోక్షమునుగోరి భజించుట మధ్యమము. ఐహికాముష్మికసుఖముల గోరిభజించుట అధమభక్తి. కృతయుగమున ధ్యానయోగమువలన, త్రేతాయుగమున యాగాదులవలన, ద్వాపరయుగమున పూజావిధానమువలన జనులు తరించిరి.

నానావిధదోషములతో కూడుకొన్న కలియుగమున జనులు సులభముగా తరించుటకు నామోచ్చారణమే సులభసాధనము (e.g. Repeating the names of God) అని భక్తియోగమను 12వ అధ్యాయమున చెప్పబడినది. ద్వితీయషట్కమున ప్రస్తావింపబడిన భక్తితో కూడుకొనిన కర్మానుష్ఠానము వలన అంతఃకరణశుద్ధిద్వారా జ్ఞానము కలుగును. అట్టిజ్ఞానవిషయము 3వ షట్కమున వివరింపబడును.

అధ్యా 13. పాంచభౌతిక మగు ఈ స్థూలశరీరము మనస్సు బుద్ధి అహంకారము మున్నగు తత్త్వములవలన నేర్పడిన సూక్ష్మశరీరము క్షేత్రమనబడును. శరీరసంరక్షణకు పొలములు ఆవశ్యకమైనట్లును ఆత్మానుభవమునకు ఈశరీరములు పొలముల వంటివి గనుక క్షేత్రములని జెప్పబడును. ఈ శరీరములయందుండి యేమేమి జరుగుచున్నది గుర్తెరుగువాడు (ఆత్మ) క్షేత్రజ్ఞుడు. ప్రతిశరీరమను క్షేత్రమునందు ఆముఖ్యక్షేత్రజ్ఞుడు జీవుడు, ముఖ్యక్షేత్రజ్ఞుడు పరమాత్మ. ఈక్షేత్ర క్షేత్రజ్ఞులకుండెడిసంబంధాసంబంధములను విచారణచేసి తెలిసికొనుటయే జ్ఞానము. ఇట్టి జ్ఞానము అహంకారమమకారాదిదుర్వృత్తులను పోగొట్టుకొనుట జననము, మరణము, ముసలితనము, నానావిధ సాంసారికదుఃఖములు మున్నగు వానిని పదేపదే స్మరించుట, నిర్జనప్రదేశముల నుండుట, పామరజనుల సహవాసము వదలుట మున్నగు సాధనానుష్ఠానములవలననే కలుగును. జీవులవల్ల ముఖ్యముగా తెలియబడవలసిన వస్తువు జ్ఞేయ మనబడును. అముఖ్యజ్ఞేయ వస్తువు శుద్ధాత్మ. ముఖ్యజ్ఞేయవస్తువు పరమాత్మ. ఆ ముఖ్య

జ్ఞేయవస్తువు ప్రతివస్తువునకు లోపల, బయటనున్నది. ఇంద్రియ నిగ్రహమనోనిగ్రహములు గలిగిన యుత్తములకు చాల దగ్గరను, అట్టి నియమములేని పామరజనులకు చాల దూరమునను ఉన్నది. అట్టి జ్ఞేయవస్తువును చెందుటకు కొందరికి ధ్యానయోగము, కొందరికి జ్ఞానయోగము, కొందరికి భక్తియోగము కొందరికి సంతతశ్రవణము సాధనములు. క్షేత్రక్షేత్రజ్ఞులకుండెడి సంబంధమును జ్ఞానమనెడి నేత్రముచే దెలిసికొనువాడు ప్రకృతిబంధమునుండి విడిపింపబడి ముక్తినొందు నని క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగ మనబడు 13 వ అధ్యాయమునందు చెప్పబడినది.

అధ్యా 14. ప్రకృతి లేక మాయ సత్త్వరజస్తమోగుణములతో కూడుకొన్నది. సత్త్వగుణము జ్ఞానమును, సుఖమును కలిగించి జీవుని యీ లోకముననే బంధించుచున్నది. రజోగుణము పేరాసను కలిగించి బంధించుచున్నది. తమోగుణము విపరీతజ్ఞానము, సంశయజ్ఞానము, అజ్ఞానములను కలిగించుచున్నది. ఈ మూడుగుణములను దాటిననేగాని ముక్తిచెందుటకు వీలులేదు. సుఖదుఃఖాదిద్వంద్వములు కలిగినప్పుడు నిర్వికారముగా నుండుట; మట్టిపెళ్ళ, రాయి, బంగారు వీనిని సమముగా నెంచుట; ప్రతివస్తువునందు సారమగు బ్రహ్మవస్తువునే గ్రహించుట త్రిగుణాతీతుని లక్షణములు. అట్టి త్రిగుణాత్మకమగు మాయను దాటుటకు భగవద్భక్తియే ముఖ్యసాధన మని గుణత్రయవిభాగయోగ మను 14వ అధ్యాయమున జెప్పబడినది.

అధ్యా 15. ఈ సంసారము లేక జగత్తు గాలివలన త్రోయబడి తలక్రిందుగా జేయబడిన వృక్షమువంటిది. జీవుని గమ్యస్థానమగు పరబ్రహ్మమును చేరనీయకుండ అడ్డుతగులు నటువంటిది. ఈ జగద్వృక్షమును, ప్రాపంచిక వస్తువులయందు వైరాగ్యము, భగవంతునియందు భక్తి అనబడు శస్త్రముచే దృఢముగా ఛేదింపవలెను. పరమాత్మ సూర్యచంద్రాదులయందు తేజోరూపముగను, భూమియందు చెట్లుచేమలు తీగెలు మున్నగు వానియందు ప్రవేశించి ఆయాధాన్యములందు నానావిధములగు చీడ మొదలగు రోగములను పోగొట్టి ఆరోగ్యము, బలము కలిగించునట్టి శక్తివిశేషములుగను, ప్రతివాని కడుపునందు జఠరాగ్నిస్వరూపముగను, మనస్సునందుండి జ్ఞానాజ్ఞానములు, జ్ఞాపకశక్తి, మరపు మున్నగువాటిని కలిగించుట లోనగు అసంఖ్యేయములగు నుపకారములను గావించుచున్నాడు భగవంతుడు సకలాత్మలలో శ్రేష్ఠమైనవాడు గనుక పురుషోత్తముడని చెప్పబడును. అట్టి పరతత్త్వమును పురుషాధము డగు జీవుడు చెందుటకు భక్తియే ముఖ్యసాధన మని, పురుషోత్తమప్రాప్తి యోగమును 15 వ అధ్యాయమందు చెప్పబడినది.

అధ్యా 16. అభయము (భయములేకుండుట) నిష్కపటమైన యోచనలు, దాతృత్వబుద్ధి, చాడీలు చెప్పకుండుట వర్ణాశ్రమధర్మములను నడుపుట మున్నగు ఇరువదిఆరు గుణములు దైవాంశములో బుట్టినవారికి ఉండును. రాక్షసాంశములో బుట్టిన వారికి విధినిషేధములను గమనించకుండుట, నాస్తికవాదము నవలంబించుట, అంటు ఎంగిలి మున్నగు వాని

గమనింపకుండుట, నానావిధములగు ఆశలకు బానిసలుగా నుండుట, అన్యాయమార్గమున ద్రవ్యము సంపాదించుట, కామ క్రోధములకు లోబడుట మున్నగు దుర్గుణము లుండును. అట్టి రాక్షసాంశసంభూతులు కామము, క్రోధము, లోభము లనబడు మూడు ద్వారములగుండా నరకమున బడుదురు. శాస్త్రములయందు నమ్మకములేక స్వేచ్ఛగా ప్రవర్తించువారు రాక్షసాంశసంభూతులు. వేదశాస్త్రముల నమ్మి ప్రవర్తించు వారు దేవాంశ సంభూతులు, అని దైవాసుర సంపద్విభాగ యోగమును 16 వ అధ్యాయమున చెప్పబడినది.

అధ్యా 17. విద్యకన్న శ్రద్ధయే ప్రధానము. శ్రద్ధ అనగా గురువాక్యములయందు, వేదాంతగ్రంథములయందు చెప్పబడిన విషయములయందు గల నమ్మకమే. ఆ శ్రద్ధ సాత్త్విక, రాజస, తామసము లని మూడువిధములు. ఎవడెట్టి శ్రద్ధకలవాడో వా డట్టివాడని చెప్పబడును. వారివారి స్వభావములను బట్టియే శ్రద్ధకూడ ఏర్పడును. శ్రద్ధ నిర్ణయించుటకు అయిదు పరీక్షలు చెప్పబడియున్నవి.

(1) ఆరాధన—ఫలాపేక్ష లేక పరమాత్మను మోక్షకాంక్షియై యుపాసించుట సాత్త్వికశ్రద్ధ. ఫలాపేక్షతో నుపాసించుట రాజసము. క్షుద్రదేవతలను జీవహింసతో నుపాసించుట; e.g. కొల్పులు మొదలగు వానియందు జీవబలి యిచ్చుట మొదలైనవి తామసశ్రద్ధ.

(2) ఆహారము—స్వతస్సిద్ధమైన రసముతో కూడు కొన్నది, శరీరమునకు పుష్టిని, ఆరోగ్యమును కలిగించునది,

మనస్సునకు ఉత్సాహము కలిగించునది, నేతితో సంబంధపడి నది, సాత్వికాహారమని చెప్పబడును. విపరీతమగు కారము పులుసు ఉప్పు చేదు మున్నగు వానితో కూడినది, మిక్కిలి ఉష్ణమైనది, కామ క్రోధముల నుద్రేకపరచునది, శరీరమునకు కొన్ని రోగములు కలిగించునది రాజసికాహారము. పాసిపోయి నది, కుళ్ళిపోయినది, వండి ఒకజాము దాటినది, దేవునికి నివే దన చేయబడనిది, తామసికాహారము.

(3) యజ్ఞము—శాస్త్రములందు విధించబడిన కర్మ లను ఫలాపేక్షలేకుండ చేయుట సాత్వికయజ్ఞము. ఫలా పేక్షతో చేయుట రాజసికము. ఇతరులకు హింస కలిగించు యజ్ఞములు లేక కర్మలు తామసికములు.

(4) తపస్సు—ఇది మూడువిధములు. కాయిక, మాన సిక, వాచిక తపస్సు. భగవంతుని, బ్రాహ్మణోత్తములను, ఏజాతివారైన యోగ్యులు మున్నగువారిని సేవచేయుట, కాయికతపస్సు. ఎవరికి కోపము గలిగించుమాటలు చెప్పకుం డుట, దూషించకుండుట, యథార్థము పలుకుట, మున్నగునవి వాఙ్మయ తపస్సు. కపటమైన యోచనలు లేకుండుట, ప్రపంచ కల్యాణమును స్మరించుట మున్నగునవి మానసిక తపస్సు. ఏ విధమైన తపస్సును ఈశ్వరార్పణముగా చేసినయెడల సాత్విక మనబడును. అహంకార మమకారములకు లోబడి ఫలాపేక్షతో చేసినయెడ రాజసికము. ఇతరులకు హింస కలిగించువానిని అనుష్ఠించిన యెడల తామసికము.

(5) దానము—దేశకాలపాత్రముల నెరిగి ప్రత్యుపకారమును కోరకుండ ఉత్సాహపూరితుడై మంచి వస్తువులను ఇచ్చుట సాత్వికము. ఫలాపేక్షతో విసుకును దుఃఖములు చెందుచు అధమమైన వస్తువులనిచ్చుట రాజసికము. సామాన్యదేశములందు, సామాన్యకాలములందు, అపాత్రునికి, కాళ్ళు కడుగుకొనుటకు నీళ్ళనివ్వక, ఆదరణలేకయిచ్చుట తామసికము. వీటిలో సాధ్యమైనంత మట్టుకు సాత్వికముగా నుండవలయును. తప్పనిసరిగ అపరిహార్యముగ (unavoidably) రాజసికతామసికాహారాదులు స్వీకరింపవలసి వచ్చినపుడు "ఓం తత్సత్" అని బ్రహ్మవాచకము స్మరింపవలయును. అట్లు స్మరించినయెడల వాటియందలి రాజసికతామసిక దోషములు పరిహరింపబడి (బంగారము నిప్పులోవేసి కాల్చినయెడల కల్మషముపోయి అపరంజిగా వెలువడునట్లు) శుద్ధసాత్త్వికమగును. అశ్రద్ధతో చేయబడు హోమము, యజ్ఞము, దానము, తపస్సు, మున్నగునవి అసత్కర్మ లనబడును. అట్టికర్మలను చేయువారికి ఇహలోక పరలోక సుఖము లేమియు నుండవు. అట్టివారు రాక్షసాంశములో చేరినవారు. సాత్త్వికశ్రద్ధగలవారు విద్యలేకున్నను దైవాంశములో చేర్చబడుదురు. రాజస తామసులు రాక్షసాంశములో చేరుదురు గనుక విద్యకన్న శ్రద్ధయే ముఖ్యమనుట శ్రద్ధాత్రయ విభాగయోగ మనెడి 17 వ అధ్యాయములో చెప్పబడినది.

అధ్యా 18. సన్న్యాసమన్నను త్యాగమన్నను ఒకే యర్థము నిచ్చు పర్యాయపదములే. రెంటికిని వదలుట అని

యర్థము. యజ్ఞము, దానము, తపస్సు ఈ మూడును జీవుని పరిశుద్ధము చేయునవి. వాని నెప్పుడును వదలిపెట్టగూడదు. అత్యావశ్యకమైన ధర్మములను వదలి పెట్టుట తామసిక త్యాగము. చేసిన మంచిదేయని యభినందించుచు తన శరీర మునకు కష్టము కలుగుననే కారణముచే చేయకుండిన యెడల రాజసిక త్యాగము, అట్టివానికి మోక్షములేదు. అత్యావశ్య కముగా చేయవలసిన నిత్యనైమిత్తికాది కర్మలను జేయుచు ఫలాపేక్ష, అహంకార మమకారములను వదలుట సాత్త్విక త్యాగము.

ప్రతికార్యమునకు ఐదు కారణము లున్నవి. వాటిలో జీవుడు లోనగు నాలుగు అముఖ్యకారణములు. పరమాత్మయే ముఖ్యకారణము. అన్నిటి వదలిపెట్టి, “నేను కర్త” నని మూఢుడు తలచుచున్నాడు. జ్ఞానము, కర్మ, కర్త,బుద్ధి, ధృతి, సుఖము మున్నగునవి అన్ని ఒక్కొక్కటి మూడువిధములు. అన్నిటియందు పరమాత్మ సమముగానున్నాడని తెలిసికొనుట సాత్త్వికజ్ఞానము, విధ్యుక్తమైన కర్మలను ఫలాపేక్షవిరహి తుడై చేయుట సాత్త్విక కర్మ. అట్టివాడు సాత్త్విక కర్త. ధర్మ మును ధర్మముగా, అధర్మమును అధర్మముగా గ్రహించు బుద్ధి సాత్త్వికబుద్ధి. ఇంద్రియములు, మనస్సు మొదలగువాని వ్యాపా రములను నియమించుకొని ఆధ్యాత్మిక చింతయందే మగ్నుడై యుండుట సాత్త్వికధృతి. మరియును ఆటంకములు వచ్చినను వదలిపెట్టక యుండవలయును. అనుభవించినకొలది మరింతఅను భవించవలెయు నను కుతూహలము కలిగించునదియు,ఆరంభమున

విషముగను అంత్యమున అమృతముగాను నుండునట్టిది,అతీంద్రియమైనది సాత్త్వికసుఖ మనబడును. ఆయా జాతులవారు వారి వారి స్వధర్మములనే సాధ్యమైనంతవరకు అనుష్ఠించి పరమాత్మకు సమర్పించినయెడల సకల కష్టములను పోగొట్టుకొని ఈశ్వరానుగ్రహమునకు పాత్రు లగుదురు గనుక "ఓఅర్జునా! మనస్సు నాయందే యుంచుము. నన్నే భజింపుము, నాకే సకల కర్మల సమర్పించుము. నాకే నమస్కారములు జేయుము. నన్నే చెందుదువు. ఇది ముమ్మాటికి యథార్థమని నమ్ముము. మహాపాపులైనను క్షేత్రయాత్ర,తీర్థయాత్ర మున్నగుసాధనములను వదలి నేను చెప్పినట్లు సకల కర్మలను అనుష్ఠించి భజించిన,సకల పాపములనుండి తప్పక విడిపించెదను. ఇట్టి పరమపవిత్రమైన గీతాశాస్త్రమును భక్తులకు తాముకూడ భక్తితో చెప్పునట్టి వారు, వినునట్టివారు, ఆమోదించునట్టివారు సకల పాపముల నుండి విడిపింపబడి మోక్షసామ్రాజ్యము చెందుదురు. అనంత కల్యాణగుణములతో కూడుకొన్న సకలకల్యాణగుణ సమేతమై హేయగుణ రహితమై, సకలవేద ప్రతిపాద్యమై "సంకల్పమాత్రః ప్రభో స్సృష్టిః" అను వాక్యమును అనుసరించి సంకల్పసిద్ధమైనట్టి ఈశ్వరస్వరూపము నందుటయే మోక్షము."

"అర్జునా! నేను చెప్పవలసినది చెప్పుటయైనది. నీవు చక్కగా యోచించి నీ యిష్టప్రకారము ప్రవర్తింపుము" అని శ్రీకృష్ణుడు చెప్పగా, అర్జునుడు "నా యజ్ఞానము తొలగినది. మీరు చెప్పినట్లు స్వధర్మమును అనుసరించెద" నని తెల్పెను. శ్రీకృష్ణుని దివ్యోపదేశము, విశ్వరూపము పదేపదే జ్ఞాపక

మునకు వచ్చుటచేత ఆనందపారవశ్యము చెందుచున్నాను. వేదవ్యాసుని అనుగ్రహమువలన దూరదృష్టి, దూరశ్రవణము మున్నగు అత్యద్భుతశక్తులు నాకు కలిగినందున నేను సాక్షాత్తుగా వినుటకు చూచుటకు వీలైనది. ఏపక్షమున సకలయోగులకు అధిపతి యగు శ్రీకృష్ణుడు, భక్తులలో అగ్రగణ్యుడగు అర్జునుడు నున్నారో ఆపక్షమున జేరినవారికే సకలదుఃఖనివృత్తి, తేజస్సు, జయము, సత్ప్రవర్తన, మోక్షఫలము కలుగునని నా యభిప్రాయము అని సంజయుడు ఆనందపరవశుడై ధృతరాష్ట్రునకు గీతాసార మంతయును విన్నవించెను.

ఇతి శ్రీమ చ్చిద్ఘనానందేంద్ర సరస్వతీ స్వామినాం.
శ్రీమ ద్భగవద్గీతోపన్యాసా స్సమాప్తాః
స ర్వేజనా స్సుఖినో భవంతు.
శ్రీ కృష్ణార్పణ మస్తు.

మంగళం మహత్.





# శ్రీభగవద్గీతాసంగ్రహము

1. న కాఙ్క్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ
   కిం నో రాజ్యేన గోవిన్ద కిం భోగైర్జీవితేన వా. 1-32

తా. ఉభయసైనికులమధ్య నిలువబడి పరమప్రీతిపాత్రులగు బంధువులను, స్నేహితులను, పూజనీయులగు గురువులను, చంపుటెట్లు? రాజ్యభోగసుఖాదులకు కారణమగు విజయము నాకక్కరలేదు. మఱియు, జీవించియుండవలయు నను కోరికయు లేదని యర్జునుడు శ్రీకృష్ణునితో చెప్పుచున్నాడు. ఈ శ్లోకమున నర్జునునికి వైరాగ్యపరాకాష్ఠ యున్నదని తేలుచున్నది. అట్టివాడే వేదాంతోపదేశమున కర్హుడనుట.

2. నజాయతే మ్రియతే వా కదాచి
   న్నాయం భూత్వా భవితా వా న భూయః ।
   అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో
   న హన్యతే హన్యమానే శరీరే॥ 2-20

తా. షడ్భావవికారము లాత్మకులేవు. వానికి శరీరమే లోనగుననుట:–
1 జాయతే = పుట్టుట, 2 అస్తి = ఉండుట, 3 వర్ధతే = పెరుగుట,
4 విపరిణమతే = మారుట (బాల్యకౌమార యౌవన వార్ధకదశలు మారుట)
5 అపక్షీయతే=తగ్గుట, 6 నశ్యతి=నశించుట.

శరీరము కొట్టబడినను శరీరి కొట్టబడడు. శరీరి (ఆత్మ) పుట్టుకలేని వాడు, త్రికాలాబాధ్యుడు, శాశ్వతుడు, పురాణుడును.

3. తత్వవిత్తు మహాబాహో గుణకర్మ విభాగయోః ।
గుణాగుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే ॥ 3-28

తా. ఓ యర్జునా! గుణములయొక్కయు, కర్మల యొక్కయు విభాగమును లెస్సగా గుర్తెఱింగిన విద్వాంసు డన్ననో, యింద్రియములు విషయములందు ప్రసరించుచున్నవిగాని యాత్మ కెట్టి సంబంధమును లేదని యెఱిగి సక్తతను చెందడు. ప్రకృతి వికారములగు యింద్రియములు ప్రాకృతిక విషయములందు సంచరించుచున్నవి. కర్తృత్వము ప్రకృతిదేగాని యాత్మదికాదని యెఱుంగుటయే జ్ఞానలక్షణము.

4. బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్ ।
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మ సమాధినా॥ 4-24

తా. బ్రహ్మస్వరూపమును కర్తయందు, క్రియయందు, కర్మయందు చూడవలయును. సకలకర్మలను బ్రహ్మార్పణబుద్ధితో చేయవలెను. అట్టివాడు బ్రహ్మస్వరూపము నందును. ఇది నిష్కామకర్మ యొక్కరీతి.

5. విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।
శుని చైవ శ్వపాకేచ పణ్డితా స్సమదర్శినః ॥ 5-18

తా. విద్య, వినయము గలిగిన బ్రాహ్మణునియందు, ఆవునందును యేనుగు నందును, కుక్కయందును, కుక్కమాంసము వండి తిను పరమ చండాలునియందును సమభావము నొందుట పండితుని (బ్రహ్మజ్ఞాని) లక్షణము. ఉపాధులు వేర్వేరుగ నున్నను, అన్నిటియందును పరబ్రహ్మము సమముగ నున్నాడని యెఱుగుట. భావాద్వైతమేగాని క్రియాద్వైతముకా

దనుట. ఈ శ్లోకము పారమార్థికదృష్టినే తెలిపించుచున్నది. వ్యావహారికమున సమత్వము కుదురనేరదు. Equailty on the spiritual plane but not on the material plane. దీనిభావమును చక్కగా గ్రహించక, కొందరేకపంక్తి భోజనములకు, అంతర్వివాహాదులకు దీనిని ప్రమాణముగ జెప్పుట అసమంజసము. "Even the Devil quote scriptures too often" అన్నట్లే.

6. శనైశ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా ।
ఆత్మ సంస్థం మనః కృత్వా న కిఞ్చిదపి చిన్తయేత్ ॥ 6-25

తా. మెల్లమెల్లగా ధైర్యముచే నిగ్రహింపబడిన బుద్ధిచేత విషయములనుండి విరమింపవలయును. మనస్సును తన యాత్మ పరమాత్మలందు లీనపరచి, యెట్టి విషయము చింతింపగూడదు. కర్మాచరణ చేయువాడు మనో నిగ్రహము నావశ్యకముగా చెందవలయును. విషయముల వైపుననే ప్రసరించు స్వభావముగల మనస్సును క్రమక్రమముగ, నిదానముగ త్రిప్పవలయును.

7. భూమి రాపో౽నలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ
అహఙ్కార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా । 7-4

తా. సృష్టికి కారణభూతమగు జడప్రకృతి పృథివి, అప్, తేజస్సు, వాయువు, ఆకాశము లను పంచభూతములుగను, మనోబుద్ధ్యహంకారములుగను ఎనిమిది విధములుగ పరిణమించియున్నది. మొదటి యైదుభూతములు జేరి స్థూలశరీరముగను, కడపటి మూడును చేరి సూక్ష్మశరీరముగను ఏర్పడుచున్న వనుట గ్రాహ్యము.

8. ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహర న్మా మనుస్మరన్
యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్ ॥ 8-13

తా. ప్రణవము (ఓంకారము) నుచ్చరించుచు, పరబ్రహ్మమగు నన్ను ధ్యానించుచు పాంచభౌతిక శరీరమును వదలువా డుత్తమమగు పదవిని (మోక్షమును) చెందును. ఇది యుత్తమాధికారి విషయము.

9. అనన్యా శ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్. 9-22

తా. ఎవరు నాయం దవ్యభిచారభక్తి గలిగియున్నారో (నీవే పరమ గతి యని నమ్మి భజించుచున్నారో) వారు నా సంపూర్ణకటాక్షమునకు పాత్రులగుదురు. అట్టివారి యోగక్షేమములను నేనే వహింతును.

లేనిదానిని (విద్య, ద్రవ్యము, ఆరోగ్యము మున్నగునవి) చెందుట యోగము. చెందినదానిని సంరక్షించుట క్షేమము.

"First seek ye the kingdom of Heaven, and everything shall be added unto you," (Holy Bible)

10. అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున
విష్టభ్యాహమిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్ ॥ 10-42

తా. అర్జునా! నీకు విపులముగ తెలిసికొనుటవలన నేమి ప్రయోజనము? ఈ చిత్ర విచిత్రవస్తువులు గల ప్రపంచమంతయు నా స్వరూపమున నేకదేశమే. నేను ప్రపంచ మంతటను వ్యాపించి యున్నాను

"పాదోఽస్య విశ్వాభూతాని, త్రిపాదస్యామృతం దివి" యని యున్నది.

11. మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సఙ్గవర్జితః ।
నిర్వైర స్సర్వభూతేషు యస్స మా మేతి పాణ్డవ ॥ 11-55

తా. ఎవడు సకల కర్మలు నా ప్రీతికొఱకు చేయునో, యెవడు నేనే యుత్కృష్టుడ నని తలచునో, సకల దేవతలు శరీరముగ గల నన్నే యెవడు

భజించునో, యెవడు దారాపుత్రాది ప్రాపంచిక విషయములం దపేక్ష లేని వాడో, యే ప్రాణియందు ద్వేషబుద్ధి లేనివాడో,అట్టివాడు నన్నే పొందును. (పునరావృత్తి రహితమగు మోక్షసుఖము నొందును.)

12. అనపేక్ష శ్శుచి ర్దక్ష ఉదాసీనో గత వ్యథః ।
సర్వారంభ పరిత్యాగీ యో మద్భక్త స్సమే ప్రియః ॥ 12-16

తా. ఎట్టికోరికలు లేనివాడును, బాహ్యాభ్యంతర శుచిగలవాడును, యుక్తితో వ్యవహరించు సమర్థుడును, మిత్రారిపక్షములందు తటస్థుడును, యెట్టి చింతయు లేనివాడును, ఫలాపేక్షతో నెట్టికర్మమును చేయని వాడును నగు భక్తుడు నాకు మిక్కిలి ప్రీతిపాత్రుడు.

13. యథా సర్వగతం సౌక్ష్మ్యదాకాశం నోపలిప్యతే ।
సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే । 13-33

తా. ఎట్లు ఆకాశము పరమసూక్ష్మమయి సకల వస్తువులందును వ్యాపించి గుణదోషములతో సంబంధము లేకుండునో, అట్లే పరమాత్మ సర్వవ్యాపకు డయి నిర్లేపుడుగ నుండును.

14. ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవచ పాణ్డవ
నద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాఙ్క్షతి ॥ 14-22

తా. ఎవడు సత్వరజస్తమోగుణముల కార్యములను ద్వేషింపడో లేక కోరడో, యట్టివాడు త్రిగుణాతీతుడు. అనగా కర్తృత్వాదులు గుణములతో సంబంధించినవేగాని యాత్మవి కావని యెఱిగి నిర్వికారుడుగ నుండును.

45. అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ।
ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥ 15-14

u64

తా. నేను ప్రతి ప్రాణి యుదరమున జఠరాగ్ని స్వరూపముననుండి వానిచే తినబడు భక్ష్య భోజ్య చోష్య లేహ్యము లను నాలుగు విధము లగు పదార్థములను జీర్ణమగునట్లు చేయుచున్నాను.

16. య శ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః।
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥ 16-23

తా. ఎవడు శాస్త్రవిధిని లక్ష్యపెట్టక స్వేచ్ఛగా ప్రవర్తించునో, యట్టి రాక్షసప్రకృతిగలవాడు శరీరసుఖము నొందడు. ఆత్మసుఖము నొందడు. (శాస్త్రము నుల్లంఘించువాడు రాక్షస స్వభావము గలవాడు.)

17. అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే ॥ 17-15

తా. ఎట్టివానికిని దుఃఖాదులు గల్గింపనిదియు, యథార్థమయినదియు ప్రీతి కల్గించునదియు, ఆత్మ శ్రేయస్సుకు కారణముగ నున్నదియు, వేద శాస్త్రాదులు చదువుట కుపకరించునదియు వాఙ్మయతప స్సనబడును.

18. సర్వధర్మా న్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥ 18-66

తా. సకల ప్రాయశ్చిత్తాది సాధనములను వదలి, పాపపుణ్యముల నుండి విముక్తినొందుటకై, అద్వితీయపరమాత్మ నగు నన్నే త్రికరణశుద్ధిగ భజించి, సకలకర్మలను నాకు సమర్పింపుము. ఎట్టి పాపిగ నున్నను, దుఃఖింపకుము. నేను నిన్ను తరింపఁజేయ సంసిద్ధుడుగ నున్నాను. అనన్య భక్తియే పాపపుణ్యముల బారినుండి తప్పించుకొనుటకు సాధనము. గొప్ప పాపులయినను భగవద్వాక్యము ననుసరించిన తప్పక జన్మసాఫల్యము నొందుదు రనుట.

## మంగళశ్లోకాః

సర్వ స్తరతు దుర్గాణి, సర్వో భద్రాణి పశ్యతు ।
సర్వ స్సద్బుద్ధి మాప్నోతు, సర్వ స్సర్వత్ర నన్దతు ॥

సర్వే భవన్తు సుఖినః, సర్వే సన్తు నిరామయాః ।
సర్వే భద్రాణి పశ్యన్తు మా కశ్చిద్దుఃఖభాగ్భవేత్ ॥

దుర్జన స్సజ్జనో భూయాత్, సజ్జన శ్శాన్తి మాప్నుయాత్ ।
శాన్తో ముచ్యేత బన్ధేభ్యో, ముక్త శ్చాన్యాన్ విమోచయేత్ ॥

మూకం కరోతి వాచాలం, పఙ్గుం లఙ్ఘయతే గిరిమ్ ।
యత్కృపా త మహం వన్దే పరమానన్ద మాధవమ్ ॥

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం,
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః ।
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం,
లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు ॥

కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ ।
దేశోఽయం క్షోభరహితో బ్రాహ్మణా స్సన్తు నిర్భయాః ॥

ప్రీయతాం పుణ్డరీకాక్షః, సర్వయజ్ఞేశ్వరో హరిః ।
తస్మింస్తుష్టే జగత్తుష్టం, ప్రీణితే ప్రీణితం జగత్ ॥

---

1

# గీతామృతము

## ప్రథమ బిందువు.

"సర్వోపనిషదో గావో, దోగ్ధా గోపాల నందనః,
పార్థో వత్స స్సుధీ ర్భోక్తా, దుగ్ధం గీతామృతం మహత్ ॥"

అనుశ్లోకము ననుసరించి సకల యుపనిషత్తులను ఆవును, శ్రీకృష్ణుడను గోపాలుడు పిండగా, పార్థుడు (అర్జునుడు) దూడగ నుండగ, బుద్ధిమంతులు భో్_త లయి యుండగా ఫలితమేదియన గీతామృతమే.

ఇట్టి భగవద్గీత శ్రీకృష్ణునిచే నర్జునుని నిమిత్తమాత్రముగ నుంచుకొని ధర్మక్షేత్రమగు కురుక్షేత్రమున నుపదేశింపబడెను. జూదమునం దోడి పాండవులు 12 వత్సరములు వనవాసము, 1 వత్సర మజ్ఞాతవాసము కావించి కౌరవులను తమ రాజ్యభాగ మిప్పింపవలయు నని కోరగ వారు దురాశకులోబడి శ్రీకృష్ణుడు రాయబారము చేసినను బుద్ధియందు మార్పు గావించుకొనక "సూది గ్రుచ్చు నంతభూమినైన నివ్వము" అనిరి. యుద్ధ మపరిహార్యమయ్యెను. శ్రీకృష్ణుడు పాండవులచే నెన్నుకొనబడెను. కౌరవులు నవకోటినారాయణుల గోరిరి. పాండవులకు కృష్ణుడు సారథిగ నుండెను. 11 అక్షౌహిణులు సైన్యము కౌరవులవైపును 7 అక్షౌహిణులు పాండవుల వైపును సమావేశమయ్యెను. సం

ఖ్యకు కౌరవులు, వారివైపువారే యెక్కువ. అయినను పాండవులు శ్రీకృష్ణుని సాయము నందిరి. ఉభయపక్ష సైనికులు యుద్ధరంగమున చేరిరి. అటజరిగిన వృత్తాంతము నంతయు శ్రీ వేదవ్యాసుని శిష్యుడగు సంజయుడు జాత్యంధుడగు ధృతరాష్ట్రునికి విన్నవించుచున్నాడు. దుర్యోధనుడు భీష్మునియందు నమ్మకము లేక ద్రోణాచార్యులను బహుజాగ్రత్తతో యుద్ధము కావించి భీష్ముని కాపాడి తమకు జయముకలిగింపవలయునని హెచ్చరించెను. భీష్ముడు దానిని గ్రహించి తనశక్తిసామర్థ్యములు వెలువడునట్లు బిగ్గరగ సింహనాదము, శంఖనాదము చేసెను. ఆ వైపుననుండు వీరులు మున్నగు వారందరును శంఖనాదాదుల గావించి యుద్ధమునకు సన్నద్ధులై యుండుటను సూచించిరి. వెంటనే శ్రీకృష్ణుడు, అర్జునుడు మున్నగు వారును బదిరధ్వనులు గావించి తాముకూడ యుద్ధసన్నద్ధులుగ నుండుట దెల్పిరి. అట్టి యొదురుదురుకు సమయమున నర్జును డుభయపక్షములందు సమావేశమైన వారందరును ప్రీతిపాత్రులగు సమీప బంధువులును, పూజనీయులగు గురువర్యులును గనుక త్రిలోకాధిపత్యము వచ్చినను సరే, అఖండభూమండలాధిపత్యము వచ్చినను సరే యుద్ధము చేయననెను. విషము పెట్టుట, ఇంటికి నిప్పంటించుట, భూమి నపహరించుట, ధనమును దొంగిలించుట స్త్రీని భంగపరచుట, ఆయుధములచే హింసింపవచ్చుట మున్నగు దుష్కృత్యములఁ గావించిన ఆతతాయులుగ నున్నను వారిని వధించుట దోషయుక్తముకాకున్నను, అహింసాపరమో ధర్మః అను వాక్యమును బట్టి వారిని చంపఁజాలనని యర్జునుడు

వాక్రుచ్చెను. ఇహాముత్ర ఫలభోగవిరాగము, నిత్యానిత్య వస్తువివేకము శమదమాది షట్కసంపద, ముముక్షుత్వము అనబడు సాధనచతుష్టయసంపదఁ గలవాడే వేదాంతోపదేశమునకర్హుడనుట గ్రాహ్యము. అర్జునుడట్టి సచ్ఛిష్యుడు. శ్రీకృష్ణుడు జగదేకగురువు. ధర్మమందధర్మబుద్ధి నంది యెచ్చట జాలి కరుణ చెందవలయునో యట్టి వ్యవస్థలేక యర్జునుని ద్వారా "అస్థాన స్నేహకారుణ్య ధర్మాధర్మధియాకులం, పార్థం ప్రపన్నముద్దిశ్య శాస్త్రావతరణం కృతమ్" అని యామునాచార్యులవారు వ్రాసినట్లు శ్రీకృష్ణుడు ధర్మనిర్ణయమును వ్యాపింపఁ జేయుచున్నాడు.



## ద్వితీయబిందువు

అఖండభూమండలము స్వాధీనమయినను, త్రైలోక్యాధిపత్యములభ్యమగునట్లున్నను యుద్ధముచేయుటకుతన కేమాత్రమిష్టము లేదని తెలిపించిన యర్జునునికిఁగలిగిన వ్యామోహమును పోగొట్టుటకై శ్రీకృష్ణుడు గీతాశాస్త్రము నుపదేశింపనారంభించుచున్నాడు. ఈ శాస్త్రముయొక్క ముఖ్యోద్దేశము జీవునికి గల శోకమోహములఁ బోగొట్టుటయే. దీనియందు కర్మ, భక్తి, జ్ఞానము లను మూడు మార్గములు ముఖ్యముగ నుపదేశింపబడెను. "పాకస్య వహ్నివత్ జ్ఞానం వినా మోక్షో నసిద్ధ్యతి" యని శ్రీ శంకరులవారు "ఆత్మబోధ"యందు చెప్పినట్లు ముక్తికి జ్ఞానమే ముఖ్యమగు సమీ

చీన సాధనము. జ్ఞాన మన తెలివి. ముక్తి కెట్టి తెలివి కావల యును? ఆత్మసంబంధమైన తెలివియే.

తదితర తెలివి 'జ్ఞాన'మను శబ్దముచే సూచింపఁబడదు. ప్రప్రథమమున శ్రీకృష్ణు డిట్లుపదేశించెను :—

అర్జునా! నీవు ఎవరిని గురించి 'దుఃఖపడగూడదో, వారిని గురించి దుఃఖపడుచున్నావు. గొప్ప తెలివి గలవారి నోటనుండి రావలసిన మాటలు చెప్పుచున్నావు. నిశ్చయ జ్ఞానము గలవారు చచ్చినవారిని గురించిగాని చావబోవువారిని గురించిగాని దుఃఖపడరు, లేక ఆత్మలను గురించిగాని శరీరము లనుగురించి గాని దుఃఖపడరు.

(దీనిచే దుఃఖమందుట మూఢునిలక్షణ మనియు ఎవరిని గురించిగాని తనకెట్టి స్థితిగతులు తటస్థించినను సంతోషముతో నుండుట జ్ఞాని లక్షణమనియు తెలియుచున్నది)

అర్జునా! పరమాత్మవలె జీవుఁడుకూడ అనాదిగను అనంతముగను నుండువాడు. పరమాత్మయు జీవులును భూతకాలమం దొకప్పుడును లేకుండిరి అనుట లేదు. వర్తమాన కాలమందున్నారు. భవిష్యత్కాలమున నొకప్పుడు నుండ రనుటలేదు గనుక పరమాత్మగాని,జీవాత్మగాని త్రికాలాబాధ్య మనుట — ఒక శరీరమునకే బాల్య, కౌమార, యౌవన, వార్ధక్యదశలు మారినను "నేను ఒక్కడనే" యను తలంపున్నది గదా, అట్టి నిర్వికార మగు నేను అనుటచే సూచింపబడు ఆత్మ శరీరము పోయినను నశింపదు. కర్మానుసారేణ వేరొక శరీరమున ప్రవేశించును.

ఇంద్రియములకు విషయములకు కలుగు చేరిక వలననే సుఖదుఃఖములు వెలువడునో యవి శాశ్వతములు కావు. రాక పోకలుగలవి. ఒకేవస్తు వొకప్పుడు సుఖకారిగను మరొకప్పుడు దుఃఖకారిగ నగును. ఒకవస్తు వేకకాలమున నొకనికి సుఖకారిగను మరొకనికి దుఃఖకారిగను నగును. గనుక నిట్టి యింద్రియజన్య సుఖ దుఃఖముల గురించి యెక్కువగ పాటింపక యోర్చుకొనవలయును. అట్టి సహనము, మోక్షప్రాప్తి కర్హతను కలిగించును. ఈ యాత్మను ప్రకృతి సంబంధమైన అస్త్రశస్త్రాద్యాయుధములచే ఛేదించుటకు గాని భేదించుటకుగాని తడుపుటకుగాని యెండ బెట్టుటకుగాని సాధ్యపడదు. 1 అస్తి, 2 జాయతే, 3 వర్ధతి, 4 విపరిణమతి, 5 అపక్షీయతి, 6 నశ్యతి, అను వికారములు (షడ్భావ వికారములు) శరీరములకే గాని ఆత్మలకు లేవు. 1 కొంతకాలము తల్లిగర్భమందుండుట, 2 పుట్టుట, 3 పెరుగుట, 4 దశలు మారుట, 5 తగ్గుట, 6 నశించుట.

స్వతస్సిద్ధముగ నాశము లేకుండుటయు గాక శాపాదుల వలనను ఆత్మకు నాశము కలుగనేరదు.

శరీర మన్ననో యెన్నటికైన నాశనమునకు లోబడ వలసినదే. పుట్టినవాడు గిట్టుట యే నాటికైన తప్పదు. ప్రాత బట్టను కట్టుకొనుటచే మనుజు డెట్లు మారడో యట్లే జీవాత్మ యొక శరీరమును వదలి మరియొక శరీరములో ప్రవేశించుటచే నేమార్పును చెందదు. కనుక ఆత్మనిత్యము, శరీరమనిత్యము.

ఆత్మ యొకరిని చంపునది కాదు. చంపబడేది కాదు.

చంపుట మొదలైనవి శరీరధర్మములే గాని యాత్మధర్మములు కావు. ఇట్టి యప్రాకృతమగు ఆత్మను ఇంద్రియ నిగ్రహ మనో నిగ్రహాదులచే నెరుంగుట కష్టము. జనసామాన్య మింద్రియ వృత్తులకు బానిసలు. అట్టివాటిని నిగ్రహించుకొని యంతర్ముఖులై యాత్మదర్శనము చేయువారు లక్షలో నొక్కడేని యుండడు గనుక దుర్లభుడు. అథవా యాత్మదర్శనము నందిన వాడున్నను తన యనుభవమును వదలి పరోపకారచింతతో నితరుల క్షేమసమాచారమును తెలుపుటకై భగవత్తుల్యులగు సద్గురువులు వెలువడి యుపదేశించుట మరి దుర్లభము. ఒకవేళ నట్టి మహనీయు లగు బోధకులున్నను తమ ప్రాపంచిక వ్యాపారములను పరిహరించుకొని శ్రవణమునకుద్యుక్తులై వచ్చువారు మరి మరి దుర్లభము. అథవా శ్రవణము చేసినను మననము, నిదిధ్యాసనముల ద్వారా కృతార్థత నందువారు మరి మరి దుర్లభము. కనుక నిట్టి యాధ్యాత్మిక విషయమున పరిశ్రమ చేయువారు కడు దుర్లభము. ఈ సంసారము బహు విచిత్రమైనది. ఒక కుటుంబమున సమావేశమయి యుండెడి భార్య, భర్త, బిడ్డలు, బంధువులు, స్నేహితులు మున్నగు వారికి తాత్కాలిక సంబంధమే. పూర్వోత్తర స్థితిగతులు గోచరముకానివి. చలిపందిరిలో ననేక దిక్కులనుండి జనులు సమావేశమయినట్లును, సంతలో చేరినట్లును, పొగబండ్లలో చేరినట్లును, నానా ప్రదేశములందలి కట్టెపుల్లలు ప్రవాహమున కొట్టుకొని రాబడి కొన్ని నిమిషము లొకటిగఁ బోవుచుండి యా వేగమున చీలి నలుదిక్కులకు వెళ్లునట్లే దారపుత్రా

ములతోడి చేరికయు నని గ్రాహ్యము. వీరందరు శరీరబంధువులు గనుక నశాశ్వత సమావేశము. ఆత్మ శాశ్వతతత్త్వము గనుక ఆత్మబంధువు. పరమాత్మ, శ్రీమన్నారాయణుడే యనుట గనుక నశాశ్వత బంధువులమీాది ప్రేమను శాశ్వతబంధు వగు పరమాత్మయం దుంచుటకు యత్నింపవలయును.

ఆత్మ జీవాత్మ యని పరమాత్మ యని యిరుదెగలు. జీవాత్మ కర్మబద్ధుడు. పరమాత్మ కర్మఫలప్రదాత, జీవుడస్వతంత్రుడు - పరమాత్మ సర్వస్వతంత్రుడు. జీవుడు మాయావశుడు, పరమాత్మ మాయాధీశుడు. జీవుడు కించిజ్ఞుడు, పరమాత్మ సర్వజ్ఞుడు. జీవు డణువు, పరమాత్మ విభువు. జీవుడు దుఃఖమయుడు, పరమాత్మ సుఖమయుడు. కనుక నిట్టి పరమాత్మ తత్త్వమును జీవు డన్నివిధములఁ జెంది యత్నింప వలయును. జీవుడు పరమాత్మతోఁ జేరుటయే యోగమనబడును. ఈ యోగ మనేక విధములు - అవి ముఖ్యముగ నాలుగు - 1 కర్మయోగము, 2 భక్తియోగము, 3 రాజయోగము, 4 జ్ఞానయోగము.

జీవుడు జడప్రకృతిలోఁ జేరినందుననే దుఃఖమందుచున్నాడు. ఆ చేరిక పరమాత్మ విషయమున నుండెనేని యదియే సుఖప్రాప్తికి కారణమగును. ఆ చేరికను కలుగనీయక ప్రతిబంధకమును కలిగించునట్టిది ప్రాచీనకర్మవాసన. అనేక జన్మముల నంది విషయసుఖముల ననుభవించి వాడుకపడియున్న జీవుడు చాల కృషిచేసి సత్కర్మానుష్ఠానముచే నా విషయ వాసనలను పరిహరించుకొన్న నేగాని బ్రహ్మప్రాప్తి నందజాలడు.

అట్టి కర్మానుష్ఠాన మన నేదియో కడు జాగ్రత్తతో మానవుడు గ్రహింపవలయును. గ్రహించి సాధ్యమైనంత మట్టుకు తన యాచరణలో నుంచవలయును. దాని వలననే దుఃఖ నివృత్తి, సుఖప్రాప్తి తటస్థించును. ఆ కర్మయోగ విషయమై శ్రీకృష్ణుని యభిప్రాయము 'తృతీయ బిందువు'న విచారింతము.



## తృతీయ బిందువు

ఆత్మనిత్యము, శరీరమనిత్యమను విషయము విపులముగ జర్చింపబడిన పిమ్మట శ్రీకృష్ణుడట్టి ఆత్మజ్ఞానమున కంతఃకరణ శుద్ధియే ప్రతిబంధకము గనుక నా యశుద్ధిని పోగొట్టుకొనుటకై కర్మాచరణను విధించుచున్నాడు.

కర్మయన పని. కర్మలు వైదిక కర్మలని లౌకికకర్మలని ద్వివిధములు. ఆత్మోద్ధారణకు హేతుభూతము లగు కర్మలు వైదిక కర్మలు. శరీరసంరక్షణకు గాను చేయబడు ద్రవ్యార్జనాదులు లౌకికకర్మలు. ఈ వైదికకర్మలు నిత్యకర్మలని నైమిత్తిక కర్మలని భాగింపబడి యున్నవి. ప్రతిరోజు చేయబడవలసిన స్నానము, సంధ్య, జపము, హోమము, పారాయణ లోనగునవి నిత్యకర్మలు.

ఆ యా కాలవిశేషములందు చేయబడు శ్రాద్ధము, తర్పణము మున్నగునవి నైమిత్తిక కర్మలు. ఫలాపేక్షయే ప్రధానముగ గల పుత్రకామేష్టి మున్నగునవి కామ్యకర్మలు.

పై నిత్యనైమి త్తిక కర్మల నాచరించుట రెండువిధములు. ఫలాపేక్ష మున్నిడుకొని చేయుట ప్రకృతిమార్గమనియు, ఫలాపేక్ష లేక యీశ్వరార్పణ బుద్ధితో చేయుట నివృత్తిమార్గమనియు, చెప్పబడును. దారపుత్రాదుల వలనిసుఖము (ఐహికసుఖము) స్వర్గసుఖము (ఆముష్మిక సుఖము). ఈ రెంటిని గోరక భగవదర్పణ బుద్ధితో కర్మ నాచరించుటచే నన్నిటికన్న నెక్కువయగు దుఃఖరహితమును శాశ్వతము నగు మోక్షసుఖ మందనగును.

ఫలాపేక్షతో చేయుట యనెడి ప్రవృత్తి కర్మచే మనమే ఫలమును కోరుచున్నామో దానినిమాత్రమే చెందనగును.

నివృత్తి కర్మానుష్ఠానముచే మోక్షము చెందనగును. మఱియు నితరసుఖములనుకూడ చెందవచ్చును. మనము కోరకపోయినందున ఫలమే కలుగదని యూహింపరాదు. మనము కోరుటచే బంధహేతు వగును. కోరకుండుటచే బంధవిమోచనమగును. ప్రవృత్తి కర్మచే పుణ్యము లభించును. ఆపుణ్యఫలమును స్వర్గాదులం దనుభవించి తగ్గగానే "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" యని మరల మాతృగర్భ ప్రవేశము కావలసినదే. నివృత్తికర్మలచే జననమరణాదిరూప మగు సంసార నివృత్తియగును. మరియు నీకర్మయోగ విధానమందొక గొప్ప విషయము గమనింపబడవలయును. పాకీవాడు చేయుపని మొదలు గొప్ప చక్రవర్తిచేయు రాజ్యపరిపాలనవరకుగల నానావిధములైన పనుల త్యావశ్యకములే. వీటిలో నొకపనియెక్కువ యని మరొకపని తక్కువయని గ్రహింపరాదు. ఒకజాతి

యెక్కువ, మరొకజాతి తక్కువ, ఒక యాశ్రమ మెక్కువ, మరొక యాశ్రమము తక్కువయని తలపరాదు. ఈశ్వరుని దృష్టి కన్నియు నొకటియే. వారివారి పనులను బ్రహ్మభావముతో నిర్వర్తింపవలయును. నన్నీ జాతిలో నీయాశ్రమములో పరాత్పరుడు పుట్టించి నాకీ పనిని విధించెను. కనుక దీనిని యోగ్యతగ బహుజాగరూకతతో నొనర్చిన యెడల నాభగవంతుడు సంతుష్టి చెందు నను నిశ్చయము కలిగియుండవలయును.

ఒకతోటలో పొట్టి వృక్షములు పొడుగువృక్షములు నన్నియు నుండవలసినదే. ఆయా స్థానము లందాయా వస్తువులు రమణీయములే. ఒక గడియారమం దనేక యంత్రములు చిన్నవిగ పెద్దవిగ నుండును. పెద్దవి యెంత యావశ్యకములో చిన్నవియంత యావశ్యకములే. అట్లే నానావిధ జాతులు ఆశ్రమములు స్త్రీ పురుష వ్యక్తులు మున్నగునవి గనుక తీసివేయవలసినది యేదియు లేదనుట గ్రాహ్యము.

భగవంతు డొక్కొక్క వ్యక్తి కొక్కొక్క విశేష శక్తి సామర్థ్యముల నొసగియున్నాడు. ఆయన యుద్దేశ్యము మన కగోచరము. స్థూలదృష్టిగల మనమాయన నెట్లు విమర్శింపగలము? కనుక జాతి మత వైషమ్యాదులు లేక వారి వారి పనులను త్రికరణశుద్ధిగ ననుష్ఠింపవలయును. ఇట్టి నివృత్తికర్మ (యజ్ఞము) ననుష్ఠించి యాశేషమును భుజించువాడు ముక్తినందును. అహంకార మమకారములకు లోనయి తనంతటతానే భుజించువాడు పాపియగును. సంసారబంధమునకు లోనగును. ప్రతిగృహస్థుడు చీపురుకట్ట, పాత్రము, నీళ్ళకుండ, పొయ్యి, రోకలి లేక

సంసారము చేయజాలడు. వీటిచే ననేక సూక్ష్మజంతువులు, చీమలు మున్నగునవి యంత మొందు చున్నవి. ఈహింస పంచ సూనదోషము లనబడును. వీటిని పోగొట్టుకొనిననేగాని సద్గతినంద లేరు. వాటికి పరిహారములు పంచమహాయజ్ఞము లన బడును. అవి యేవనగా (1) బ్రహ్మయజ్ఞము, వేదాధ్యయ నము పురాణపఠన మున్నగునవి. తదనధికారులు భాషాంతర మందలి, మతగ్రంథములనేని ప్రతిరోజు పఠించుట.

(2) దైవయజ్ఞము—నేయి, సమిధలు మున్నగు వా టిచే నగ్ని నారాధించుట, విగ్రహారాధన మున్నగునవి.

(3) పితృయజ్ఞము—తల్లిదండ్రులు జీవించి యున్న పుడు వారి వాక్కును శిరసావహించి నిర్వర్తించుట. వారు మృతులైన పిదప శ్రాద్ధాదులను చక్కగ సలిపిన వారికి తృప్తి కల్గించుట.

(4) మనుష్యయజ్ఞము—ఆకలిగొన్న అతిథి అభ్యా గతులకు అన్నమిచ్చుట, దప్పిగొన్నవారికి జలమిచ్చుటయు, వస్త్రహీనులకు వస్త్రమిచ్చుట మున్నగు మానవసేవ.

(5) భూతయజ్ఞము—కుక్కలు, కాకులు మున్నగు జంతువులకు ఆహార పదార్థముల నిచ్చి తృప్తిపరచుట.

ఈయైదు యజ్ఞములను భగవదర్పణ బుద్ధితో ప్రతిమాన వుడు సలిపి యంతఃకరణమందలి మాలిన్యమును పోగొట్టుకొని జ్ఞాన సంపాదనద్వారా ముక్తి నందుటకై సర్వథా యత్నింప వలయును.



## చతుర్థబిందువు

నివృత్తి కర్మచే నంతఃకరణ శుద్ధి, తద్ద్వారా జ్ఞానము నంది ముక్తిఁ బడయునగును. మూఢుడు తన స్వాంతమునకై కర్మచేయవలయును. జ్ఞాని లోక సంగ్రహార్థమై చేయవలయును. జనకుడు, అశ్వపతి, ప్రియంవదమున్నగు రాజర్షులు జ్ఞానులుగ నుండినను కర్మను వదలలేదు. అధికారికక్షత్రియుడు కర్మ వదలిన యెడల తదనుసరులు తప్పక వదలుదురు. వారిని చెడ గొట్టిన దోషము వీరినే చేరును. ముక్తి ప్రదాతగ నున్నను శ్రీకృష్ణుడుకూడ కర్మ చేయుచునేయుండెను. ఆయన చేయని యెడల ప్రజలు కర్మభ్రష్టులై చెడుదురు. వర్ణసంకరములోనగు దోషములు కలుగును గనుక జ్ఞానులుగాని యజ్ఞానులుగాని తప్పక కర్మచేసియే తీరవలయును.అని శ్రీకృష్ణు డుపదేశించెను. అర్జునుడు “ఓప్రభువా, మీ యుపదేశ ప్రకారము తప్పక కర్మ ననుష్ఠింపవలసినదే యని తోచుచున్నది గాని సమయము వచ్చినపు డట్లు చేయుటలేదు. ఏబలవత్తరమైన కారణముచేఁ బ్రేరేపింపబడి జీవుడు తన కిష్టము లేకున్నను పాపకార్యమును చేయుచున్నాడు. నిశ్చయించిన పుణ్యకార్యమును చేయుట లేదని ప్రశ్నించెను. అపుడు శ్రీకృష్ణుడు “అర్జునా జీవునికి కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యమని యంతశ్శత్రువు లారు కలవు. వాటిలో కామము (ఆశ), క్రోధము (కోపము) ప్రబలశత్రువులు. ఇవి రజోగుణముచే నేర్పడును. ఎన్ని విషయముల ననుభవించినను తృప్తి కలుగదు. గొప్ప పాపకార్యములను చేయునట్లు ప్రేరేపించును.

నిప్పులో నేయి, సమిధలు మున్నగునవి వేయుటచే నెట్లు వృద్ధియగునో యట్లే భోగము కామమును మరింత వృద్ధిపరచును. కనుక జ్ఞానియగువాడు కామాదులను శత్రువులుగ భావించును. కనుక వీటిని పరిహరించుకొన యత్నింపవలయును. పొగ నిప్పును క్రమ్మినట్లు, అద్దము మాలిన్యముచే జెడినట్లు, గర్భగతజీవుడు మావిచే నావరింపబడినట్లు కామక్రోధాదులచే జీవునికి ప్రతిబంధక మేర్పడియున్నది. ఈ కామాదులు వ్యాపించియుండు ఆశ్రయము లేవి యన ఇంద్రియములు, మనసు, బుద్ధి. పరమాత్మ జీవునికన్న నతీతుడు. ఆయన నాశ్రయించి యాయన వాక్యానుసారేణ ప్రవర్తించువాడు వాటిని పరిహరించుకొనును. కనుక "శ్రుతి స్మృతిమమైవాజ్ఞ" యన్నట్లు విధ్యుక్తకర్మలను ఫలత్యాగపూర్వకముగ ననుష్ఠించినయెడల జీవుడు తన జీవత్వమును వదలి శివత్వమును చెందును. కనుక నెల్లరును కర్మాచరణయం దాసక్తి గలవారై యుండ వలయునని శ్రీకృష్ణుడు ప్రజలకు అర్జునునిద్వారా బోధించుచున్నాడు.



## పంచమ బిందువు

రెండవ మూడవ అధ్యాయములం దుపదేశింపబడిన జ్ఞాన కర్మయోగములు సృష్ట్యాదిలో సూర్యునికి నాచే నుపదేశింపబడెను. అతనిచే వైవస్వత మనువునకు, అతనిచే నిక్ష్వాకు రాజునకు, అతనిచే తనకుమారునకు నిట్లు గురుశిష్య

పరంపరగా పరమలౌకికు లగు రాజులవంశములలోను వ్యాపించి యనుష్ఠింపబడుచున్నది. పరమాత్మ యగు తాను సర్వవ్యాపకుడు, ఆనందమయుడు, జ్ఞానమయుడు, మాయాధీశు డనియు జీవుడు పరమ సూక్ష్ముడు (అణుప్రాయుడు) దుఃఖమయుడు, అజ్ఞానమయుడు, మాయావశు డనియు, తాను దుష్టనిగ్రహ శిష్టపరిపాలన మున్నగు సాధనముల ద్వారా నానావిధ ధర్మములను సంస్థాపన చేయుచున్నట్లు శ్రీ కృష్ణుడు తెలిపించెను. ఇట్టి తన స్వరూపమును భక్తు డెట్టి కోరికతో నుపాసించునో యా కోరికను నెరవేర్చుకొనవచ్చును. తాను కల్పవృక్షము, కామధేనువు, చింతామణివంటివాడు. సకలైహికాముష్మిక సుఖముల నందుటకు జీవుడు పరమాత్మనే భజింపవలయును. ముక్తినొసంగు పరమాత్మ యైహిక సుఖమునుకూడ తానే కలిగించును. రామకృష్ణాద్యవతారములలోగాని శివకేశవులలో గాని భేదమును కల్పించక వారివారి సాంప్రదాయానుసారేణ యాయా భగవన్మూర్తినే యుపాసింపవలయును. ఆ యుపాసనకు వర్ణాశ్రమోచిత ధర్మానుష్ఠానము ముఖ్యసాధనము. తాను చేయవలసిన కర్మ లెట్టివియో, చేయకూడని దేదియో విచారింపవలయును. జీవుడగు తాను చేయు సకల కాయిక, వాచిక, మానసిక కర్మలకు పరమాత్మయే ప్రేరకు డనుట యెరుంగవలయును. తటస్థించినదానితో తృప్తిగలిగి, శీతోష్ణాది ద్వంద్వములకు లోబడక కర్త, క్రియ, కర్మ లన్నిటియందు పరబ్రహ్మ స్వరూపమును వీక్షించుచు వాటి నంతయు శివార్పణ, కృష్ణార్పణ, బ్రహ్మార్పణ మనవలయును.

ఇట్లు చేయుటవలన అంతఃకరణశుద్ధి ద్వారా జ్ఞాన మేర్పడును. ఆ జ్ఞానసంపాదనకు నానావిధనివృత్తికర్మ లున్నవి.



## షష్ఠ బిందువు

జీవుడు పరమాత్మనంది సుఖపడుటకు నానావిధ కర్మలలో విధ్యుక్తమైనవాటి ననుసరింపవలయును. ద్రవ్యయజ్ఞము, ఈశ్వరునిచే ప్రసాదింపబడిన ద్రవ్యమునుగాని విద్యనుగాని శరీర బలమునుగాని పరోపకారముగ నుపయోగించుట. అనగా పాఠశాలలు, అన్నసత్రములు, ఔషధశాలలు మున్నగువాటికి వలయు సాయము చేయుట లోనగునవి. కొందరు తపస్సు, యోగము (అష్టాంగయోగము), వేదాధ్యయము, జ్ఞానయజ్ఞము, ప్రాణాయామము మున్నగువాటిలో దేనినైన నవలంబించి తరింతురు. ఏకర్మనైన బ్రహ్మార్పణబుద్ధితో నాచరింపవలయును. కర్మ బ్రహ్మస్వరూపమనియు, కర్త బ్రహ్మస్వరూపమనియు, హవ్యకవ్యాదులు బ్రహ్మస్వరూపమనియు భావించుటయే నివృత్తికర్మ యనబడును. ఇట్టి కర్మాచరణచే అంతఃకరణశుద్ధి ద్వారా జ్ఞానము కలుగును.

శాస్త్రజన్య జ్ఞానమును గల సద్గురువు నాశ్రయించి నమస్కారము, శుశ్రూష మున్నగునవి కావించి మోక్షము, స్వర్గము, జీవాత్మ, పరమాత్మ, నరకము, బంధము మున్నగువాటి స్వరూపములను ప్రశ్నించి విధేయతతో సందేహములను పోగొట్టుకొని జ్ఞానమందలి రహస్యాంశములను తెలిసికొనవల

యును. జ్ఞానమందినవానికి గుర్తేమనగా సకల ఆత్మలు తన యాత్మవలెనని యెఱింగి పిదప నన్నియాత్మలును పరమాత్మకు సమానములు లేక అంశలని యెఱుంగుట — ఇందుచే జీవ కారుణ్యము జ్ఞానమునకు ముఖ్యాంగమని యూహ్యము. కఠిన చిత్తునికి ఈశ్వరుని రాజ్యమున ప్రవేశము కలుగదనుట. జీవుడు కల్మషచిత్తము గలవాడు. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యము లనునవియే అంతశ్శత్రువులు. వీటి నన్నిటిని జ్ఞానమువలననే పరిహరించుకొనవలయును. జీవుని శుద్ధిపఱచు సాధనము లన్నిలో జ్ఞానమే ముఖ్యమైనది. దానికి సాటియైనది మఱొకటి లేదు. అసంఖ్యేయము లగు జన్మపరంపరలందు కావింపబడిన పాపరాసుల నన్నిటిని జ్ఞానాగ్నిచేతనే భస్మీభూతము లగునట్లు చేసికొననగును. ఆగామి, సంచితము, ప్రారబ్ధమని కర్మలు త్రివిధములు. వెనుకటి జన్మములందు చేసినది యిక మీదట ఫలమును కల్పించును. అది సంచితకర్మ. ఇప్పుడు చేయుచున్న పనుల ఫల మికమీదట రాబోవునది యాగామి యనబడును. వెనుకటి జన్మములందు చేసిన యనేక కర్మలలో నేదేని యొక దానిఫలము నిప్పు డనుభవించు చున్నాము గదా! అదియే ప్రారబ్ధ మనబడును. జ్ఞానాగ్నిచే సంచితము ఆగామి యనబడు కర్మలు పూర్తిగ నశించును. ప్రారబ్ధకర్మ యొక్క వేగము చాలమట్టుకు తగ్గింపబడును. కనుక ప్రతి మానవుడు కర్మ నాధారముగ గల సంసారబంధమునుండి విడిపింపబడి దుఃఖరహితమై శాశ్వత మగు మోక్షసుఖమునందు

టకై సమీచీనసాధనమగు జ్ఞానమున కంగ మగు నివృత్తి కర్మను చక్కఁగ ననుష్ఠింపవలయును.

"కర్మణా జ్ఞాన మాతనోతి, జ్ఞానేన మోక్షః" యను వాక్య మీ విషయమునే వెల్లడించును.



## సప్తమ బిందువు

కర్మసన్న్యాస, కర్మయోగములలో నేది యుత్తమ మని ప్రశ్న?

కర్మ చేయనివానికి సన్న్యాసము కుదురనేరదు. మనబోంట్లకు సన్న్యాసమునకన్న కర్మయే మంచిది. అంతఃకరణశుద్ధి గలవారికి కర్మసన్న్యాసము, తదితరులకు కర్మయోగము విధింపబడియున్నది. కర్మ చేయుచు ఫలాపేక్ష వదలి యుండుటయే సన్న్యాసముగాని కర్మలనే వదలుట కాదు. ఈ రెండు వేర్వేరు ఫలములను కలిగించునని తలచు వారు మూఢులు. రాగద్వేషములను పరిహరించుకొని ద్వంద్వాతీతుడగువాడే నిత్యసన్న్యాసి యనబడును. చక్షురాదీంద్రియములచే చూచుచున్నను, వినుచున్నను, ఆఘ్రాణించుచున్నను, రుచిని గ్రహించుచున్నను, నడచుచున్నను, మాట్లాడుచున్నను నేను చేయుటలేదు. శుద్ధచైతన్యస్వరూపి యగు నాకు (ఆత్మకు) ఎట్టి కర్తృత్వాదులు లేవు. ప్రకృతికే యవి యున్నవి యనిగాని లేక పరమాత్మయే సర్వస్వాతంత్ర్యము కలవాడు. ఆయనయే నాద్వారా సకల పనులను కావించుచున్నాడు. ఆయన ప్రేరణ లేని దెట్టి కార్యమును

జరుగనేరదని తలచుట సన్యాసలక్షణము. ఇట్టివాడు తామరాకు నీటియందున్నను దానిచే తడుపబడనట్లు, కర్మల ననుష్ఠించు చున్నను వాటివలన నెట్టి లోపము నందదు. ఇట్టి కర్మానుష్ఠాన ముచే నంతఃకరణశుద్ధి ద్వారా బ్రహ్మజ్ఞానము కలుగును. సక లాత్మలు జ్ఞానాకారములనియు పరమాత్మ సకల వస్తువులందు సమముగ వ్యాపించి యున్నాడని యెరుంగునది. ప్రతి వస్తువు నీశ్వరునికి విమానమువంటిది. కనుక సద్బ్రాహ్మణుడు, జాతి బ్రాహ్మణుడు, ఆవు, ఏనుగు, కుక్క, కుక్క మాంసము తిను చండాలుడు, లోనగు ఉత్తమ, మధ్యమ, అధమ వస్తువులందంతట సమభావము (బ్రహ్మభావము) చెందుటయే జ్ఞాని లక్షణము. అట్టి జ్ఞాని జీవన్ముక్తుడగును. కబీరుదాసునకు కుక్కయందు రామభావన, త్యాగ రాజస్వామికి తంబురయందును రామ భావన, శ్రీరామ కృష్ణపరమహంసకు పిల్లియందును, చాప యందును కాళిభావన కలిగి యుండెను. ఇట్టివారే బ్రహ్మ జ్ఞానులు. "అండాండంబులు పిండాండంబులు, అంతా రామ మయమ్ ఈజగమంతా రామమయమ్" ఇట్టి స్థితి నందకయే మేము జ్ఞానులము, భక్తులమని నటించు వేషధారు లనేకులు కన్పడుచున్నారు. వారి వలలలో చిక్కుపడకుందుము గాత!

ఈ జ్ఞానము కలుగుటకై కర్మానుష్ఠాన మత్యావశ్య కము. జీవునికి ప్రాచీనకర్మయే ప్రతిబంధకముగాని దారపుత్రా దులు కారు. ఎవని పాపపుణ్యములు వాడనుభవింపవలసినదియే గనుక దుష్టకర్మను సత్కర్మచే నిర్వీర్యముగ చేసికొనవలయును. అందునకై భగవంతుడే మన కత్యధికమగు ఆప్తుడని విశ్వసించి

యట్టి త్రైలోక్యాధిపతియు వేదప్రతిపాద్యుడును సకల యజ్ఞ భోక్తయునగు నాయన వాక్యమును త్రికరణశుద్ధిగ నమ్మి విధ్యుక్త కర్మలను విడనాడక యనుష్ఠించుచు ఫలాపేక్షను మాత్రము వదలియుండునట్టి స్థితియే కర్మ సన్యాస మనబడునని శ్రీకృష్ణు డుద్ఘోషించుచున్నాడు.



## అష్టమ బిందువు

కర్మలను చేయుచు ఫలాపేక్షను వదలిన వాడే కర్మ యోగియును, కర్మ సన్యాసియు నగును. జీవునికి మనసే శత్రువు. మనసే మిత్రము. ఇంద్రియములకు లోబడిన మనస్సు శత్రువు. ఇంద్రియములను జయించి స్వాధీనపరచుకొనిన మనస్సు మిత్రము. కనుక శత్రువులు మనలోపల నున్నారేగాని వెలుపల లేరనుట గ్రాహ్యము.

క్రిమికీటకాదులులేని పరిశుద్ధమైన ప్రదేశమున దర్భాసనము, కృష్ణాజినము, వాటిమీాద వస్త్రమును పరచి కూర్చుండి యటునిటు తిరుగు మనసును క్రమముగ నియమింపఁ బ్రయత్నింపవలయును. ప్రథమమున దృష్టిని నాసికాగ్రమున నిలుపవలయును. ఉచ్ఛ్వాస నిశ్వాసములను నియమించి రేచక పూరక కుంభకములతో గూడిన ప్రాణాయామము నభ్యసింపవలయును. ఏయేవిషయములవైపు మనసు మాటిమాటికి పరుగెత్తుచుండునో యాయా విషయములందలి దోషములను గ్రహింప వలయును. దీనిచే వాటియం దాస తగ్గును. క్రమ

ముగ వైరాగ్యభాగ్య మంకురించును. పురాణ శ్రవణాదుల వలన భగవంతునియం దాసక్తి యధికరించును. ఈ సాధనానుష్ఠానముచే భగవంతుని పాదకమలములందు మనసును నిశ్చలముగ నుంచి ధ్యానము చేయవలయును.

విషయసుఖములను తగ్గించుకొని పరమాత్మను ధ్యానించుచుండునట్టి స్థితిలో నా ధ్యానయోగము పక్వము కానప్పుడు చనిపోయినయెడల నట్టివాని శ్రమ వృథాయగును గదా యను ప్రశ్నకు శ్రీకృష్ణు డిట్లు సమాధానము చెప్పుచున్నాడు. సదాచారసంపదగల ధనికునింటగాని దరిద్రుడగు యోగియింటగాని జనించి వెనుకటి వాసన ననుసరించి యాధ్యాత్మిక విషయములం దభివృద్ధిగాంచి ధ్యానసిద్ధినందును. కనుక నేయే జన్మమందెంతెంత చేయుదుమో యది వృథా కానేరదు. మంచిపని యెన్నటికిని నశింపదు. బాహ్యకర్మల నన్నిటిని భగవదర్పణబుద్ధితోఁ జేయుచు మనసున పరమాత్మయందుంచి ధ్యానయోగమును ప్రతిమానవుడు నభ్యసింపవలయును. జన్మపరంపరలనుండి విడిపింపబడి యీశ్వరప్రాప్తి నందుటయే మోక్షము. అది యెన్నటికైన ప్రతిప్రాణికి లభ్యమగును. ఈశ్వరసేవ చేయువానికి జన్మపరంపరలు కష్టముగ కనుపట్టవు. తగినంతఫలము వెంటనే కలుగలేదని విసుగుజెంది యిదివరకుండెడి యాస్తిక్యబుద్ధిని మానక భార మీశ్వర చరణములందుంచి యుత్సాహముతో ధ్యానయోగాదుల నభ్యసింపవలయునని శ్రీకృష్ణభగవాను లుపదేశించియున్నారు.



## న వ మ బిం దు వు

అనేకవేల ప్రజలలో నొకానొకనికి భగవత్కథలను వినవలయునని కోరిక కలుగును. అట్లు వినువారిలో వేయింట నొకనికి పైపై సోపానముల ననుష్ఠింపవలయు నని తోచును. భగవత్సంబంధమైన జ్ఞానము సకల జ్ఞానములకు వేరువంటిది. ఆ బ్రహ్మజ్ఞానమునందు వానికి సర్వజ్ఞత్వము కరతలామలక మగును. జడప్రకృతి, చేతనప్రకృతి యను రెండు విధములగు ప్రకృతులచే నీశ్వరుడు సకల ప్రపంచములను సృష్టించి కాపాడుచున్నాడు. జడప్రకృతి పృథివ్యప్తేజోవాయ్వాకాశము లను పంచభూతములు, అహంకారము, మనస్సు, బుద్ధి వెరసి ఎనిమిది విధములుగ నున్నది.— ఈ జడప్రకృతియందు చేరి దానియందు చలనాది వ్యాపారముల గల్గించునది చేతన ప్రకృతి (జీవతత్వము). ఈ రెంటిని నియమించునది యీశ్వర తత్వము. ఆరంభదశయం దుండువారు భగవంతుడు ప్రతివస్తు వున సారాంశముగ నున్నాడని యుపాసింపవలయును. సూర్యుని యందు తేజస్సుగను, భూమియందు మంచిగంధముగను, ధర్మ మునకు విరుద్ధము కాని కామముగను, బలవంతుల బలముగ నుపాసింపబడవలయును. ఇట్లుపాసించువాడు క్రమముగ నీశ్వ రుడు సారాసారాంశములం దంతట నున్నాడని గ్రహించును. ఆ పరబ్రహ్మము సాత్విక, రాజసిక, తామసిక, పదార్థములం దంతట నున్నను వాటి గుణదోషములచే నేమాత్రమును లేపము నందకుండును. ఆర్తులు (దుఃఖపీడితులు), జిజ్ఞాసువులు విషయము నెఱుంగగోరువారు), అర్థార్థులు (ప్రయోజనాపేక్ష

కలవారు), జ్ఞానులు నని భక్తులు చతుర్విధములుగ నున్నారు. ఇందులో జ్ఞానులు భగవంతుని సాధనముగను సాధ్యముగను కలవారు. కనుక భగవంతుని కాత్మవంటివారు. తదితరులాయనకు శరీరమువంటివారు. కట్టకడపటిజన్మముకలవానికి "వాసుదేవస్సర్వమితి"యనగాసర్వమీశ్వరమయమనుజ్ఞానము కలుగును. "అండాండంబులు పిండాండంబులు అంతా రామమయమ్, ఈ జగమంతా రామమయం" అని శ్రీరామదాసుగారు నుడివిరి. కబీరుదాసుకు కుక్క రామమయముగఁ దోచెను. శ్రీరామకృష్ణపరమహంసకు పిల్లి యందును, చాపయందును, పరాశక్తి మహాకాళి స్ఫురించెను. ఇట్టి స్థితినందుటకే ప్రతిమానవు డన్నివిధములుగ యత్నింపవలయును. దేవతాంతరములను భజించుటచే ఫలము శీఘ్రముగ కలుగును. ఆ ఫలము స్వల్పమే. సర్వదేవోత్తముడగు శ్రీమన్నారాయణుని భజించుటచే సత్యోత్తమోత్తమమగు ముక్తినిదానముగ కలుగును. ముక్తిసుఖము భగవద్భక్తిచేతనే కలుగును. అట్టి ఈశ్వరుని ప్రతిమానవుడు తనహృదయకమలమం దుంచుకొని ధ్యానముచేయుట కుద్యుక్తుడు కావలయును. అట్టివానికి అధ్యాత్మ, అధిభూత, అధిదైవ, అధియజ్ఞ, బ్రహ్మ, కర్మ, అంతిమస్మృతి మున్నగునవి విస్పష్టమగును.

శ్రీకృష్ణు డర్జునునికి కర్మయోగమవశ్యమనుష్ఠేయమనుట ప్రథమషట్కమున వివరించి యా కర్మాచరణ భక్తిసహితముగ నుండవలయు ననుట ద్వితీయ షట్కమున నిరూపించుచున్నాడు.

ఓ యర్జునా! సకల జ్ఞానములకు (తెలువులు) బ్రహ్మ

జ్ఞానము మూలమువంటిది. బ్రహ్మజ్ఞాని సర్వజ్ఞత్వ మందు చున్నాడు. ఇట్టి జ్ఞానసంపాదనకు వేనవేలు ప్రజలలో నొకా నొకడే ప్రయత్నించును. నేను జడప్రకృతి, చేతనప్రకృతి యనెడి రెంటిచే సృష్టి, స్థితి, సంహారాదులఁ జేయుచున్నాను. ఆ జడ ప్రకృతి పృథివ్యప్తేజోవాయ్వాకాశము లను పంచభూతములు గను, బుద్ధి, అహంకారము, మనసు అను 3 వెరసి యెనిమిది తత్త్వములుగ పరిణమించినది. దీనికన్న శ్రేష్ఠమైనది చేతన ప్రకృతి. నేను చరాచరాత్మక ప్రపంచమునకు హారమునకు దారమువలె నాధారభూతుడుగ నున్నాను. సృష్టింపఁబడిన వస్తువులు స్థూలదృష్టికి గోచరమగును. సృష్టికర్తయగు నేనట్లు గోచరము కాను. అతీంద్రియుడను. సృష్టింపఁబడిన వస్తువులు అండజ, స్వేదజ, ఉద్భిజ్జ, జరాయుజము లని 84 లక్షల యోని వర్గములు. వీటి సృష్టికర్త యగు నే నొక్కడనే. ఇంద్రియ వృత్తుల నుపసంహరించుకొనిననేగాని నా తత్త్వమెరుంగబడదు. నే నన్నిటియందున్నను ఆ యా వస్తువుల గుణదోషములతో సంపర్కము లేకున్నాను. ప్రతివస్తువుయొక్క సారాంశమునందు నే నున్నానని సాధకు డారంభదశలో నుపాసింపవలయును. మంచి వస్తువునందు నే నున్నానని యుపాసించుటచే క్రమముగ మనోలీన మగును. ఆ యుపాసన పరిపక్వదశ నందినచో నేను సర్వత్ర వ్యాపించి యున్నానని స్పష్టమగును.

పుణ్యాత్ములగు నలువురు 1. ఆర్తుడు (వ్యాధియున్నగు దుఃఖములచే బీడింపబడువాడు. 2. జిజ్ఞాసువు (తత్త్వ విషయము నెరుంగవలయునని కోర్కిగలవాడు) 3. అర్థార్థి (ద్రవ్యము-

సంతానము మున్నగు ఫలాపేక్షగలవాడు) 4. జ్ఞాని (తత్త్వము నెరింగినవాడు) నన్ను భజింతురు. పాపులు నన్ను భజింపరు. నన్ను భజించువారిలో జ్ఞాని నాయాత్మవంటివాడు. తదితరులు నా శరీరమువంటివారు. ఎంత జ్ఞానమున్నను కామినీ, కాంచనములకు లోనయి నశించుటకు కారణము మహామాయయే. జీవులా మాయకు లోబడియుండుటచేతనే శుద్ధవస్తువుల నశుద్ధముగను, అశుద్ధవస్తువులను శుద్ధముగను, శాశ్వతమైన దాని నశాశ్వతముగను, అశాశ్వతమైన దానిని శాశ్వతముగను గ్రహించి విపరీతజ్ఞానము నంది యాత్మ పరాత్మలను మరచి దుఃఖమయమగు ప్రాపంచిక విషయములనే కోరుచుండుట. అట్టి పరమానర్థకారి యగు మాయనుండి విడిపింపబడుటకు మాయాధీశుడగు పరమాత్మను భజింపవలయును. భక్తివలననే ముక్తి నందనగును. దేవతాంతరములు పరమాత్మ యొక్క యవయవముల వంటివారు. వారిని భజించినను పారంపర్యముగ పరమాత్మను భజించినట్లే. వారు పరమాత్మకు వశులై ఫలముల గల్గించుదురు. కనుక భజించినప్పుడు వారికిని సర్వదేవమయు డగు పరమాత్మకును భేదములేదని యెరుగవలయును. ఇట్లుపాసించువాడు అధ్యాత్మము, అధిభూతము, అధియజ్ఞము, బ్రహ్మ, కర్మ మున్నగువాటిని బాగుగ నెరింగి ప్రయాణకాలమున మనసును పరమాత్మయగు నాయందు లీనపరచి బ్రహ్మానందము నందును. కనుక అర్జునా! ఇట్టి భక్తి పురస్సరమగు స్వధర్మాచరణమే ఫలకారి యగునని శ్రీకృష్ణు డుపదేశించెను.



## దశమ బిందువు

చిదచిదీశ్వరులలో (జీవాత్మలు, ప్రకృతి, పరమాత్మ) నేది యుత్తమమైనదో యది బ్రహ్మము. ఆ బ్రహ్మముయొక్క ప్రతిబింబము అధ్యాత్మము. నాశముతో గూడిన ఘటపటాది ప్రపంచ మంతయు అధిభూతము. ఆరాధింపబడెడి యీశ్వర తత్వము అధియజ్ఞము—అధ్యాత్మ, అధిభూతములకు చేరిక కల్గించెడి సూర్యుడు మున్నగు దేవతత్వము అధిదైవము. సృష్టికి కారణభూత మగు పనులు కర్మ. అంత్యకాలమే ప్రయాణ కాలము. ప్రయాణ కాలమున కొద్దిగనో గొప్పగనో మూట యుండవలయును. అట్లే జీవుడీ శరీరమును వదలునపుడు పాప పుణ్య రూపమగు బరువును తనతో గూడ దీసికొని వెళ్లును. ఆ యవసానకాలమందే విషయమును స్మరించుచు శరీరమును వదలునో తదనుగుణమైన శరీరాంతరము నొందును. భరతుడు లేడిపిల్లను స్మరించినందున లేడిగ జన్మించెను. ఒక మఠాధిపతి మాదిగవానిని, చెప్పులను స్మరించుచు శరీరమును వదలినందున రోహిదాసనెడి మాదిగ భక్తుడుగ జనించెను. అంత్యకాలమున నన్ను స్మరించినయెడల నాతో జేరి బ్రహ్మానందము ననుభ వించు నని శ్రీకృష్ణుని వాక్యము గనుక జన్మాంతరమునకు విషయ స్మరణ,జన్మరాహిత్యమునకు భగవంతుని స్మరించుటయే కారణమనుట. ఇట్టి యంతిమస్మృతికి శరీరపాటవము, ఇంద్రియ పాటవము గలిగి యుండెడి బాల్యదశ మొదలుకొని వాడుక చేసి కొనవలయును. సంవత్సర ప్రారంభమునుంచి కష్టపడి చదువు

నట్టివాడే పరీక్షయందు కృతార్థుడగును. సోమరిపోతు తప్పి పోవుట నిస్సంశయము.

నివృత్తి కర్మానుష్ఠానముచేసి యంతఃకరణశుద్ధిద్వారా జ్ఞానమందిన వారు సామాన్యముగ పగలు, శుక్లపక్షము, ఉత్తరాయణ పుణ్యకాలమున శరీరమును వదలి అగ్ని, జ్యోతి మున్నగు ప్రకాశమాన మగు దేవతలలోకములగుండా వెళ్ళి వారిచే సత్కరింపబడి బ్రహ్మప్రాప్తి నందుదురు. సత్వగుణో ద్రేక మున్నప్పుడు తాము కష్టపడక, పరుల కేలాటి కష్ట మును కలిగింపని కాలవిశేషాదులందు బ్రహ్మజ్ఞానులు శరీర మును చాలింతురు. వారి మార్గము దేవయానము, శుక్లగతి అర్చిరాదిమార్గ మని వ్యవహరింప బడును. ప్రవృత్తి కర్మ చేయునట్టి సాంసారికులు సామాన్యముగ రాత్రి, కృష్ణపక్షము దక్షిణాయనమున,శరీరమును వదలి, ధూమమున్నగు వాటి యభిమాన దేవతలచే సత్కరింపబడి చంద్ర మండలము ద్వారా మేఘములలో ప్రవేశించి వర్షధారల ద్వారా సస్యా దుల ప్రవేశించి స్త్రీపురుషులచే గ్రహింపబడుదురు. ఆ యన్న సారము శుక్లశోణితముగ పరిణమించి గర్భోత్పత్తికి కారణ మగును. ఇట్టి కర్మఠుల మార్గము, పితృయానము, ధూమ మార్గము, కృష్ణగతి యని వ్యవహరింప బడును. పునరావృత్తి రహితమగు అర్చిరాది మార్గమున వెళ్ళుటకై నివృత్తికర్మ యంగముగ గల భక్తి నసుష్ఠింప ప్రయత్నింపవలయును. భక్తి విరహితమగు వేదాధ్యయనము, యజ్ఞము. తపస్సు, దానము

మున్నగునవి నిష్ప్రయోజనము. భక్తియే జీవుని నాశరహిత మగు పరబ్రహ్మము నంద జేయు ననుట పరమగ్రాహ్యము.



## ఏ కా ద శ బిం దు వు

ఓయర్జునా! నీకు ఓర్వలేనితనము లేనందున మిక్కిలి రహస్యమైనదియు విద్యలన్నిటిలో శ్రేష్ఠమైనదియు నగు బ్రహ్మవిద్య నుపదేశించుచున్నాను. దీని నెరుంగుటవలననే సంసారమునుండి విడుదల కలుగును. దీనియందు శ్రద్ధలేనివాడు నన్ను చెందక మాటిమాటికి పుట్టుచు గిట్టుచు నుండును. నా విచిత్రమైన యోగమును చూడుము. అన్నిటియం దున్నను వాటి గుణదోషములతో సంబంధము లేకున్నాడను. కనుక నేను వాటి యందుండియు లేనట్లే అన్నివస్తువులు నాయం దుండియు వాటి కా తెలివి లేనందున నాయందు లేనట్లే. ఆకాశమంతట నిండియుండి నిర్లేపముగ నున్నట్లే నేనుకూడ నిర్లేపుడను. అద్వితీయుడను. అర్జునా! నేను ఎండ కాయునట్లు చేయువాడను. మరియు దాని నాపువాడను. అట్లే వర్షము కురిపింతును. ఆపుదల చేయుదును. ప్రాణులను జీవింపజేయు వాడను నేనే. వాటిని చంపువాడను నేనే. సకల ప్రాణివర్గము లకు తండ్రి, తల్లి, గురువు సర్వము నేనే. ఆయాజీవులను వారి వారి వెనుకటి కర్మవాసనల ననుసరించి యాయా స్థితిగతులం దుద్భవింపజేయువాడను నేనే. జీవులు కర్మబద్ధులు. పరమాత్మ యగు నేను వారివారి కర్మను కారణముగ నుంచుకొని నిష్పక్ష పాతబుద్ధితో వ్యవహరించుచున్నాను. ఏమానవుడు త్రికరణ

శుద్ధిగ సకలభారములను నాయందు సమర్పించి నన్నే యారాధించునో యట్టివాని యోగక్షేమములను నేను తప్పక భరింతును. భక్తితో నొక్క పండుగాని కాయగాని యాకుగాని కొంత నీటినిగాని యెవడు నాకు సమర్పించునో వాని భక్తిభావమును గ్రహించి వానికి సకలదురితనివృత్తిద్వారా యమోఘఫలమును కల్గింతును. ఎట్టి పాపిగ నున్నను నన్ను విరామములేక భజించినయెడల వాని పాపములను శీఘ్రకాలములోనే పరిహారించి సత్ప్రవర్తన కలిగింతును. ఆ ప్రవర్తనయే సూర్యోదయమును సూచించు అరుణోదయమువలె బ్రహ్మప్రాప్తిని సూచించును. నన్ను నమ్మి భజించువాడు తప్పక ముక్తినందునని ప్రమాణపురస్సరముగ సకల చిక్కులయందును భేరీమృదంగాదివాద్యములద్వారా చాటింపవలయును. "నమ్మి చెడినవాడు లేడు. నమ్మక చెడిపోతే పోయేరు" అన్నట్లు పుణ్యకర్మాచరణవలన నిపుడు బ్రాహ్మణ క్షత్రియాద్యుత్తమ జాతులం దుద్భవించినవారు గాని పాపకర్మాచరణవలన శూద్రాది అధమజాతులయం దుద్భవించిన వారుగాని పురుషులు స్త్రీలు ఎవరైనను సరే నా కథలు కాలక్షేపములు వినవచ్చును. సంకీర్తనలలో పాల్గొనవచ్చును. తాము జపము చేయనగును. ధ్యానము చేయవచ్చును. నాలోకమునకు నిరాటంకముగ వచ్చి నన్ను పొందవచ్చును. ప్రతివాడు జాతి మత వివక్షతలేక భక్తినంద ప్రయత్నించవలయును. కనుక నోయర్జునా ! మనసు నామయముగ కానిమ్ము. సర్వదేవమయుడగు నన్నే భజింపుము. సకల కర్మలను నాకు సమర్పించుము. నాకు నమస్కరింపుము.

ఇట్లు నా యం దాసక్తి గలిగి నా యారాధనరూప మగు స్వధర్మానుష్ఠానము చేయుటచే తప్పక సకలపాపముల నుండి విడిపింపబడి వాక్కుచే వర్ణించుటకుగాని మనసుచే నూహించు టకు గాని సాధ్యము కానట్టి దుఃఖరహితమైనదియు శాశ్వతము నగు బ్రహ్మానందము నందుట నిస్సంశయము.



## ద్వా ద శ బిం దు వు

ఓ యర్జునా, నీకు సంతోషమును కలిగించునట్టిదియు మేలును కలిగించునట్టిదియు నగు నామాటలను మరల వినుము. నా ప్రభావమును గురించి నేను చెప్పవలయునేగాని దేవతలు, మహర్షులు మున్నగువారు గూడ ప్రస్తావింపనేరరు. నాకు జనన మరణాది వికారములు లేవనియు నేనే త్రిలోకముల కధిపతి ననియు, యెరుంగువాడు సంసారమునకు కారణభూతమగు పాపపుణ్యములనుండి విడిపింపబడును. ఆయా జీవులకు బుద్ధి, జ్ఞానము, ఓర్పు, ఇంద్రియనిగ్రహము, మున్నగునవి నావల ననే కల్గింపబడును. సకల దేవతలు, మనువులు, ప్రజాపతులు, చరాచరాత్మకప్రపంచమంతయునావలననేకల్గింపబడును. జీవులు కించిజ్ఞులు, కర్మబద్ధులు దుఃఖభాగులు గనుక సర్వజ్ఞుడను, కర్మా తీతుడను, ఆనందమయుడ నగు నన్నుపాసింపవలయును. ఇట్టి యుపాసన రెండువిధములు. అఖండోపాసన, ఖండోపాసన యనఁబడును. సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును నన్ను

తైలధారవలె నవిచ్ఛిన్నముగ నుపాసించుట యఖండోపాసన యనఁబడును. అట్టి సంతతధ్యానము కుదురనివారికి ఖండోపాసన సులభసాధ్యము. ఏయేవస్తువులు తమ ప్రాచీన సుకృత విశేషముచే నా ప్రభ నెక్కువగ జెంది ప్రజ్వరిల్లునో యవి నా విభూతిరూపము లనబడును. (విభూతియన నైశ్వర్యము, మాహాత్మ్యమనుట,) ఆ విభూతిరూపముల నుపాసించుట ఖండోపాసన యనఁబడును. పర్వతములలో హిమవత్పర్వతము, నదులలో గంగ, వృక్షములలో అశ్వత్థము, మహర్షులలో నారదుడు, మునులలో వేదవ్యాసుడు, దేవతలలో ఇంద్రుడు ఆయుధములలో వజ్రాయుధము, మోసపుచ్చువాటిలో జూదము, వృష్ణులలో వాసుదేవుడు, పాండవులలో అర్జునుడు, శిక్షించువారిలో యముడు, విద్యావంతుల విద్య, తేజోవంతుల తేజస్సు, బుద్ధిమంతుల బుద్ధి, బలశాలుర బలము, లెక్కపెట్టు వానిలో కాలము, ఉత్తమస్త్రీల తేజస్సు సమయోచితముగ మాట్లాడు నేర్పు, జ్ఞాపకశక్తి, తెలివి, ధైర్యము, పట్టుదల, మున్నగు విశేషధర్మము లన్నియు నా స్వరూపము లని యెరుంగుము. అర్జునా, సకలప్రాణుల విశేషధర్మములన్నియు నా విభూతులని యెరింగి వాటిని యుపాసించిన యెడల నట్టి ఖండోపాసనచే క్రమముగ అఖండోపాసన యేర్పడును. నామాహాత్మ్యములకు ముగింపులేదు. చిత్రవిచిత్రమగు పదార్థములుగల యీయఖండ ప్రపంచము నాస్వరూపములో స్వల్పాంశము. దీనిని బట్టియే నాసంపూర్ణమహిమ యెట్టిదో చక్కగ నూహింపుము. ఆశ్చర్య పడుము. అహంకార మమకారములను బొత్తిగ వదలి నన్నే

శరణుజొచ్చి యీ సంసారసాగరమునుండి వెలువడి దుఃఖ సంబంధములేని శాశ్వత బ్రహ్మానంద మనుభవింప ప్రయత్నింపుము.



## త్రయోదశబిందువు.

శ్రీకృష్ణుని విభూతి యోగమును వినిన పిదప నర్జునుడు "శ్రీహరీ! నీ సంపూర్ణ రూపమును చూడనిచ్ఛగించుచున్నాను. దయయుంచి చూపవలయు"నని ప్రార్థించెను. భగవంతుడతనికి దివ్యనేత్రము నిచ్చి, ఓ యర్జునా! ఇదిగో విశ్వరూపమును చూపించెదను. ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు, అష్టవసువులు మున్నగు చరాచరాత్మక సకల ప్రపంచమును, మరియు నీవేమి చూడగోరినను వాటినంతయుఁ జూడనగును. జాగ్రత్తతో చూడుమనెను. ఓ ధృతరాష్ట్రమహారాజా! అర్జును డా రూపమును చూచి మిక్కిలి యాశ్చర్యమును విభ్రమను చెంది యంజలిబద్ధుడై యిట్లు ప్రార్థించెను. ఓ పరమాత్మా! నీ స్వరూపమున సృష్టికర్తయగు బ్రహ్మదేవుని, సంహారకర్తయగు శివుని సకల ఋషులను, సర్పములను చూచుచున్నాను. ఎచ్చట చూచినను నీకండ్లే, చెవులే, పాదములే, సకలావయవములే. ఆద్యంతములు లేక సకల ప్రదేశములందును నీవు వ్యాపించి యున్నావు. నీకోరల సందులలో భీష్మద్రోణాది ప్రముఖులందరు చిక్కుబడి వారి శిరస్సులు ముక్కలు ముక్కలుగ గావింపబడి రక్తప్రవాహమగుచున్నది. నీ స్వరూపమున

నానారంగులతో నానారూపములతో గూడిన యసంఖ్యేయ వస్తువులు కనబడుచున్నవి. కోటిసూర్యుల కాంతికన్న యెక్కుడు కాంతి యున్నది. అఖండ ప్రపంచమందలి సకల వస్తువులు దీపములో పురుగులు ప్రవేశించినట్లు సముద్రమున నదులు ప్రవేశించునట్లు నీనోళ్ళలో చొచ్చుచున్నవి. హే ప్రభో! నాకు దిగ్భ్రమ జనించుచున్నది, నీవెవ్వడవు, ఎందు నకుగా నిట్టి భయంకరరూపమని యడిగెను. శ్రీకృష్ణుడు ఓ యర్జునా! సకలలోకమును నాశనము చేయుటకుగా నుద్భ వించిన కాలుడను. నేను జీవచ్ఛవముగ నుండు వీరిపై బాణ ప్రయోగము కావించి నిమిత్తమాత్రుడుగ నుండి కర్తృప్రతి ఫల నందుము"అనెను. పిదప అర్జునుడు "కృష్ణా! నీవిట్టివాడ వని నేనెరుగనైతిని, ఒంటరిగ నుండునపుడుగాని నలుగురిలో నుండునపుడుగాని భోజనము, నిద్ర, సంచారము మున్నగు సందర్భములందు నేను నిన్నుల్లంఘించినాడను. అందునకై నీవు నన్ను స్నేహితునివలె భావించి క్షమింప వలయును.నీ భయంకర మగు విశ్వరూపమును చూచి భరింపజాలను. గనుక శీఘ్రముగ నుపసంహరించి సౌమ్యరూపమును చెందవలయునని ప్రార్థిం చెను. భగవంతు డా విశ్వరూపము నుపసంహరించి సౌమ్య రూపమును చెంది "ఓ యర్జునా! చూడుము! ఇట్టి నా సంపూర్ణ రూపమును వట్టివేదాధ్యయనము, యజ్ఞము, దానము, తపస్సు మున్నగు సాధనములచే జూడజాలరు. భక్తియే ముఖ్య కారణము. నా నిజరూపమును గురించి వినుటకుగాని చూచు టకుగాని, దానియందు ప్రవేశించి సకల దుఃఖములను పోగొట్టు

కొని శాశ్వత బ్రహ్మానందము నందుటకుగాని భక్తి తప్ప వేరే దియు సాధనములేదు, ఓ యర్జునా నీ విట్టి భక్తిభాగ్యమును కొద్దిగనో గొప్పగనో చెందియుండుటచేతనే నాద్వారా శ్రవణాదులఁ జేయుచున్నావు. గనుక నట్టి భక్తిభాగ్యమును మరింత వృద్ధిపరచుకొనుమని శ్రీకృష్ణు డుపదేశించెను.



## చతుర్దశబిందువు

పరమాత్మ దయదలచి విశ్వరూపము నర్జునునకు చూపించి "ఓ అర్జునా, కర్మానుష్ఠానము, సత్ప్రవర్తన భక్తికి ముఖ్యమైన యంగములు. గనుక సాంగోపాంగముగ భజించువాడు నిస్సంశయముగ నన్ను చెందు" ననెను. వెంటనే యర్జునుడు నామరూపములతో వ్యవహరింపబడు సగుణోపాసన, వాటి కతీతమగు నిర్గుణోపాసన—యీ రెండింటిలో నేది శ్రేష్ఠమైనదని ప్రశ్నించెను. దానికి భగవంతుడు శరీరధారులును, ఇంద్రియనిగ్రహము లేనివారు నగు జనసామాన్యమునకు సగుణోపాసనయే సులభమగు తరణోపాయము. సకలవిధములగు అభిమానములనుండి విడిపింపబడిన మహానుభావులకు నిర్గుణోపాసన సాధ్యముకావచ్చును గాని తదితరులకు కానేరదు. గనుక ఓ అర్జునా ! నన్ను సదా భజించుటకు యత్నింపుము. అట్లు సంతతధ్యానము కుదురనియెడల ప్రతిరోజు కొన్ని గంటలుగాని నిమిషములుగాని స్మరించుట అనెడి అభ్యాసయోగము నేని కావించుము. అదియు కష్టమని తోచినయెడల నా సంబంధ

మైన పనులనేని చేయుము. అనగా దేవాలయములు కట్టుట, దేవాలయములను చిమ్ముట, దీపములు వెలిగించుట, పూదోఁటలఁ బెంచుట, హారములనుగుచ్చి యీశ్వరునికి సమర్పించుట మున్నగు భగవత్ కైంకర్యమునేని చేయుము. అదియు కష్టమని తోఁచినయెడల నీ శరీర సంరక్షణకు వలయు పనులను చేసికొనునపుడు ఫలాపేక్షను వదలి నన్నుస్మరించి వాటిని నా కర్మగా చేయుము. తద్ద్వారా క్రమముగ నీ వభివృద్ధిఁ చెందగలవు. ఓయర్జునా! ఇట్టి భక్తిమార్గము ననుసరించువాని లక్షణములఁ జేర్కొనెదను వినుము. ఎవని చూచి యెట్టిజంతువైనను భయపడదో, ఎట్టిజంతువును చూచిగాని యెవడు భయపడడో యతడే నిజమైన భక్తుడు. మానావమానములు, సుఖదుఃఖములు, జయాపజయములు, లాభనష్టములు మున్నగు ద్వంద్వములచే నెట్టి వికారము నొందనివాడు భక్తుడు. తన కుపకారము కల్గించు స్నేహితులుగాని, మహదపకారము కల్గించు శత్రువులుగాని, యెవనిదృష్టికి సమముగఁ దోఁచునో వాడే భక్తుడు. ఎవడు తన సుఖమునకు దారాపుత్రాదులు కారణములని భావింపక పరమాత్మయే సుఖమున కంతయు కారణమని నిశ్చయించి యా మహామహుని సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును స్మరించునో యతడే భక్తుడు. ఈభక్తి వారివారి మతము, జాతి, ఆశ్రమములకు తగినట్లు విధింపబడియుండు కర్మల ననుష్ఠించుటతో సంబంధించినది. అనగా నివృత్తి కర్మాచరణమనుట- మరియు సత్ప్రవర్తనతోఁగూడినదనుట పరమగ్రాహ్యము. అట్టిభక్తియే ముక్తికి ముఖ్యసాధ-

నము. 84 లక్షల యోనివర్గములలో జేరిన సకల జీవరాసు లలో శ్రేష్ఠుడగు మానవుడు తన జన్మమును సార్థకమగునట్లు చేసికొనవలయును. అందునకే భక్తిభాగ్య మత్యావశ్యకము. "దుర్లభో మానుషో దేహః, ప్రాణినాం క్షణభంగురః, తత్రాపి దుర్లభం మన్యే, వైకుంఠప్రియదర్శనం" అన్నట్లు నీటిబుగ్గ వంటిది యీ శరీరము. గాలియున్నపుడే తూర్పారఁ బెట్టుకొన వలయును. గనుక సకల దుఃఖములనుండి, విడిపింపబడి సకలై హికాముష్మికసుఖములను, అన్నిటికన్న నెక్కుడగు ఆత్మ సుఖము (మోక్షము)ను చెందుటకై భగవంతుని కళ్యాణగుణ గణంబులను పదేపదే యీ వీనులచే గ్రోలి యానందపార వశ్యంబునకై మనసు నా పరాత్పరుని పాదారవిందములందు లీనమగునట్లు సర్వవిధముల బ్రయత్నింతుముగాక! భగవంతుడు ప్రేమమయుడు, అట్టివాని కృపకు పాత్రుల మగుటకై మన మాయనను 'భక్తి'చే బంధింతుముగాక!



## పంచదశ బిందువు

ప్రకృతి, పురుషుడు, క్షేత్రము, క్షేత్రజ్ఞుడు, జ్ఞానము, జ్ఞేయము వీటిని వివరింపవలయునని యర్జునుడడుగగా శ్రీకృష్ణు డిట్లు చెప్ప దొడంగెను.

ప్రకృతి, క్షేత్రము రెండును ఒకటియే. పురుషుడు, క్షేత్రజ్ఞుడు రెండు నొకటియే. పంచభూతముల వలన నేర్పడిన

యీస్థూలశరీరము,మనోబుద్ధ్యహంకారములు, ఇంద్రియములు, శబ్దస్పర్శరూప రసగంధములు, ఇచ్ఛ, ద్వేషము, సుఖదుఃఖములు తెలివి, ధైర్యము మున్నగు తత్త్వములతో నేర్పడిన సూక్ష్మశరీరము— ఈ రెండుశరీరములు ప్రకృతి లేక క్షేత్రమనబడును. మన శరీర సంరక్షణకు పొలము(క్షేత్రము)కారణముగ నున్నట్లు జీవుని యనుభవమునకు శరీరము కారణము గనుక క్షేత్రమువంటిది. ఈ శరీరము (క్షేత్రము)ను గుర్తెరుగువాడు క్షేత్రజ్ఞుడు.(ఆత్మ). ఈక్షేత్రజ్ఞుడు అముఖ్య క్షేత్రజ్ఞుడు (జీవాత్మ), ముఖ్య క్షేత్రజ్ఞుడు (పరమాత్మ) అనబడును. జాతి, విద్య, ధనము మున్నగు వాటి ననుసరించి తానెక్కువయని మనసున గూడ తలచకుండుట (అమానిత్వము), బయటికి తోపించునట్లు మాట్లాడుట, నడచుట మున్నగునవి లేకుండుట(అదంభిత్వము), కాయిక వాచిక మానసిక హింస చేయకుండుట, సద్గురుసేవ, ఓర్పు, తలచినట్లు చెప్పుట, చెప్పినట్లు చేయుట, బాహ్యశుద్ధి, మానసికశుద్ధి, శరీరము ఇంద్రియములు మున్నగు వాటిని నియమించుట, ప్రాపంచిక విషయములందాశ తగ్గించుకొనుట, గర్భవాసము, జననము, వ్యాధి, సాంసారిక దుఃఖములు, చావు, వీటిని మాటిమాటికి చింతించుట, నిర్జన ప్రదేశములందుండి సృష్టివైచిత్ర్యముల గమనించుట మున్నగు వాటి విషయముల నెరింగి యనుష్ఠించుటయే జ్ఞాన మనబడును. మనవలన నెరుగ బడవలసిన శుద్ధాత్మ, పరమాత్మ జ్ఞేయ మనబడును. అది ప్రతివస్తువునకు వెలుపల లోపల మధ్యనున్నది. అఖండజ్యోతిర్మయమైనది. ఇంద్రియ నిగ్రహము గలవాని కతిసమీపమునను, లేని

వాని కతిదూరమున నున్నది. అట్టి జ్ఞేయవస్తువును కర్మ,జ్ఞాన, భక్తి, రాజయోగములలో దేనిచేత నైనను చెందనగును. తుదకు శ్రవణమువలనను చెందవచ్చును. తుదకు ఇట్టి క్షేత్ర క్షేత్రజ్ఞుల స్వరూపముల నెరుంగువాడు నకలానర్థములకు కారణమగు ప్రకృతిబంధమునుంచి విడిపింపబడి బ్రహ్మ సాయుజ్యము నందును.



## షో డ శ బిం దు వు

జీవుని పరమాత్మని సన్నిధికి పోనీయక యడ్డగించు ప్రకృతి యెట్టిదను ప్రశ్నకు శ్రీకృష్ణుడర్జునునికి జవాబిచ్చు చున్నాడు.

ఓ యర్జునా! ఈ ప్రకృతియే మాయ, అవ్యక్తము, అజ్ఞానము, భ్రాంతి, మిథ్యయని నానావిధములుగఁ బ్రస్తాపింప బడును. ఈ ప్రకృతి మూడుగుణములతోఁ గూడినది. అవియే సత్వగుణము, రజోగుణము, తమోగుణము లనబడును. ఈ మూడుగుణములతో (మాయతాళ్లు) జీవుని బంధించును. సత్వ గుణముయొక్క కార్యములు జ్ఞానము, సుఖము, ఓర్పు, దయా దాక్షిణ్యములు, ఇంద్రియ నిగ్రహము మున్నగునవి. రజో గుణముయొక్క కార్యములు. పేరాశ, దాని నెరవేర్చుకొనుటకు గాను చురుకుదనము, చాపల్యము మున్నగునవి. తమోగుణము యొక్క కార్యములు నిద్ర, అజ్ఞానము, సందేహము, విపరీత జ్ఞానము, పొరబాటు, ఆలస్యము మున్నగునవి.

ప్రతిజీవునియందు నీ త్రిగుణము లున్నవి. ఒక్కొక్క గుణ మితరగుణములకన్న నెక్కువగ విజృంభించును. సత్వో ద్రేకమున్నపుడు శరీరపతన మాయెనేని యట్టి జీవుడుత్తమలోక ములకు వెళ్లలేక యుత్తమస్థితిగతులు గల కుటుంబములలో జనించి సుఖపడును. రజోగుణ ముద్రేకమగునపుడు మరణించు వాడు మధ్యస్థితిలోనే (ఉన్నదున్నట్లే) యుండును. తమోగుణో ద్రేకమగునపుడు మరణించువాడు క్రింది లోకములకు వెళ్లలేక యధమయోనులందు ప్రవేశించి కష్టమందును.

ఈ త్రిగుణాత్మికయగు ప్రకృతినిదాటి త్రిగుణాతీతుడు కావలయును. అట్టి మహానుభావుడు గుణముల కార్యములం దుదాసీనుడై, శతృమిత్రులను సుఖదుఃఖములను, మట్టిపెళ్ల, రాయి, బంగారును సమముగ భావించును. అనగ ద్వంద్వము లచేఁ బీడింపబడక నిర్వికారుడుగ నుండును. ఇట్టిస్థితి తాను నిర్వి కారమగు ఆత్మయే యను నిశ్చయజ్ఞానముచేతనే చెందనగును.

గనుక సర్వానర్థము లకు కారణమగు ప్రకృతిని జయించు టకు శాశ్వతపరబ్రహ్మమును త్రికరణశుద్ధిగ భజించుటతప్ప వేరే సాధనములేదని చెప్పబడుచున్నది.



## స ప్త ద శ బిం దు వు

ఓ యర్జునా! ఈ సంసారము (లేక జగత్తు) బహు విచిత్రమైన వృక్షము. దీనికొమ్మలు మీద క్రింద వ్యాపించి

యున్నవి. మూలము (బ్రహ్మ) మీద క్రిందనున్నది. ఇది యశాశ్వత మయినది. (అశ్వత్థము) జీవుని గమ్యస్థానము (బ్రహ్మము) నకు ఈ వృక్షము ప్రతిబంధకముగనున్నది. గనుక దీనిని వైరాగ్యమనెడి కత్తిచే ఛేదింపవలయును. అటుపిమ్మట బ్రహ్మవస్తువును చెందనగును. దేనిని సూర్యచంద్రాదుల వెలుగుచే నెరుంగుటకు సాధ్యముకాదో యదియే పరబ్రహ్మము. దేనిని చెందినపిదప జీవుడు మరల నీ సంసారమునఁ బడవలసిన యావశ్యకతయుండదో యదియే పరతత్వము. అది నా స్వరూపమే. అర్జునా! నేను ప్రపంచమున కెన్నివిధములుగ నుపకారము చేయుచున్నానో గమనింపుము. నాశక్తిని భూమి యందు ప్రవేశపెట్టి యుండుటచేతనే మిక్కిలి బరువైన యసంఖ్యేయములగు పదార్థములు (పర్వతములు, వృక్షములు, కట్టడములు, సకలజీవరాసులు) భరింప బడుచున్నవి. నేను చంద్రుని యందు ప్రవేశించి తత్సంబంధమైన తేజస్సుచే చెట్లు, తీగెలు మున్నగునవి నానావిధము లగు కాయలు, పండ్లు, ధాన్యములు, ఓషధులు మున్నగువాటిని కల్గించుచున్నాను. అది భుజించువారికి బలము, ఆరోగ్యము కల్గించుటకు దానివలననే; జీవుడు తినిన పదార్థములు (భక్ష్యభోజ్యచోష్యలేహ్యములు) జీర్ణింపబడుటకు నా శక్తి విశేషమే (జఠరాగ్ని) కారణము. నేను ప్రతిప్రాణి హృదయమందుండి జ్ఞానము, అజ్ఞానము, జ్ఞాపకము, మఱపు కల్గించువాడను. నాశముతోఁగూడిన జడ ప్రకృతికన్న చైతన్యముగల చేతన ప్రకృతి (పురుషుడు, జీవుడు) యెక్కువ. సకలజీవులకన్న నేనెక్కువ గనుక పురు

షో త్తము డనబడుచున్నాను. ఇట్టి నా స్వరూపము నెరుంగు వాడు సకల యజ్ఞ యాగాది క్రతువులవలన కలుగు ఫలమున కన్న నెక్కుడు ఫలము నందును. వా డితరసాధనము లన్నిటి నవలంబించినవాడగును. ఇట్టి పరమరహస్యమైన శాస్త్రము పాపరహితుడవు గనుక నీకు నే నుపదేశించితిని.



## అ ష్టా ద శ బిం దు వు

ఓ యర్జునా! వారివారి ప్రాచీనకర్మ ననుసరించి కొందరు దైవాంశమున,మరికొందరు రాక్షసాంశమున జన్మించు చున్నారు. భయపడకుండుట, అంతఃకరణశుద్ధి, జ్ఞానసంపాదన యందే దృష్టి, దానము, బహిరింద్రియ, అంతరింద్రియ నిగ్రహము, విధ్యుక్త కర్మాచరణ, తపస్సు, తలచినట్లు చెప్పుట, చెప్పినట్లు చేయుట, అహింస, సత్యవ్రతము, దొంగిలింప కుండుట, బ్రహ్మచర్యము మున్నగుసద్గుణములు దైవాంశమునం బుట్టినవారికుండును. మరియు రాక్షసాంశసంభూతుల కుండెడి దుర్గుణము లెవ్వియనగా— కామము, క్రోధము, దంభము, దర్పము మున్నగునవి. మరియు వారు ఆత్మ పరమాత్మలు వేరనియు, జన్మాంతరము, లోకాంతరము మిథ్యయనియు, సృష్టికి కామమే కారణమనియు వాదింతురు. మరియు వారెల్ల ప్పుడు గొంతెమకోరికలను కలిగియుందురు. ఆచార వ్యవహార ములు, పరిశుభ్రత, అంటు, ఎంగిలి పాటించరు. కామపూర్తి కొఱకే సదా పాటుపడుచుందురు. అందువలన నన్యాయమార్గ

మున నెంతైన ద్రవ్యమును గడించుటయే ముఖ్యప్రయోజన ముగ కలిగియుందురు. సంతుష్టి యేకోశమున లేక సదా విచార గ్రస్తులై యుండుదురు. అహర్నిశములు నిషిద్ధపదార్థముల ననుభవింపుచు, కఠినమైన మాటలు, పనులుచేయుచు పరులను పీడించుచునే యుందురు. కామము, కోపము, లోభమనెడు మూడు దుర్గుణములే జీవులను నరకమున ప్రవేశపెట్టెడి ద్వార ములు గనుక వాటిని జయించుటకు యత్నింపవలయును. దానికి మార్గ మేమనగా వేదశాస్త్రపురాణములను ప్రమాణ బుద్ధితో నంగీకరించి వాటి ననుసరించుటయే యని శ్రీకృష్ణుడుప దేశించెను.



## ఏకోనవింశబిందువు

ఓ యర్జునా! శాస్త్రముల ననుసరించుటకు విద్యాగంధ ముండవలయును. జనసామాన్యమట్టివారుకారు. గనుక విద్య లేకున్నను శ్రద్ధతో కర్మాద్యనుష్ఠానముచేసినయెడల వారు సాత్వి కులు (దైవాంశమున) గనే భావింపబడుదురు. శ్రద్ధ సాత్వికి రాజసిక, తామసికము లని త్రివిధము. సాత్వికశ్రద్ధగలవారు మోక్షాపేక్షతో పరబ్రహ్మము నారాధింతురు. పుష్టినికల్గించెడి యింపైన, రసయుక్తమైన, ఆయుర్వృద్ధి, ఉత్సాహము మున్నగువాటిని కలిగించు మంచి యాహారమును తిందురు. విధ్యుక్తమైన కర్మలను శ్రద్ధతో చేయుదురు. ఈశ్వ రుడు, బ్రాహ్మణుడు, గురువు, జ్ఞాని మున్నగువారికి సేవ

చేయుదురు. వాగింద్రియనియమనము, సదుద్దేశములు కలిగి యుందురు. ప్రత్యుపకారము నెదురుచూడక దేశకాలపాత్రముల నెరింగి దానమును చేయుదురు. రాజసికులు ఫలాపేక్షతో దేవతాంతరములను భజించుట, ఉప్పు, కారము మున్నగు రసము లెక్కువగనుండు పదార్థముల దినుట, కామక్రోధములం గలిగియుండుట, కామ్యకర్మలనే చేయుట, ప్రత్యుపకారమును కోరి దానముచేయుట మున్నగువాటి నవలంబింతురు.

తామసికులన్నచో భూత ప్రేత పిశాచాదుల నారాధించుట, ఇతరులకు హింసకల్గించెడి కర్మలనుచేయుట చెడుద్దేశ్యములు కల్గియుండుట,అపాత్రదాన మన మంచి మాట పలుకులేక మర్యాదచేయక దానము నిచ్చుట మున్నగువాటి నవలంబింతురు.

ఓ యర్జునా! రాజసిక తామసిక ఆహారాదులను స్వీకరింపవలసినయెడల "ఓం తత్సత్" అనెడి పరబ్రహ్మ వాచకమును స్మరింపుము. సకలదోషములు పరిహరింపబడి యవి సాత్వికమగును. గనుక శ్రద్ధయే (సాత్విక) ప్రధానము గాని విద్య గానేరదు. అశ్రద్ధతో కర్మాదుల ననుష్ఠించువానికి ఇహలోకమునగాని పరలోకమునగాని యెట్టి సుఖముగాని కలుగనేరదని కృష్ణు డుపదేశించెను.



## వి ం శ బి ం దు వు

ఓ యర్జునా! సన్న్యాస త్యాగశబ్దములను గురించి వేర్వే రుగ నభిప్రాయపడుచున్నారు గాని యా రెండును 'వదలుట' యనునర్థము నేసూచించును. నకర్మణా నప్రజయా ధనేన త్యాగే నైకేన అమృతత్వ మానశుః॥ అను శ్రుతివాక్యము ననుసరించి త్యాగమే ముక్తికి ముఖ్యసాధనము. ఆ త్యాగము సాత్త్విక రాజసిక తామసికము లని త్రివిధము. కర్మలను చేయుచు ఫలా పేక్షను వదలుటయే సాత్త్వికత్యాగము. యజ్ఞ దాన తపస్సు లెన్నటికి నాచరింప బడవలసినవేగాని త్యాజ్యము కానేరవు. అవియే జీవుని పరిశుద్ధము చేయునవి. గనుక ఫలత్యాగమే గాని కర్మత్యాగము విధ్యుక్తము కానేరదు. ప్రతి కార్యమునకు నైదు కారణము లున్నవి. 1. అధిష్ఠానము (శరీరము, స్థలము) 2. జీవుడు (కర్త) 3. కరణములు (సామగ్రిలు) 4. నానావిధ వ్యాపారములు. 5 భగవదనుగ్రహము (అదృష్టము) ఈ యైదిం టిలో అదృష్టమే ముఖ్యమైనది. అముఖ్యకారణములగు నాలు గింటిలో జీవుడొకడుగ నుండగా తానే కారణమని తలచుట గొప్పపొరపాటు. ముఖ్యకారణము ప్రతికార్యమునకు నీశ్వరుడే యని గ్రహించి యహంకారమమకారాగులను వదలవలయును. జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత, కరణము, కర్మ, కర్త సాత్త్వికరాజ సిక తామసిక గుణముల ననుసరించి మూడువిధములు. అట్లే ధృతి, బుద్ధి మున్నగునవియును. ఓ యర్జునా! పిపీలికాది బ్రహ్మ పర్యంతము వ్యాపించియుండు సకల జీవులును దుఃఖపరి హారముద్వారా సుఖము నందఁగోరుచున్నారు. ఆసుఖము

సాత్త్విక రాజసిక తామసికములని త్రివిధము. ఏది యతీంది యమో, అనుభవింపగా, అనుభవింపగా క్రొత్త క్రొత్తగఁ దోచుచునుండునో, సకలదుఃఖవినాశమునకు కారణమగునో, ఆరంభమున విషప్రాయముగను ముగింపున అమృతమయముగ నుండునో యట్టిదే సాత్త్వికసుఖము. ఇట్టి యాధ్యాత్మికసుఃఖము నందుటకే ప్రతి జీవుడు తన శక్తివంచన లేకుండ యత్నించ వలయును. దీనికే శ్రవణ మనన నిది ధ్యాసనములు సోపానములు. గనుక నిట్టి సాధనముల ననుష్ఠించి జన్మసాఫల్య మందుటకై యత్నించువాడే మానవుడు, అని శ్రీకృష్ణు డుపదేశించెను.



## ఏకవింశబిందువు

ఓ అర్జునా ! బ్రహ్మప్రాప్తికిఁ గర్మానుష్ఠానమత్యావశ్యకము. ఈవిషయమై యనగా కర్మాచరణవలన నంతఃకరణశుద్ధి ద్వారా జ్ఞానము తద్ద్వారా మోక్షము కలుగుననియు, కర్మ చేయకుండుటచే జీవుడుమాలిన్యమును పోగొట్టుకొనజాలడనియు ననేకవిధముల నుపదేశించితిని. పరమాత్మ ప్రతిజీవుని హృదయమందుండి వాని ప్రాచీనకర్మ ననుసరించి త్రిప్పుచుండును. జీవుడు పరమాత్మచేతిలో కీలుబొమ్మవంటివాడు. సర్వస్వాతంత్ర్య మీశ్వరునిది. అస్వాతంత్ర్యము జీవునిది. పరమాత్మ యాజ్ఞ ప్రకారము నడుచుకొనువాడు సుఖపడును. తదితరుడు దుఃఖమందును. నేను చెప్పవలసినదంతయు నైనది. పిమ్మట నీ యిష్టము. బాగుగ యోచించి నీయిష్టము ననుసరించి ప్రవర్తింపు

మని శ్రీకృష్ణుడు చెప్పగా నర్జునుడు ఓస్వామీ! మీయుప దేశము వలన నా వ్యామోహము పూర్తిగ నశించెను. మీ దయకు నేను పాత్రుడ నైతిని. సందేహము లన్నియు నశించెను. తమమాట ప్రకారమే ప్రవర్తించెద ననెను. అప్పుడు భగవంతుడు, ఓయర్జునా! సకల కర్మలను నాకు సమర్పణ చేయుము. అహంకార మమకారములను వదలుము. సకల ధర్మములను (ఫలాపేక్షను) వదలి యద్వితీయుడును, అవ్యాజ కరుణాకటాక్షముతోఁ గూడినవాడనగు నన్నే శరణుజొచ్చుము. నీవెంత పాపివైనను నేను నీసకల పాపములఁ బోగొట్టి తరింప చేసెద"నని యభయప్రదాన మొసంగెనని సంజయుడు ధృతరాష్ట్రునితో యావద్వృత్తాంతమును దెలిపి "ఓరాజా! శ్రీకృష్ణుని గొప్పతనమెక్కడ, అర్జునుని యధమత్వ మెక్కడ! వినుగు జెందక కరుణామయుడగు శ్రీకృష్ణుడు చేసిన గీతోపదేశము నేనుగూడ వేదవ్యాసుని దయచే దూరదృష్టి దూరశ్రవణము లోనగు శక్తుల నందియుండుటవలన చక్కగ వింటిని. విశ్వరూపమును చూచితిని. ఏమియానందము! ఏమియానందము!! ఏమియానందము!!! పరమాత్మ యేవైపున నున్నాఁడో, అర్జునునివంటి భక్తుడేవైపున నున్నాడో యనగా భగవత్కథలు భాగవతుల కథలు జరిపించువారు, చెప్పువారు, వినువారు సకలురు దురితక్షయముద్వారా సకలైహికాముష్మిక సుఖములనంది శాశ్వత బ్రహ్మానంద మందుదురని నాయభిప్రాయమని నుడివెను.



# ధ్యానశ్లోకములు

శుక్లాంబర ధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోపశాంతయే.

హేగోపాలక హేకృపాజలనిధే హేసింధుకన్యాపతే
హే కంసాంతక హేగజేంద్రకరుణాపారీణ హేమాధవ
హే రామానుజ హేజగత్త్రయగురో హేపుండరీకాక్ష మాం
హే గోపీజననాథ పాలయ పరం జానామి నత్వాం వినా.

వందే శంభు ముమాపతిం సురగురుం వందే జగత్కారణం
వందే పన్నగభూషణం మృగధరం, వందే పశూనాంపతిమ్
వందే సూర్యశశాంకవహ్నినయనం, వందే ముకుందప్రియమ్
వందే భక్తజనాశ్రయంచ వరదమ్, వందే శివం శంకరమ్.

యంశైవాః సముపాసతే శివఇతి, బ్రహ్మేతి వేదాంతినో
బౌద్ధా బుద్ధఇతి ప్రమాణపటవః, కర్తేతి నైయాయికాః
అర్హన్నిత్యథ జైనశాసనరతాః, కర్మేతి మీమాంసకాః
సోయం వో విదధాతు వాంఛితఫలం త్రైలోక్యనాథో హరిః

గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః, గురురేవ మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరంబ్రహ్మా, తస్మై శ్రీగురవే నమః. 5



సాంబసదాశివ శంభోశంకర, శరణంమే తవచరణయుగమ్.
శంభోశంకర గౌరీశహర, శరణంమే తవచరణయుగమ్.
సాంబసదాశివ సాంబసదాశివ, సాంబసదాశివ సాంబహర.
కాశీపతే వారణాశీపతే, గంగాజటాజూట గౌరీపతే.
సీతాపతే రామ రాధాపతేకృష్ణ, శ్రీరుక్మిణీ సత్యభామాపతే.
వాణీపతేబ్రహ్మ గౌరీపతే శంభో, లక్ష్మీపతే శ్రీమన్నారాయణ.

రామరాఘవ రామరాఘవ, రామరాఘవ రక్ష మామ్.
కృష్ణ కేశవ కృష్ణ కేశవ, కృష్ణ కేశవ పాహి మామ్.
రాధారమణ మదనమోహన, బృందావనా చంద్రకృష్ణ.
శ్రీకృష్ణ చైతన్య ప్రభునిత్యానంద, హరేరాం హరేకృష్ణ
రాధేగోవింద.
రామనామతారకం భుక్తి ముక్తిదాయకం, జానకీమనోహరం
సకలలోకనాయకం.
శ్రీదేవి భూదేవి నీళామహాదేవి, కాశీవిశాలాక్షి కామాక్షి
మీనాక్షి.
శ్రీమద్రమారమణ గోవిందో హరిః, నమః పార్వతీపతయే హర
హర మహాదేవ.

హరిః ఓం తత్సత్.



ఓమ్

శ్రీ పార్వతీపతయే నమః

# బీజాక్షరవర్ణమాలికా స్తోత్రము



సాంబసదాశివ సాంబసదాశివ, సాంబసదాశివ సాంబశివా.
అద్భుతవిగ్రహ అమరాధీశ్వర, అగణిత గుణగణ అమృతశివా.
ఆనందామృత ఆశ్రితరక్షక, ఆత్మానంద మహేశశివా ॥సాం
ఇందుకళాధర ఇంద్రాదిప్రియ, సుందరరూప సురేశశివా॥సాం
ఈశ సురేశ మహేశ జనప్రియ, కేశవసేవితకీర్తి శివా ॥సాం
ఉరగాదిప్రియభూషణ శంకర, నరకవినాశ నటేశశివా ॥సాం

ఊర్జిత దానవనాశ పరాత్పర, ఆర్జిత పాపవినాశ శివా ॥సాం॥
ఋగ్వేదశ్రుతి మౌళివిభూషణ, చంద్రార్కాగ్ని త్రినేత్రశివా.
రూపనామాది ప్రపంచవిలక్షణ, తాపనివారణ తత్వశివా.
లింగస్వరూప సర్వబుధప్రియ, మంగళమూర్తి మహేశ శివా.
ఏకానేకస్వరూప విశ్వేశ్వర, యోగిహృదిప్రియవాస శివా.
అమరాధీశ్వరసర్వబుధప్రియ, వేదాంతప్రియవేద్యశివా ॥సాం॥
ఐశ్వర్యాశ్రియ చిన్మయ చిద్ఘన, అచ్యుతానంద మహేశశివా.
ఓంకారప్రియ ఉరగవిభూషణ, హ్రీంకారాది మహేశ శివా.
ఔరసలాలిత అంతకనాశన, గౌరీసమేత గిరీశశివా. ॥సాం॥
అంబరవాస చిదంబరనాయక, తుంబురునారద సేవ్యశివా. ॥సాం॥
ఆహారప్రియ ఆదిగిరీశ్వర, భోగాదిప్రియ పూర్ణశివా ॥సాం॥
కమలాక్షార్చిత కైలాసప్రియ, కరుణాసాగర కాంతశివా ॥సాం॥
ఖడ్గశూల మృగ ఢక్కాద్యాయుధ, విక్రమరూప విశ్వేశశివా.
గంగాగిరిసుతవల్లభ గుణహిత, శంకర సర్వజనేశ శివా. ॥సాం॥
ఘాతుకభంజన పాతకనాశన, గౌరీసమేత గిరీశశివా. ॥సాం॥
జ్ఞానాశ్రిత శ్రుతిమౌళివిభూషణ, వేదస్వరూప విశ్వేశశివా. ॥సాం॥
చండవినాశన సకలజనప్రియ, మండలాధీశ మహేశశివా. ॥సాం॥
ఛత్రకిరీట సుకుండలశోభిత, పుత్రప్రియ భువనేశశివా. ॥సాం॥
జన్మజరామృతినాశనకల్మష, రహితా తాపవినాశశివా. ॥సాం॥
ఝంకారాశ్రియ భృంగిరిటిప్రియ, ఓంకారేశమహేశశివా. ॥సాం॥
జ్ఞానాజ్ఞానవినాశక నిర్మల, దీనజనప్రియ దీప్తశివా. ॥సాం॥
టంకాద్యాయుధధారణ సత్వర, హ్రీంకారాది సురేశ శివా.
ఠంకస్వరూప సహకారోత్తమ, వాగీశ్వర వరదేశ శివా. ॥సాం॥
డంబవినాశన డిండిమభూషణ, అంబరవాస చిదీశ శివా ॥సాం॥
ఢంఢం డమరుక ధరణీనిశ్చల, ఢుండివినాయకసేవ్యశివా. ॥సాం॥

నళినవిలోచన నటనమనోహర, అళికులభూషణ అమృతశివా.
తత్త్వమసీత్యాది వాక్యస్వరూపక, నిత్యానందమహేశశివా.॥సా
స్థావరజంగమ భువనవిలక్షణ, భావుకమునివర సేవ్యశివా ॥సాం॥
దంతివినాశన దళితమనోన్మన, చందనలేపిత చరణశివా. ॥సాం॥
ధరణీధరశుభధవళ విభాస్వర, ధనదాదిప్రియదానశివా ॥సాం॥
నానామణిగణభూషణ నిర్గుణ, నటనజనప్రియనాట్యశివా.॥సాం॥
పన్నగభూషణ పార్వతినాయక, పరమానంద పరేశశివ.॥సాం॥
ఫాలవిలోచన భానుకోటిప్రభ, హాలాహలధర అమృతశివా.
బంధవినాశన బృహదీశామర, స్కందాది ప్రియకనకశివ.॥సాం॥
భస్మవిలేపన భవభయనాశన,విస్మయరూప విశ్వేశశివ.॥సాం॥
మన్మథనాశన మధుపానప్రియ, మందరపర్వత వాసశివ.॥సాం॥
యతిజనహృదయనివాసిత ఈశ్వర, విధివిష్ణ్వాదిసురేశశివ.॥సాం॥
రామేశ్వర రమణీయముఖాంబుజ, సోమేశ్వర సుకృతశివ. ॥సాం
లంకాధీశ్వర సురగణసేవిత, లావణ్యామృత లసిత శివ. ॥సాం॥
వరదాభయకరవాసుకిభూషణ, వనమాలాదివిభూషశివ.॥ సాం॥
శాంతిస్వరూపజగత్రియచిన్మయ,కాంతిమతిప్రియకనకశివ.॥సాం॥
షణ్ముఖజనకసురేంద్ర మునిప్రియ, షాడ్గుణ్యాదిసమేతశివ. ॥సాం॥
సంసారార్ణవ నాశనశాశ్వత, సాధుహృదిప్రియవాసశివ. ॥సాం॥
హార పురుషోత్తమ అద్వైతామృత, పూర్ణమురారిసుసేవ్యశివ.
లాలితభక్తజనేశ నిజేశ్వర, కాళినటేశ్వర కామశివ. ॥సాం॥
క్షరరూపాదిప్రియాన్వితసుందర,సాక్షిజగత్రియస్వామిశివ.॥సాం॥
సాంబసదాశివ సాంబసదాశివ సాంబసదాశివ సాంబశివా॥

బీజాక్షర వర్ణమాలికా స్తోత్రము సంపూర్ణము.
హరిః ఓం తత్సత్.



# శ్రీరామస్తవము

ఆపదామపహర్తారం, దాతారం సర్వసంపదామ్
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్॥

ఆపన్న జనరక్షైక, దక్షాయామిత తేజసే
నమోస్తు విష్ణవే తుభ్యం, రామాయాపన్నివారిణే ॥ఆప॥
పదాంభోజ రజస్స్పర్శ, పవిత్రమునియోషితే
నమోస్తు సీతాపతయే, రామాయాపన్నివారిణే ॥ఆప॥
దానవేంద్ర మహామత్త, గజపంచాస్యరూపిణే
నమోస్తు రఘునాథాయ, రామాయాపన్నివారిణే ॥ఆప॥
మహిజాకుచసంలగ్న, కుంకుమారుణవక్షసే
నమః కల్యాణరూపాయ, రామాయాపన్నివారిణే ॥ఆప॥
పద్మ సమ్భవభూతేశ, ముని సంస్తుత కీర్తయే
నమోమార్తాండవంశ్యాయ, రామాయాపన్నివారిణే ॥ఆప॥
హరత్యార్తించ లోకానాం, యోవా మధునిషూదనః
నమోస్తు హరయే తుభ్యం, రామాయాపన్నివారిణే॥ఆప॥
తాపకారణ సంసార, గజసింహస్వరూపిణే
నమో వేదాన్తవేద్యాయ, రామా యాపన్నివారిణే॥ఆప॥
రంగత్తరంగజలధి, గర్వహృచ్ఛరధారిణే
నమః ప్రతాపరూపాయ, రామా యాపన్నివారిణే ॥ఆప॥
దారా సహిత చంద్రావ, తంసధ్యాత స్వమూర్తయే
నమ స్సత్యస్వరూపాయ, రామా యాపన్నివారిణే ॥ఆప॥
తారా నాయక సంకాశ, వదనాయ మహౌజసే
నమోస్తు తాటకాహంత్రే, రామాయాపన్నివారిణే॥ఆప॥

రమ్యసాను లసచ్చిత్రి,కూటాశ్రమ విహారిణే
నమ సౌమిత్రి సేవ్యాయ, రామా యాపన్నివారిణే ||ఆప||
సర్వ దేవాహితాసక్త, దశానన వినాశినే
నమః కలుషసంహర్త్రే రామాయాపన్నివారిణే ||ఆప||
రత్నసాను నివాసైక, వంద్యపాదాంబుజాయచ
నమస్త్రైలోక్యనాథాయ, రామా యాపన్నివారిణే ||ఆప||
సంసార బంధమోక్షైక, హేతునామ ప్రకాశినే
నమః కలుషసంహర్త్రే, రామా యాపన్నివారిణే ||ఆప||
పవనాశుగ సంక్షిప్త, మారీచాద్యసురారయే
నమో మఖపరిత్రాత్రే, రామా యాపన్నివారిణే ||ఆప||
దాంభికేతర భక్తౌఘ, మహదానందదాయినే
నమః కమలనేత్రాయ, రామా యాపన్నివారిణే ||ఆప||
లోకత్రయోద్వేగకర, కుంభకర్ణశిరశ్ఛిదే
నమో భీషణరూపాయ, రామా యాపన్నివారిణే. ||ఆప||
కాకాసురైక నయన, హరల్లీలాస్త్రధారిణే
నమో భక్తైక వంద్యాయ, రామాయాపన్నివారిణే. ||ఆప||
భిక్షురూప సమాక్రాంత, బలిసర్వైకసంపదే
నమో వామనరూపాయ, రామా యాపన్నివారిణే. ||ఆప||
రాజీవనేత్ర సుస్పంద, రుచిరాంగసురోచిషే
నమఃకైవల్య నిధయే, రామా యాపన్నివారిణే. ||ఆప||
మందమారుత సంవీత, మందార మృదువాసినే
నమః పల్లవహస్తాయ, రామా యాపన్నివారిణే. ||ఆప||
శ్రీకంఠ చాపదళన, ధురీణబలబాహవే
నమః సీతానుషక్తాయ రామా యాపన్నివారిణే. ||ఆప||

రాజరాజ సుహృద్యోషా, ర్చిత మంగళమూర్తయే
నమ ఇక్ష్వాకు వంశ్యాయ, రామాయాపన్నివారిణే. ॥ఆప॥
మంజులాదర్శ విప్రేక్ష, ణోత్సుకైక విలాసినే...
నమః పోషితభక్తాయ, రామాయాపన్నివారిణే. ॥ఆప॥
భూరి భూధరకోదండ, మూర్తిజ్ఞేయ స్వరూపిణే
నమః ప్రితాపరూపాయ, రామాయాపన్నివారిణే. ॥అవ॥
యోగీంద్ర హృత్సరోజాత, మధుపాయ మహాత్మనే
నమో రాజాధిరాజాయ, రామాయాపన్నివారిణే. ॥ఆప॥
భూదారక స్వరూపాయ, నమో భూరి ప్రదాయినే
నమః కోమల దేహాయ, రామాయాపన్నివారిణే. ॥ఆప॥
యోషాంజలి వినిర్ముక్త, లాజాంచితవపుష్మతే
నమస్సౌందర్యనిధయే, రామాయాపన్నివారిణే. ॥ఆప॥
నఖకోటి వినిర్భిన్న, దైత్యాధిపతి వక్షసే
నమో నృసింహరూపాయ, రామాయాపన్నివారిణే.॥ఆప॥
మాయామానుష దేహాయ, వేదోద్ధరణ హేతవే
నమోస్తు మత్స్యరూపాయ, రామాయాపన్నివారిణే.॥ఆప॥
మితిశూన్య మహాదివ్య, మహిమ్నే మానితాత్మనే
నమో బ్రహ్మస్వరూపాయ, రామాయాపన్నివారిణే.॥ఆప॥
అహంకారేతరజన, స్వాంతసౌధ విహారిణే
నమోస్తు చిత్స్వరూపాయ, రామాయాపన్నివారిణే॥ఆప॥
సీతాలక్ష్మణ సంశోభిపార్శ్వాయ పరమాత్మనే
నమః పట్టాభిషిక్తాయ రామాయాపన్నివారిణే ॥ఆప॥

శ్రీ రామచంద్రార్పణమస్తు.

హరిః ఓం తత్సత్.



4f, BCI

## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA105B201 |
| పుస్తకం పేరు | భగవద్గీతోపన్యాసములు |
| తారీఖు | 03 February 2025 |
| ముందు అట్ట | YCS |
| వెనుక అట్ట | YCS |
| మొత్తం పేజీలు | 571 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | CI, III, VI, 49, [illegible] |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Bhanu |
| పేజీలు విడదీసినది | Bhanu |
| స్కాన్ చేసినది | Nandini |
| పరీక్ష చేసినది | LAKSHMI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |